**ABIJNANA SAKUNTALAM**

Bethavolu Rama Brahmam

**అభిజ్ఞాన శాకుంతలమ్**

**బేతవోలు రామబ్రహ్మం**



ముద్రణ : **ఆగష్టు 2020**

మూల్యం : **రూ. 288/-**

**ISBN : 978-93-86040-95-4**



ప్రచురణ :

**ఎస్. ఆర్. పబ్లికేషన్స్**

డి. ఆర్. ఆర్. వీధి,
ఇన్నర్ రింగ్ రోడ్, (అంబాపురం),
విజయవాడ రూరల్ 520 012.
ఆంధ్రప్రదేశ్, ఇండియా.
**Ph** : 0866 2436959, 2438959
**Cell** : 94948 75959, 94938 75959,
94928 75959

బ్రాంచి :
1-8-104,
అంబేద్కర్ కాలేజీ రోడ్,
చిక్కడపల్లి, హైదరాబాద్ - 500 020.
తెలంగాణా, ఇండియా.
**Cell** : 90324 28516

Purchase online @ www.srpublications.in
info@srpublications.in 

For e-books :

**Kinige**
https://kinige.com/

మరియు

**ఆంధ్రప్రదేశ్ మరియు తెలంగాణాలోని అన్ని బుక్ షాపులు**

# అంకితం



## కావ్య కారసాని

11-02-1991 11-03-2005

స్మృతికి అభిజ్ఞానంగా

# విషయసూచిక

# ఒకడే కాళిదాసు – ఒకటే శాకుంతలం

**– డా॥ అద్దంకి శ్రీనివాస్**

**పురా కవీనాం గణనా ప్రసంగే ...** – అంటూ మహాకవుల్ని లెక్కించడం మొదలు పెట్టారట చాన్నాళ్ళక్రితం. ఒకటి అనగానే కాళిదాసు అని లేచి నిలుచుంది చిటికెనవ్రేలు. రెండు అనగానే – కాళిదాసు తరువాత అంతటి కవి లేడుకాబట్టి – ఉంగరపువేలు– అనామిక అయ్యింది అన్నాడో కవి. ఇదో గొప్ప చమత్కారం కాళిదాసుపై. ఇది ఒక్కటీ చాలు కాళిదాసుకు కవికులగురుస్థానాన్ని ఇవ్వడానికి.

**కాళిదాసకవితా నవం వయో మాహిషం దధి సశర్కరం పయః ఐణమాంస మబలా చ కోమలా సంభవంతు మమ జన్మ జన్మని** – అంటూ ప్రతిజన్మలోనూ యౌవనం, గేదె పెరుగు, చక్కర పాలు లాంటివి కావాలంటూ– వాటి జాబితాలో కాళిదాసు కవిత్వానికే అగ్రతాంబూలం ఇచ్చారు. ఎందుకంటే– **పుష్పేషు జాతీ పురుషేషు విష్ణుః నారీషు రంభా నగరీషు కాంచీ వీరేషు రామః విమలీషు పూషా కావ్యేషు మాఘః కవి కాళిదాసః** – కవి అంటే కాళిదాసే కాబట్టి.

మరి కొందరుంటారు. అయ్యా మేమూ కవులమే కానీ – **కవయః కాళిదాసాద్యాః కవయో వయమప్యమీ పర్వతే పరమాణౌ చ పదార్థత్వం వ్యవస్థితమ్** – అంటూ దాసత్వాన్ని ప్రకటించేస్తారు. అందుకు కుమారిలభట్టు లాంటి ప్రఖ్యాత కవిపండితుడే, మీమాంసాశాస్త్ర ప్రవర్తకుడే సంకోచించ లేదంటే ఇక మామూలువాళ్ళ సంగతి?

అంతెందుకు? కాళిదాసభారతికి దివ్వెటబట్టిన మల్లినాథసూరిగారే– **కాళిదాసగిరాం సారం కాళిదాస స్సరస్వతీ చతుర్ముఖోఽథవా సాక్షాత్ విదు ర్నాన్యే తు మాదృశాః** – కాళిదాసు మాటలలోని సారం కాళిదాసుకీ, సరస్వతికీ, బ్రహ్మదేవుడికీ మాత్రమే తెలుసు. మా వంటి వారికెట్లా తెలుస్తుంది ? అన్నాడంటే ఇంక మనమెక్కడ?

కవివిద్వన్మూర్ధన్యులలో కాళిదాసుకు ఇంతటి గౌరవాదరాలు– కేవలం ఉపమాకాళిదాసస్య, దీపశిఖా కాళిదాసు లాంటి బిరుదులవల్ల మాత్రమే రాలేదు. సామాన్యమైన మాటల్లో ప్రకృతితత్వాన్నీ, లోకానుభవాన్నీ పట్టుకొని, కవితామయంగా

చెప్పగల అద్భుతమైన కైతలగారడీవిద్య అతడికొక్కడికే తెలియడంవల్ల కూడా. ఆ గారడీల్లో ఎన్నో మెరుపులు. అయితే పెద్దగా ఉరుములు ఉండవు. అదీ కాళిదాసు ప్రత్యేకత. దానికి అదనపు సుగుణం వినయశీలత.

**ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగ విజ్ఞానమ్ బలవదపి శిక్షితానా మాత్మన్యప్రత్యయం చేతః** – అంటాడు శాకుంతలంలో సూత్రధారుడు. పండితులు చూసి మెచ్చుకొనేంత వరకూ నా ప్రయోగం సరైనదని నమ్మను. ఎంత నేర్పరికైనా తన పని మీద తనకు ఉన్న నమ్మకం ఆత్మతృప్తిని ఇవ్వదు. దానిని ఇతరులు చూసి మెచ్చుకోవాలి. అప్పుడే ఆత్మవిశ్వాసం కలుగుతుంది.

**'తం సంతః శ్రోతుమర్హంతి సదసద్వ్యక్తి హేతవః హేమ్నః సంలక్ష్యతేహ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాపి వా**– బంగారం మంచిదో కాదో నిప్పులలో వేస్తేనే కదా దాని అసలు సంగతి తెలుస్తుంది.

**పురాణమిత్యేవ న సాధు సర్వం న చాపి కావ్యం నవమిత్యవద్యమ్, సంతః పరీక్ష్యాన్యతరత్ భజంతే మూఢఃపరప్రత్యయనేయబుద్ధిః** (మా.మిత్ర.1–2) – 'పాతదంతా మంచిదీ, కొత్తదంతా పనికిమాలినదీ కాదు. గుణదోషాలనుబట్టి నిర్ణయించాలి. సమర్థులైన విద్వాంసులు అలా పరిశీలించి నిర్ణయిస్తారు. మూర్ఖుడు యితరుల నిర్ణయాలను విని దానినే ప్రమాణంగా స్వీకరిస్తాడు '

**యదేవోపనతం దుఃఖాత్ సుఖం తద్రసవత్తరమ్ నిర్వాణాయ తరుచ్ఛాయా తప్తస్య హి విశేషతః** (విక్ర. 3–21) – 'దుఃఖం తరువాత కలిగే సుఖం ఎంతో ఆనందాన్నిస్తుంది. ఎండలో మాడిన వాడికే చెట్టు నీడ విలువ తెలుస్తుంది.

**భవంతి నమ్రా స్తరవః ఫలోద్గమైః నవాంబుభిర్దూర విలంబినో ఘనాః అనుద్ధతాః సత్పురుషాః సమృద్ధిభిః స్వభావ ఏవైష పరోపకారిణామ్** (అ.శా.5–13) – 'పండ్లు కాపుకు వచ్చాకే కిందికి వంగుతాయి. క్రొత్త నీటిని మోసుకొని వచ్చిన మేఘాలే మిక్కిలి కిందికి వంగుతూ అధికంగా వర్షాన్నిస్తాయి. కాబట్టి సత్పురుషులు ఎంత సంపదలు లభించినా గర్వించరు. వినయంగా వంగి ఉంటారు.

ఇలా కాళిదాసు కృతులన్నిటిలో ఈ వినయశీలతతో పాటు రచనామాధుర్యం కనిపిస్తుంది. ఇక శాకుంతలంలో చెప్పనేల? అది– మధుర, చతుర, హిత, మహితోక్తులకు పుట్టినిల్లు. అమృత కవితాప్రవాహం. భారతీయ జీవన విధానంలోని

గొప్పదనానికి కరదీపిక. గృహస్థాశ్రమ ధర్మాలను విస్మరించ రాదని హెచ్చరించే కావ్యం. ఇందులోని ప్రధానపాత్రలే కాదు, అతి సామాన్య పాత్రలు కూడా వ్యక్తిత్వంతో, సంస్కారంతో ఎంతవరకూ ఉండాలో అంతవరకే ఉంటూ ఒప్పారుతాయి. కథానిర్వహణ, ఔచిత్యంకోసం చేసిన మార్పులు ఈ నాటకానికి అదనపు అందం.

మనిషికీ ప్రకృతికీ ఉండే బంధాన్ని ఎంత చక్కగానో ప్రతిపాదించాడు కాళిదాసు ఈ నాటకంలో. శకుంతల– మొక్కలకి నీళ్ళు పోయకుండా తను మంచినీళ్ళు కూడా త్రాగేది కాదుట. చిగురుటాకులను అలంకరించు కోవటం ఎంత ఇష్టమయినా సరే తుంచేది కాదుట. తాను పెంచిన మొక్కకి పువ్వు పూస్తే పిల్లలు పుట్టినంత ఆనందించి ఉత్సవం చేసేదిట. ఇలా మొక్కలను సాటి మనుషుల్లా, సన్నిహితులుగా, బంధువులుగా చూపటం వాల్మీకికీ కాళిదాసుకే చెల్లింది.

గృహస్థులకు కూతురిని అత్తవారింటికి పంపేటప్పుడు ఉండే బాధ, కణ్వ మహర్షి– అల్లుడైన దుష్యంతుడికి పంపే సందేశం, ఆడపిల్ల అత్తవారింట ఎలా ఉండాలో శకుంతలకి చెప్పిన సుద్దులు ఇవన్నీ లోకోత్తరమైనవి.

**కావ్యేషు నాటకం రమ్యం..** – అంటూ సంస్కృత కావ్యాలలో నాటకం, నాటకాలలో అభిజ్ఞాన శాకుంతలం, అందులో నాలుగో అంకం, దానిలో నాలుగు శ్లోకాలూ రమ్యమైనవన్న ప్రసిద్ధి ఒక్క ఈ నాటకానికే ఉంది. అంటే ఆ నాలుగు శ్లోకాలు ఈ నాటకానికి ప్రాణం అన్నమాట. మరి ఈ నాలుగు శ్లోకాలలో ఏముందో, ఇంకా ఇందులో ఏ పరిమళం దాగుందో చూస్తేనే కదా తెలిసేది. కాళిదాసు కవిత్వం ఒక గంధపుచెక్క. అరదీసుకున్నవారికి అరగదీసుకున్నంత.

★★★

# కథాసంగ్రహం

## నాంది

మొదట పరమేశ్వరుణ్ణి స్తుతించి, నాంద్యంతంలో సూత్రధారుడు వచ్చి – కాళిదాసమహాకవి రచించిన 'అభిజ్ఞాన శాకుంతలం' అనే నాటకం ప్రదర్శిత మౌతుందని ప్రకటిస్తాడు.

★★★

## 1

అనగనగా ఒక మహారాజు. ఆయన పేరు దుష్యంతుడు. వేట కోసం అడవికి వచ్చాడు. వేట – పైకి వ్యసనంలా కన్పించవచ్చు. కానీ అది రాజధర్మం. క్రూరమృగాల నుంచి ప్రజలను రక్షించడమే వేటలో ఉన్న పరమార్థం. దానితోపాటూ రాజుగారికి వినోదమూ ఆటవిడుపూ కూడా.

అందుకే దుష్యంతమహారాజు విల్లూ బాణాలూ ధరించి వచ్చాడు. రథసారథి సూతుడూ అతడి వెంట నడిచాడు. రాజుగారి కంటికి కనిపించింది ఓ లేడికూన. దానిని తరుముతూ బయలుదేరాడు.

లేడికి ప్రాణభీతి కదా. అందుకే దాని పరుగు నేల మీద కంటే గాలిలోనే ఎక్కువ. రాజు బాణం ఎక్కు పెట్టాడు. అంతలో ఒక మహర్షి.

"రాజా ఇది ఆశ్రమానికి సంబంధించిన మృగమయ్యా.. వద్దు.. చంపవద్దు.. చంపవద్దు..." అంటూనే రాజుముందరికి వచ్చాడు. అతడి పేరు వైఖానసుడు.

దుష్యంతమహారాజుకు మహర్షులంటే అమితమైన గౌరవం. అందుకే ఆ మహర్షి మాటను శిరసా వహించాడు. లేడికూనను విడిచిపెట్టేశాడు. బాణం వెయ్యలేదు.

తన మాటను మన్నించినందుకు వైఖానసమహర్షి ఆనందించి 'రాజా! చక్కని శుభలక్షణాలూ, చక్రవర్తి అయ్యే అన్ని అర్హతలు ఉన్నవాడూ అయిన సుపుత్రుడు నీకు

లభిస్తాడులే! అని దుష్యంతమహారాజును దీవించి ఇక్కడే కణ్వమహర్షి ఆశ్రమం ఉంది. ఒకసారి అక్కడికి రా అని అతడికి ఆహ్వానం పలికాడు.

రాజూ ఆనందంగా అంగీకరించి ఆశ్రమానికి వెళ్ళాడు. కణ్వముని ఆశ్రమం ఎంతో రమణీయంగా ఉంది. అందమైన ప్రకృతి. చూడగానే దుష్యంతుడి మనసుకు ఎక్కడలేని ప్రశాంతత కలిగింది. చూట్టూ చూశాడు. చెట్లకొమ్మలు కదులుతున్నాయి. ఆ చెట్ల వెనుక ఎవరో ఉన్నారు. ఏదో కోలాహలం. అటువైపు చూపు సారించాడు. ఆశ్చర్యం! ఒక మెరుపుతీగ. అంతఃపుర కాంతలకు కూడా ఉండదు ఆ శరీరలావణ్యం. అలాంటి అందమైన ఒక కాంత అతడికి కన్పించింది.

ఆమె పేరు శకుంతల. కణ్వమహర్షి పెంపుడు కూతురు. తన ఇష్టసఖులైన అనసూయ, ప్రియంవద అనే వారితో కలిసి విహరిస్తోంది. వాళ్ళు రాజును చూడలేదు. రాజు వాళ్ళను చూశాడు. ఆమె ఎవరో ఏమిటో రాజుకు తెలియదు. తెలుసుకోవాలని ఒకటే కుతూహలం.

అందుకే దుష్యంతుడూ వారి కంట పడకుండా రెప్పవేయకుండా చాటునుంచి చూస్తున్నాడు.

శకుంతల కణ్వమహర్షి పెంపుడు కూతురే కాదు. కణ్వమహర్షి ఆశ్రమంలో లేనప్పుడు అన్నీ తానై ఆశ్రమాన్ని నడిపిస్తుంది. అందుకే ఇప్పుడు కూడా శకుంతలకు ఆశ్రమబాధ్యతలు అప్పగించి కణ్వమహర్షి శకుంతలకు సంబంధించిన దుష్టగ్రహాలకు ఏవేవో శాంతులూ అవీ జరిపించడం కోసం సోమతీర్థం అనే ప్రాంతానికి వెళ్ళాడు.

చెలులతో విహరిస్తూ శకుంతల చెట్లకు నీళ్ళు పోస్తోంది. ఆమె సౌందర్యానికి ముగ్ధుడైపోయాడు రాజు.

"ఈ సౌందర్యవతి రాజకన్యా? మునికన్యా?!

నిజంగా మునికన్యే అయితే నా మనసును ఎందుకు ఆకర్షిస్తుంది!? ఎవరో తెలుసుకోవాలి. ఎలా ?!" అని తనలో తాను ఒకటే సతమతమై పోతున్నాడు. వాళ్ళకు తెలియకుండా వాళ్ళనే అనుసరించాడు. వాళ్ళు మాట్లాడుకొనే మాటలు విన్నాడు. ఆ మాటల్లోనే అతడికి ఆమె ఎవరో తెలిసింది.

ఆమె కణ్వమహర్షి కూతురని తెలిసేసరికి ఆశ్చర్యపోయాడు. ఒక ముని కన్యకు ఇంతటి అందమా?! నార చీరలో ఉంది. అయితేనేం ఆమె లోకోత్తర సౌందర్యం

రాజును మరులుగొనేలా చేసింది. ఆమెతో పరిచయం చేసుకోమంది ఆత్రుత. ఆమెతోనే అనురాగం పంచుకోమంది అతడి మనసు.

శకుంతల మునికన్య అయినా ఆమెపై తనకు అనురాగం కలిగింది కాబట్టి నిశ్చయంగా ఆమె క్షత్రియుడు పెళ్ళాడటానికి యోగ్యురాలే! ఇది నిజం. అనుకున్నాడు రాజు.

ఇంతలో ఒక విచిత్రం జరిగింది.

శకుంతల చెట్లకు నీళ్ళు పోస్తోంది కదా! అలా నీళ్ళు పెట్టడంవల్ల ఒక తుమ్మెదకు చాలా ఇబ్బంది కలిగింది. అది కంగారు పడిపోయి ఆందోళనతో శకుంతల ముఖంపైకి ఝుమ్మంటూ ముసురుకొచ్చింది. ఎందుకంటే శకుంతల ముఖాన్నే పద్మం అనుకొంది మరి!

అప్పుడు శకుంతల పరిస్థితి చూడాలి! బెదిరిపోయింది. బేల చూపులు చూస్తూ 'అనసూయా! ప్రియంవదా! రక్షించండే!' అంటూ వేడుకొంది.

అసలే చెలులు. సరదాగా కాస్సేపు శకుంతలను ఆటపట్టిద్దామనుకున్నారు.

"అమ్మా! శకుంతలా! మా వల్ల ఏమవుతుంది గానీ ఈ దేశాన్నేలే మహారాజు గారు, దుష్యంతు డున్నాడు కదా! ఆయన్ని పిలువ్... ఆయనగారు వచ్చి రక్షిస్తాడులే..." అంటూ సాగదీస్తూ ఆటపట్టించారు.

ఎంత చక్కని అవకాశం చిక్కిందో దుష్యంతమహారాజుకి. కాగలకార్యం చెలికత్తెలు తీర్చారు. వాళ్ళతో మాట కలపడాని కింతకంటే మంచి అవకాశం రాదని దుష్యంతమహారాజు వాళ్ళ మాటలు విని అక్కడికి వచ్చినట్లుగా–

"ఎవడు ఎవడా దుర్మార్గుడు... అన్నెం పున్నెం ఎరుగని మునికన్యలను బాధించేవాడు " అంటూ వాళ్ళ మధ్యకు వచ్చాడు.

అంతే! అందరూ ఆయన్ని చూసి అవాక్కైపోయారు. ఆశ్చర్యం నించి తేరుకోలేక పోయారు. మొత్తానికి ఎలాగో తేరుకొని అనసూయ తడుముకుంటూ– ఈ తుమ్మెద.. తుమ్మెద అంటూ కష్టపడి కష్టపడి అక్కడ జరిగిన విషయం చెప్పి అదుగో.. అంటూ శకుంతలను చూపించింది.

కొంతసేపటికి అందరూ కుదుటపడ్డారు. పరస్పరం పరిచయాలు అయ్యాయి.

చెలుల ద్వారా రాజుకు శకుంతల జన్మవృత్తాంతమూ తెలిసింది. హమ్మయ్య.. అని ఊపిరి పీల్చుకున్నాడు. ఇప్పటిదాకా ఏదో శంక. ఆమె తాకరాని అగ్ని హోత్రమేమో అనుకున్నాడు. కానీ ఆమె స్పృశించ తగిన రత్నమే అని తేలిపోయింది. రాజుగారి మనసు తేలికపడింది. ఆనందం ఇనుమడించింది.

అటు శకుంతల స్థితీ అలాగే ఉంది. దుష్యంతుణ్ణి చూసీ చూడడంతోనే సిగ్గుల మొగ్గ అయ్యింది. ఆపై వలపుల మొలక కూడా అయ్యింది.

వీళ్ళిద్దరి పరిస్థితిని మార్చి మార్చి చూస్తున్నారు అనసూయా ప్రియంవదలు. వాళ్ళను ఈ లోకంలోనికి తీసుకురావాలని మెల్లగా ఇలా అన్నారు.

కణ్వమహర్షే గనక ఆశ్రమంలో ఉండి ఉంటే రాజుగారిని ఎంత గొప్పగా (వీరిద్దరినీ ఒకటి చేసి) సత్కరించి ఉండేవాడో అన్నారు.

దానికి శకుంతలకి కోపం వచ్చింది. అలిగింది.

మీరిలా మాట్లాడితే నేను ఇక్కడ ఒక్క క్షణం కూడా ఉండను. వెళ్ళిపోతాను అని బెదిరించింది.

చెలులు ఆమెను ఇంకా ఉడికించారు. ఏమమ్మా! శకుంతలా! నువ్విలా ఉన్న పళంగా వెళ్ళిపోతే మిగిలిన ఈ రెండుచెట్లకూ నీళ్ళెవరు పోస్తారమ్మా ? వెళ్తే వెళ్ళావు గానీ బాకీ తీర్చిమరీ వెళ్ళు. అన్నారు.

వెంటనే దుష్యంతుడు కలగజేసుకున్నాడు. అయితే ఇదుగో అంగుళీయకం. దీన్ని తీసుకొని ఆ బాకీ ఏదో జమకట్టుకోండి అంటూ శకుంతల తరపున వకాల్తా పుచ్చుకున్నాడు.

అప్పుడు చెలులు ఆ ఉంగరం పై ముద్రించి ఉన్న అక్షరాలను కూడబలుక్కొని చదువుతుంటే – ఆఁ.. ఆఁ.. మీకేమీ సందేహం అక్కర్లేదు. నేను రాజపురుషుణ్ణే.. ఇంద! ఈ ఉంగరంతో ఆ బాకీ తీర్చుకోండి ఊఁ..'... అన్నాడు గట్టిగా.

"రాజా! తమరు అంత మాట అన్నారు అంతే చాలు! ఆ మాటకే ఆమె బాకీ తీరిపోయింది లెండి!" అంటూ కిసుక్కున నవ్వి, ఆ ఉంగరం తిరిగి రాజుగారికే ఇచ్చేశారు.

వాళ్ళతో మాట్లాడుతూనే మరోపక్క ఈ కాస్సేపట్లోనే దుష్యంతమహారాజు శకుంతలను బాగా పరిశీలించేశాడు. అతడికి ఒక విషయం బాగా అర్థమయ్యింది. అదేమిటంటే – శకుంతల కూడా తనను ప్రేమిస్తోందని,

ఇంతలో దూరంగా ఒకటే కోలాహలం. ఆశ్రమవాసులారా! దుష్యంతమహారాజు వేటకు వచ్చాడు. అందరూ తొలగిపోండి! అంటూ సైనికులు అక్కడ హడావుడి చేసేస్తున్నారు.

మరోవైపు రాజుగారి రథాన్ని చూసింది ఒక ఏనుగు. దానికి భయపడిపోయింది. ఆ భయానికి ఆ ఏనుగు వీరంగం చేస్తూ విధ్వంసం సృష్టించింది. దాంతో ఆశ్రమం అంతటా ఒకటే కలకలం.

తన కోసం సైనికులు ఆశ్రమవాసుల్ని అలా పీడిస్తుండడంతో రాజు ఎంతగానో బాధపడి, వారిని వారించడం కోసం వెళ్తూ – అక్కడే తనతో ఉన్న చెలులను చూసి మీరూ వెళ్ళిపోండి అన్నాడు.

శకుంతలకు కాళ్ళు రావడం లేదు. వెళ్ళలేక వెళ్ళలేక వెళ్తోంది. అలా వెళ్తూ రాజునే చూస్తోంది. అయినా తప్పదు కదా ఇష్టంలేకపోయినా సఖులతో కలిసి మెల్లగా ఆశ్రమం వైపు అడుగులు వేసింది.

దుష్యంతుడి పరిస్థితీ అంతే! శకుంతల పై ఉన్న అనురాగం అతగాణ్ణి ఎంతో దూరం వెళ్ళ నివ్వలేదు. తపోవనానికి దగ్గరలోనే విడిది చేసేలా చేసింది.

## 2

దుష్యంతుడి మనసు మనసులో లేదు.

శకుంతల తనను ప్రేమిస్తోందో లేదో అన్న దిగులు. వేట పైకి మనసు పోవడం లేదు. ప్రియమిత్రుడు విదూషకుడితో (మాండవ్యుడు)– వయస్యా ఆ శకుంతల నన్ను ప్రేమిస్తోందంటావా అని అడిగాడు.

రాజు వాలకం చూశాడు మాఢవ్యుడు. రాజా ఈ రోజు వేట వద్దు. విశ్రాంతి తీసుకోండి. దేవరవారి మనసు ఏమీ బావున్నట్లు లేదు. అన్నాడు.

దానిని రాజూ పాటించాడు.

ఎలాగైనా శకుంతలని చూడాలని రాజు మనసు తపిస్తోంది.

ఆశ్రమవాసులు తాము పండించిన నీవారధాన్యంలో ఆరోవంతు రాజుకు – పన్నుగా చెల్లించాలి. ఆ పన్ను వసూలు చేసే మిషతో వెళ్ళి, శకుంతలని చూసి రమ్మని మరో సలహా ఇచ్చాడు విదూషకుడు.

ధార్మికుడైన రాజు దానికి ఒప్పుకోలేదు. నాలుగు వర్ణాల వారూ పన్ను చెల్లిసారు. అదంతా తరిగిపోతుంది. కానీ ఈ ఆశ్రమవాసులు ఇచ్చేది మాత్రం ఎన్నటికీ తరగదు సరి కదా! అది ఎంతో విలువైనది. అందుకే రాజుకి ఆ మిషతో వెళ్ళడానికి ఇష్టంలేదు.

దౌవారికుడు వచ్చి– దేవా! దేవరవారి దర్శనం కోసం ఎవరో ఇద్దరు మునికుమారులు వచ్చారు అని చెప్పాడు.

రాజు అనుమతించాడు. వెంటనే వాళ్ళు ప్రవేశించారు. రాజును ఇలా శరణుకోరారు.

రాజా! మా కులపతి ఆశ్రమంలో లేని సమయం చూసుకొని రాక్షసులు పేట్రేగి పోతున్నారు. ఇష్టికి (యాగం) విఘ్నాలు కలిగిస్తున్నారు. మీరే ఎలాగైనా రక్షించాలి! అని.

ఆశ్రితరక్షకుడైన దుష్యంతమహారాజు వెంటనే అభయ మిచ్చాడు.

ఇంతలో మరో సందేశం వచ్చింది. రాజా! రాబోయే చతుర్థి రోజున నువ్వు పితృకార్యం చెయ్యాలి. ఆనాటికి వెనక్కి తిరిగి రా! అని దుష్యంత మహారాజు తల్లిగారి ఆదేశం. అప్పుడే కరభకుడు అనే చారుడు వచ్చి ఆ సందేశం అందించాడు.

ఇప్పుడు రాజుకు ఏమీ పాలుపోలేదు. సంకట స్థితిలో పడ్డాడు. ఒకవైపు మునికుమారులకు ఇచ్చిన మాట, మరోవైపు పితృకార్యం, తల్లి ఆజ్ఞ.

దానికో ఉపాయం తోచింది అతడికి. తనకు సోదరతుల్యుడైన విదూషకుణ్ణి పిలిచి– వయస్యా! వెళ్లు నాకు ప్రతినిధిగా నువ్వే పితృకార్యాన్ని నిర్వర్తించు. జాగ్రత్త! శకుంతల గురించి నేను చెప్పినదంతా మర్చిపో! అని పంపివేశాడు.

తాను మాత్రం ఆశ్రమ రక్షణకే కట్టుబడి అక్కడే ఉండిపోయాడు.

# 3

దుష్యంతుడు యాగ రక్షణలో ఉన్నాడు. ఋషుల అనుమతి లభిస్తే శకుంతలను చూడడానికి వెళ్ళాలన్నది అతడి కోరిక. శకుంతల కూడా రాజును చూసింది మొదలు తపించిపోతోంది. అనసూయా ప్రియంవదలు ఆమెకు శైత్యోపచారాలు చేస్తున్నారు.

దుష్యంతుడిదీ అదే పరిస్థితి. ఎలాగైనా శకుంతలను చూడాలని ఉంది. మాలినీ నదీ తీరానికి బయలుదేరాడు. అక్కడ శకుంతల ఉంటుందేమోనని అతడి ఆశ.

శకుంతలకూ ఓపలేని విరహబాధ. అది పోవాలంటే ఆమెను రాజు చేపట్టాలి. దానికిముందు మనసులోని ప్రేమను చెప్పాలి కదా! అందుకే ప్రేమలేఖ రాయమన్నారు చెలులు. ఆమె రాసింది.

అప్పుడే అటుగా వచ్చాడు దుష్యంతుడు. ఆ మాటలు విన్నాడు. శకుంతల విరహతాపానికి కారణం తానేనని తెలుసుకున్నాడు. ఎగిరి గంతేసినంత పనిచేశాడు. అతడికి గాల్లో తేలినట్టుంది. ఇదే మంచి సమయమని మళ్ళీ వాళ్ళ ముందుకు వచ్చాడు.

చెలులు చూసి 'రాజా! స్వాగతం' అన్నారు సాదరంగా.

ఈ చెలులిద్దరికీ శకుంతలపై వల్లమాలిన అభిమానం. అందుకే శకుంతలవైపు తామే వకాల్తా పుచ్చుకొని రాజుతో మాట్లాడుతున్నారు.

'రాజా! మీకేం మహారాజులు. మీకేమైనా ప్రియురాళ్ళకూ దేవేరులకూ కరువా ఏమిటి చెప్పండి? అసలే మా శకుంతల అమాయకురాలు! రేపు మీరు అన్యకాంతలపై ఆసక్తితో శకుంతలను నిర్లక్ష్యం చేయకూడదు. 'ఇలాంటివాణ్ణి కట్టుకున్నావేమిటమ్మా!' అని రేపు ఈమె బంధువులు ఈమెపై జాలిపడే పరిస్థితి ఎన్నడూ రానివ్వకండి! జాగ్రత్తగా ఏలుకోండి!' అని రాజును వేడుకున్నారు.

రాజుకీ వాళ్ళ ఆందోళన అర్థమయ్యింది. అందుకే ఇలా అన్నాడు.

"నా ప్రతిష్ఠను నిలబెట్టేది మొదట ఆ భూకాంత. ఆ తరవాత ఈ మీ ఇష్టసఖి శకుంతల. అందుకే శకుంతల సంతానానికే పట్టాభిషేకం చేస్తాను" అని వారికి భరోసా ఇచ్చాడు.

ఆ మాటలు అందరికీ నచ్చాయి. ఇంక శకుంతలా దుష్యంతులకు ఏకాంతం కావాలి.

'చెలీ! చూడు! పాపం ఆ లేడిపిల్ల! తల్లికోసం ఎలా తపిస్తోందో! పద! వెళ్ళి వెదుకుదాం' అంటూ నెపంపెట్టుకొని చెలులు నెమ్మదిగా అక్కణ్ణుంచి జారుకున్నారు.

★★★

శకుంతలను దుష్యంతుడు గాంధర్వవివాహం చేసుకున్నాడు. వాళ్ళు అన్యోన్యంగా ఏకాంతంలో ఉన్నారు.

ఈలోగా శకుంతల విరహంలో ఉందన్న విషయం తెలిసి గౌతమి అక్కడికి వస్తోంది. అది చూశారు దూరంనించే చెలులు. వెంటనే శకుంతలాదుష్యంతులకు వినబడేలా 'ఓ చక్రవాకమా! రాత్రి కావస్తోంది. ఇంక నీ ప్రియుణ్ణి' విడిచిపెట్టు అన్నారు.

శకుంతలకు విషయం అర్థమై ఎవరో వస్తున్నారనుకొని వెంటనే దుష్యంతమహారాజును లతలమాటున దాచి పెట్టింది.

గౌతమి అక్కడికి వచ్చింది. శకుంతలను కుశలం అడిగింది. ఆ తాపం పోవడానికి తనతో తెచ్చిన శాంతి జలాన్ని ఆమె పై చల్లి– శకుంతలా! చీకటి పడింది. పద ఆశ్రమానికి పోదాం అంటూ గౌతమి శకుంతలను తీసుకుని ఆశ్రమానికి బయలుదేరింది.

అప్పుడు శకుంతల లతలకు చెప్తున్నట్లుగా వెళ్ళి వస్తానని రాజుకు చెప్పి వెళ్ళిపోయింది.

అలా అకస్మాత్తుగా శకుంతల వెళ్ళిపోవడంతో రాజుకు ఏం చేయాలో తోచలేదు. విరహం అతిశయించింది. శకుంతల పడుకున్న పూలపాన్పు, కూర్చున్న శిలాతలం, రాసిన మన్మథ లేఖ మొదలైన వాటినే చూస్తూ అక్కడే ఉండిపోయాడు.

ఇంతలో ఒక వార్త. మళ్ళీ రాక్షసులు యాగానికి విఘ్నం కలిగిస్తున్నారట. అక్కణ్ణుంచి వెళ్ళాలి. కాని వెళ్ళడానికి మనసు రావడం లేదు. అయినా బలవంతంగానే బయలుదేరాడు ధర్మపాలకుడు కాబట్టి.

# 4

యాగం పరిసమాప్త మయ్యింది. రాజు నగరానికి వెళ్ళిపోయాడు.

వెళ్ళినదగ్గరనుంచీ శకుంతలకి ఒకటే చింత. దుష్యంతుడికి తాను గుర్తుందా?! లేక అంతఃపుర స్త్రీల మోజులో పడి మర్చిపోయాడా?! ఇలా అనుకొంటూనే కాలం గడపసాగింది.

కాలచక్రం గిర్రున తిరుగుతోంది. రాజు నుండి ఏ కబురూ లేదు. క్షణం క్షణం దుర్భరంగా గడుస్తోంది శకుంతలకి. ఎప్పుడు చూసినా ఒకటే పరధ్యానం!

ఆమె దురదృష్టం కాకపోతే మరేమిటి! సరిగ్గా అదే సమయానికి అక్కడికి దుర్వాస మహర్షి వచ్చాడు. శకుంతల వచ్చిన మహర్షిని గమనించలేదు. కనీసం పట్టించుకోలేదు. ఎందుకంటే ఆమె దుష్యంతమహారాజులోకంలోనే ఉంది కాబట్టి.

అసలే దుర్వాసుడు ముక్కోపి. ఆమె నిర్లక్ష్య వైఖరి మహర్షికి అస్సలు మింగుడు పడలేదు. విషయం గ్రహించాడు. దుష్యంతుడిపై ధ్యాస వల్లనే శకుంతల తనను నిర్లక్ష్యం చేసింది. కాబట్టి ఆ దుష్యంతుడే శకుంతలను మర్చిపోతాడు అని శపించాడు.

ప్రియంవద మహర్షిని శాంతింప జేసింది. తరణోపాయం చెప్పమని ప్రార్థించింది.

మహర్షి మెత్తబడ్డాడు. అభిజ్ఞానదర్శనం (జ్ఞాపిక) వల్ల గుర్తిస్తాడని అనుగ్రహించాడు.

దుష్యంతుడు శకుంతలకు ఒక ఉంగరం ఇచ్చాడు. అది ఉంది కదా! ఇంక భయం లేదని ఊపిరి పీల్చుకున్నారు అనసూయాప్రియంవదలు.

అసలే శకుంతల బాధల్లో ఉంది. అందుకే శాపం విషయం ఆమెకు చెప్పకూడదనుకున్నారు వాళ్ళిద్దరూ.

శకుంతల దుష్యంతుణ్ణి పెండ్లాడినట్లు, గర్భం దాల్చినట్లు కణ్వమహర్షికి ఆకాశవాణి చెప్పింది. రాజు శకుంతలకు తగిన వాడేనని కణ్వుడూ సంతోషించాడు. ఇక తన బాధ్యతే మిగిలింది! అది శకుంతలను అత్తవారింటికి పంపడం! దానికి సన్నాహాలు చేశాడు.

శకుంతలకు ఒకటే ఆందోళన. ఒక వైపు భర్త ఇంటికి వెళ్తున్నందువల్ల ఉత్కంఠ, మరో వైపు ఆశ్రమాన్ని విడిచి పెడుతున్నానన్న బాధ. ఈ రెండూ ఆమెను కలచి వేస్తున్నాయి.

ఆడపిల్లను అత్తవారింటికి పంపే సందర్భం, ఏ తల్లిదండ్రులకైనా భరించలేనిదే! అల్లారు ముద్దుగా పెంచుకొన్న ఆడపిల్ల తమను వీడిపోతోందన్న ఆలోచనే నిలువునా శోకం ముంచెత్తేలా చేస్తుంది.

ఆ పరిస్థితి ఇప్పుడు కణ్వమహర్షికి ఎదురయ్యింది. అందరిలాగే కణ్వుడూ, శకుంతలకు వస్త్రాలు, అలంకారాలు ఇచ్చి సాగనంపుతున్నాడు.

శకుంతల అగ్నిదేవుడికి ప్రదక్షిణం చేసింది. వనదేవత అనుగ్రహంతో భర్త ఇంటికి బయలుదేరింది శకుంతల.

వనదేవతలు, మృగాలు, వృక్షాలు, లతలు ఇలా ఆశ్రమం ఆశ్రమమే అశ్రునయనాలతో ఆమెకు కన్నీటి వీడ్కోలు పలికింది. కొంత దూరం ఆమెను వెంబడించింది.

ఇక కణ్వ మహర్షి పరిస్థితి వేరే చెప్పనక్కర్లేదు. శకుంతల వెళ్ళిపోతోందన్న ఆలోచన రావడంతోనే అతడి పెంచినపేగు కలుక్కుమంటోంది. ఒకటే బెంగగా ఉంది. కళ్ళ నుంచి నీరు ధారాపాతంగా వస్తుంటే తన కన్నీళ్ళు నేలపై పడితే అమంగళమన్న భయంతో దుఃఖాన్ని అలాగే మింగుతున్నాడు. అయినా అతడివల్ల కావడం లేదు. కంఠం బొంగురుపోయింది. చూపు జడమయ్యింది. ఇంద్రియాలన్నీ భీష్మించుకొని కూర్చున్నాయి. పేరుకే చూస్తున్నాడు, వింటున్నాడు గానీ అతనికేదీ కనిపించడం లేదు వినిపించడం లేదు.

మమకారం అంటే ఇదేనా?! శకుంతలకు తాను పెంపుడు తండ్రి మాత్రమే! భవబంధాలను తెంచుకొని ముక్కు మూసుకొని తపస్సు చేసుకొనే తనకే వియోగ బాధ ఇంతగా ఉంటే మరి! సామాన్యులు, ఇంద్రియనిగ్రహం లేనివారు అయిన గృహస్థుల పరిస్థితి ఇంకేం కాను! అమ్మాయిని కని, అల్లారుముద్దుగా పెంచి అత్తవారింటికి పంపేటప్పుడు ఎంతగా బాధపడతారో కదా! అని బాధపడ్డాడు కణ్వమహర్షి.

కణ్వుడి బాధ ఆకాశమంత. చెప్పనలవి కానిది. ఆ బాధను ఎవరితో చెప్పుకోవాలి? శకుంతలతో పాటుగా పెరిగిన చెట్లకూ, లతలకూ, వనదేవతలకూ చెప్పుకున్నాడు. వాళ్ళందరినీ శకుంతల వెళ్ళడానికి అనుమతి నివ్వవలసిందని అభ్యర్థించాడు.

అంతలో కోకిల కూసింది. అదే ఆశీర్వచనంగా భావించి పొంగిపోయాడు. అల్లుడు ఎంత ఉత్తముడైనా కూతురిపై ఉండే ప్రేమవల్ల ఏవో కొన్ని జాగ్రత్తలు చెప్తాడు పిల్లతండ్రి. అది సహజం. బ్రతిమిలాడినా బామాలినా బెదిరించినా అవన్నీ కూతురి పై ఉన్న మమకారం కొద్దీ చేసేవే కానీ అల్లుడి వ్యక్తిత్వాన్ని శంకించేవి కావు. కణ్వుడూ అదే పని చేశాడు.

"రాజా ! ఈ శకుంతల నీ భార్య. ఏలుకోవయ్యా! వంశానికి మచ్చ తెచ్చే విధంగా ప్రవర్తించకు. మేం తపోధనులమని గుర్తుంచుకో! మా ప్రేమను గుర్తుంచుకొని ఇతర భార్యలతో సమానంగా ఈమెను చూసుకో! మేం అరణ్యవాసులం. కట్నకానుకలేవీ పెద్దగా ఇచ్చుకోలేం. మాకున్న ఐశ్వర్యం శాంతం ఒక్కటే! ఇంతకన్నా మేం చెప్పేది ఏమీ లేదు. ఇక పై దైవానుగ్రహం" ఇదీ కణ్వుడు దుష్యంతుడి కిచ్చిన సందేశం.

తన కూతురికీ అత్తవారింట్లో మెలగవలసిన సుద్దులు చెప్పాడు.

"అమ్మా! శకుంతలా! భర్తనూ, అత్తమామలనూ, గురువులనూ భక్తి శ్రద్ధలతో సేవించు. పెద్దలు చెప్పిన మాటలు విని, నడుచుకో! సవతులతో సఖ్యంగా ఉండు. ఎప్పుడైనా భర్త తిరస్కరించినా ఎదురు మాట్లాడకు. సేవకులపై దయతో ప్రవర్తించు. పట్టపు రాణివైనా నీకు గర్వం పనికిరాదు. అంటూ చెప్పి, శకుంతలను మనసారా దీవించి, శార్ఙ్గరవుణ్ణీ గౌతమినీ తోడుగా ఇచ్చి పంపాడు. సరస్తీరం వరకూ వెళ్ళి, శకుంతల కనుమరుగయ్యేంతవరకూ అలా ఆమె వెళ్ళినవైపే చూస్తూ ఉండిపోయాడు.

## 5

అది సంగీతశాల.

రాజు, విదూషకుడూ సుఖాసీనులై ఉన్నారు.

హంసపదిక చక్కగా గానం చేస్తోంది. ఆ గానం ఎంతో మధురంగా ఉంది.

'ఓ తుమ్మెదా! మొదట మావిగుత్తితో ఉన్నావు, తరువాత కమలంపై వాలావు. మావి గుత్తిని మరిచిపోయావు" ఇదీ ఆ పాటలోని భావం.

అది విన్న రాజు మనసు ఏదోలా అయ్యింది.

ఇంతలో కణ్వమహర్షి శిష్యులు వచ్చారన్న సందేశం. దుష్యంతుడే స్వయంగా యాగశాలలో ఉన్న వారి వద్దకు వెళ్ళాడు. వారిలో శకుంతల ఉంది. ఎంతో మనోహరంగా ఉంది. రాజు ఆకర్షితుడయ్యాడు. ఆమె ఇతరుడి భార్య కదా! తప్పు. తనను తాను నియంత్రించుకున్నాడు.

దుర్వాసమహర్షి శాపం కారణంగా ఆమె తన భార్యే నన్న విషయాన్ని రాజు మరిచిపోయాడు.

"మీ పెళ్ళిని నేను అంగీకరిస్తున్నాను. ఇప్పుడు ఈమె నీవల్ల గర్భవతి అయ్యింది. భార్యగా స్వీకరించు" అని కణ్వుడు పంపిన సందేశాన్ని శార్ఙ్గరవుడు దుష్యంతుడికి విన్నవించాడు. దుష్యంతుడి కిదేమీ గుర్తు లేదు. ఎంత ప్రయత్నించినా శకుంతలను చూసిన జ్ఞాపకం కూడా లేదు. పైగా ఇదంతా అబద్ధ మనిపించింది.

స్త్రీలు అబద్ధాలాడతారు. ఇదంతా కట్టుకథ అన్నాడు. శకుంతల రాజు తనకు ఇచ్చిన ఉంగరం చూపిద్దామనుకుంది. కానీ దురదృష్టం! అదికాస్తా ఎక్కడో పడిపోయింది.

అయినా శకుంతల విడిచిపెట్టలేదు. గుర్తుచేయాలని చూసింది. ఎన్నెన్నో గుర్తులు చెప్పింది. అయినా ఫలితం లేదు. చివరికి నీ వల్ల మోసపోయానని నిలదీసింది.

మంచో చెడో నువ్విక్కడే ఉండాలి. చివరికి రాజు వద్ద దాస్యం చేసైనా బతకవలసిందే! అని చెప్పి వెంటవచ్చినవాళ్ళు కాస్తా వెళ్ళిపోయారు.

చివరికి తన భాగ్యం ఇలా ఉందని శకుంతల బాధపడుతూ పురోహితుడి వెంట వెళ్ళింది.

శకుంతల ప్రసవించాక పుట్టిన సంతానం చెప్పకనే చెబుతుంది. తనకు తండ్రి ఎవరో అన్న సంగతి. పోలికలు ఎక్కడికి పోతాయి అన్నదే పురోహితుడి వ్యూహం.

అలా వెళ్ళిన శకుంతల అప్సరస్తీర్థాన్ని చేరుకుంది. ఇంతలో ఒక దివ్యజ్యోతి స్త్రీ ఆకారంలో వచ్చింది. శకుంతలను ఎత్తుకొని వెళ్ళిపోయింది.

ఈ విషయాన్ని పురోహితుడి ద్వారా తెలుసుకొన్న రాజు ఆశ్చర్యపోయాడు. శకుంతల తన భార్య అనుకోవడానికి ఏమీ గుర్తుకు రావడంలేదు. కానీ మనసులో

ఎక్కడో ఓ మూల ఆమెను వివాహం చేసుకొన్నానేమో నన్న అనుమానం వెంటాడుతూ ఉంది. కలత చెందిన మనసుతో శయనాగారంలోనికి ప్రవేశించాడు.

★★★

దుష్యంత మహారాజు రాజ్యంలోనే ఒక ధీవరుడు (జాలరి) ఉన్నాడు. చేపలు పట్టడం అతడి వృత్తి. ఒక రోజు తాను పట్టుకున్న 'రోహితం' అనే చేపను కోశాడు. దాని పొట్టలో ఒక అంగుళీయకం (ఉంగరం) దొరికింది. దానిని అమ్మి సొమ్ము చేసుకుందామని చూశాడుగానీ రక్షకభటులకు అడ్డంగా దొరికిపోయాడు.

అది రాజముద్రిక. అందుకే వాళ్ళు తెచ్చి రాజుగారికి సమర్పించారు. దానిని చూడగానే రాజుకు గతం గుర్తుకువచ్చింది (ఆనవాలు ఏదైనా ఉంటే రాజు శకుంతలను గుర్తుపడతాడని దుర్వాసముని శాపవిమోచనం ఉంది కదా!).

రాజు మనసు కదిలిపోయింది. చేజేతులా శకుంతలను దూరం చేసుకొన్నాననే చింత. మరోవైపు అపరాధభావం. చేసిన తప్పుకు పశ్చాత్తాపం.. ఇలా అన్నీ కలిసి ఇప్పుడు దుష్యంతుణ్ణి వేధిస్తున్నాయి.

★★★

తన కుమార్తెను తిరస్కరించిన దుష్యంతుడి పరిస్థితి ఎలా ఉందో ఏమిటో చూసి రమ్మని మేనక తన స్నేహితురాలైన సానుమతిని పంపింది. ఆమె తిరస్కరిణీ విద్య వల్ల ఎవరికీ కనబడకుండా వచ్చి ఉద్యానవనంలో తిరుగుతూ ఉంది.

అది వసంతకాలం.

వసంతం వచ్చిందంటే చాలు ఉత్సవాలు చాలా వైభవంగా జరుగుతాయి. కానీ ఇప్పుడు జరగడం లేదు. దానికి కారణం రాజుకు మనసు మనసులో లేకపోవడమే!

ఉత్సవం తాలూకూ కోలాహలం ఎక్కడా మచ్చుకు కూడా కనిపించకపోవడంతో సానుమతి ఆశ్చర్యపోయింది.

అదే సమయంలో రాజు విదూషకుడితో అక్కడికే వచ్చాడు. పదే పదే దుఃఖిస్తున్నాడు. ఒక పక్క గౌతమీ, మునికుమారులూ, మరోపక్క శకుంతలా ఎంతగా చెప్తున్నా దయ కొంచెమైనా లేకుండా గర్భవతి అని కూడా చూడకుండా ఆమెను తిరస్కరించినందుకు తనను తానే నిందించుకున్నాడు.

ఈ పశ్చాత్తాపం వల్ల రాజుకు రాచకార్యాలపై కూడా ఏకాగ్రత కుదరడం లేదు. బాధ్యతల్ని మంత్రి అయిన పిశునుడికి అప్పగించాడు.

అతడి దృష్టిని మరల్చడం కోసం దుష్యంతుడే గీసిన శకుంతల చిత్రపటాలు తీసుకురమ్మని చెలికత్తెతో చెప్పాడు విదూషకుడు.

తపోవనంలో ఉన్నప్పుడు రాజు శకుంతలను కలిసిన విషయం విదూషకుడికి తెలుసు. అయితే రాజు శకుంతలను తిరస్కరించే సమయంలో విదూషకుడు అక్కడ లేడు. తరువాత కూడా ఎప్పుడూ శకుంతల విషయం రాజు దగ్గర విదూషకుడు ప్రస్తావించలేదు. రాజు దానికి కారణం అడిగాడు.

అప్పుడు విదూషకుడు– రాజా! తపోవనంలో ఉన్నప్పుడు శకుంతల గురించి ఏదేదో చెప్పావు, కానీ అదంతా సత్యం కాదని మళ్ళీ నువ్వే చెప్పి ఆ విషయం మర్చిపొమ్మన్నావు. అందుకే నేనూ మర్చిపోయాను అన్నాడు.

అప్పుడు రాజు శకుంతల స్మృతులను విదూషకుడితో పంచుకున్నాడు. వయస్యా! నేను శకుంతలను గాంధర్వ వివాహం చేసుకున్నాను. ఆ తరువాత పట్టణానికి బయలుదేరి వస్తుంటే శకుంతల కన్నీటి వెల్లువే అయ్యిందంటే నమ్ము. నన్ను ఎప్పుడు తీసుకు వెళ్తారు అని బేలగా అడిగింది. దానికి నేను ఒక అంగుళీయకం ఇచ్చి శకుంతలా! ఈ అంగుళీయకంపై ఉన్న అక్షరాలను రోజుకు ఒక్కటి చొప్పున లెక్క పెట్టుకో! లెక్క పూర్తయ్యేలోగా అంతః పుర జనులు నిన్ను స్వాగతించి తీసుకువస్తారు అని చెప్పాను అంటూ బాధపడుతున్నాడు.

దురదృష్టం కొద్దీ దుర్వాసుడి శాప ప్రభావం వల్ల రాజు ఆమెను మర్చిపోయాడు. శకుంతల కూడా తనవద్ద ఉన్న ఒకే ఒక్క ఆనవాలునూ (ఉంగరాన్ని) శచీతీర్థంలో నమస్కరిస్తూ పోగొట్టుకుంది.

ఇలా వీరి సంభాషణ సాగుతుంటే మధ్యలో ‘చతురిక’ శకుంతల చిత్రపటంతో ప్రవేశించింది.

చిత్రంలో శకుంతలతో పాటు ఆమె చెలులు కూడా ఉన్నారు.

విదూషకుడు శకుంతలను చూడలేదు కదా! అందుకే రాజు వయస్యా! వీరిలో శకుంతల ఎవరో గుర్తించు చూద్దాం! అన్నాడు.

విదూషకుడు చిత్రాన్ని చూసి శకుంతలను ఇట్టే గుర్తించేశాడు. ఎలాగంటే– ఆ చిత్రాన్ని చిత్రించేటప్పుడు రాజు విరహంలో ఉన్నాడు. అందువల్ల శకుంతలను చిత్రించేటప్పుడు రాజు చేతి వేళ్ళు చెమర్చి ఉంటాయి. దానివల్ల అక్కడక్కడా నల్లని ఆనవాళ్ళు పడ్డాయి. కన్నీటి చుక్క జారిపడి రంగు ఉబ్బింది. దానిని బట్టీ విదూషకుడు గుర్తుపట్టేశాడు.

అతడి తెలివికి రాజు భళా! మిత్రమా! అని మెచ్చుకున్నాడు.

ఆ చిత్రం ఇంకా పూర్తికాలేదు. పూర్తి చేయడానికి రంగులు తెమ్మని చతురికను ఆజ్ఞాపించాడు. ఆమె రంగులు తీసుకువస్తోంది.

అదే సమయంలో దుష్యంతుడి పట్టమహిషి వసుమతి అక్కడికి వస్తోందన్న

సమాచారం.

రాజు– శకుంతల చిత్రపటాన్ని జాగ్రత్త చేయమని విదూషకుడికి ఇచ్చి పంపేశాడు. అలా వెళ్ళిన విదూషకుడు 'మేఘప్రతిచ్ఛందం' అనే పేరుకల మేడలో ఉన్నాడు.

రాజుకు మంత్రి నుండి ఒక సందేశం అందింది.

ధనమిత్రుడనే వర్తకుడు నౌకా ప్రమాదంలో మరణించాడట. అతనికి పిల్లలు లేరట. అందువల్ల అతని సంపద యావత్తూ రాజుకే చెందింది. ఇదే ఆ సందేశం.

అది విన్న రాజు మరింత దుఃఖించాడు. తనకూ పుత్రులు లేరు. గర్భవతి అయిన శకుంతలను దూరం చేసుకొన్నాడు. రేపు తన సంపదలు, రాజ్యం, ఇక ఎవరి పాలు అవుతాయోనని బాధపడ్డాడు.

ఇక్కడ జరిగేదంతా అదృశ్యంగా ఉండి చూస్తోంది సానుమతి. రాజు సంతానానికి ఏ కీడు కలగదని దీవించింది. అతడు శకుంతల కోసం పరితపించడాన్ని –చూసి సంతోషించింది. ఆ విషయం మేనకకు చెప్పాలని హడావుడిగా వెళ్ళిపోయింది.

★★★

అక్కడ విదూషకుణ్ణి ఒక అదృశ్యశక్తి పట్టి పీడిస్తోంది. అతణ్ణి రక్షించడానికి వచ్చిన రాజు ఆ శక్తిపై బాణం సంధించాడు. ఆ శక్తి విదూషకుణ్ణి విడిచి పెట్టి ప్రత్యక్షమయ్యింది.

ఆ శక్తి రూపంలో ఉన్నది ఎవరో కాదు. మాతలి. ఇంద్రుడి రథసారథి. రాక్షస సంహారంకోసం దుష్యంతుణ్ణి తీసుకు వెళ్ళాలి. ఇంద్రుడి ఆజ్ఞ. అందుకు అతణ్ణి యుద్ధానికి సిద్ధం చేయడం కోసం విదూషకుణ్ణి పట్టి పీడించాడు.

రాజు ఇంద్రుడి ఆజ్ఞను శిరసా వహించాడు. రాజ్యాన్ని జాగ్రత్తగా చూసుకోమని మంత్రికి అప్పగించి ఇంద్రరథాన్ని అధిరోహించి వెళ్లి రాక్షస సంహారం గావించాడు.

మాతలి దుష్యంతుడి పరాక్రమాన్ని ప్రశంసించాడు.

మాతలీ! ఇదంతా ఇంద్రుడి అనుగ్రహమే! నాదేముంది? అన్నాడు దుష్యంతుడు.

కశ్యప ప్రజాపతి హేమకూట పర్వతంపై ఉన్నాడట. ఆయన్ని కలవాలని కొంతసేపు దుష్యంతుడు అక్కడే వేచి ఉన్నాడు.

ఆ సమయంలోనే 'సర్వదమనుడు' అనే పిల్లవాడిని చూశాడు రాజు. సమస్త క్రూరమృగాల దర్పాన్నీ అణచడంవల్ల సర్వదమనుడు అని అతడు ప్రసిద్ధి పొందాడట. ఇతడు ఎవరో కాదు శకుంతల కుమారుడే.

అప్పుడు అంతర్ధానమైన నాటి నుంచీ మారీచ మహర్షి ఆశ్రమంలోనే దేవతల తల్లి అయిన అదితి సంరక్షణలో ఉంది శకుంతల.

సర్వదమనుడి చేతికి అపరాజిత అనే ఒక రక్షరేఖ ఉంది. దానిని జాతకర్మ చేసే సమయంలో మారీచమహర్షి (కశ్యపుడు) ప్రసాదించాడు.

సర్వదమనుడు కానీ అతని తల్లిదండ్రులు కానీ ఆ రక్షరేఖను ముట్టుకోవచ్చు. ఇతరులెవరైనా దానిని తాకితే అది పాముగా మారి కాటు వేస్తుందట.

సర్వదమనుడు ఒక కొదమసింహంతో ఆడుకొంటున్నాడు. ఈ రక్షరేఖ కాస్తా జారి అక్కడే ఎక్కడో పడిపోయింది. ఆ సింహాన్ని వదలి రావటం లేదు. ఇదంతా చూస్తున్న తాపసి ఆ పిల్లవాణ్ణి ఇలా తీసుకురమ్మని రాజును కోరింది. రాజు తీసుకువచ్చాడు.

అందుకోసం ఆ బాలుడిని తాకాడు. ఆ స్పర్శ రాజుకెంతో హాయిని కలిగించింది. అతడిలో చక్రవర్తి లక్షణాలుండటాన్ని చూసి ఆశ్చర్యపోయాడు.

ఇంతలో తాపసకన్యలు వచ్చి సర్వదమనుడి 'రక్షరేఖ' కోసం వెతుకుతున్నారు. అప్పుడు రాజు దానిని తెచ్చియిచ్చాడు.

రాజు రక్షరేఖను తాకాడు. అయినా ఏమీ కాలేదు. అది చూసి తాపసులు ఆశ్చర్యపోయారు.

తాపసులు చెప్పిన ఆ రక్షరేఖ ప్రభావంవల్ల సర్వదమనుడు తన పుత్రుడేనని తెలుసుకొని రాజు పరమానందభరితుడయ్యాడు. శకుంతల అక్కడే ఉందని తెలిసి చూడాలనుకున్నాడు.

శకుంతలకీ సానుమతి ద్వారా భర్త విషయాలన్నీ తెలిశాయి. ఆమె కూడా భర్త పట్ల ప్రసన్నంగానే ఉంది.

★★★

దూరంగా శకుంతల.

రాజు అడుగులో అడుగువేస్తూ దగ్గరికి వెళ్ళాడు. శకుంతలా! నన్ను క్షమించు. అన్నాడు అపరాధభావంతో.

'నాథా! ఇదంతా నా దురదృష్టం. మీ దోషం ఏమీ లేదు' అంది శకుంతల. భర్తను గౌరవించింది. కశ్యప – ప్రజాపతి వద్దకు తీసుకు వెళ్ళింది. ప్రజాపతి జరిగిన వృత్తాంతమంతా దుష్యంతుడికి చెప్పాడు. అదితికి రాజును పరిచయం చేశాడు. శకుంతలా దుష్యంతులు, సర్వదమనుడు కశ్యపాదితులకు నమస్కారం చేశారు.

'వీరు ముగ్గురూ శ్రద్ధ, విత్తం, విధులకు ప్రతీకలు' ఈ మూడూ కలిశాయి కాబట్టి ఇక యజమానివై యజ్ఞాలను నిర్వహించు. ఈ సర్వదమనుడు కూడా సమస్తలోకాన్నీ భరిస్తూ భరతుడని ఖ్యాతి వహిస్తాడు అని దీవించాడు కశ్యపుడు.

మీరు చేసిన యాగాలవల్ల ఇంద్రుడు తృప్తి చెంది తగిన వర్షాలను కురిపిస్తాడు. మీ వల్ల (దుష్యంతుడు, ఇంద్రుడు) రెండు లోకాలు సుభిక్షంగా ఉంటాయి. ఇది కశ్యప ప్రజాపతి ఆశీర్వచనం.

**భరతవాక్యం**

రాజు ప్రజాహితంగా పాలించుగాక! చదువుకొన్నవారి మాటకు గౌరవం లభించుగాక! సర్వశక్తులతో ప్రకాశించే ఉమాపతి అయిన ఆ పరమేశ్వరుడు శాశ్వతమైన మోక్షాన్ని అనుగ్రహించుగాక!

★★★

# సింహావలోకనం

తెలుగు విశ్వవిద్యాలయం – రాజమండ్రి సాహిత్యపీఠంలో నేనున్నప్పుడు 1988లో వ్యాఖ్యాస్రవంతి అనే ప్రాజెక్టు ప్రారంభించి సంస్కృత నాటకాలకు తెలుగు వ్యాఖ్యానాలు సంతరించే పని పెట్టుకున్నాను. అప్పటికే వ్యాఖ్యానాలు ఉన్నవాటిని విడిచిపెట్టి లేనివాటిని ఎంచుకొన్నాను. వేణీసంహారమ్, అనర్ఘరాఘవమ్, నాగానందమ్ వీటికి వ్యాఖ్యానాలు సమకూర్చాను. తెలుగు విశ్వవిద్యాలయమే ప్రచురించింది. మల్లంపల్లి శరభయ్యగారి కాశీఖండ వ్యాఖ్య, జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారి కుమారసంభవ – శివరాత్రి మాహాత్మ్య వ్యాఖ్యానాలు ఈ ప్రాజెక్టులో భాగంగానే తెలుగు కావ్యాలకు వచ్చిన వ్యాఖ్యానాలు. వీటినీ పొ.శ్రీ. తె.వి.వి. ప్రచురించింది.

మృచ్ఛకటికానికి వ్యాఖ్య రాస్తూండగా నేను తె.వి.వి. నుంచి హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయానికి (2005) వచ్చేశాను. అక్కడ అది పూర్తి చేసి భవభూతి ఉత్తర రామచరితమ్ అందుకున్నాను. వీటిని రెండింటినీ అ.జో.వి.భొ. కందాళం ఫౌండేషన్ పక్షాన మాన్యశ్రీ అప్పాజోస్యుల సత్యనారాయణగారు ప్రచురించారు. ఈ వరసలో మరికొన్ని సంస్కృత నాటకాలకు వ్యాఖ్యానం రాయాలనుకొన్నాను గానీ ప్రాచీన తెలుగు అధ్యయనకేంద్రం బాధ్యతలు చేతికి వచ్చి వర్ణనరత్నాకరం వ్యాఖ్యారచనను ఎత్తుకొన్నాను. దేవుడు మేలు చేసి సర్వశ్రీ అద్దంకి శ్రీనివాసు, నరాల రామారెడ్డి, గెడ్డాపు సత్యం, శ్రీమతి శాంతమ్మ, ఆర్వీ ఆర్కె. శాస్త్రి ప్రభృతుల భాగస్వామ్యంతో దాదాపు ఎనిమిది వేల పద్యాల ఆ బృహత్సంకలనాన్ని పాఠకమిత్ర వ్యాఖ్యతో ఇరవైమూడు సంపుటాలుగా ప్రచురించి (ఎమెస్కో) ఉద్యోగ విరమణ చేసి, ఎఱ్ఱన హరివంశానికి వ్యాఖ్యారచన ప్రారంభించి (8-11-2016) సాగిస్తున్న తరుణంలో–

గుంటూరు నుంచి నా శిష్యుడూ సాహితీమిత్రుడూ చి॥ కారసాని రామకృష్ణారెడ్డి సన్నాయినొక్కులతో – ఒక చిన్న కోరిక మాష్టారూ! అన్నాడు. అతడి పెద్ద కూతురు కావ్య పదవతరగతి కాబోలు చదువుతూ విషజ్వరంతో హఠాత్తుగా కాలం చేసింది. పదిపన్నెండేళ్ళు అయ్యింది. ఆ చిన్నారికి స్మృతిగా ప్రచురిస్తాను, అభిజ్ఞాన

శాకుంతలానికి వ్యాఖ్యానం రాసి ఇవ్వండి మాష్టారూ! అన్నాడు. ఆ అమ్మాయి – నాన్నకూచి. చాలా తెలివైనది. నాకూ బాగా తెలుసు. ఆమెకు అభిజ్ఞానమంటున్నాడు. అందుమీదట సరే అన్నాను.

దీనికి ఇంకో కారణమూ ఉంది. నాకు గుంటూరులో ఇతడిలాగానే మరొక ఆత్మీయ శిష్యమిత్రుడు చి॥ కొమాండూరు రంగనాథాచార్యులు. అతడి తాతగారు గొప్ప పండితకవి. వారు రచించిన శ్రీకృష్ణవిలాసమనే ప్రౌఢప్రబంధానికి – అతడు కోరగా నేను వ్యాఖ్యానం సంతరించి ఇచ్చాను. మరిప్పుడు రామకృష్ణుడి కోరికను ఎలా కాదనగలను!?

హరివంశం అయ్యాక అభిజ్ఞాన శాకుంతలం అందుకొంటాలే అన్నాను. అలాగే మాష్టారూ! మీరు రాస్తాను అన్నారు అదే చాలు – అన్నాడు రామకృష్ణుడు. హరివంశం నాలుగువేల పద్యగద్యాల మహాపురాణం. అది అయ్యేదాకా ఇతడిని ఆపడం ఎందుకో నాకు నచ్చలేదు. అది పూర్వభాగం (రెండువేల పద్యాలు) వ్యాఖ్య కాగానే 19.06.2019 తేదీనాడు ఇది ప్రారంభించాను. 30.9.2019 నాడు పూర్తి అయ్యింది.

ఈ వ్యాఖ్యాన రచనకు ప్రధానంగా రాఘవభట్టు అర్థద్యోతినీ వ్యాఖ్య (ముంబయి నిర్ణయసాగర్ – 1843) సహకారం తీసుకున్నా. కాటయవేముని వసంతరాజీయ వ్యాఖ్యనూ (ఆం.ప్ర.సా.అ.హైదరాబాదు – 1982), శ్రీనివాసాచార్యవ్యాఖ్యనూ (వావిళ్ళ – 1934), కందుకూరి వీరేశలింగం పంతులుగారి ఆంధ్రీకరణనూ (హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము – 1971), మోనియర్విలియమ్సుల ఆంగ్లీకరణనూ (అంతర్జాలం) సంప్రదించాను. కాటయవేముడి వ్యాఖ్యానం సంధిసంధ్యంగాది నాటక లక్షణాల సమన్వయం ప్రధానంగా క్లుప్తంగా సాగింది. శ్రీనివాసాచార్య వ్యాఖ్య అనేక స్వారస్యాల ప్రకటనాత్మకంగా విస్తృతంగా నడిచింది. సంభాషణల గురించి ఇద్దరూ పెద్దగా పట్టించుకోలేదు. అర్థద్యోతినియే సమగ్రంగా నాతివిస్తృతంగా ఛందో ఽలంకార వ్యాకరణాంశాల యథావసర ప్రస్తావన సహితంగా నిఘంటువుల ఉద్ధరణలతో నాకు బాగా చేదోడయ్యింది. పాఠాంతరాలను పరిశీలించడం కోసం – బెనారస్ హిందూవిశ్వవిద్యాలయం రేవా ప్రసాద్ ద్వివేదిగారి సంపాదకత్వంలో ప్రచురించిన (1976) కాళిదాస రచనా సర్వస్వాన్ని సంప్రదించాను. అధిక పాఠాలను వదిలేశాను. ముఖ్యమైన పాఠాంతరాలను సూచించాను.

వెరసి నా శక్తిమేరకు ఈ వ్యాఖ్యానాన్ని ఇలా సంతరించి మీ ముందు ఉంచుతున్నాను. వ్యాఖ్యాన రచనలో నేను వాడుక తెలుగు వైపే మొగ్గు చూపాను. అర్థవివరణలో అవసరమైన చోటల్లా గ్రాంథికాన్ని ఉపయోగించాను. పాఠకుడికి ఏ రకంగానూ బరువు పెంచే ప్రయత్నం చెయ్యలేదు. కాళిదాసు రచనలోని సొగసులనూ, వ్యంగ్యాలనూ గ్రహించడంలోనూ ఊహించడంలోనూ పాఠకుడి భాగస్వామ్యానికీ స్వేచ్ఛకూ ప్రతిభకూ నేను అడ్డుపడలేదు. అరటిపండు ఒలిచి చేతిలో పెట్టాను అంతే. **నామూలం లిఖ్యతే కించిత్, నానపేక్షిత ముచ్యతే** – అన్న మల్లినాథసూరి నాకు మహర్షి.

ఇప్పటికే ఈ నాటకానికి తెలుగు వ్యాఖ్యలూ, అనువాదాలూ చాలా వచ్చాయి. దేని సొగసు దానిది. ఇలాంటి సందర్భంలో నాకు అనంతుడి మాటే జ్ఞాపకం వస్తూంటుంది. **నిజాగ్రసూనుల పటుప్రచురోక్తులకంటె చిన్నిబిడ్డల వెడ తొక్కుబల్కులు దృఢంబుగ నింపుల నీనకుండునే!** సెలవు.

**కొసమెరుపు:** ఎప్పటిలాగానే దీని తయారీలోనూ అన్నివిధాలా సాంకేతిక సహకారం అందించడమే కాక పీఠికనూ కథాసంగ్రహాన్నీ అందించిన సోదరుడు డా. అద్దంకి శ్రీనివాస్ గారికీ వారి శ్రీమతి రాజ్యలక్ష్మిగారికీ; దీన్ని ముద్రించడానికి కోరి ముందుకు వచ్చిన విజయవాడ – శ్రీ రాఘవేంద్ర ప్రచురణల సంస్థ వారికీ ముఖ్యంగా దిట్టకవి రాఘవేంద్రరావు గారికీ ప్రత్యేకంగా ధన్యవాదాలు.

మీ

శ్రీ వికారి — **బేతవోలు రామబ్రహ్మం**

విజయదశమి — 08.10.2019

# ఈ నాటకంలో వచ్చే పాత్రలు

**పురుషులు**

దుష్యంతుడు – కథానాయకుడయిన పూరువంశపు రాజు

మాఢవ్యుడు – రాజుకు వేడుక చెలికాడు

కణ్వుడు – శకుంతలకు పెంపుడు తండ్రియగు మహర్షి

వైఖానసులు – కణ్వాశ్రమ ప్రాంతమందలి ఋషులు

శార్ఙ్గరవుడు – కణ్వశిష్యుడు

శారద్వతుడు – కణ్వశిష్యుడు

మిత్రావసువు – రాజు బావమఱిది, ఆరక్షకభటాధిపతి

రైవతకుడు – రాజు ద్వారపాలకుడు

కరభకుడు – రాజుతల్లి పంపిన భటుడు

సోమరాతుడు – రాజపురోహితుడు

జానుకుడు – ఆరక్షక భటుడు

సూచకుడు – ఆరక్షక భటుడు

వాతాయనుడు – అంతఃపుర ద్వారపాలకుడు

మాతలి – ఇంద్రసారథి

భరతుడు – దుష్యంతుని పుత్రుడు

కశ్యపుడు – మరీచి పుత్రుడగు మహర్షి

కుంభీలకుడు – బెస్తవాడు

**స్త్రీలు**

శకుంతల – దుష్యంతుని భార్య, కథానాయిక

అనసూయ – శకుంతల చెలికత్తె

ప్రియంవద – శకుంతల చెలికత్తె

గౌతమి – ఒక వృద్ధ తాపస స్త్రీ

వసుమతి – దుష్యంతుని మొదటి భార్య

సానుమతి – శకుంతల చెలియైన అప్సరస

తరళిక – వసుమతి పరిచారిక

చతురిక – రాజు పరిచారిక

పరభృతిక – ఉద్యానవన పాలకురాలు

అదితి – కశ్యపుని భార్య

సువ్రత – ఒక తాపస స్త్రీ

వీళ్లే కాకుండా సారథి మొదలైనవారు మరికొందరు వస్తారు.

# ప్రథమోఽంకః

**యా సృష్టిః స్రష్టురాద్యా వహతి విధిహుతం యా హవిర్యా చ హోత్రీ**
**యే ద్వే కాలం విధత్తః శ్రుతివిషయగుణా యా స్థితా వ్యాప్య విశ్వమ్**
**యామాహుస్సర్వభూతప్రకృతి రితి యయా ప్రాణినః ప్రాణవంతః**
**ప్రత్యక్షాభిః ప్రపన్నస్తనుభి రవతు వ స్తాభిరష్టాభిరీశః** **01**

---

**యా సృష్టి:** స్రష్టుః = బ్రహ్మదేవుడి, ఆద్యా = మొమ్మొదటి, సృష్టిః = సృష్టి, యా = ఏదో (జలం); విధిహుతమ్ = నియమపూర్వకంగా హోమం చెయ్యబడిన, హవిః = పురోడాశాన్ని, యా–వహతి = ఏది వహిస్తుందో (అగ్ని), చ = మరియు, హోత్రీ = యజమానుడు, యా = ఏదో (యజ్ఞకర్త); యే–ద్వే = ఏ రెండు, కాలమ్ = కాలాన్ని, విధత్తః = పగలూరేయిగా విభజిస్తాయో (సూర్యచంద్రులు); శ్రుతివిషయగుణా = చెవికి గ్రాహ్యమైన శబ్దమే గుణముగా కలిగి, విశ్వమ్ + వ్యాప్య = విశ్వమంతటా వ్యాపించి, స్థితా = ఉన్నది, యా = ఏదో (ఆకాశం); సర్వభూత = సకల చరాచరాలకూ, ప్రకృతిః ఇతి = జన్మస్థానమని (ఉపాదానకారణమని), యామ్ + ఆహుః = దేనిని చెబుతారో (భూమి); యయా = దేనితో, ప్రాణినః = జంతువులు, ప్రాణవంతః = ప్రాణవంతాలవుతున్నాయో (గాలి); తాభిః = ఆ, ప్రత్యక్షాభిః = ఇంద్రియగోచరాలైన, అష్టాభిః తనుభిః = ఎనిమిది తనువులతోనూ, ప్రపన్నః = కూడుకొన్నవాడైన (ప్రసన్నః = ప్రసన్నుడైన) – ఈశః = శివుడు, వః = మిమ్ము, అవతు = కాపాడుగాక!

**తాత్పర్యం:** శివుడికి అష్టమూర్తి అని పేరు. పంచభూతాలూ యజమానుడూ సూర్యచంద్రులూ – వెరసి ఈ ఎనిమిదీ మన ఇంద్రియాలకు గోచరించే శివుడి తనువులని వేదవాక్కు. అటువంటి ప్రత్యక్షతనువులు ఎనిమిదింటితోనూ కూడిన శివుడు మిమ్ము రక్షించుగాక అని సభ్యులకు ఆశీస్సు (తను శబ్దం స్త్రీ లింగం. కనుక అంతటా యా' అన్నాడు.)

**విశేషాలు:** నాటక ప్రదర్శనకు ఆరంభంలో తెరవెనక నిలబడి మొదటి సూత్రధారుడు గానం చేసే శ్లోకాన్ని నాందీ శ్లోకం అంటారు. శ్రోతల్ని ఆకర్షించి ఆనందింపజేస్తుందని దీనికి ఆ పేరు. ఇది వాగ్రూపనాంది. ఆశీస్సుగాగానీ దేవతావందనంగాగానీ నాటక వస్తునిర్దేశరూపంగాగానీ ఉండవచ్చు. ఇందులో ఎనిమిదిగానీ పన్నెండుగానీ

**(నాంద్యంతే ప్రవిశతి సూత్రధారః)**

**సూత్రధారః : (నేపథ్యాభిముఖ మవలోక్య) ఆర్యే! యది నైపథ్య విధానమవసితం? తర్హీతస్తావదాగమ్యతామ్.**

**నటీ : (ప్రవిశ్య) అయ్య ఇఅమ్హి. (ఆర్య! ఇయమస్మి).**

---

పద్దెనిమిదిగానీ ఇరవైరెండుగానీ పదాలుండాలని ఒక నియమం. పదమంటే పాదమని కొందరూ వాక్యమని కొందరూ భాష్యం చెప్పారు. కాబట్టి దీన్ని ఎనిమిది వాక్యాల నాందిగా భావించాలి. ఇందులో కథా సూచన కూడా ఉండాలన్నారు. ఈశః అంటే ప్రభువు దుష్యంతుడు లేదా భరతుడు. బ్రహ్మదేవుడి తొలి సృష్టి అంటే సౌందర్యరాశి – శకుంతల. దూర్వాసుడిచ్చిన శాపాన్నీ దాని అవధికాలాన్నీ ఎరిగినవాళ్ళు (యే–ద్వే) అనసూయా ప్రియంవదలు. విశ్వం వ్యాప్య – దుష్యంతుడి కీర్తిప్రతాపాలు. విధిహుతమ్ = శకుంతలా గర్భధారణ. ఇలా ఎన్నింటినో చెప్పారు వ్యాఖ్యాతలు. సర్వబీజ ప్రకృతిః – అని పాఠాంతరం. సర్వేషాం బీజానాం ప్రకృతిర్యోనిరిత్యాహుః. ప్రకృతిస్సహజే యోనావమాత్యే పరమాత్మని ఇతి విశ్వః (రాఘవభట్ట వ్యాఖ్య). ఇది స్రగ్ధరావృత్తం. మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిమునియతియుతా స్రగ్ధరా కీర్తితేయం. మ–ర–భ–న–య–య–య. ఏడేసి అక్షరాలకు ఒకటిగా పాదానికి మూడు యతులు.

(నాంద్యంతే = నాంది ముగిశాక, సూత్రధారః = రెండవ సూత్రధారుడు, ప్రవిశతి = ప్రవేశించి)

**ఆర్యేయది:** (నేపథ్య+అభిముఖమ్ = వెనుక తెరవైపు, అవలోక్య = చూసి) ఆర్యే = ఆర్యురాలా! నైపథ్యవిధానమ్ = నైపథ్య నిర్వహణము, యది+అవసితమ్ = ముగిసినదా? తర్హి = అయినచో, ఇతః+తావత్ = ఇటువైపు, ఆగమ్యతామ్ = రమ్ము.

**విశేషాలు:** ఆర్య అనేది నటీసూత్రధారులు పరస్పరం చేసుకునే సంబోధన. విప్రామాత్యాగ్రజాస్త్వార్యా నటీసూత్రకృతౌ మిథః. నైపథ్యం నాలుగు విధాలు. పుస్త–భూషా–అంగరచనా–సంజీవాలు. పుస్తం ప్రదర్శితం నాట్యే విమానాద్రివనాదికం, కుండలాది విభూషా, అంగరచనాత్వనులేపనం, సంజీవః పశుపక్ష్యాదిప్రాణినాం రూపధారణమ్.

(ప్రవిశ్య = నటి ప్రవేశించి)

**అయ్యఇఅమ్హి :** ఆర్య = ఆర్యుడా! ఇయమ్+అస్మి = ఇదిగో వచ్చితిని.

**సూత్ర : ఆర్యే! అభిరూపభూయిష్ఠా పరిషదియమ్. అత్రఖలు కాళిదాస గ్రథిత వస్తునా అభిజ్ఞాన శాకుంతల నామధేయేన నవేన నాటకేనో పస్థాతవ్యమస్మాభిః. తత్ప్రతిపాత్ర మాధీయతాం యత్నః.**

**నటీ : సువిహిదప్పఓఅదాఏ అజ్జస్స ణ కిం వి పరిహాఇస్సది. (సువిహిత ప్రయోగతయార్యస్య న కిమపి పరిహాస్యతే)**

**సూత్ర : ఆర్యే! కథయామితే భూతార్థమ్ –**

**ఆపరితోషాద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్**
**బలవదపి శిక్షితానా మాత్మన్యప్రత్యయం చేతః 02**

---

**అభిరూప:** ఆర్యే = ఆర్యురాలా! ఇయమ్–పరిషత్ = ఈ సభ, అభిరూప భూయిష్ఠా = పండితులతో నిండినది. (ప్రాప్తరూప సురూపాభిరూపాః బుధమనోజ్ఞయోః). అత్రఖలు = ఇక్కడేమో, కాళిదాసగ్రథిత వస్తునా = కాళిదాసుచేత రచింపబడిన కథ కలదీ, అభిజ్ఞాన శాకుంతల నామధేయేన = అభిజ్ఞానశాకుంతలమనే పేరుగలదీ, నవేన = కొత్తదీ అయిన, నాటకేన = నాటక ప్రదర్శనతో, అస్మాభిః + ఉపస్థాతవ్యమ్ = మనం సిద్ధంగా ఉండాలి. అది ప్రదర్శించాలి అనడం. తత్ = అందుచేత, ప్రతిపాత్రమ్ = అన్ని పాత్రలపట్లా, యత్నః = శ్రద్ధ, ఆధీయతామ్ = వహించాలి –వహించబడుగాక! (ఇతివృత్త కథావస్తుశబ్దాః పర్యాయవాచినః).

**సువిహిద:** సువిహితప్రయోగతయా = సుశిక్షితమైన నాటకప్రదర్శనా నైపుణ్యం కలిగి ఉండటంవల్ల, ఆర్యస్య = తమరికి, కిమపి–పరిహాస్యతే = ఏ లోటూ రాదులెండి!

**ఆపరి:** ఆర్యే = ఆర్యురాలా! తే = నీకు, భూతార్థమ్ = యథార్థం, కథయామి = చెబుతున్నాను విను. విదుషామ్ = పండితులకు, ఆపరితోషాత్ = సంతోషం కలిగించేంతవరకూ, ప్రయోగవిజ్ఞానమ్ = నా ప్రదర్శనా నైపుణ్యం, సాధు = గొప్పదిఅని, న–మన్యే = భావించను. బలవత్ = గట్టిగా, శిక్షితానామ్ + అపి = శిక్షణ పొందినవారికైనా, చేతః = మనస్సు, ఆత్మని = స్వవిషయంలో, అప్రత్యయమ్ = నమ్మకంలేనిదేసుమా!

**తాత్పర్యం:** పండితులు మెచ్చేంతవరకూ నా ప్రదర్శననైపుణ్యం గొప్పదని నేను భావించను. ఎంతటి సుశిక్షితులకైనా ఇంతే – స్వవిషయంలో మనస్సుకు నమ్మకం చాలదు!

**నటీ : అజ్జ! ఏవం ణేదం. దాణిం అణంతరకరణిజ్జం ఆణవేదు అజ్జో.**

**(ఆర్య! ఏవంన్విదమ్. అనంతరకరణీయమిదానీమాజ్ఞాపయత్వార్యః)**

**సూత్ర : కిమన్యదస్యాః పరిషదః శ్రుతిప్రసాదనతః.**

**నటీ : అధ కదమం ఉణ ఉదం సమాస్సిఅ గాఇస్సం. (అథ కతమం పునః ఋతుం సమాశ్రిత్య గాయామి?).**

**సూత్ర : నను ఇమమేవతావత్, అచిరప్రవృత్తమ్ ఉపభోగక్షమం గ్రీష్మమధికృత్య గీయతామ్. సంప్రతి హి –**

**సుభగ సలిలావగాహాః పాటల సంసర్గ సురభివనవాతాః**
**ప్రచ్ఛాయసులభనిద్రాః దివసాః పరిణామ రమణీయాః 03**

---

**ఏవం :** ఆర్య = ఆర్యుడా! ఇదమ్ = ఇది, ఏవమ్+ను = ఇట్టిదేగదా! ఇదానీమ్ = ఇక ఇప్పుడు, అనంతరకరణీయమ్ = అనంతర కర్తవ్యం, ఆర్యః = ఆర్యుదు, ఆజ్ఞాపయతు = ఆజ్ఞాపించుగాక!

**కిమన్యత్:** అస్యాః = ఈ, పరిషదః = సభకు, శ్రుతిప్రసాదనతః = చెవికి ఇంపుగూర్చటం కన్నా, అన్యత్ + కిమ్ = వేరొకటి ఏముంది?

**అధ కదమం:** అథ= అయినచో, కతమమ్ + పునః = ఏ, ఋతుమ్ = ఋతువును, సమాశ్రిత్య = ఆశ్రయించి, గాయామి = పాడను? (తావత్, పునః, వా–ఇత్యాదులు కొన్ని వాక్యాలంకారాలు).

**నన్విమమ్:** నను = విను. అచిరప్రవృత్తమ్ = ఇటీవలనే ప్రవేశించినదీ, ఉపభోగక్షమమ్ = జలక్రీడాదులైన సుఖాలకు యోగ్యమైనదీ, ఇమమ్–గ్రీష్మమ్+ఏవ = ఈ గ్రీష్మర్తువునే, అధికృత్య = ఉద్దేశించి, గీయతామ్+తావత్ = గానం చెయ్యి. సంప్రతి–హి = ఇప్పుడేమో–

**సుభగ:** దివసాః = పగళ్లు, సుభగ = అందమైన, సలిల + అవగాహాః = జలస్నానాలు కలవి. పాటల = కలిగొట్టుపూలతోటి, సంసర్గ = కలయికవల్ల, సురభి = పరిమళించే, వనవాతాః = అడవిగాలులు కలవి. ప్రచ్ఛాయ = చిక్కటి నీడలలో, సులభనిద్రాః = తేలికగాపట్టే నిద్ర కలవి. పరిణామరమణీయాః = సాయంకాలం మరీ అందగించేవి.

**నటీ : తహ (తథా)**

**(గాయతి)**

**ఈసీసిచుంబిఆఇం భమరేహిం సుఉమారకేసరసిహాఇం**
**ఓదంసయంతి దఅమాణా పమదాఓ సిరీసకుసుమాఇం. 04**

**(ఈషదీషచ్చుంబితాని భ్రమరైః సుకుమారకేసరశిఖాని**
**అవతంసయంతి దయమానాః ప్రమదాః శిరీషకుసుమాని).**

**సూత్ర : ఆర్యే! సాధు గీతమ్. అహో! రాగానుబంధి చిత్తవృత్తి రాలిఖిత ఇవ సర్వతో రంగః. తదిదానీం కతమం ప్రయోగమాశ్రిత్య ఏనమారాధయామః?**

---

**తాత్పర్యం:** ఈ గ్రీష్మర్తువులో పగటివేళలు స్నానాలకూ జలక్రీడలకూ మనోహరాలు. అడవిగాలులు కలిగొట్టుపూల సంసర్గంతో సురభిళాలు. దట్టంగా వ్యాపించే చెట్లనీడలు గాఢనిద్రకు తావలాలు. పొద్దు వాటారుతున్న కొద్దీ సాయంకాలాలు పరమ రమణీయాలు.

**ఈసీసి:** తథా = అవును. (గాయతి = నటి పాడుతుంది). భ్రమరైః = తుమ్మెదలతో, ఈషత్+ఈషత్ = కొంచెం కొంచెంగా, చుంబితాని = చుంబించబడ్డవీ, సుకుమార = నేవళంతో నవనవలాడుతున్న, కేసరశిఖాని = కింజల్కాల అగ్రభాగాలు కలవీ అయిన, శిరీష కుసుమాని = దిరిసెన పూలను, దయమానాః = దయగలవారైన, ప్రమదాః = వనితలు, అవతంసయంతి = చెవులలో అలంకరించుకొంటున్నారు.

**తాత్పర్యం:** ఇప్పుడిప్పుడే వికసిస్తున్నాయి దిరిసెన పువ్వులు. వాటిని తుమ్మెదలు ముట్టీముట్టనట్టు ముద్దాడుతున్నాయి. వాటి కేసరాలు మృదువుగా నవనవలాడు తున్నాయి. ఈ శిరీషకుసుమాలను దయగల మదవతులు సుకుమారంగా చెవులకు అలంకరించుకొంటున్నారు (పుంస్యుత్తంసావతంసౌ ద్వౌ కర్ణపూరేఽపి శేఖరే).

**సాధు:** ఆర్యే = ఆర్యురాలా! సాధు-గీతమ్ = అద్భుతంగా గానం చేశావు. అహో = ఆశ్చర్యం! రాగ+అనుబంధి = నీ గానంతో సమ్మిళితమైన, చిత్తవృత్తిః = మనోవ్యాపారం కలదై, రంగః = ఈ సభామండపం, సర్వతః = మొత్తంగా, ఆలిఖితః+ఇవ = గీసిన చిత్తరువైపోయింది! తత్ = కాబట్టి, ఇదానీమ్ = ప్రస్తుతం, కతమమ్ = ఏ, ప్రయోగమ్ = నాటక ప్రదర్శనను, ఆశ్రిత్య = ఆశ్రయించి, ఏనమ్ = ఈ సభారంగాన్ని, ఆరాధయామః = సేవింతుము?

**నటీ : ణం అజ్జమిస్సేహిం పఢమం జేవ్వ ఆణత్తం అహిణ్ణాణ సాఉందలం ణామ అపువ్వం ణాదఅం పఓఏ అహికరోఅదు త్తి (నన్వార్యమిశ్రైః ప్రథమమేవాజ్ఞప్తమ్ అభిజ్ఞాన శాకుంతలం నామ అపూర్వం నాటకం ప్రయోగే అధిక్రియతామితి).**

**సూత్ర : ఆర్యే! సమ్యగనుబోధితోఽస్మి. నను అస్మిన్ క్షణే విస్మృతం ఖలు మయా. యతః–**

**తవాస్మి గీతరాగేణ హారిణా ప్రసభం హృతః**
**ఏష రాజేవ దుష్యంతః సారంగేణాతిరంహసా. 05**

**(నిష్క్రాంతౌ) –ఇతి ప్రస్తావనా–**

---

**ణం అజ్జ:** అభిజ్ఞానశాకుంతలమ్–నామ = అభిజ్ఞానశాకుంతలమనే పేరుగల, అపూర్వమ్ = సరికొత్త, నాటకమ్ = నాటకం, ప్రయోగే+అధిక్రియతామ్ = ప్రదర్శనకు అధికరింపబడుగాక, ఇతి = అని, ఆర్యమిశ్రైః = ఆర్యమిశ్రులైన తమచేత, ప్రథమమేవ = ముందుగానే, ఆజ్ఞప్తమ్+నను = ఆజ్ఞాపింపబడింది గదా!

**సమ్యగను:** ఆర్యే = ఆర్యురాలా! సమ్యక్ = బాగుగా, అనుబోధితః+అస్మి = గుర్తుచేయబడ్డవాణ్ని అయ్యాను – బాగా గుర్తు చేశావనడం. అస్మిన్+క్షణే = ఈ క్షణంలో, మయా = నాచేత, విస్మృతం ఖలు నను = నిజంగా మరిచిపోబడింది సుమా! యతః = ఎందుకంటే –

**తవాస్మి:** హారిణా = అత్యంత మనోహరమైన, తవ = నీ, గీతరాగేణ = పాట రాగంతో, ప్రసభమ్ = హఠాత్తుగా, హృతః = హరింపబడ్డాను. అతిరంహసా = అతివేగం కలదైన, సారంగేణ = లేడితో, ఏషః = ఇడిగో, రాజా = మహారాజైన, దుష్యంతః + ఇవ = దుష్యంతుడిలాగా–

**తాత్పర్యం:** ఆర్యురాలా! అత్యంత మనోహరం నీ గీతరాగం. అది హఠాత్తుగా నన్ను హరించింది. ఎలాగంటే – అతివేగంగా పరుగిడుతున్న లేడి ఇడిగో ఈ దుష్యంత మహారాజునులాగా!!

(నిష్క్రాంతౌ = ఇద్దరూ నిష్క్రమిస్తారు) – ఇది ప్రస్తావన –

**(తతః ప్రవిశతి మృగానుసారీ సశరచాపహస్తో రాజా రథేన సూతశ్చ)**

**సూతః : (రాజానం మృగం చావలోక్య) ఆయుష్మన్!**

**కృష్ణసారే దదచ్చక్షుస్త్వయి చాధిజ్యకార్ముకే**
**మృగానుసారిణం సాక్షాత్ పశ్యామీవ పినాకినమ్ 06**

**రాజా : సూత! దూరమమునా సారంగేణ వయమాకృష్టాః. అయం పునరిదానీ మపి –**

---

(తతః = అంతట, మృగ + అనుసారీ = లేడిని వెంబడిస్తూ, సశరచాపహస్తః = బాణం ఎక్కుపెట్టిన ధనుస్సుచేబూని, రాజా = దుష్యంతమహారాజూ, రథేన = అతడెక్కిన రథం తోలుతూ, సూతశ్చ = సూతుడూ, ప్రవిశతి = ప్రవేశం – రాజా ప్రవిశతి. సూతశ్చ ప్రవిశతి – అని అన్వయం).

**ఆయుష్మన్:** (రాజానమ్= రథంమీద ఉన్న రాజునూ, మృగమ్+చ = ముందు పరుగిడుతున్న లేడినీ, అవలోక్య = చూసి) ఆయుష్మన్ = ఓయి ఆయుష్మంతుడా! (సూతో రథినమాయుష్మన్ తథా పూజ్యో యవీయసా – ఇతి నాటక పరిభాషా)

**కృష్ణసారే:** కృష్ణసారే = లేడియందూ, అధిజ్యకార్ముకే + త్వయి–చ = ఎక్కుపెట్టిన ధనుస్సు ధరించిన నీయందూ, దదత్+చక్షుః = అర్పిస్తున్న చూపుకలవాడనై, మృగానుసారిణమ్ = అలనాడు లేడిని వెంబడిస్తున్న, పినాకినమ్ = పినాకపాణియైన శివుణ్ని, సాక్షాత్ = ఇప్పుడు సాక్షాత్తుగా, పశ్యామి + ఇవ = చూస్తున్నాను అన్నట్టుంది.

**తాత్పర్యం:** పరుగిడుతున్న లేడినీ, ధనుస్సు ఎక్కువెట్టిన నిన్నూ చూస్తుంటే – ఓ ఆయుష్మంతుడా! అలనాడెప్పుడో మృగాన్ని వెంటాడుతున్న పినాకపాణిని ఇప్పుడు సాక్షాత్తుగా చూస్తున్నట్టు అనిపిస్తోంది.

**విశేషాలు:** పినాకినం వృషధ్వజం పశ్యామీవేత్యుపమాలంకారః. పినాకినో హరిణాను ధావనం దక్షయజ్ఞ విధ్వంసమయే సిద్ధమితి ప్రసిద్ధిః – శ్రీనివాసాచార్య వ్యాఖ్యా.

**దూరమ్:** సూత = రథచోదకా! అమునా = ఈ, సారంగేణ = లేడితో, వయమ్ = మేము, దూరమ్ + ఆకృష్టాః = చాలా దూరమే ఆకృష్టులమై వచ్చేశాం. అయమ్ + పునః = ఈ లేడిమాత్రం, ఇదానీమ్ + అపి = ఇప్పుడు సైతం –

**గ్రీవాభంగాభిరామం ముహురనుపతతి స్యందనే దత్త దృష్టిః**
**పశ్చార్ధేన ప్రవిష్టః శరపతనభియా భూయసా పూర్వకాయమ్**
**దర్భైర్ధావలీఢైః శ్రమ వివృతముఖభ్రంశిభిః కీర్ణవర్త్మా**
**పశ్యోదగ్రప్లుతత్వాద్ వియతి బహుతరం స్తోకముర్వ్యాం ప్రయాతి. 07**

**తదేష కథమనుపతత ఏవ ప్రయత్నప్రేక్షణీయస్సంవృత్తః?**

---

**గ్రీవాభంగ:** అనుపతతి = వెంబడిస్తున్న, స్యందనే = రథమునందు, గ్రీవా–భంగ+అభిరామమ్ = మెడ త్రిప్పిన ఒయ్యారం ఉట్టిపడేలా, ముహుః = మాటిమాటికీ, దత్త దృష్టిః = చూపు నిలుపుతున్నదై (బద్ధ దృష్టిః – పాఠాంతరం); శర–పతన–భియా = బాణం వచ్చిపడుతుందేమో అన్న భయంవల్ల, పశ్చార్ధేన = శరీరపు వెనుకభాగంతో, భూయసా = అత్యధికంగా, పూర్వకాయమ్ = శరీరపు ముందరిభాగం, ప్రవిష్టః = ప్రవేశించినదై; అర్ధ + అవలీఢైః = సగం సగం నమలబడ్డవై, శ్రమ = అలసటతో, వివృత = తెరుచుకున్న, ముఖ = నోటినుంచి, భ్రంశిభిః = జారుతున్నవైన, దర్భైః = గరికలతో, కీర్ణవర్త్మా = వెదజల్లబడ్డదారి కల్గినదై; ఉదగ్రప్లుతత్వాత్ = పెద్ద పెద్ద దుముకుళ్లవల్ల, వియతి = ఆకాశంలో, బహుతరమ్ = ఎక్కువ సేపూ, ఉర్వ్యామ్ = నేలమీద, స్తోకమ్ = తక్కువసేపూ, ప్రయాతి = ప్రయాణిస్తోంది. పశ్య = చూడు.

**తాత్పర్యం:** ఈ లేడి–తనను వెంబడించి వస్తున్న మన రథంవైపు ఒయ్యారంగా మెడ తిప్పి మాటిమాటికీ చూస్తోంది. బాణం వచ్చిపడుతుందేమోనన్న భయంతో శరీరం వెనుకభాగాన్ని ముందుభాగంలోకి చొప్పిస్తోంది. అలసటతో తెరుచుకున్న నోటినుంచి సగం సగం నమిలిన దర్భలు జారి దారి పొడవునా పడుతున్నాయి. పెద్ద పెద్ద దుముకుళ్లతో ఇది ఆకాశంలో ఎక్కువ – నేలమీద తక్కువ ప్రయాణిస్తోంది. చూశావా?!

**తదేషః:** కథమ్ = ఎట్టా! తత్ + ఏషః = ఆ ఈ లేడి, అనుపతతః ఏవ = ఇంతగా వెంబడిస్తున్న నాకే, ప్రయత్న ప్రేక్షణీయః + సంవృత్తః = వెదకి వెదకి చూడదగ్గది అయ్యిందే?

**ఉద్ఘాతినీ:** ఆయుష్మన్ = ఆయుష్మంతుడా! ఉద్ఘాతినీ–భూమిః + ఇతి = నేల ఎగుడుదిగుళ్లుగా ఉన్నదని, మయా = నాచేత, రశ్మి–సంయమనాత్ = పగ్గాలు

**సూతః : ఆయుష్మన్! ఉద్ఘాతినీ భూమిరితి మయా రశ్మిసంయమనాత్ రథస్య మందీకృతో వేగః. తేన మృగ ఏష విప్రకృష్టాంతరః సంవృత్తః. సంప్రతి సమదేశవర్తినస్తే న దురాసదో భవిష్యతి.**

**రాజా : తేన హి ముచ్యంతామభీషవః.**

**సూతః : యదాజ్ఞాపయత్యాయుష్మన్. (రథవేగం నిరూప్య) ఆయుష్మన్! పశ్య, పశ్య –**

**ముక్తేషు రశ్మిషు నిరాయతపూర్వకాయా**
**నిష్కంపచామరశిఖా నిభృతోర్ధ్వకర్ణాః**
**ఆత్మోద్ధతైరపి రజోభిరలంఘనీయా**
**ధావంత్యమీ మృగజవాక్షమయేవ రథ్యాః 08**

---

బిగబట్టడంవల్ల, రథస్య–వేగః = రథవేగం, మందీకృతః = తగ్గింపబడింది. తేన = అందుచేత, ఏషః–మృగః = ఈ లేడి, విప్రకృష్టాంతరః + సంవృత్తః = నడిమి దూరం పెరిగినదైనది. రాజుకీ లేడికీ నడుమ దూరం పెరిగిందని. సంప్రతి = ఇప్పుడు, సమదేశవర్తినః = సమతల ప్రదేశంలో సాగుతున్న, తే = నీకు, దురాసదః = చేరుకోజాలనిది, న–భవిష్యతి = కాజాలదు. తేలికగా అందుకోగలవని.

**తేనహి:** తేన–హి = అందుచేత, అభీషవః = పగ్గాలు, ముచ్యంతామ్ = విడిచి పెట్టబడుగాక! పగ్గాలు సడలించమనడం.

**యదాజ్ఞాపయతి:** ఆయుష్మన్ = ఆయుష్మంతుడు, యత్ + ఆజ్ఞాపయతి = ఆనతిచ్చినట్టే! (రథవేగమ్ = రథం వేగం పుంజుకోవడాన్ని, నిరూప్య = అభినయించి) ఆయుష్మంతుడా! పశ్య–పశ్య = చూడు చూడు!

**ముక్తేషు:** రశ్మిషు = పగ్గాలు, ముక్తేషు = సడలింపబడగా, అమీ = ఈ, రథ్యాః = గుర్రాలు, నిరాయతపూర్వకాయాః = బాగా చాచబడిన ముందరి శరీరాలు కలవై, నిష్కంప = నిశ్చలంగా నిలిచిన, చామరశిఖాః = చామరాగ్రాలు కలవై, నిభృత = నిక్కబొడిచిన, ఊర్ధ్వకర్ణాః = చెవులకొనలు కలవై, ఆత్మ+ఉద్ధతైః = తమచేతనే ఎగరదన్నబడ్డ, రజోభిః+అపి = ధూళులతోనైనా, అలంఘనీయాః = దాటబడనివై; మృగజవ = లేడివేగాన్ని, అక్షమయా+ఇవ = సైచలేక పోవడంవల్ల అన్నట్టు, ధావంతి = దౌడు తీస్తున్నాయి.

**రాజా : సత్యమ్. అతీత్య హరితో హరీంశ్చ వర్తంతే వాజినః. తథాహి–**

**యదాలోకే సూక్ష్మం వ్రజతి సహసా తద్విపులతాం**
**యదర్ధే విచ్ఛిన్నం భవతి కృతసంధానమివ తత్,**
**ప్రకృత్యా యద్వక్రం తదపి సమరేఖం నయనయోః**
**న మే దూరే కించిత్ క్షణమపి న పార్శ్వే రథజవాత్. 09**

---

**తాత్పర్యం:** నేను పగ్గాలు సడలించగానే మన గుర్రాలు చూడు ఎంత వేగంగా దౌడు తీస్తున్నాయో! వీటి శరీరాల ముందరిభాగాలు పొడవుగా సాగుతున్నాయి. వీటి చామరాల శిఖరాలు నిశ్చలంగా ఉన్నాయి. చెవుల కొసలు నిక్కబొడిచి నిబ్బరంగా ఉన్నాయి. తాము రేపిన దుమ్ముకి సైతం తాము అందనంత వేగంగా దౌడుతీస్తున్నాయి. లేడి పరుగును చూసి అసూయతో మరింతగా పరుగిడుతున్నాయి అన్నట్టు దౌడుతీస్తున్నాయి. (వసంతతిలకం. తభజజగగ).

**సత్యమ్:**సత్యమ్ = నిజమే! హరితః = హరిత్తులు అనే పేరు కల్గిన, హరీన్+చ = సూర్యుడి గుర్రాలను సైతం, అతీత్య = మించిపోయి, వాజినః = మన గుర్రాలు, వర్తంతే = పరుగిడుతున్నాయి. (హరిత్ సూర్యాశ్వ ఇతి హలాయుధః). తథాహి = అవునుగదా!

**యదాలోకే:** రథజవాత్ = రథవేగంవల్ల, ఆలోకే = దూరపు చూపునందు, యత్ = ఏది, సూక్ష్మమ్ = చిన్నదిగా ఉన్నదో, తత్ = అది, సహసా = హఠాత్తుగా, విపులతామ్ = వైపుల్యాన్ని, వ్రజతి = పొందుతోంది. యత్ = ఏది, అర్ధే = సగభాగంలో, విచ్ఛిన్నమ్ = విరిగినదో, తత్ = అది, కృతసంధానమ్ + ఇవ = అతికింపబడ్డదానిలాగా, భవతి = భాసిస్తోంది. ప్రకృత్యా = సహజసిద్ధంగా, యత్–వక్రమ్ = ఏది వంకరగా ఉన్నదో, తత్+అపి = అది సైతం, నయనయోః = కన్నులకు, సమరేఖమ్ = తిన్నగా కనిపిస్తోంది. కించిత్ = ఏ వస్తువుగానీ, మే = నాకు, క్షణమపి = క్షణకాలమైనా, దూరే + న = దూరంలోనూ ఉండటం లేదు. క్షణమపి = క్షణమైనా, పార్శ్వే+న = చేరువలోనూ ఉండటంలేదు.

**తాత్పర్యం:** రథవేగంవల్ల –దూరపుచూపునకు చిన్నదిగా ఉన్న వస్తువు క్షణంలో చేరువై పెద్దదిగా కనిపిస్తోంది. సగంలోకి విరిగి ఉన్న వస్తువు అతుకుపెట్టినట్టు ఒకటిగా భాసిస్తోంది. సహజంగా వంకరగా ఉన్నది తిన్నగా ఉన్నట్టు అగుపిస్తోంది. ఇంతకీ ఏ వస్తువూ క్షణంసేపు దూరంలోనూ ఉండటం లేదు, క్షణంసేపు చేరువలోనూ ఉండటం లేదు.

**సూత! పశ్యైనం వ్యాపాద్యమానమ్! (ఇతి శరసంధానం నాటయతి)**

**(నేపథ్యే)**

**భో! భో! రాజన్! ఆశ్రమ మృగోఽయం న హంతవ్యో న హంతవ్యః.**

**సూతః : (ఆకర్ణ్య విలోక్య చ) ఆయుష్మన్! అస్య ఖలు తే బాణపాతవర్తినః కృష్ణసారస్యాంతరే తపస్విన ఉపస్థితాః.**

**రాజా : (ససంభ్రమమ్) తేన హి ప్రగృహ్యంతాం వాజినః.**

**సూతః : తథా. (రథం స్థాపయతి).**
**(తతః ప్రవిశత్యాత్మనా తృతీయో వైఖానసః)**

**వైఖా : (హస్తముద్యమ్య) రాజన్! ఆశ్రమమృగోఽయం న హంతవ్యః న హంతవ్యః.**

---

**సూత:** సూత = రథచోదకా! ఏనమ్ = దీనిని, వ్యాపాద్యమానమ్ = సంహరింప బడుతున్నదాన్నిగా, పశ్య = చూడు. ఇదిగో చంపుతున్నాను చూడు – అనడం. (ఇతి = అని, శర సంధానమ్ = బాణం ఎక్కుపెట్టడాన్ని, నాటయతి = అభినయిస్తాడు).

(నేపథ్యే = తెరలో)

**భోభో:** భోభో రాజన్ = ఓయోయీ మహారాజా! అయమ్ = ఇది, ఆశ్రమమృగః = మా ఆశ్రమం లేడి. న–హంతవ్యః – న – హంతవ్యః = చంప దగదు! చంప దగదు!!

**అస్య ఖలు:**(ఆకర్ణ్య = ఆలకించీ, విలోక్య–చ = తిలకించీ) ఆయుష్మన్ = ఆయుష్మంతుడా! బాణపాత–వర్తినః = బాణం దెబ్బకు గురిగా ఉన్న, అస్య = ఈ, కృష్ణసారస్య = లేడికీ, తే = నీకూ, అంతరే = మధ్యలో, తపస్వినః = ఎవరో తాపసులు, ఉపస్థితాః ఖలు = వచ్చి నిలిచారుసుమా!

**తేనహి:** (ససంభ్రమమ్ = హడావిడిగా) తేన–హి = అందుకని, వాజినః = గుర్రాలు, ప్రగృహ్యంతామ్ = నిలువరింపబడుగాక!

**తథా:** తథా = అలాగే! (రథమ్ = రథాన్ని, స్థాపయతి = నిలిపేస్తాడు) (తతః = అంతట, ఆత్మనా = తనతో, తృతీయః = మూడవవాడైన, వైఖానసః = వైఖానస శాఖకు చెందిన తాపసి, ప్రవిశతి = ప్రవేశించును. తనతో కలిపి ముగ్గురు – అని)

**ద్వితీయః : నఖలు నఖలు బాణ స్సన్నిపాత్యోఽయమస్మిన్**
**మృదుని మృగశరీరే తూలరాశా వివాగ్నిః**

**తృతీయః : క్వ బత హరిణకానాం జీవితం చాతిలోలం**
**క్వ చ నిశితనిపాతా వజ్రసారాః శరాస్తే.**

**వైఖా : తత్సాధు కృతసంధానం ప్రతిసంహర సాయకమ్**
**ఆర్తత్రాణాయ వః శస్త్రం న ప్రహర్తు మనాగసి.** **10**

---

**రాజన్:** (హస్తమ్ – ఉద్యమ్య = చెయ్యి పైకెత్తి) రాజన్ = రాజా! ఆశ్రమ మృగః + అయమ్ = ఆశ్రమం లేడి ఇది. న–హంతవ్యః = చంపదగదు! చంపదగదు!!

**నఖలు:** పుష్పరాశౌ = పూలదొంతిలో (తూలరాశౌ = దూదిమేటిలో – అని పాఠాంతరం), అగ్నిః + ఇవ = నిప్పులాగా, మృదుని = సుకుమారమైన, అస్మిన్ = ఈ, మృగశరీరే= లేడి తనువులో, అయమ్ = ఈ, బాణః = బాణం, సన్నిపాత్యః = వేయదగ్గది, నఖలు – నఖలు = కాదు సుమా! కానేకాదు సుమా!!

**క్వబత:** బత = అయ్యో! హరిణకానామ్ = లేడికూనల, అతిలోలమ్ = బహుచంచలమైన, జీవితమ్ = జీవితం, క్వ = ఎక్కడ, నిశితనిపాతాః = వాడి తాకిడిగలవై, వజ్రసారాః = వజ్రాయుధ బలంకలవైన, తే = నీ, శరాః = బాణాలు, క్వ = ఎక్కడ?

**తాత్పర్యం:** వద్దు సుమా! వద్దు సుమా! పూలదొంతిలోకి నిప్పు రవ్వలాగా–ఈ మృగం సుకుమార శరీరంలోకి నీ బాణం వెయ్యకు! అయ్యయ్యో! అతి చంచలమైన లేడికూనల జీవితమెక్కడ? వజ్రకఠోరాలైన నీ వాడిబాణాలెక్కడ? (సారపుంఖాః = బలిష్ఠమైన పిడికలవి – పాఠాంతరం).

**తత్సాధు:** కృతసంధానమ్ = ఎక్కుపెట్టిన, సాయకమ్ = బాణాన్ని, ప్రతిసంహర = ఉపసంహరించు, తత్+సాధు = అది ఉత్తమం. (సాధుకృత అనీ సాధు ఉపసంహర అనికూడా అన్వయించారు. తదాశు కృతసంధానమ్ – అని పాఠాంతరం). వః = పౌరవులైన తమరికి, శస్త్రమ్ = ఆయుధం, ఆర్తత్రాణాయ = దీనులను కాపాడటం కోసం. అనాగసి = నిరపరాధునిమీద, ప్రహర్తుమ్+న = ప్రయోగించడానికి కాదు.

**తాత్పర్యం:**రాజా! ఎక్కుపెట్టిన బాణం వెంటనే ఉపసంహరించు. అది ఉత్తమం. మీ ఆయుధాలు ఆర్తుల్ని కాపాడటానికే గానీ నిరపరాధుల్ని రాపాడడానికి కాదు!!

**రాజా : ఏష ప్రతిసంహృతః (యథోక్తం కరోతి).**

**వైఖా : సదృశమేతత్ పురువంశప్రదీపస్య.**

**జన్మ యస్య పురోర్వంశే యుక్తరూప మిదం తవ**
**పుత్రమేవం గుణోపేతం చక్రవర్తినమాప్నుహి. 11**

**ఇతరౌ : (బాహూ ఉద్యమ్య) సర్వథా చక్రవర్తినం పుత్రమాప్నుహి.**

**రాజా : (సప్రణామమ్) ప్రతిగృహీతమ్.**

---

**ఏష:** ఏషః = ఇదిగో, ప్రతిసంహృతః = ఉపసంహరింపబడింది (యథోక్తమ్–కరోతి = అని–చెప్పింది చేస్తాడు)

**సదృశమ్:** ఏతత్ = ఇది – మా మాట వినడం, పురువంశ–ప్రదీపస్య = పురువంశ శ్రేష్ఠుడికి, సదృశమ్ = తగినది.

**జన్మ యస్య:** యస్య = ఎవని, జన్మ = పుట్టుక, పురోః = పురువుయొక్క, వంశే = వంశమునందో, తవ = అట్టి నీకు, ఇదమ్ = ఇది–బాణాన్ని ఉపసంహరించడం, యుక్తరూపమ్ = మిక్కిలి సమంజసం. ఏవం గుణ+ఉపేతమ్ = శిష్టులమాట వినడం అనే ఇటువంటి గుణవంతుణ్ని, చక్రవర్తినమ్ = ఒక చక్రవర్తిని, పుత్రమ్ = పుత్రుడిగా, ఆప్నుహి = పొందుము!

**తాత్పర్యం:** శిష్టులమాట విని ఇలా ఎక్కుపెట్టిన బాణాన్ని ఉపసంహరించడం అనేది పురువంశంలో జన్మించినవాడవైన నీకు ఎంతైనా సమంజసం. ఏవంగుణవిశిష్టుడై చక్రవర్తి కాదగిన కొడుకును నువ్వు పొందుదువుగాక!

**సర్వథా:** (బాహూ+ఉద్యమ్య = రెండు చేతులూ పైకెత్తి) సర్వథా = అన్ని విధాలా, చక్రవర్తినమ్ = చక్రవర్తినే, పుత్రమ్ = కొడుకుగా, ఆప్నుహి = పొందుము!

**ప్రతిగృహీతమ్:** (సప్రణామమ్ = నమస్కరిస్తూ) ప్రతిగృహీతమ్ = మీ దీవెన స్వీకృతం!!

**రాజన్:** రాజన్ = దుష్యంతమహారాజా! సమిత్ + ఆహరణాయ = సమిధలు సేకరించడంకోసం, వయమ్ = మేము (ముగ్గురం), ప్రస్థితాః = బయలుదేరాం. ఏషః + ఖలు = ఇదే సుమా! అనుమాలినీతీరమ్ = మాలినీ నది ఒడ్డునే, దృశ్యతే =

**వైఖా : రాజన్! సమిదాహరణాయ ప్రస్థితా వయమ్. ఏష ఖలు కణ్వస్య కులపతేః అనుమాలినీతీరమాశ్రమో దృశ్యతే. నచేదన్యకార్యాతిపాతః ప్రవిశ్య ప్రతిగృహ్యతా మతిథిసత్కారః. అపిచ –**

**రమ్యాస్తపోధనానాం ప్రతిహృతవిఘ్నాః క్రియాః సమవలోక్య**
**జ్ఞాస్యసి కియద్ భుజో మే రక్షతి మౌర్వీకిణాంక ఇతి. 12**

**రాజా : అపి సన్నిహితోఽత్ర కులపతిః?**

**వైఖా : ఇదానీమేవ దుహితరం శకుంతలా మతిథిసత్కారాయ నియుజ్య దైవమస్యాః ప్రతికూలం శమయితుం సోమతీర్థం గతః.**

---

ఆ కనబడుతున్నది, కులపతేః = కులపతి అయిన, కణ్వస్య = కణ్వుడి, ఆశ్రమః = ఆశ్రమం!! అన్యకార్య+అతిపాతః+న–చేత్ = నీ ఇతరకార్యాలకు ఇబ్బంది లేకపోతే (విఘ్నం కాదనుకొంటే), ప్రవిశ్య = ఆశ్రమంలోకి ప్రవేశించి, అతిథి సత్కారః = ఆతిథ్యం, ప్రతిగృహ్యతామ్ = స్వీకరింపబడుగాక! అపిచ = అంతేకాదు –

**రమ్యా:** ప్రతిహృత–విఘ్నాః = ఆటంకాలు తొలగింపబడినవై, (ధర్మ్యాః = ధర్మబద్ధాలైన – పాఠాంతరం), రమ్యాః = రమణీయాలైన, తపోధనానామ్ = మహాతపస్వుల, క్రియాః = యజ్ఞయాగాది క్రియలు, సమవలోక్య = ప్రత్యక్షంగా చూసి, మౌర్వీకిణాంకః = అల్లెత్రాటి దెబ్బలతో కాయలు కాసిన, మే–భుజః = నా బాహువు, కియత్ + రక్షతి + ఇతి = ఏపాటి రక్షిస్తున్నది అనేది, జ్ఞాస్యసి = స్వయంగా తెలుసుకుంటావు.

**తాత్పర్యం:** తపోధనుల యజ్ఞయాగాదిక్రియలు ఏ విఘ్నాలూ లేకపోవడంతో చాలా రమణీయంగా నిర్వహింపబడుతున్నాయి. ఇది ప్రత్యక్షంగా చూసి – జ్యాఘాతాలతో కాయలు గాసిన నీ బాహువు ఆశ్రమాలను ఎంతగా పరిరక్షిస్తోందో స్వయంగా తెలుసుకోవచ్చు.

**అపి:** కులపతిః = కులపతి కణ్వుడు, అత్ర = ఇక్కడ ఆశ్రమంలో, అపి–సన్నిహితః = ఇప్పుడు ఉండెనా? (వాక్యం కనుక అపితో ప్రారంభమైతే అది ప్రశ్నార్థకవాక్యం).

**ఇదానీమ్:** దుహితరమ్ = పుత్రికను, శకుంతలామ్ = శకుంతలను, అతిథి సత్కారాయ = అతిథులను సత్కరించడం కోసమై, నియుజ్య = ఆశ్రమంలో నియమించి; అస్యాః = ఈమెకు, ప్రతికూలమ్ = అంతగా అనుకూలించని, దైవమ్ = దైవాన్ని, శమయితుమ్

**రాజా : భవతు. తాం ద్రక్ష్యామి. సా ఖలు విదితభక్తిం మాం మహర్షేః కరిష్యతి!**

**వైఖా : సాధయామస్తావత్. (సశిష్యో నిష్క్రాంతః)**

**రాజా : సూత! చోదయాశ్వాన్. పుణ్యాశ్రమదర్శనేన తావదాత్మానం పునీమహే.**

**సూతః : యదాజ్ఞాపయత్యాయుష్మాన్ (భూయో రథవేగం నిరూపయతి).**

**రాజా : (సమంతాదవలోక్య) సూత! అకథితోఽపి జ్ఞాయత ఏవ యథా అయమాభోగస్తపోవనస్యేతి.**

---

= ఉపశమింపజెయ్యడం కోసమని, ఇదానీమ్+ఏవ = ఇప్పుడే, సోమతీర్థమ్ = సోమతీర్థానికి, గతః = వెళ్ళెను.

**భవతు:** భవతు = సరే! తామ్ = ఆమెను, ద్రక్ష్యామి = దర్శిస్తాను. సా+ఏవ = ఆమెయే, విదితభక్తిమ్ = తెలుపుడు చేయబడిన భక్తి కలవాడినిగా, మామ్ = నన్ను, మహర్షేః = కణ్వర్షికి, కరిష్యతి = చేస్తుంది (కథయిష్యతి = చెబుతుంది అని పాఠాంతరం). దుష్యంతుడికి కణ్వుడిపట్ల భక్తి ఉంది అని గ్రహించి ఆ సంగతి ఆమెయే మహర్షికి చెబుతుందిలే – అనడం.

**సాధయామః:** సాధయామః + తావత్ = ఇక మేం బయలుదేరతాం. తావత్ అనేది వాక్యాలంకారం కోసం ఊత పదం. (సశిష్యః = శిష్యులిద్దరితోనూ కలిసి, నిష్క్రాంతః = వైఖానసుడు నిష్క్రమిస్తాడు).

**చోదయ:**సూత = రథచోదకా! అశ్వాన్ = గుర్రాలను, చోదయ = తోలు. పుణ్య = పవిత్రమైన, ఆశ్రమ దర్శనేన = ఆశ్రమాన్ని దర్శించడంతో, ఆత్మానమ్ = మనను మనం, పునీమహే–తావత్ = పావనం చేసుకుందాం.

**యదాజ్ఞాపయతి:** ఆయుష్మాన్ = ఆయుష్మంతుడు, యత్ + ఆజ్ఞాపయతి = ఆజ్ఞాపించినట్లే!

(భూయః=మళ్ళీ, రథవేగమ్=రథవేగాన్ని, నిరూపయతి=అభినయంతో ప్రదర్శిస్తాడు).

**అకథితోఽపి:** (సమంతాత్ = అన్నివైపులకూ, అవలోక్య = తేరిపారజూసి) సూత = సూతుడా! అయమ్ = ఈ, ఆభోగః = వైభవం, తపోవనస్య+ఇతి = ఒక తపోవనానిది అని, అకథితః+అపి = ఎవరూ చెప్పకుండానే, జ్ఞాయతే+ఏవ = తెలుస్తూనే ఉంది, యథా = ఎలాగంటే –

**సూతః** : **కథమివ?**

**రాజా** : **కిం న పశ్యతి భవాన్? ఇహ హి –**
**నీవారాః శుకగర్భకోటరముఖభ్రష్టాస్తరూణామథః**
**ప్రస్నిగ్ధాః క్వచిదింగుదీఫలభిదస్సూచ్యంత ఏవోపలాః**
**విశ్వాసోపగమాదభిన్నగతయః శబ్దం సహంతే మృగాః**
**తోయాధారపథాశ్చ వల్కలశిఖా నిష్యందరేఖాంకితాః** **13**

---

**కథమివ:** కథమివ = ఎలా? ఎలా?

**కిం న:** భవాన్ = నువ్వు, న–పశ్యతి–కిమ్ = చూడటం లేదా? ఇహ+హి = ఇక్కడ ఇవిగో–

**నీవారాః:** శుకగర్భ = చిలుకలు గర్భభాగంలో ఉన్న, కోటర = తొర్రల, ముఖ = అగ్రభాగాలనుంచి, భ్రష్టాః = జారిపడినవై, నీవారాః = నివ్వరిధాన్యపు గింజలు, క్వచిత్ = అక్కడక్కడా, తరూణామ్+అథః = చెట్ల కింద ఇవిగో, సూచ్యంతే+ఏవ = ఇది ముని వాటిక అని సూచిస్తూనే ఉన్నాయి. క్వచిత్ = అక్కడక్కడా, ఇంగుదీఫల–భిదః = గారకాయలను పగలగొట్టడం వల్ల, ప్రస్నిగ్ధాః = బాగా నునుపుదేరిన, ఉపలాః = రాళ్లు, సూచ్యంతే+ఏవ = ఇది మున్యాశ్రమమని సూచిస్తూనే ఉన్నాయి. విశ్వాస+ఉపగమాత్ = నమ్మకం కల్గి ఉండటంవల్ల, అభిన్నగతయః = మారని నడకకలవై, మృగాః = లేళ్లు, శబ్దమ్ = రథం చప్పుడును, సహంతే = సహిస్తున్నాయి. తోయాధార పథాః+చ = జలాశయాల (రాకపోకలు సాగించే) దారులు, వల్కలశిఖా = నారచీరల కొసలనుంచి, నిష్యంద = జారే నీటిధారల, రేఖా+అంకితాః = జాడలతో అమరినవై, సూచ్యంతే+ఏవ = ఇది మున్యాశ్రమమని సూచిస్తూనే ఉన్నాయి.

**తాత్పర్యం:** అక్కడక్కడా చెట్లకింద నీవారధాన్యపు గింజలు కనిపిస్తున్నాయి. ఆ చెట్ల తొర్రలలో ఉన్న చిలుకల నోళ్లనుంచి జారిపడ్డ గింజలు అవ్వి. నివ్వరిబియ్యంతో అన్నం వండుకు తినే మునులు నివసించే ప్రాంతం ఇది అని ఇవి సూచిస్తూనే ఉన్నాయి. అక్కడక్కడా కొన్ని శిలలు బాగా నునుపుదేరి (నూనె రాసినట్టు) నిగనిగలాడుతున్నాయి. గారకాయలను పగిల్చి గింజలను పొడికొట్టిన రాళ్లు ఇవ్వి. ఆ పొడితో స్నానాలు చేసే మునులు నివసించే ప్రాంతమిది అని ఇవి సూచిస్తూనే ఉన్నాయి. ఇక్కడి లేళ్లు మన రథం చప్పుడు సహించి ఊరుకున్నాయి. బెదరలేదు. చెదరలేదు. వాటి నడకలో మార్పు

[అపిచ – ఇక్కడి అధిక పాఠం –

కుల్యాంభోభిః పవనచపలైః శాఖినో ధౌతమూలా
భిన్నో రాగః కిసలయరుచామాజ్య ధూమోద్గమేన
ఏతే చార్వాగుపవనభువిచ్ఛిన్నదర్భాంకురాయాం
నష్టాశంకా హరిణశిశవో మందమందం చరంతి – అధికపాఠం]

**సూతః : సర్వముపపన్నమ్.**

**రాజా : (స్తోకమంతరం గత్వా) తపోవననివాసినా ముపరోధో మాభూత్. ఏతావత్యేవ రథం స్థాపయ. యావదవతరామి.**

**సూతః : ధృతాః ప్రగ్రహాః. అవతరత్వాయుష్మాన్.**

---

లేదు. అంటే తమకు హానిచేసేవారు ఎవ్వరూ ఇక్కడ అడుగుపెట్టలేరని వాటి విశ్వాసం. రథాల చప్పుళ్లకూ మనుషుల అలికిడులకూ ఇలా లేళ్లు అలవాటు పడ్డాయి అంటే ఇది ఆశ్రమ ప్రాంతమనేగా సూచన! సరోవరాల బాటలలో – నారచీరల కొసలనుంచి జారిపడ్డ నీటిధారల జాడలు కనిపిస్తున్నాయి. అంటే – ఋషులూ ఋషిపత్నులూ నివసించే ప్రాంతం ఇది అనడానికి నిదర్శనం కదూ!

**సర్వమ్:** సర్వమ్ + ఉపపన్నమ్ = అంతా సమంజసమే.

**తపోవన:**(స్తోకమ్ = కొంచెం, అంతరమ్ + గత్వా = లోపలికి వెళ్ళి) తపోవన నివాసినామ్ = ఈ తపోవనంలో నివసిస్తున్నవారికి, ఉపరోధః = ఇబ్బంది, మాభూత్ = కలుగకుండుగాక. ఏతావతి+ఏవ = ఇక్కడే, రథమ్ + స్థాపయ = రథం నిలుపు. యావత్ + అవతరామి = ఇంతలో దిగుతాను.

**ధృతాః:** ప్రగ్రహాః = పగ్గాలు, ధృతాః = బిగబట్టాను (బిగబట్టబడ్డాయి). ఆయుష్మాన్ = ఆయుష్మంతుడు, అవతరతు = దిగుగాక!

**వినీత:** (అవతీర్య = రథం దిగి) సూత = సూతుడా! తపోవనాని–నామ = తపోవనాలంటే, వినీతవేషేణ = వినయ సూచకమైన వేషధారణతో, ప్రవేష్టవ్యాని = ప్రవేశింపవలసినవి. ఇదమ్ = ఇది, గృహ్యతామ్ + తావత్ = స్వీకరించు. (సూతస్య = సూతుడికి, ఆభరణాని = తన ఆభరణాలనూ, ధనుశ్చ = ధనుస్సును, ఉపనీయ = తీసిఇచ్చి) సూత = సూతుడా! ఆశ్రమవాసినః = ఆశ్రమవాసులను, ప్రత్యవేక్ష్య =

**రాజా : (అవతీర్య) సూత! వినీతవేషేణ ప్రవేష్టవ్యాని తపోవనాని నామ. ఇదం తావద్గృహ్యతామ్ (సూతస్యాభరణాని ధనుశ్చోపనీయ). సూత! యావదాశ్రమవాసినః ప్రత్యవేక్ష్య అహముపావర్తే తావదార్ద్రపృష్ఠాః క్రియంతాం వాజినః**

**సూతః : తథా (నిష్క్రాంతః).**

**రాజా : (పరిక్రమ్యావలోక్య చ) ఇదమాశ్రమ ద్వారమ్. యావత్ ప్రవిశామి. (ప్రవిశ్య, నిమిత్తం సూచయన్).**

**శాంతమిదమాశ్రమపదం**
**స్ఫురతి చ బాహుః కుతః ఫలమిహాస్య?**
**అథవా భవితవ్యానాం**
**ద్వారాణి భవంతి సర్వత్ర! 14**

---

దర్శించి, అహమ్ = నేను, యావత్ + ఉపావర్తే = ఎంతలో తిరిగివస్తానో, తావత్ = అంతలో, వాజినః = మన గుర్రాలు, ఆర్ద్రపృష్ఠాః = చల్లబరచబడిన వీపులు కలవిగా, క్రియంతామ్ = చేయబడుగాక! వాటి దాహం తీర్చమనీ దేహం చల్లబరచమనీ. విశ్రమింపజెయ్యమనీ.

**తథా:** తథా = అలాగే (నిష్క్రాంతః = సూతుడు నిష్క్రమిస్తాడు).

**ఇదమాశ్రమ:** (పరిక్రమ్య = ముందుకి నడిచి, అవలోక్య–చ = అవలోకించి) ఇదమ్ = ఇదే, ఆశ్రమద్వారమ్ = కణ్వాశ్రమానికి ద్వారం. యావత్ + ప్రవిశామి = ప్రవేశిస్తాను. (ప్రవిశ్య = ప్రవేశించి, నిమిత్తమ్ = శుభ శకునం, సూచయన్ = అభినయంతో సూచిస్తున్నవాడై)

**శాంతమ్:** ఇదమ్ = ఇది, ఆశ్రమపదమ్ = ఆశ్రమ ప్రదేశం. శాంతమ్ = శాంతగుణప్రధానం. బాహుః = నా కుడిభుజం, స్ఫురతి – చ = అదురుతోంది. అస్య = ఈ శుభ శకునానికి, ఫలమ్ = ఫలమైన కన్యాలాభం, ఇహ = ఈ ఆశ్రమంలో, కుతః = ఎలా? అథవా = అయినా, భవితవ్యానామ్ = జరగవలసిన వాటికి, ద్వారాణి = అవకాశాలు, సర్వత్ర–భవంతి = అంతటా ఉంటాయిలే.

**తాత్పర్యం:** ఇది చూస్తే ఆశ్రమం. శాంతరస ప్రధానం. నా కుడిబుజమేమో అదురుతోంది. ఇది శృంగార సూచకం – శుభ శకునమంటారు. మరి ఈ ఫలం

(నేపథ్యే)

ఇదో ఇదో సహిఓ (ఇత ఇతస్సఖ్యౌ)

**రాజా** : (కర్ణం దత్త్వా) అయే! దక్షిణేన వృక్షవాటికా మాలాప ఇవ శ్రూయతే. యావదత్ర గచ్ఛామి. (పరిక్రమ్యావలోక్య చ)

అయే! ఏతాస్తపస్వికన్యకాః. స్వప్రమాణానురూపైః సేచనఘటైః బాల పాదపేభ్యః పయో దాతుమిత ఏవాభివర్తంతే.

(నిపుణం నిరూప్య) అహో! మధురమాసాం దర్శనమ్ –

శుద్ధాంతదుర్లభమిదం వపురాశ్రమవాసినో యది జనస్య
దూరీకృతాః ఖలు గుణై రుద్యానలతా వనలతాభిః **15**

---

ఇక్కడ ఎలా సంభవం? ఏమోలే! జరగాలని రాసిపెట్టి ఉన్నవాటికి అవకాశాలు అంతటా ఉంటాయి. (నిమిత్తం – బాహుః – ఫలం – భవితవ్యం అనే పదాలను విశేషణరహితాలుగా ప్రయోగించినా సందర్భాన్నిబట్టి శుభాలుగా భావించాలి).

(నేపథ్యే = తెరలో)

**ఇదోఇదో:**సఖ్యౌ = చెలులారా! (ద్వివచనం కనుక ఇద్దరు) ఇతః + ఇతః = ఇటు ఇటు!!

**అయే:** (కర్ణమ్+దత్వా = చెవి ఒగ్గి) అయే = అరే! వృక్షవాటికామ్ = ఈ చెట్ల గుంపులో, దక్షిణేన = కుడివైపున, ఆలాపః + ఇవ = ఎవరిదో సంభాషణలాగా, శ్రూయతే = వినబడుతోంది! (ఏనపా ద్వితీయా) యావత్ = ఇంతలో, అత్ర = ఇక్కడికి, గచ్ఛామి = వెడతాను. (పరిక్రమ్య = అటువైపు నడిచీ, అవలోక్య–చ= చూసీ). అయే = అరే! ఏతాః = వీళ్లు, తపస్వి కన్యకాః = తాపసకన్యకలు!! స్వప్రమాణ + అనురూపైః = తమ శక్తి సామర్థ్యాలకు సరిపోయే, సేచనఘటైః = నీటి కుండలతో, బాల పాదపేభ్యః = మొక్కలకు, పయః + దాతుమ్ = నీరు పొయ్యడానికి, ఇతః + ఏవ = ఇటువైపే, అభివర్తంతే = వస్తున్నారు!!

(నిపుణమ్ + నిరూప్య = బాగా చూసి) అహో = ఓహో! ఆసామ్ = ఈ తాపసకన్యకల, దర్శనమ్ = దర్శనం, మధురమ్ = ఎంత మధురం!!

**శుద్ధాంత:** శుద్ధాంత–దుర్లభమ్ = అంతఃపురకాంతలకు దుర్లభమైన, ఇదమ్ + వపుః = ఈ సుందర శరీరం, ఆశ్రమవాసినః = ఆశ్రమాలలో నివసించే, జనస్య యది =

**యావదిమాం తరుచ్ఛాయా మాశ్రిత్య ప్రతిపాలయామి. (విలోకయన్ స్థితః)**

**(తతః ప్రవిశతి యథోక్త వ్యాపారా సహసఖీభ్యాం శకుంతలా)**

**శకుం : ఇదో ఇదో సహీఓ! (ఇత ఇతః సఖ్యౌ)**

**అనసూయా: హలా! సఉందలే! తువత్తో వి తాదకస్సవస్స అస్సమరుక్ఖఆ పిఅదరేత్తి తక్కేమి, జేణ ణోమాలిఆ కుసుమపేలవా తుమం వి ఏదాణం ఆలవాలపూరణే ణిఉత్తా (హలా! శకుంతలే! త్వత్తోఽపి తాతకాశ్యపస్య ఆశ్రమవృక్షకాః ప్రియతరా ఇతి తర్కయామి, యేన నవమాలికా కుసుమపేలవా త్వమపి ఏతేషామాలవాలపూరణే నియుక్తా).**

---

కాంతాజనానిద్వైతే, గుణైః = సౌందర్య సౌకుమార్యాది గుణాలతో, ఉద్యానలతాః = ఉద్యానాలలోని పుష్పలతలు, వనలతాభిః = అడవితీగలచేత, దూరీకృతాః + ఖలు = తిరస్కృతాలే సుమా!

**తాత్పర్యం:** ఈ తాపసకన్యకల శరీరాలు ఎంతటి సుకుమార సుందరాలు! ఇవి మా అంతఃపురకాంతలలో కనిపించవు. అవును మరి – సౌకుమార్య సౌందర్యాది గుణాల విషయంలో అడవి తీగల ముందు ఉద్యాన లతలు ఎప్పుడూ దిగదుడుపే!

**యావత్:** ఇమామ్ = ఈ, తరు+ఛాయామ్ = చెట్టునీడను, ఆశ్రిత్య = ఆశ్రయించి, ప్రతిపాలయామి = నిరీక్షిస్తాను. (విలోకయన్–స్థితః = చూస్తూ నిలబడ్డాడు).

(తతః = అంతట, యథోక్తవ్యాపారా = ప్రస్తావించబడ్డ పని చేస్తున్నదై, సహసఖీభ్యామ్ = ఇద్దరు చెలిమికత్తెలతో, శకుంతలా = శకుంతల, ప్రవిశతి = ప్రవేశిస్తుంది).

**ఇదో ఇదో:** సఖ్యౌ = చెలులారా!, ఇతః ఇతః = ఇటు, ఇటు!

**హలా:** హలా = ఓయీ! శకుంతలే = శకుంతలా! తాతకాశ్యపస్య = నీ తండ్రిగారైన కణ్వుడికి, త్వత్తః+అపి = నీకంటేకూడా, ఆశ్రమ వృక్షకాః = ఆశ్రమంలోని మొక్కలు, ప్రియతరాః + ఇతి = ఇష్టమైనవని, తర్కయామి = భావిస్తాను. యేన = ఎందుకంటే – నవమాలికా – కుసుమ –పేలవా = విరజాజి పువ్వులా నాజూకు దానవైన, త్వమ్ + అపి = నువ్వు సైతం, ఏతేషామ్ = ఈ మొక్కల, ఆలవాల–పూరణే = బోదెలు నింపే పనిలో, నియుక్తా = నియుక్తురాలివయ్యావు.

**శకుం : ణకేఅలం తాదణిఓఓఏవ్వ, అత్తి మే సోదరసిణేహో ఏదేసు.**

**(న కేవలం తాతనియోగ ఏవ, అస్తి మే సోదరస్నేహ ఏతేషు).**

**(వృక్షసేచనం రూపయతి)**

**రాజా : (ఆత్మగతమ్) కథమియం సా కణ్వదుహితా? అసాధుదర్శీ ఖలు తత్రభవాన్ కాశ్యపః య ఇమామాశ్రమధర్మే నియుంక్తే.**

**ఇదం కిలావ్యాజమనోహరం వపుః**
**తపఃక్లమం సాధయితుం య ఇచ్ఛతి**
**ధ్రువం స నీలోత్పల పత్రధారయా**
**సమిల్లతాం ఛేత్తుమయం వ్యవస్యతి. 16**

---

**ణకేఅలం:** కేవలమ్ = కేవలమూ, తాతనియోగః + ఏవ = తండ్రి ఆజ్ఞయే, న = కాదు; ఏతేషు = ఈ మొక్కలపట్ల, మే = నాకు, సోదరస్నేహః + అస్తి = సోదరస్నేహమూ ఉంది.

(వృక్షసేచనమ్ = మొక్కలకు నీళ్లు పొయ్యడం, రూపయతి = ప్రదర్శిస్తుంది).

**కథమియమ్:** (ఆత్మగతమ్ = తనలో) కథమ్ = ఎట్టా! ఇయమ్ = ఈమె, సా = ఆ, కణ్వదుహితా = కణ్వపుత్రికయా? ఇమామ్ = ఈమెను, ఆశ్రమధర్మే = ఆశ్రమ కార్యకలాపంలో, యః = ఏ వ్యక్తి, నియుంక్తే = నియమిస్తున్నాడో, సః = ఆ, తత్రభవాన్–కాశ్యపః = గౌరవార్హుడైన కణ్వుడు, అసాధుదర్శీ–ఖలు = అనుచితదృష్టికలవాడుసుమా!

**ఇదం కిల:** అవ్యాజ–మనోహరమ్ = భూషణాదికమైన ఏ హేతువూ లేకుండానే మనోహరమైన, ఇదమ్ = ఈ, వపుః = తనువును, తపఃక్లమమ్ = తపస్సంబంధి శ్రమను, సాధయితుమ్ = నిర్వహించడానికి, యః = ఏ వ్యక్తి, ఇచ్ఛతి – కిల = వినియోగించగోరుతున్నాడో, సః + అయమ్ = ఆ ఈ కణ్వుడు, ధ్రువమ్ = నిస్సంశయంగా, నీల + ఉత్పలపత్ర–ధారయా = నల్లకలువ పూరేకుటంచుతో, సమిత్+లతామ్ = సమిధ తీగను, ఛేత్తుమ్ = నరకడానికి, వ్యవస్యతి = ప్రయత్నిస్తున్నాడు. (తపః + క్షమమ్ = తపస్సుకు సమర్థంగా, సాధయితుమ్ = చేయడానికి. శమీలతామ్ = జమ్మి కొమ్మను, ఛేత్తుం వ్యవస్యతి – పాఠాంతరాలు). కిల సంభావ్యవార్తయోః హేత్వరుచ్యోర లీకే చ – ఇతి హైమః. ఇక్కడ అరుచి సూచకం.

**తాత్పర్యం:** అయ్యయ్యో! సహజసిద్ధంగా మనోహరమైన ఈమె తనువును చాంద్రాయణాది కఠోరవ్రత నియమాలతో కూడిన తపస్సుకు సమర్థంగా సాధనంగా

**భవతు. పాదపాంతర్హిత ఏవ విస్రబ్ధం తావదేనాం పశ్యామి.**
**(తథా కరోతి)**

శకుం : **హలా అణసూఏ! అదిపిణద్ధేణ థణవక్కలేణ పిఅంవదాఏ దిఢం ణిఅంతిదంహి. సిఢిలేహి దావణం. (హలా అనసూయే! అతిపినద్ధేన స్తనవల్కలేన ప్రియంవదయా దృఢం నియంత్రితాస్మి. శిథిలయ తావదేతత్.**

అన : **తహ (తథా). (శిథిలయతి)**

ప్రియం : **(సహాసమ్) ఏత్థ పఓహర విత్థారఇత్తఅం అత్తణో జోవ్వణం ఉవాలహ. (అత్ర పయోధరవిస్తారయితృకం ఆత్మనో యౌవనమ్ ఉపాలభస్వ).**

రాజా : **కామమననురూపమప్యస్యా వపుషః వల్కలమ్, న పునరలంకారశ్రియం న పుష్యతి. కుతః-**

---

వినియోగించగోరుతున్న వ్యక్తి –కణ్వర్షి – సందేహం లేదు, నల్లకలువరేకుతో సమిధ కొమ్మను (జమ్మితీగను) నరకడానికి ప్రయత్నిస్తున్నాడు.

**భవతు:** భవతు = అగుగాక! పాదప+అంతర్హితః+ఏవ = చెట్ల మాటున దాగినవాడనయ్యే, విస్రబ్ధమ్ = స్వేచ్ఛగా (తనివితీరా), ఏనామ్ = ఈ శకుంతలను, పశ్యామి = చూస్తాను. (తథా = అలా, కరోతి = చేస్తాడు).

**హలా:** హలా = ఓయీ, అనసూయే = అనసూయా! అతిపినద్ధేన = బాగా బిగించిన, స్తనవల్కలేన = స్తనవల్కలంతో (కుచాల మీద బిగించుకొనే నార చీర), ప్రియంవదయా = ప్రియంవదచేత, దృఢమ్ = గట్టిగా, నియంత్రితా+అస్మి = బంధింపబడినదాననయ్యాను. ప్రియంవద ఈ స్తనవల్కలాన్ని మరీ గట్టిగా బిగించి కట్టింది అనడం. తావత్ + ఏతత్ = కాస్త దీన్ని, శిథిలయ = వదులుచెయ్యి.

**తహ:** (తథా = అలా), (శిథిలయతి = వదులు చేస్తుంది)

**ఏత్థ:** (సహాసమ్ = నవ్వుతూ) అత్ర = ఈ విషయంలో, పయోధర – విస్తారయితృకమ్ = నీ స్తనాలను అంతకంతకూ పెంపొందించే, ఆత్మనః + యౌవనమ్ = నీ జవ్వనాన్ని, ఉపాలభస్వ = నిందించు.

**కామమ్:** అస్యాః = ఈ శకుంతలయొక్క, వపుషః = సుకుమార శరీరానికి (వయసః = యౌవనానికి), కామమ్ = బొత్తిగా (మిక్కిలి), అననురూపమ్ + అపి

సరసిజమనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీం తనోతి
ఇయమధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివ హి మధురాణాం మండనం నాకృతీనామ్. **17**

**శకుం : (అగ్రతోఽవలోక్య) సహిఓ! ఏసో వాదేరిదపల్లవంగులీహిం తువరేది విఅ మం కేసరరుక్ఖఓ. జావణం సంభావేమి.**

**(సఖ్యౌ! ఏష వాతేరిత పల్లవాంగులీభిస్త్వరయతీవ మాం కేసరవృక్షకః. యావదేనం సంభావయామి).**

---

= తగనిదే అయినప్పటికీ, వల్కలమ్ = నారచీర, పునః = మరి (వాక్యాలంకారం), అలంకారశ్రియమ్ = అలంకారశోభను, న–పుష్యతి–ఇతి–న = కచ్చితంగా పోషిస్తోంది – పెంచుతోంది. (పెంచడం లేదు అనేది లేదు). కుతః = ఎలాగంటే –

**సరసిజమ్:** సరసిజమ్ = పద్మం, శైవలేన = నాచుతో, అనువిద్ధమ్ + అపి = కప్పివేయబడినా, రమ్యమ్ = అందంగానే ఉంటుంది. హిమాంశోః = చంద్రుడి, లక్ష్మ = మచ్చ, మలినమ్ + అపి = కళంకమైనా (నల్లనిదైనా), లక్ష్మీమ్ + తనోతి = శోభను పెంచుతోంది. ఇయమ్ = ఈ, తన్వీ = కృశాంగి శకుంతల, వల్కలేన + అపి = నారచీరతోనే అయినా, అధికమనోజ్ఞా = ఇనుమిక్కిలి మనోహరంగా ఉంది. మధురాణామ్ = సహజ సుందరమైన, ఆకృతీనామ్ = రూపాలకు, కిమ్+ఇవ–హి–మండనమ్+న = ఏది అలంకారం కాదు!

**తాత్పర్యం:** నాచు కప్పినా పద్మం – సుందరమే! చంద్రుడిలో మచ్చ ఉన్నా అదీ శోభస్కరమే! నారచీర కట్టినా ఈ తన్వి అత్యంతమనోజ్ఞురాలే! అవును, అందమైన ఆకారాలకు ఏది అలంకారం కాదు!? అన్నీ అలంకారాలే!!

**ఏసో:** (అగ్రతః + అవలోక్య = ముందుకు చూసి) సఖ్యౌ = చెలులారా! వాత = గాలికి, ఈరిత = కదిలించబడ్డ, పల్లవ = చిగురాకులనే, అంగులీభిః = చేతివేళ్లతో, ఏషః = ఈ, కేసరవృక్షకః = పొగడ యువతరువు, మామ్ = నన్ను, త్వరయతి + ఇవ = తొందర పెడుతున్నట్టుంది. (కేసరవృక్షః – అని కొన్నింట పాఠం. అల్పార్థక కప్రత్యయం లేదు. కాబట్టి కేసర వృక్షం. యువతరువు దుష్యంతుడికి సూచకం). ఏనమ్ = దీనిని, సంభావయామి–యావత్ = (జలప్రదానంతో) గారవింతునుగాక!

(పరిక్రామతి)

**ప్రియం : హలా సఉందలే! ఏత్థ ఏవ్వ దావ ముహత్తఅం జిట్ఠ!!**

**(హలా! శకుంతలే! అత్రైవ తావన్ముహూర్తం తిష్ఠ.)**

**శకుం : కిం ణిమిత్తం? (కిం నిమిత్తమ్).**

**ప్రియం : జావ తుఏ ఉవగదాఏ లదాసనాహో విఅ అఅం కేసరరుక్ఖఓ పడిభాది (యావత్త్వయోపగతయా లతాసనాథ ఇవాయం కేసర వృక్షకః ప్రతిభాతి).**

**శకుం : అదోఖు పిఅంవదా సి తుమం. (అతఃఖలు ప్రియంవదాసి త్వమ్)**

**రాజా : ప్రియమపి తథ్యమాహ శకుంతలాం ప్రియంవదా, అస్యాఃఖలు-**

**అధరః కిసలయరాగః కోమలవిటపానుకారిణౌ బాహూ**
**కుసుమమివ లోభనీయం యౌవనమంగేషు సంనద్ధమ్. 18**

---

(పరిక్రామతి = అటువైపు నడుస్తుంది)

**ఏత్థ:** హలా! శకుంతలే! = ఓయీ శకుంతలా! అత్ర+ఏవ = ఇక్కడ ఈ యువతరువు చెంగటనే, ముహూర్తం = కొంచెంసేపు, తిష్ఠ-తావత్ = నిలబడుదూ!!

**కింణిమిత్తం:** కిమ్-నిమిత్తమ్ = ఎందుకో?!

**జావతుఏ:** త్వయా-ఉపగతయా = నువ్వు చెంగట నిలవడంతో, అయమ్ = ఈ, కేసరవృక్షకః = పొగడ యువతరువు, లతాసనాథః + ఇవ = పూల తీగతో కూడినదిలాగా, ప్రతిభాతి-యావత్ = భాసిస్తుంది సుమా!

**అదోఖు:** అతః+ఖలు = ఇందుకే కదా, త్వమ్ = నువ్వు, ప్రియంవదా + అసి = ప్రియంవదవయ్యావు!

**ప్రియమపి:** ప్రియమ్+అపి = ఇచ్చకమే అయినా, శకుంతలామ్ = శకుంతలనుద్దేశించి, ప్రియంవదా = ప్రియంవద, తథ్యమ్+ఆహ = నిజం పలికింది! అస్యాః+ఖలు = ఈమెకు

**అధరః:** అధరః = ఈమె పెదవి, కిసలయరాగః = చిగురాకులాగా ఎర్రనిది. బాహూ = చేతులు, కోమల-విటప+అనుకారిణౌ = లేత కొమ్మలను సరిపోలుతున్నాయి. కుసుమమ్+ఇవ = పువ్వులాగా, లోభనీయమ్ = సమ్మోహపరిచే, యౌవనమ్ = జవ్వనం, అంగేషు = సర్వావయవాలలోనూ, సంనద్ధమ్ = సంసిద్ధం.

**అన : హలా! సఉందలే! ఇఅం సఅంవరవహూ సహఆరస్స తుఏ కిదణామహేఆ వణజో సిణిత్తి ణోమాలిఆ. ణం విసుమరిదా సి? (హలా! శకుంతలే! ఇయం స్వయంవరవధూః సహకారస్య త్వయా కృతనామధేయా వనజ్యోత్స్నేతి నవమాలికా. ఏనాం విస్మృతవత్యసి?)**

**శకుం : తదా అత్తాణం వి విసుమరిస్సం. (లతాముపేత్యావలోక్యచ) హలా! రణణీఏ ఖు కాలే ఇమస్స లదాపాఅవమిహుణస్స వఇఅరో సంవుత్తో. ణవకుసుమజోవ్వణా వనజోసిణీ సిణిద్ధ పల్లవదాఏ అ ఉవభోఅక్ఖమో సహఆరో. (తదాత్మానమపి విస్మరిష్యామి (లతాముపేత్య అవలోక్య చ) హలా! రమణీయే ఖలు కాలే ఏతస్య లతాపాదపమిథునస్య వ్యతికరః సంవృత్తః. నవ కుసుమయౌవనా వనజ్యోత్స్నా స్నిగ్ధపల్లవతయా చ ఉపభోగక్షమః సహకారః).**

---

**తాత్పర్యం:** ఈమె అధరం – చిగురాకు. ఈమె బాహువులు – లేత కొమ్మలు. ఈమె అంగాంగంలోనూ పిక్కటిల్లుతున్న జవ్వనం – వికసిస్తున్న పువ్వులాగా స్పృహణీయం. ఈమె ఒక లతకాదా మరి!!

**ఇఅం:** ఓయీ శకుంతలా! సహకారస్య = ఈ మామిడి చెట్టుకు, స్వయంవర వధూః = స్వయంగా వరించిన వధువులాంటిదైన, ఇయమ్ = ఈ, నవమాలికా = విరజాజి తీగ, త్వయా = నీచేత, వనజ్యోత్స్నా + ఇతి =“వనజ్యోత్స్న” అని, కృతనామధేయా = పేరుపెట్టబడినది గదా! (నువ్వు దానికి ఈ పేరు పెట్టావని). ఏనామ్ = ఈ విరజాజితీగను, విస్మృతవతీ+అసి = మరచినదానవయ్యావా?

**తదాఅత్తాణం:** తదా = ఈ వనజ్యోత్స్నను మరిచిపోయినట్టయితే, ఆత్మానమ్+అపి = నన్ను కూడా నేను, విస్మరిష్యామి = మరిచిపోయినట్టే. నన్ను నేనే మరిచిపోయినట్టు అనడం. (లతామ్+ఉపేత్య = ఆ విరజాజి తీగను సమీపించీ, అవలోక్య–చ = వీక్షించీ) హలా = చెలీ! రమణీయే–కాలే = అతి మనోహరమైన ప్రాయంలో (కాలంలో), ఏతస్య = ఈ, లతాపాదప–మిథునస్య = నవమాలికా సహకారాల జంటకు, వ్యతికరః = పరస్పర సమ్మేళనం, సంవృత్తః ఖలు = జరిగింది కదూ! నవకుసుమ యౌవనా = ముమ్మొదటి పూతతో జవరాలు, వనజ్యోత్స్నా = ఈ విరజాజి వనజ్యోత్స్న! స్నిగ్ధ–పల్లవతయా = నిగనిగలాడే చిగురింతతో, ఉపభోగక్షమః = సుఖానుభూతికి సమర్థం, సహకారః+చ = ఈ తియ్యమామిడి!!

**(పశ్యంతీ తిష్ఠతి)**

**ప్రియం : (సస్మితమ్) అణసూఏ! జాణాసి కింణిమిత్తం సఉందలా వణజోసిణీం అదిమేత్తం పేక్ఖదిత్తి? (అనసూయే! జానాసి కిం నిమిత్తం శకుంతలా వనజ్యోత్స్నామతిమాత్రం పశ్యతీతి?).**

**అన : ణక్ఖు విభావేమి. కహేహి. (న ఖలు విభావయామి. కథయ).**

**ప్రియ : జహ వణజోసిణా అణురూపేణ పాఅవేణ సంగదా, అవి ణామ ఎవ్వం అహం వి అత్తణో అణురూవం వరం లహేఅత్తి.**

**(యథా వనజ్యోత్స్నా అనురూపేణ పాదపేన సంగతా అపినామ ఏవమహమప్యాత్మనోఽనురూపం వరం లభేయమితి).**

**శకుం : ఏసో ణూణం తుమ అత్తగదో మణోరహో. (ఏష నూనం తవాత్మగతో మనోరథః).**

**(కలశమావర్జయతి)**

---

(పశ్యంతీ – తిష్ఠతి = ఆ జంటనే చూస్తూ ఉండిపోతుంది).

**జాణాసి:** (సస్మితమ్ = చిరునవ్వుతో) అనసూయా! కిమ్+నిమిత్తమ్ = ఎందుకని, శకుంతలా = మన శకుంతల, వనజ్యోత్స్నామ్ = ఈ విరజాజి వనజ్యోత్స్నను, అతిమాత్రమ్+పశ్యతి+ఇతి = అదే పనిగా చూస్తోందో, జానాసి = ఎరుగుదువా?

**ణక్ఖు:** న–ఖలు – విభావయామి = ఊహించలేను సుమా! కథయ = నువ్వే చెప్పు.

**జహ వణజోసిణా:** వనజ్యోత్స్నా–యథా = ఎలాగైతే ఈ వనజ్యోత్స్న, అనురూపేణ = ఈడూజోడైన, పాదపేన = తియ్యమామిడి చెట్టుతో, సంగతా = అల్లుకొన్నదో, అపినామ+ఏవమ్ = తప్పకుండా ఇలాగే, అహమ్+అపి = తానుకూడా, ఆత్మనః = తనకు, అనురూపమ్ = అన్నివిధాలా తగిన, వరమ్ = వరుణ్ని, లభేయమ్ ఇతి = పొందుదునుగాక అని!

**ఏసోణూణం:** ఏషః = ఇది, నూనమ్ = కచ్చితంగా, తవ+ఆత్మగతః = తమరి బుద్ధిలోని, మనోరథః = కోరిక. (ఆత్మా జీవే వృతౌ బుద్ధౌ పరమాత్మని–విశ్వః) (కలశమ్ = నీటికుండను, ఆవర్జయతి = విరజాజి మొదట ఒంపుతుంది).

**రాజా : (ఆత్మగతమ్). దుర్లభః ఖల్వేష మనోరథః. అపినామ కులపతేరియ మసవర్ణక్షేత్రసంభవా స్యాత్? అథవా కృతం సందేహేన.**

**అసంశయం క్షత్రపరిగ్రహక్షమా**
**యదార్య మస్యామభిలాషి మే మనః!**
**సతాం హి సందేహపదేషు వస్తుషు**
**ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః** **19**

**తథాపి తత్త్వత ఏవైనా ముపలప్స్యే.**

---

**దుర్లభః:** (ఆత్మగతమ్ = తనలో) ఏషః + మనోరథః = ఈ కోరిక, దుర్లభః + ఖలు = కష్టసాధ్యం సుమా! (అలాంటి వరుడు మునిజాతిలో దొరకడని).

ఇయమ్ = ఈ శకుంతల, కులపతేః = కులపతి కణ్వుడికి, అసవర్ణ–క్షేత్ర–సంభవా = విలోమజాతిస్త్రీ యందు పుట్టినది, అపి నామ స్యాత్ = కాదు గదా?! (బ్రాహ్మణేతరకాంతకు పుట్టినదా?). అథవా = అయినా, సందేహేన–కృతమ్ = ఈ సంశయం ఇక చాలు (అనవసరం అనడం).

**అసంశయమ్:** ఆర్యమ్ = పవిత్రమైన (నమ్మదగ్గ), మే–మనః = నా అంతరంగం, అస్యామ్ = ఈమె పట్ల, యత్+అభిలాషి = అభిలాష కలది అయ్యిందంటేనే, అసంశయమ్ = ఇక సందేహం లేదు, క్షత్ర పరిగ్రహ–క్షమా = ఈమె క్షత్రియుడు పరిణయమాడదగినదే! సతామ్ = సజ్జనులకు, సందేహపదేషు = సందేహాస్పదాలైన, వస్తుషు = సందర్భాలలో, అంతఃకరణ–ప్రవృత్తయః = తమ అంతరంగాల స్పందనలే, ప్రమాణమ్–హి = ప్రమాణాలు (సాధనాలు) గదా!

**తాత్పర్యం:** నిష్కల్మషమైన నా మనస్సు ఈమెను ఇలా అభిలషిస్తోందంటే – సందేహం లేదు – ఈమె క్షత్రియుడు స్వీకరించడానికి యోగ్యురాలన్నమాటే. ఇలా సందేహాలు కలిగిన సందర్భాలలో సజ్జనులకు వారి వారి మనస్సుల స్పందనలే (మనసు చెప్పే మాటయే) ప్రమాణాలు గదా!

**తథాపి:** తథాపి = అయినప్పటికీ, తత్త్వతః+ఏవ = వాస్తవంగానే, ఏనామ్ = ఈమెను, ఉపలప్స్యే = తెలుసుకుంటాను.

**శకుం : (ససంభ్రమమ్) అమ్మఓ! సలిలసేఅసంభముగ్గదో ణోమాలిఅం ఉజ్ఝిఅ వఅణం మే మహుఅరో అహివట్టఇ. (అహో! సలిలసేక సంభ్రమోద్గతో నవమాలికా ముజ్ఝిత్వా వదనం మే మధుకరోఽభివర్తతే)**

**(భ్రమర బాధాం రూపయతి)**

**రాజా : (సస్పృహం విలోక్య)**

**చలాపాంగం దృష్టః స్పృశసి బహుశో వేపథుమతీం**
**రహస్యాఖ్యాయీవ స్వనసి మృదు కర్ణాంతికచరః**
**కరౌ వ్యాధూన్వత్యాః పిబసి రతిసర్వస్వమధరం**
**వయం తత్త్వాన్వేషాన్మధుకర! హతాస్త్వం ఖలు కృతీ. 20**

---

**అమ్మఓ:** (ససంభ్రమమ్ = కళవళపాటుతో) అహో = అక్కటా! సలిలసేక = నీళ్లు పొయ్యడంవలని, సంభ్రమ = భయంతో, ఉద్గతః = ఎగిరినదైన, మధుకరః = తుమ్మెద, నవమాలికామ్ = విరజాజిని, ఉజ్ఝిత్వా = విడిచి, మే+వదనమ్ = నా ముఖాన్ని, అభివర్తతే = చుట్టుముడుతోంది.

(భ్రమరబాధామ్ = తుమ్మెదపెట్టే బాధను, రూపయతి = అభినయంతో ప్రదర్శిస్తుంది).

**చలాపాంగం:** (సస్పృహమ్ = ఆశగా, విలోక్య = చూసి) మధుకర = ఓ తుమ్మెదా! చల+అపాంగమ్ = కదిలే కడకన్నులతో, దృష్టః = ఈమెతో చూడబడుతున్నావు. వేపథుమతీమ్ = భయంతో వణుకుతున్న ఈమెను, బహుశః = మాటిమాటికీ, స్పృశసి = తాకుతున్నావు. కర్ణ+అంతికచరః = ఈమె చెవికి దగ్గరగా ఎగురుతూ, రహస్య+ఆఖ్యాయీ+ఇవ = ఏదో రహస్యం చెబుతున్నట్టు (చెబుతున్న వ్యక్తిలాగా), మృదు = సుతారంగా, స్వనసి = ధ్వనిచేస్తున్నావు. కరౌ = చేతులను, వ్యాధూన్వత్యాః = విదిలిస్తున్న ఈమెదైన, రతిసర్వస్వమ్+ అధరమ్ = రతి సర్వస్వమైన అధరాన్ని, పిబసి = గ్రోలుతున్నావు. వయమ్ = మేము, తత్త్వ+ అన్వేషాత్ = ఈమె ఏ జాతిది అనే సత్యాన్వేషణ (పెట్టుకోవడం) వల్ల, హతాః = వంచితులమయ్యాం, త్వమ్+ఖలు+కృతీ = నువ్వు గదా ధన్యుడివి. (చలావపాంగౌ యస్మిన్ కర్మణి తత్తథా = చలాపాంగమ్)

**తాత్పర్యం:** ఓయీ! మధుకరా! ఈమె క్రీగంటిచూపులకు నోచుకొన్నావు. వణికిపోతున్న ఈమెను బహుధా స్పృశిస్తున్నావు. ఏదో రహస్యం చెబుతున్నట్టు ఈమె చెవి చెంత

**(యతో యతః షట్చరణోఽభివర్తతే తతస్తతః ప్రేరిత వామలోచనా వివర్తితభ్రూ రియమద్య శిక్షతే భయాదకామాపి హి దృష్టి విభ్రమమ్ – అధిక పాఠం).**

**శకుం : ణ ఏసో దుట్ఠో విరమది. అణ్ణదో గమిస్సం (పదాంతరే స్థిత్వా సదృష్టిక్షేపమ్) కహం ఇదో వి ఆఅచ్ఛది. హలా! పరిత్తాఅహ మం ఇమిణా దువ్వీణీదేణ దుట్ఠమహుఅరేణ అహిభూఅమాణం. (న ఏష దుష్టో విరమతి. అన్యతో గమిష్యామి. కథమితోఽప్యాగచ్ఛతి! సఖ్యౌ పరిత్రాయేథాం మామ్ అనేన దుర్వినీతేన దుష్టమధుకరేణ అభిభూయమానామ్).**

**ఉభే : (సస్మితమ్) కా అంహే పరిత్తాదుం? దుస్సందం ఆక్కంద. రాఅ రక్కిదవ్వాఇం తవోవణాఇం ణామ. (కే ఆవాం పరిత్రాతుమ్?! దుష్యంతమాక్రంద. రాజ రక్షితవ్యాని తపోవనాని నామ).**

---

మృదువుగా ధనిస్తున్నావు. చేతులతో విదిలిస్తున్నా తప్పించుకుంటున్నావు, సంభోగ సమస్త సంపదలాంటి ఈమె అధరాన్ని చటుక్కున గ్రోలుతున్నావు. ఓయి తుమ్మెదా! నువ్వు ధన్యుడివి, చరితార్థుడివి. మేము మాత్రం ఈమె జాతి ఏమిటి జన్మ ఏమిటి అనే తత్త్వాన్ని తెలుసుకునే అన్వేషణలో ఇలా ఉండిపోయాం, దెబ్బతిన్నాం!!

**ణఏసో:** ఏషః = ఈ, దుష్టః = దుష్టమధుకరం, న–విరమతి = విడిచి పెట్టడం లేదు. అన్యతః + గమిష్యామి = మరో వైపు వెడతాను. (పదాంతరే స్థిత్వా = మరోచోట నిలిచి, సదృష్టిక్షేపమ్ = రెప్పలల్లారుస్తూ), కథమ్ = ఎట్టూ! ఇతః + అపి = ఇటు కూడా, ఆగచ్ఛతి = వచ్చిందే!? సఖ్యౌ = చెలులారా! అనేన = ఈ, దుర్వినీతేన =తుంటరి, దుష్ట మధుకరేణ = దుర్మార్గపు తుమ్మెదతో, అభిభూయమానామ్ = హింసింపబడుతున్నదాననైన, మామ్ = నన్ను, పరిత్రాయేథామ్ = రక్షించుడీ! రక్షించుడీ!!

**కాఅంహే:** (సస్మితమ్ = చిరునవ్వుతో) పరిత్రాతుమ్ = రక్షించడానికి, కే + ఆవామ్ = మేమెవరం?! దుష్యంతమ్ = దుష్యంతుణ్ని, ఆక్రంద = మొరపెట్టుకో. తపోవనాని–నామ = ఇలాంటి ఆశ్రమ ప్రాంతాలంటే, రాజరక్షితవ్యాని = రాజు రక్షించవలసినవిగదా?

**రాజా : అవసరోఽయమాత్మానం ప్రకాశయితుమ్. న భేతవ్యం న భేతవ్యమ్ – (అర్ధోక్తే స్వగతమ్) రాజభావస్త్వభిజ్ఞాతో భవేత్. భవతు. ఏవం తావదభిధాస్యే.**

**శకుం : (పదాంతరే స్థిత్వా, సదృష్టిక్షేపమ్) కహం ఇదో వి మం అణుసరది? (కథమితోఽపి మా మనుసరతి?)**

**రాజా : కః పౌరవే వసుమతీం శాసతి శాసితరి దుర్వినీతానామ్**
**అయమాచరత్యవినయం ముగ్ధాసు తపస్వికన్యాసు? 21**

**(సర్వా రాజానం దృష్ట్వా కించిదివ సంభ్రాంతాః)**

**అన : అజ్జ! ణ ఖు కింవి అచ్చాహిదం. ఇఅం ణో పిఅసహీ మహుఅరేణ అహిహూఅమాణా కాదరీభూదా (ఆర్య! న ఖలు కిమప్యత్యాహితమ్. ఇయం నో ప్రియసఖీ మధుకరేణాభిభూయ మానా కాతరీభూతా)**

---

**అవసరః:** ఆత్మానమ్ = నన్నునేను, ప్రకాశయితుమ్ = వెల్లడిపరుచుకోడానికి, అయమ్ = ఇదే, అవసరః = తగిన సమయము. న–భేతవ్యమ్ = భయపడవద్దు, భయపడవద్దు. (అర్ధోక్తే = సగం మాటలో ఆగి, స్వగతమ్ = తనలో) రాజభావః + తు = నా రాజత్వం, అభిజ్ఞాతః + భవేత్ = వీరికి తెలిసిపోతుంది. భవతు = కానీలే. ఏవమ్ + తావత్ = ఇలా, అభిధాస్యే = చెబుతాను.

**కహం:** (పదాంతరే = మరోచోట, స్థిత్వా = నిలిచి) కథమ్ = ఎట్టూ! ఇతః + అపి = ఇక్కడికి కూడా ఈ తుమ్మెద, మామ్ + అనుసరతి = నన్ను అనుసరిస్తోందే!?

**కఃపౌరవే:** పౌరవే= పురువంశీయుడైన దుష్యంతుడు, వసుమతీమ్ = భూమిని, శాసతి (సతి) = పరిపాలిస్తుండగా; దుర్వినీతానామ్ = దుర్మార్గులను, శాసితరి (సతి) = శిక్షిస్తూండగా; ముగ్ధాసు = అమాయికురాండ్రైన, తపస్వి కన్యాసు = మునికన్యలపట్ల, అవినయమ్ = అపచారం, ఆచరతి = ఆచరిస్తున్నవాడు, కః+అయమ్ = ఎవడు వీడు?

**తాత్పర్యం:** పురు వంశీయుడైన దుష్యంతుడు పరిపాలన సాగిస్తూ దుష్టులను శిక్షిస్తుండగా, ఎవడు వీడు – ముద్దరాండ్రయిన మునికన్యలపట్ల అనుచితంగా ప్రవర్తిస్తున్న వీడు ఎవడు?? (సర్వాః = మునికన్యలు ముప్వురూ, రాజానమ్ – దృష్ట్వా = దుష్యంతుణ్ని చూసి, కించిత్ + ఇవ = కొద్దిపాటిగా, సంభ్రాంతాః = కంగారు పడ్డారు).

**(శకుంతలాం దర్శయతి)**

**రాజా : (శకుంతలాభిముఖో భూత్వా) అపి తపో వర్ధతే?**
**(శకుంతలా సాధ్వసా దవచనా తిష్ఠతి)**

**అన : దాణిం అదిహి విసేస లాహేణ. సా అదం అజ్జస్స. (శకుంతలాముద్దిశ్య) హలా! సఉందలే! గచ్ఛ ఉడఅం, ఫలమిస్సం అగ్ఘం ఉవహర. ఇదం పాదోదఅం భవిస్సది. (ఇదానీమతిథివిశేషలాభేన. స్వాగతమార్యస్య. హలా! శకుంతలే! గచ్ఛోటజమ్. ఫలమిశ్రమర్ఘ్యముపహర. ఇదం పాదోదకం భవిష్యతి).**

**రాజా : భవతీనాం సూనృతయైవ గిరా కృతమాతిథ్యమ్.**

---

**అజ్జ ణ ఖు:** ఆర్య = అయ్యా! అత్యాహితమ్ = అంతటి మహాభయం (మహాపరాధం), కిమపి = ఏదీ, న ఖలు = లేదు సుమా! ఇయమ్ = ఈ, నః = మా, ప్రియసఖీ = నెచ్చెలి, మధుకరేణ = ఒక గండుతుమ్మెదతో, అభిభూయమానా = బాధింపబడుచున్నదై, కాతరీభూతా = భయపడింది–అంతే! (శకుంతలామ్ = శకుంతలను, దర్శయతి = చేతితో చూపుతుంది).

**అపితపః:** (శకుంతలాభిముఖః+భూత్వా= శకుంతలవైపు తిరిగి) తపః = తపస్సు, అపి–వర్ధతే = బాగా సాగుతోందా? (శకుంతలా = శకుంతల, సాధ్వసాత్ = భయంతో, అవచనా+తిష్ఠతి = మిన్నకుంటుంది).

**దాణిం అదిహి:** ఇదానీమ్ = ఇప్పుడు, అతిథివిశేషలాభేన = ఒక విశిష్ట అతిథి రాకతో – తపస్సు వృద్ధి పొందుతోంది. ఆర్యస్య = ఆర్యుడికి (నీకు), స్వాగతమ్ = స్వాగతం. హలా శకుంతలే = ఓయీ శకుంతలా! ఉటజమ్+గచ్ఛ = పర్ణశాలలోకి వెళ్ళు, ఫలమిశ్రమ్ = పళ్లూ ఫలాలతో, అర్ఘ్యమ్ + ఉపహర = ఈ అతిథికి అర్ఘ్యం తీసుకురా! ఇదమ్ = ఇదిగో ఈ కలశోదకం, పాదోదకమ్+భవిష్యతి = పాద్యంగా ఉపయోగపడుతుంది.

**భవతీనామ్:** భవతీనామ్ = మీ, సూనృతయా–గిరా – ఏవ = ప్రియవాక్కులతోనే, ఆతిథ్యమ్+ కృతమ్ = అతిథిసత్కారం అయ్యింది. (సూనృతం తు ప్రియే సత్యే – ఇతిచామరః).

**ప్రియం : తేణ హి ఇమస్సిం పచ్ఛాఅసీఅలాఏ సత్తవణ్ణవేదిఆఏ ముహుత్తఅం ఉవవిసిఅ పరిస్సమవిణోదం కరేదు అజ్జో.**

**(తేన హి అస్యాం ప్రచ్ఛాయశీతలాయాం సప్తపర్ణవేదికాయాం ముహూర్తముపవిశ్య పరిశ్రమవినోదం కరోత్వార్యః).**

**రాజా : నూనం యూయమప్యనేన కర్మణా పరిశ్రాంతాః.**

**అన : హలా! సఉందలే! ఉఇదం ణో పజ్జువాసణం అదిహీణం, ఏత్థ ఉవవిశంహ. (హలా! శకుంతలే! ఉచితో నః పర్యుపాసనమతిథీనామ్. అత్రోపవిశామః).**

**(సర్వే ఉపవిశంతి)**

**శకుం : (ఆత్మగతమ్) కిం ణు ఖు ఇమం పేక్ఖిఅ తవోవణవిరోహిణో విఆరస్స గమణీఅంహి సంవుత్తా? (కిం ను ఖల్విమం ప్రేక్ష్య తపోవన విరోధినో వికారస్య గమనీయాస్మి సంవృత్తా?)**

---

**తేణహి:** తేన–హి = అయితే, అస్యామ్ = ఈ, ప్రచ్ఛాయశీతలాయామ్ = దట్టమైన నీడతో చల్లగా ఉన్న, సప్తపర్ణవేదికాయామ్ = ఏడాకుల అరటిచెట్టు అరుగుమీద, ముహూర్తమ్ = కాసేపు, ఉపవిశ్య = కూర్చొని, ఆర్యః = సజ్జనుడు (నువ్వు), పరిశ్రమ–వినోదమ్ = అలసట తొలగించుకోవడం, కరోతు = చేయునుగాక. అలసట తీర్చుకోమనడం.

**నూనమ్:** యూయమ్+అపి = మీరుకూడా, అనేన–కర్మణా = మొక్కలకు నీళ్లుపోసే ఈ పనితో, నూనమ్ = కచ్చితంగా, పరిశ్రాంతాః = అలిసిపోయారు.

**ఉఇదం:** ఓయీ! శకుంతలా! అతిథీనామ్ = అతిథులను, పరి+ఉపాసనమ్ = అర్చించడం, నః = మనకు, ఉచితః = సముచితం. అత్ర = ఇక్కడ, ఉపవిశామః = కూర్చుందాం.

(సర్వే = అందరూ, ఉపవిశంతి = కూర్చుంటారు).

**కిం ణు ఖు:** (ఆత్మగతమ్ = తనలో) కిమ్+ను+ఖలు = ఇదేమిటబ్బా! ఇమమ్ = ఈతడిని, ప్రేక్ష్య = చూసి, తపోవనవిరోధినః = తపోవనానికి తగనిదైన, వికారస్య = మనోవికారానికి, గమనీయా+సంవృత్తా+అస్మి = లక్ష్యభూతురాలినయ్యాను? తపోవననియమాలకు విరుద్ధమైన మనోవికారం పొందాను, ఇదేమిటబ్బా!? – అనడం.

**రాజా : (సర్వా విలోక్య) అహో! సమానవయోరూపలావణ్యం భవతీనాం సౌహార్దమ్.**

**ప్రియం : (జనాంతికమ్) అణసూఏ! కోణు ఖు ఏసో మహుర గంభీరాకిదీ చఉరం పిఅం ఆలవంతో పహావవందో విఅ లక్ఖీఅది? (అనసూయే! కోను ఖల్వేష మధురగంభీరాకృతి శ్చతురం ప్రియమాలపన్ ప్రభావవానివ లక్ష్యతే?)**

**అన : సహి! మమ వి అత్థి కౌదూహలం. పుచ్ఛిస్సం దావణం. (ప్రకాశమ్) అజ్జస్స మహురాలావజణిదో వీసంభో మం మాంతావేది -కదమో అజ్జేణ రాఏసిణో వంసో అలంకీ అది? కదమో వా విరహపజ్జుస్సు అజణో కిదో దేసో? కిం ణిమిత్తం వా సఉమారదరో వి తపోవణ గమణపరిస్సమస్స అత్తా పదం ఉవణీదో? (సఖి! మమాప్యస్తి కౌతూహలమ్. పృచ్ఛామి తావ దేనమ్. (ప్రకాశమ్) ఆర్యస్య మధురాలాపజనితో విస్రంభో మాం మంత్రాపయతే - కతమ ఆర్యేణ రాజర్షేర్వంశోఽలంక్రియతే? కతమో వా విరహపర్యుత్సుకజనః కృతో దేశః? కిం నిమిత్తం వా సుకుమారతరోఽపి తపోవనగమన పరిశ్రమస్య ఆత్మాపదముపనీతః?)**

---

**అహో సమాన:** (సర్వాః = అందరినీ, విలోక్య = చూసి) అహో = ఎంత ఆశ్చర్యం! భవతీనామ్ = మీ, సౌహార్దమ్ = ఈ చెలికారం, సమాన-వయోరూపలావణ్యమ్ = మీ వయస్సుకూ రూపసౌందర్యానికీ సరితూగుతోంది!!

**కోణు ఖు:** (జనాంతికమ్ = జనాంతికంగా) మధురగంభీర + ఆకృతిః = సుందరమూ గంభీరమూ అయిన రూపం కలవాడూ, చతురమ్ = నిపుణంగానూ, ప్రియమ్ = హితంగానూ, ఆలపన్ = మాట్లాడుతున్నవాడై, ప్రభావవాన్ + ఇవ = సమర్థుడిలా, (ప్రభురివ అని పాఠాంతరం) లక్ష్యతే = కనిపిస్తున్నాడు, ఏషః = ఇతడు, కః+ను+ఖలు = ఎవరోకదా!

**మమ వి:** సఖి = నెచ్చెలీ! మమ+అపి = నాకూ, కౌతూహలమ్ = ఇదే కుతూహలం, అస్తి = మనసులో ఉంది. ఏనమ్ = ఇతడినే, పృచ్ఛామి-తావత్ = అడిగేస్తాను!! (ప్రకాశమ్ = ప్రకాశంగా) ఆర్యస్య = ఆర్యుడివైన నీ, మధుర + ఆలాప = మధుర సంభాషణవల్ల, జనితః = కల్గిన, విస్రంభః = చనవు (విశ్వాసః-అని పాఠాంతరం), మామ్ = నన్ను,

**శకుం : (ఆత్మగతమ్) హిఅఅ! మా ఉత్తమ్మ. ఏసా తుఏ చింతిదాఇం అణసూఆ మంతేది (హృదయ! మా ఉత్తామ్య. ఏషా త్వయా చింతితాని అనసూయా మంత్రయతే).**

**రాజా : (ఆత్మగతమ్) కథమిదానీమాత్మానం నివేదయామి? కథం వా ఆత్మాపహారం కరోమి? భవతు, ఏవం తా వదేనాం వక్ష్యే. (ప్రకాశమ్) భవతి! యః పౌరవేణ రాజ్ఞా ధర్మాధికారే నియుక్తః సోఽహమ్ అవిఘ్నక్రియోపలంభాయ పుణ్యాశ్రమదర్శన ప్రసంగేణ ధర్మారణ్య మిదమాయాతః.**

---

మంత్రాపయతే = మాట్లాడిస్తోంది. కతమః = ఏ, రాజర్షేః + వంశః = రాజర్షివంశం, ఆర్యేణ = తమచేత, అలంక్రియతే = అలంకరింపబడుతోంది? నీది ఏ వంశం? అనడం. కతమః = ఏ, దేశః = దేశం, ఆర్యేణ = తమచేత, విరహపర్యుత్సుక జనః = వియోగ బాధను అనుభవిస్తున్న ప్రజలు కలదిగా, కృతః = చెయ్యబడింది? నువ్వు ఇటు రావడంవల్ల ప్రజలు విరహం అనుభవిస్తున్న దేశం ఏది? అనడం. సుకుమారతరః+అపి = అత్యంత సుకుమారమైనప్పటికీ, ఆత్మా = ఆత్మ (నిన్ను నీవు), తపోవనగమన పరిశ్రమస్య = ఈ తపోవనానికి రావడం అనే శ్రమకు, పదమ్ (పాత్రమ్) ఉపనీతః = తావలం చెయ్యబడింది, కిమ్-నిమిత్తం నామ = ఎందుకోసమని? ఇంత శ్రమించి ఇక్కడికి రావడంలోని ఆంతర్యం కారణం ఏమిటని అడగడం.

**హిఅఅ:** (ఆత్మగతమ్ = తనలో) హృదయ = మనసా! మా+ఉత్తామ్య=ఉత్కంఠపడకు. త్వయా-చింతితాని = నువ్వు అనుకొన్నవే, ఏషా+అనసూయా = ఈ అనసూయ, మంత్రయతే = అడుగుతోంది.

**కథమ్:** (ఆత్మగతమ్ = తనలో) ఇదానీమ్ = ఇప్పుడు, ఆత్మానమ్ = నన్ను నేను, కథమ్ = ఎలా, నివేదయామి = నివేదించుకోను? కథమ్+వా = ఎలా, ఆత్మ+అపహారమ్ = ఆత్మగోపనం, కరోమి = చేసుకోను? భవతు = కానిమ్ము. ఏవమ్ + తావత్ = ఇలా, ఏనామ్ + వక్ష్యే = ఈమెకు చెబుతాను. (ప్రకాశమ్ = ప్రకాశంగా) భవతి = మాన్యురాలా! పౌరవేణ = పురువంశీయుడైన, రాజ్ఞా = మహారాజుచేత, యః = ఎవడు, ధర్మాధికారే = ధర్మాధికారి పదవియందు, నియుక్తః = నియమింపబడ్డాడో, సః+అహమ్ = ఆ నేను, అవిఘ్న-క్రియా+ఉపలంభాయ = నిర్విఘ్నంగా యాగాదిక్రియలు జరుగుతున్నాయా

**అన : సణాహా దాణిం ధమ్మఆరిణో. (సనాథా ఇదానీం ధర్మచారిణః).**

**(శకుంతలా శృంగారలజ్జాం రూపయతి).**

**సఖ్యౌ : (ఉభయోరాకారం విదిత్వా జనాంతికమ్) హలా! సఉందలే! జఇ ఏత్థ అజ్జ తాదో సంణిహిదో భవే... (హలా! శకుంతలే! యది అత్ర అద్య తాతః సన్నిహితో భవేత్...**

**శకుం : (సరోషమివ) తదో కిం భవే? (తతః కిం భవేత్?)**

**సఖ్యౌ : ఇమం జీవిదసవ్వస్సేణ వి అదిహివిసేసం కిదత్థం కరిస్సది. (ఇమం జీవితసర్వస్వేనాపి అతిథివిశేషం కృతార్థం కరిష్యతి)**

---

తెలుసుకోవడం కోసం, పుణ్య+ఆశ్రమ దర్శన-ప్రసంగేణ = పుణ్యప్రదాలైన ఆశ్రమాలను చూడాలనే ఆసక్తితో, ఇదమ్ = ఈ, ధర్మారణ్యమ్ + ఆయాతః = ధర్మారణ్యానికి వచ్చాను.

**సణాహా:** ధర్మచారిణః = తపోధర్మం స్వీకరించినవారందరూ (తపస్వులంతా), ఇదానీమ్ = ఇప్పుడు, సనాథాః = తమ కొక రక్షకుడు కలవారయ్యారు - సనాథులయ్యారు.

(శకుంతలా = శకుంతల, శృంగారలజ్జామ్ = శృంగారలజ్జను, రూపయతి = అభినయంతో చూపుతుంది)

**జఇ ఏత్థ:**(ఉభయోః = శకుంతలా దుష్యంతుల, ఆకారం = రూపాలను, విదిత్వా = గమనించి, జనాంతికమ్ = జనాంతికంగా - అంటే దుష్యంతుడికి వినపడకుండా). హలా = చెలీ! శకుంతలే = శకుంతలా! అద్య = ఇప్పుడు, అత్ర = ఇక్కడ, తాతః = తండ్రి కణ్వుడు, యది-సన్నిహితః-భవేత్ = సన్నిహితుడై ఉండెనా...

**తదోకిం:** (సరోషమ్ + ఇవ = ఉక్రోషంతోలాగా) తతః = అప్పుడు, కిమ్ + భవేత్ = ఏమయ్యేది?

**ఇమం జీవిద:** జీవిత సర్వస్వేన+అపి = జీవితసర్వస్వమైనా సమర్పించి, ఇమమ్ = ఈ, అతిథివిశేషమ్ = విశిష్టాతిథిని, కృతార్థమ్ + కరిష్యతి = కృతార్థుణ్ని చేసేవాడు!

**శకుం : (సకృతక కోపమ్) తుంహే అవేధ. కిం వి హిఅఏ కరిఅ మంతేధ. ణ వో వఅనం సుణిస్సం.**

**(యువామపేతమ్. కిమపి హృదయే కృత్వా మంత్రయేథే. న వో వచనం శ్రోష్యామి).**

**రాజా : వయమపి తావత్ భవత్యోః సఖీగతం కిమపి పృచ్ఛామః?**

**సఖ్యౌ : అజ్జ! అణుగ్గహో విఅ ఇఅం అబ్భత్థణా (ఆర్య! అనుగ్రహ ఇవ ఇయమభ్యర్థనా)**

**రాజా : భగవాన్ కాశ్యపః శాశ్వతే బ్రహ్మణి స్థిత ఇతి ప్రకాశః. ఇయం వస్సఖీ తదాత్మజేతి కథమేతత్?**

**అన : సుణాదు అజ్జో. అత్థి కోవి కోసిఓత్తి గోత్తణామహేహో మహాప్పహావో రాఏసీ. (శృణోత్వార్యః. అస్తి కోఽపి కౌశిక ఇతి గోత్రనామధేయో మహాప్రభావో రాజర్షిః).**

---

**తుంహే:** (సకృతకకోపమ్ = దొంగ కోపంతో) యువామ్+అపేతమ్ = మీరు పొండి!! కిమపి = ఏదో, హృదయే-కృత్వా = మనసులో పెట్టుకొని, మంత్రయేథే = మాట్లాడుతున్నారు. వః+వచనమ్ = మీరనేది, న-శ్రోష్యామి = నేను వినను!

**వయమపి:** వయమ్+అపి-తావత్ = మేముకూడా, భవత్యోః = మీ, సఖీగతమ్ = స్నేహితురాలి గురించి, కిమ్+అపి+పృచ్ఛామః = ఏమైనా అడగమా!

**అణుగ్గహో:** ఆర్య = ఆర్యుడా! అనుగ్రహః+ఇవ = నిజంగా అనుగ్రహం వంటిది, ఇయమ్+అభ్యర్థనా = నీ ఈ అభ్యర్థన.

**భగవాన్:** భగవాన్ - కాశ్యపః = మహానుభావుడు కణ్వుడు, శాశ్వతే - బ్రహ్మణి-స్థితః+ఇతి = నిత్య బ్రహ్మచారి అని, ప్రకాశః = అతిప్రసిద్ధి. ఇయమ్ = ఈ, వః+సఖీ = మీ స్నేహితురాలు, తత్ + ఆత్మజా+ఇతి = ఆయన కూతురు అనడం, ఏతత్ = ఇది, కథమ్ = ఎలా? (ప్రకాశోఽతిప్రసిద్ధే స్యాత్ - ఇత్యమరః).

**సుణాదు:** ఆర్యః = మాన్యుడు, శృణోతు = ఆలకించుగాక! కౌశికః + ఇతి = కౌశికుడు అని, గోత్రనామధేయః = తండ్రివల్ల వచ్చిన పేరుగలవాడూ, మహాప్రభావః = గొప్ప ప్రభావశాలి, కః+అపి రాజర్షిః = ఒకానొక రాజర్షి, అస్తి = ఉన్నాడు.

**రాజా : అస్తి, శ్రూయతే.**

**అన : తంణో పిఅసహీఏ పహవం అవగచ్ఛ. ఉజ్ఝిఆఏ సరీర సంవడ్ఢణాదీహిం తాదకస్సవో సే పిదా. (తమావయోః ప్రియసఖ్యాః ప్రభవమవగచ్ఛ. ఉజ్ఝితాయాః శరీర సంవర్ధనాదిభిస్తాతకాశ్యపోఽస్యాః పితా).**

**రాజా : ఉజ్ఝి తశబ్దేన జనితం మే కౌతూహలమ్. ఆమూలాత్ శ్రోతు మిచ్ఛామి.**

**అన : సుణాదు అజ్జో. గోదమీతీరే పురా కిల తస్స రాఏసిణో ఉగ్గే తబసి వట్టమాణస్స కింవి జాద సంకేహిం దేవేహిం మేణఆ ణామ అచ్ఛరా పేసిదా ణిఅమవిగ్ఘకాలిణీ.**

**(శృణోత్వార్యః. గౌతమీతీరే పురా కిల తస్య రాజర్షేః ఉగ్రే తపసి వర్తమానస్య కిమపి జాతశంకైః దేవైః మేనకా నామాప్సరాః ప్రేషితా నియమవిఘ్నకారిణీ).**

---

**అస్తి:** అస్తి = ఉన్నాడు. శ్రూయతే = విన్నాను.

**తంణోపి:** తమ్ = ఆతనిని, ఆవయోః = మా, ప్రియసఖ్యాః = నెచ్చెలికి, ప్రభవమ్ = జన్మస్థానంగా (జనకునిగా), అవగచ్ఛ = తెలుసుకో. ఉజ్ఝితాయాః = పుట్టిన వెంటనే విడిచిపెట్టబడినదైన, అస్యాః = ఈమెకు, శరీరసంవర్ధనాదిభిః = శరీర పోషణ పాలనాదులతో, తాతకాశ్యపః = తాతపాదుడైన కణ్వుడు, పితా = తండ్రి. (పాతి = రక్షతి – పోషయతి ఇతి పితా).

**ఉజ్ఝిత:** ఉజ్ఝిత శబ్దేన = విడిచిపెట్టబడింది అనే పదంతో, మే = నాకు, కౌతూహలమ్ = ఉత్సుకత, జనితమ్ = కలిగింది; ఆమూలాత్ = సమగ్రంగా, శ్రోతుమ్ + ఇచ్ఛామి = వినగోరుతున్నాను.

**గోదమీ:** ఆర్యః = మాన్యుడు, శృణోతు = వినుగాక! పురా–కిల = ఒకప్పుడు, గౌతమీతీరే = గౌతమీనది ఒడ్డున, ఉగ్రే–తపసి = తీవ్రతపస్సులో, వర్తమానస్య = మునిగి ఉన్న, తస్య–రాజర్షేః = ఆ రాజర్షి కౌశికుడి చెంతకు, కిమపి = ఏదో, జాతశంకైః = శంకించినవారైన, దేవైః = దేవతలచేత, మేనకా–నామ+అప్సరాః = మేనక అనే అప్సరస, నియమ విఘ్నకారిణీ = తపోనియమాలను భంగపరిచే అప్సరస, ప్రేషితా = పంపబడింది.

**రాజా : అస్త్యేతదన్యసమాధిభీరుత్వం దేవానామ్.**

**అన : తదో వసంతోదార రమణీఏ సమఏ సే ఉమ్మాదఇత్తఇం రూవం పేక్ఖిఅ – (తతో వసంతోదార రమణీయే సమయే తస్యా ఉన్మాదయితృకం రూపం ప్రేక్ష్య–) (అర్ధోక్తే లజ్జయా విరమతి)**

**రాజా : పరస్తావత్ జ్ఞాయత ఏవ. సర్వథా అప్సరస్సంభవైషా!?**

**అన : అహ ఇం. (అథకిమ్).**

**రాజా : ఉపపద్యతే –**

**మానుషీషు కథం వా స్యాదస్య రూపస్య సంభవః**
**న ప్రభాతరళం జ్యోతి రుదేతి వసుధాతలాత్. 22**

**(శకుంతలా అథోముఖీ తిష్ఠతి)**

---

**అస్తి:** దేవానామ్ = దేవతలకు, ఏతత్ = ఈ రకం, అన్య సమాధి భీరుత్వమ్ = ఇతరుల తపోనిష్ఠకు భయపడటం, అస్తి = ఉన్నదేలే!

**తదో:** తతః = అటుపైని, వసంత+ఉదార–రమణీయే = వసంత ఋతువులో అత్యంత రమణీయమైన, సమయే = సమయంలో, తస్యాః = మేనక (యొక్క), ఉన్మాదయితృకమ్ = మత్తెక్కించే, రూపమ్ = రూపాన్ని, ప్రేక్ష్య = తిలకించి – (ఇతి = అని, అర్ధోక్తే = సగంమాటలో, లజ్జయా = సిగ్గుతో, విరమతి = ఆపేస్తుంది).

**పరస్తావత్:** పరః+తావత్ = అటుపైది, జ్ఞాయతే + ఏవ = తెలుస్తూనే ఉంది. సర్వథా = ముమ్మాటికీ, ఏషా = ఈమె, అప్సరస్ + సంభవా = అప్సరసకు పుట్టిందన్నమాట!?

**అహఇం:**అథకిమ్ = అవును. (అంగీకృతౌ స్యాదథకిమ్ – అమరః).

**మానుషీషు:** ఉపపద్యతే = లెస్స! లెస్స!! అస్య = ఈ, రూపస్య = సుందర రూపానికి, సంభవః = పుట్టుక, మానుషీషు = మానవాంగనలందు, కథమ్ + వా – స్యాత్ = ఎలా సంభవం? ప్రభా–తరళమ్ = కాంతితో నిగనిగలాడే, జ్యోతిః = మెరుపు, వసుధాతలాత్ = భూమినుంచి, న+ఉదేతి = పుట్టదుగదా!

**తాత్పర్యం:** ఇంతటి సుందరరూపం పుట్టుక మానవకాంతలలో సంభవమా!? కాంతులతో నిగనిగలాడే మెరుపుతీగ నేలనుంచి పుట్టదు గదా!

(శకుంతలా = శకుంతల, అథోముఖీ = ముఖం వంచి, తిష్ఠతి = నిల్చుంటుంది).

**రాజా : (ఆత్మగతమ్). లబ్ధావకాశో మే మనోరథః. కింతు సఖ్యాః పరిహాసోదాహృతాం వరప్రార్థనాం శ్రుత్వా ద్వైధీభావకాతరం మే మనః.**

**ప్రియం : (సస్మితం శకుంతలాం విలోక్య నాయకాభిముఖీభూత్వా) పుణో వి వత్తుకామో విఅ అజ్జో. (పునరపి వక్తుకామ ఇవార్యః).**

**(శకుంతలా సఖీమంగుళ్యా తర్జయతి)**

**రాజా : సమ్యగుపలక్షితం భవత్యా. అస్తి నః సచ్చరిత శ్రవణ లోభా దన్యదపి ప్రష్టవ్యమ్.**

**ప్రియం : అలం విఆరిఅ. అణిఅంతణాణుఓఓ తవస్సిఅణో నామ. (అలం విచార్య. అనియంత్రణానుయోగస్తపస్విజనో నామ)**

---

**లబ్ధావ:** (ఆత్మగతమ్ = తనలో) మే = నా, మనోరథః = కోరిక, లబ్ధ+అవకాశః = తీరే అవకాశం కలదే! కింతు = కానీ ఇందాక, సఖ్యాః = ప్రియంవదయొక్క, పరిహాస+ఉదా హృతామ్ = పరిహాసంగా పలకబడిన, వర ప్రార్థనామ్ = ఆత్మనోఽనురూపం వరం లభేయమితి అనే వరప్రార్థనను, శ్రుత్వా = విని, మే-మనః = నా మనస్సు, ద్వైధీభావకాతరమ్ = అదా? ఇదా? అనే గుంజాటనతో కంగారు పడుతోంది. (అనురూపవరుడంటే ఎవడు? ఈమె తపోవృత్తికి తగ్గవాడనా? రూప లావణ్యాదులకు తగ్గవాడనా? – ఇదీ గుంజాటన).

**పుణోవి:** (సస్మితమ్ = చిరునవ్వుతో, శకుంతలామ్ + విలోక్య = శకుంతలను చూసి, నాయక+అభిముఖీభూత్వా = దుష్యంతుడి వైపు తిరిగి) ఆర్యః = మాన్యుడు, పునః + అపి = మళ్ళీ ఏదో, వక్తుకామః ఇవ = అడగ గోరినవాడిలా కన్పిస్తున్నాడు!?

(శకుంతలా = శకుంతల, సఖీం = చెలికత్తెను, అంగుళ్యా = వేలితో, తర్జయతి = భయపెడుతుంది)

**సమ్యక్:** భవత్యా = మాన్యురాలిచేత, సమ్యక్ + ఉపలక్షితమ్ = బాగుగా గుర్తింపబడినది. సరిగ్గా గుర్తించావనడం. సచ్చరిత = మంచి గాథను, శ్రవణ = వినడంలోని, లోభాత్ = లోభంవల్ల, నః = మాకు, అన్యత్ + అపి-ప్రష్టవ్యమ్ = అడగదగినది మరొకటి సైతం, అస్తి = ఉంది. [అడగమంటే అడుగుతానని].

**అలం విఆరిఅ:** విచార్య+అలమ్ = ఆలోచించి-చాలు. సందేహించడం ముగించి అడగదలిచినది అడుగు-అనడం. తపస్విజనః+నామ = మావంటి తపస్వి జనమంటే,

**రాజా : ఏతత్ పృచ్ఛామి –**

**వైఖానసం కిమనయా వ్రతమాప్రదానాత్**
**వ్యాపారరోధి మదనస్య నిషేవితవ్యమ్**
**అత్యంతమేవ మదిరేక్షణవల్లభాఽఽభి**
**రాహో నివత్స్యతి సమం హరిణాంగనాభిః 23**

**ప్రియం : అజ్జ! ధమ్మచరణే వి పరవసో అఅం జణో. గురుణో ఉణ సే అణురూవ వరప్పదాణే సంకప్పో. (ఆర్య! ధర్మాచరణేఽపి పరవశోఽయం జనః. గురోః పునరస్యా అనురూపవరప్రదానే సంకల్పః).**

---

అనియంత్రణ+అనుయోగః = అపరిమితంగా ప్రశ్నలు అడగదగ్గది సుమా! ఏ నియంత్రణా లేకుండా ప్రశ్నలు అడగనూ వచ్చు మానుంచి మీ సందేహాలు తీర్చుకోనూ వచ్చునని.

**వైఖానసమ్:** ఏతత్+పృచ్ఛామి = అయితే ఇదిగో అడుగుతున్నాను. మదనస్య–వ్యాపారరోధి = మన్మథభావాదులకు అడ్డుకట్ట వంటిదైన, వైఖానసమ్+ వ్రతమ్ = (ఈమె అవలంబించిన ఇప్పటి) ఈ వైఖానసదీక్ష, ఆప్రదానాత్ = ఒక అయ్య చేతిలో పెట్టేంతవరకే (కన్యాదాన పర్యంతమే), అనయా = ఈమెచేత, నిషేవితవ్యమ్–కిమ్ = అనుష్ఠింపబడవలసినదా? ఆహో = లేక, మదిర+ఈక్షణవల్లభా = కాటుకపిట్టల వంటి కన్నులతో స్పృహణీయురాలైన ఈమె, ఆభిః = ఇవిగో ఈ, హరిణాంగనాభిః = ఆడులేడులతో, సమమ్ = సమానంగా, అత్యంతమ్ + ఏవ = జీవితాంతమూ, నివత్స్యతి (కిమ్) = (ఇలా తపోవనాలలో) నివసిస్తుందా?

**తాత్పర్యం:** మన్మథ భావాలకు చుక్కెదురు ఈ వైఖానసతపోదీక్ష. మరి ఈ వ్రతాన్ని ఈవిడ ఇలా చేపట్టడం – అనుష్ఠించడం – పెళ్ళి అయ్యేంతవరకేనా? లేక (మీలాగా) జీవితాంతమూనా? ఈమె ఇక శాశ్వతంగా ఇలాంటి తపోవనాలలో ఇలాంటి హరిణాంగనలతో జీవితం ఇలాగే గడిపేస్తుందా? (సదృశేక్షణవల్లభా – పాఠాంతరం. మదిరః = ఖంజనః).

**ధమ్మచరణే:** ఆర్య = మాన్యుడా! ధర్మ+ఆచరణే+అపి = (సన్యాసధర్మమా? సంసారధర్మమా?) ఏ ధర్మాన్ని ఆచరించాలనే విషయంలో సైతం, అయమ్+జనః = ఈ ప్రజ (మేమంతా), పరవశః = గురువుగారి అధీనమే (అస్వతంత్రులం అనడం). గురోః + పునః = గురువు కణ్వుడికిమాత్రం, అస్యాః = ఈమెకు సంబంధించి, అనురూప

**రాజా : (ఆత్మగతమ్) న దురవాపా ఇయం ఖలు ప్రార్థనా**

**భవ హృదయ! సాభిలాషం సంప్రతి సందేహనిర్ణయో జాతః**
**ఆశంకసే యదగ్నిం తదిదం స్పర్శక్షమం రత్నమ్. 24**

**శకుం : (సరోషమ్) అణసూఏ! గమిస్సం అహం. (అనసూయే గమిష్యా మ్యహమ్)**

**అన : కిం ణిమిత్తం? (కిం నిమిత్తమ్?)**

**శకుం : ఇమం అసంబద్ధప్పలావిణిం పిఅంవదం అజ్జాఏ గోదమీఏ ణివేదఇస్సం. (ఇమామసంబద్ధ ప్రలాపినీం ప్రియంవదామార్యాయై గౌతమ్యై నివేదయిష్యామి)**

---

వరప్రదానే = అనురూప వరుడికి ప్రదానం చెయ్యాలనే విషయంలో, సంకల్పః = దృఢ నిశ్చయం.

**న దురవాపా:** (ఆత్మగతమ్ = తనలో) ఇయమ్ = అనురూప వరుడికి ఇవ్వాలి అనే ఈ, ప్రార్థనా = ఇచ్ఛ, న–దురవాపా = నెరవేర జాలనిది కాదు. నెరవేరగలదే అని.

**భవ హృదయ:** హృదయ = మనసా! సాభిలాషమ్ – భవ = అభిలాష కలదానివే కమ్ము. ఆశ వదులుకోవద్దు అని. సంప్రతి = ఇప్పుడు, సందేహనిర్ణయః–జాతః = సందేహం తీరిపోయింది. యత్ = దేనిని, అగ్నిమ్ = అగ్నినిగా, ఆశంకసే = ఆశంకిస్తున్నావో, తత్ + ఇదమ్ = ఆ యిది, స్పర్శక్షమమ్ = పట్టుకోదగ్గ, రత్నమ్ = రత్నం.

**తాత్పర్యం:** ఓ మనసా! ఆశ వదులుకోకు. (జాతి–ధర్మ–అనురూపాలకు సంబంధించిన) సందేహాలన్నీ ఇప్పుడు తీరాయి కదా! దేనిని అగ్ని కాబోలు అనుకుంటున్నావో అది – స్పృశించదగిన రత్నం!! (అగ్ని–ఆర్ష సంకేతం. రత్నం – క్షాత్రసంకేతం. రత్నగ్రాహీతు పార్థివః – అందుకని ఆశ).

**గమిస్సం:** (సరోషమ్ = రోషంతో) అనసూయే = అనసూయా! అహమ్ = నేను, గమిష్యామి = వెడుతున్నాను.

**కింణిమిత్తం:** కిమ్–నిమిత్తమ్ = ఎందు నిమిత్తం?

**ఇమం:** అసంబద్ధప్రలాపినీమ్ = అసంబద్ధంగా వాగుతున్న, ఇమామ్–ప్రియంవదామ్ = ఈ ప్రియంవద గురించి, ఆర్యాయై = ఆర్యురాలైన, గౌతమ్యై = గౌతమికి, నివేదయిష్యామి = విన్నవిస్తాను.

**అన : సహి! ణ జుత్తం తే అకిదసక్కారం అదిహి విసేసం విసజ్జిఅ సచ్ఛందదో గమణం. (సఖి! న యుక్తం తే అకృతసత్కార మతిథివిశేషం విసృజ్య స్వచ్ఛందతో గమనమ్)**

**(శకుంతలా న కించిదుక్త్వా ప్రస్థితైవ)**

**రాజా : (ఆత్మగతమ్) కథం గచ్ఛతి! (గ్రహీతుమిచ్ఛన్ నిగృహ్యాత్మానమ్) అహో! చేష్టాప్రతిరూపికా కామిజనమనోవృత్తిః. అహం హి–**

**అనుయాస్యన్ మునితనయాం సహసా వినయేన వారితప్రసరః**
**స్థానాదనుచ్చలన్నపి గత్వేవ పునః ప్రతినివృత్తః. 25**

---

**ణ జుత్తం:** సఖి = చెలీ! అతిథి విశేషమ్ = విశిష్టాతిథిని, అకృత సత్కారం = సత్కరించకుండా (చేయబడని సత్కారం కలవాడిగా), విసృజ్య = విడిచి, తే = నీకు, స్వచ్ఛందతః – గమనమ్ = ఇష్టం వచ్చినట్టు వెళ్ళిపోవడం, న–యుక్తమ్ = తగదు సుమా!

(శకుంతలా = శకుంతల, న–కించిత్ + ఉక్త్వా = మరింక ఏమీ పలకకుండానే, ప్రస్థితా + ఏవ = బయలుదేరుతుంది).

**కథమ్:** (ఆత్మగతమ్ = తనలో) కథమ్ = ఎట్టా!! గచ్ఛతి = వెళ్ళిపోతోందే!? (గ్రహీతుమ్ = పట్టుకోడానికి, ఇచ్ఛన్ = అభిలషిస్తున్నవాడై, ఆత్మానమ్ = మనస్సును, నిగృహ్య = అదుపు చేసుకుని).

**అహో:** అహో = ఓహో! కామిజన = కాముకుల, మనోవృత్తిః = మనః ప్రవృత్తి, చేష్టా–ప్రతిరూపికా = చేష్టల ప్రతిబింబమే (చేష్టలతో మనస్సు తెలుస్తుందని). అహమ్+హి = నేను–

**అనుయాస్యన్:** మునితనయామ్ = శకుంతలను, సహసా = హఠాత్తుగా, అనుయాస్యన్ = వెంబడించబోయినవాడనై, వినయేన = మనో నిగ్రహంతో, వారిత–ప్రసరః = వారింపబడ్డ ప్రణయం (వేగం) కలవాడనై, స్థానాత్ = ఉన్నచోటునుంచి, అనుచ్చలన్ + అపి = లేచి వెళ్ళనివాడనైనా, గత్వా = వెళ్ళి, పునః = మళ్ళీ, ప్రతినివృత్తః+ఇవ = తిరిగి వచ్చినవాడిలా అయ్యాను. [ప్రసరః ప్రణయే వేగే–ఇతి విశ్వః. ఇంద్రియాణాం జయం ప్రాహ వినయం భరతో మునిః].

**ప్రియం : (శకుంతలాం నిరూప్య) హలా! ణ దే జుత్తం గంతుం (హలా! న తే యుక్తం గంతుమ్).**

**శకుం : (సభ్రూభంగమ్) కిం ణిమిత్తం? (కిం నిమిత్తమ్?)**

**ప్రియం : రుక్ఖసేఅణం దువే ధారేసి మే. ఏహి జావ; అత్తాణం మోచిఅ తదో గమిస్ససి. (వృక్షసేచనే ద్వే ధారయసి మే ఏహి తావత్, ఆత్మానం మోచయిత్వా తతో గమిష్యసి).**

**(బలాదేనాం నివర్తయతి)**

**రాజా : భద్రే! వృక్షసేచనాదేవ పరిశ్రాంతా మత్రభవతీం లక్షయే. తథాహి. అస్యాః –**

---

**తాత్పర్యం:** వెళ్ళిపోతున్న మునితనయను వెంబడించి వెళ్ళాలనిపించింది. కానీ వినయంతో నా కదలికనూ (ప్రసరం) నా ప్రణయాన్నీ నిగ్రహించుకున్నాను. ఉన్నచోటునుంచి లేచి వెళ్ళకుండానే వెళ్ళివచ్చినట్టు అనుభూతి చెందుతున్నాను.

**ణ దే జుత్తం:** హలా = సఖీ! గంతుమ్ = వెళ్ళడానికి, తే = నీకు, న–యుక్తమ్ = వల్లగాదు.

**కిం ణిమిత్తం:** (సభ్రూభంగమ్ = కనుబొమ్మలు ముడిచి) కిమ్ + నిమిత్తమ్ = ఎందుకని?

**రుక్ఖసేఅణం:** వృక్షసేచనే = మొక్కలతడుపులు, ద్వే = రెండు, మే = నాకు, ధారయసి = ఋణపడి ఉన్నావు. (నా బదులు నువ్వు రెండు మొక్కలకు నీళ్లు పోసి బాకీ తీర్చుకోవాలనడం). ఏహి–తావత్ = దయచేసి వెనక్కిరా! ఆత్మానమ్ = నిన్ను నువ్వు, మోచయిత్వా = ఋణవిముక్తను చేసుకొని, తతః = అటుపైని, గమిష్యసి = వెడుదువుగాని.

(బలాత్ = బలవంతంగా, ఏనామ్ = శకుంతలను, నివర్తయతి = వెనక్కు మళ్లిస్తుంది).

**భద్రే:** భద్రే = దయగలదానా! వృక్షసేచనాత్+ఏవ = మొక్కలకు నీళ్లు పొయ్యడంవల్లనే, పరిశ్రాంతామ్ = బాగా అలసి పోయినదానిగా, అత్రభవతీమ్ = ఈ మాన్యురాలిని, లక్షయే = గమనిస్తున్నాను. అలసట చిహ్నాలు కనిపిస్తున్నాయని. తథాహి = అవును గదా! అస్యాః = ఈమెకు –

**స్రస్తాంసావతిమాత్రలోహితతలౌ బాహూ ఘటోత్క్షేపణాత్**
**అద్యాపి స్తనవేపథుం జనయతి శ్వాసః ప్రమాణాధికః**
**స్రస్తం కర్ణ శిరీషరోధి వదనే ఘర్మాంభసాం జాలకం**
**బంధే స్రంసిని చైకహస్తయమితాః పర్యాకులా మూర్ధజాః** **26**

**తదహమేనా మనృణాం కరోమి (అంగులీయం దాతుమిచ్ఛతి)**

**(ఉభే నామ ముద్రాక్షరాణ్యను వాచ్య పరస్పరమవలోకయతః)**

---

**స్రస్తాం సౌ:** బాహూ = చేతులు రెండూ, ఘట + ఉత్క్షేపణాత్ = నీటి కుండ మొయ్యడంవల్ల, స్రస్త+అంసౌ = భుజాలు జారినవీ, అతిమాత్ర–లోహిత–తలౌ = బాగా ఎఱ్రబడ్డ అరచేతులు కలవీ అయ్యాయి. సహజంగా అవనతాలైన బుజాలు మరింత అవనతాలు అయ్యాయనీ, సహజంగానే ఎఱ్రగా ఉండే అరచేతులు కంది మరింత ఎఱ్రబడ్డాయనీ. ప్రమాణ+అధికః = (నిమిషానికి ఇన్నిసార్లు అనే) సాధారణమైన కొలమానాన్ని మించినదై, శ్వాసః = ఊర్పు, అద్య+అపి = (నీళ్లు పొయ్యడం ఆపి చాలాసేపయినా) ఇప్పటికి సైతం, స్తన–వేపథుమ్ = కుచాల కదలికను, జనయతి = కల్గిస్తోంది. వదనే = ముఖంలో, కర్ణ–శిరీష–రోధి = చెవులలో పెట్టుకొన్న శిరీషపుష్పాలను – అవి అడ్డగించడంతో – ముంచినదై, ఘర్మ+ అంభసామ్ = స్వేదజలాల, జాలకమ్ = సమూహం (బిందుశ్రేణి), స్రస్తమ్ = (చెంపలకు) జారింది. బంధే–స్రంసిని (సతి) = జుత్తుముడి వీడిపోగా, పర్యాకులాః + మూర్ధజాః = చెదిరిన శిరోజాలు, ఏకహస్త = ఒంటి చేతితో (మరో చేతిలో కుండ ఉండటం వల్ల), యమితాః = చక్కనొత్తబడ్డాయి.

**తాత్పర్యం:** నీటికుండ మొయ్యడంవల్ల ఈమె బుజాలు వంగాయి. అరచేతులు కంది ఇబ్బడిగా ఎఱ్రబడ్డాయి. ఉచ్ఛ్వాసనిశ్వాసాలు సాధారణ స్థాయిని మించాయి. అందువల్ల ఇప్పటికీ ఈమె కుచాలు కిందికీ పైకీ కదులుతున్నాయి. చెమటలు ధారలు కట్టి, చెవులలో పెట్టుకున్న శిరీషపుష్పాలు అడ్డు వస్తే వాటిని ముంచివేసి చెంపల వెంట జారుతున్నాయి. కుండ–చంకలో ఉండగా జుట్టుముడి జారిపోయింది. చెదిరిన శిరోజాలను ఒంటిచేత్తో చక్కనొత్తుకుంది.

**తదహమ్:** తత్ = ఇంతగా అలిసిపోయింది కాబట్టి, అహమ్ = నేను, ఏనామ్ = ఈమెను, అనృణామ్+కరోమి = ఋణవిముక్తురాలిని చేస్తాను. (అంగులీయకమ్ = చేతి ఉంగరం,

**రాజా : అలమన్యథా సంభావ్య. రాజ్ఞః పరిగ్రహోఽయమ్.**

**ప్రియం : ణ హి ఏదం అంగులీఅఅం అంగులీ విఓఅం అజ్జస్స అరుహది. తుహ వఅణేణేవ్వ అణిణా ణామ ఏసా (కించిద్విహస్య) సహి! సఉందలే! మోఇదాసి అణూ అప్పిణా అజ్జేణ అహవా మహారాఏణ. గచ్ఛ దాణిం. (నహ్యేతదంగులీయకమ్ అంగులీవియోగమార్యస్యార్హతి. తవ వచనేనైవానృణా నామైషా. సఖి! శకుంతలే! మోచితాస్యను కంపినార్యేణ– అథవా మహారాజేన. గచ్ఛేదానీమ్).**

**శకుం: (ఆత్మగతమ్) జఇ అత్తణో పహవిస్సం. (ప్రకాశమ్) కా తుమం విసజ్జిదవ్వస్స వా రుధిదవ్వస్స వా? (యద్యాత్మనః ప్రభవిష్యామి? కా త్వం విసర్జితవ్యస్య వారోద్ధవ్యస్య వా?)**

---

దాతుమ్+ఇచ్ఛతి = ఇయ్యబోతాడు). (ఉభే = అనసూయాప్రియంవదలిద్దరూ, నామ–ముద్రాక్షరాణి = దుష్యంతుడనే పేరుగా చెక్కబడిన అక్షరాలను, అనువాచ్య = చదివి, పరస్పరమ్ = ఒకరి ముఖం ఒకరు, అవలోకయతః = చూసుకుంటారు).

**అలమన్యథా:** అన్యథా = మరోలా, సంభావ్య = నన్ను భావించి, అలమ్ = ఇకచాలు. పేరు చదివి నన్ను మహారాజు అనుకోకండి – అని. అయమ్ = ఇతడు (నేను), రాజ్ఞః = రాజుగారి, పరిగ్రహః = పరిజనుడు. (పరిగ్రహః పరిజనే పత్న్యాం స్వీకారమూలయోః – ఇతి విశ్వః).

**ణ హి:** ఆర్యస్య = మాన్యుడవైన నీ, ఏతత్ + అంగులీయకమ్ = ఈ ఉంగరం, అంగులీవియోగమ్ = నీ చేతి వేలి ఎడబాటుకు, న+అర్హతి = తగదు. తీసుకో నీ వేలికే ఉంచుకో అనడం. తవ = నీ, వచనేన+ఏవ = మాట మాత్రంతోనే, ఏషా = ఈ శకుంతల, అనృణా+నామ = ఋణవిమోచితురాలు అయినట్టే! సఖి = చెలీ, శకుంతలే = ఓ శకుంతలా! అనుకంపినా = దయగలవాడైన, ఆర్యేణ = ఈ మాన్యుడిచేత, అథవా = అదేలే! మహారాజేన = మహారాజుచేత, మోచితా + అసి = ఋణం నుంచి విడిపింపబడిన దానవయ్యావు. ఇదానీమ్ = ఇక ఇప్పుడు, గచ్ఛ = వెళ్లు!

**జఇ అత్తణో:** (ఆత్మగతమ్ = తనలో) ఆత్మనః = నాకు నేను, యది – ప్రభవిష్యామి = చాలినదాననైతే కదా! (ప్రకాశమ్ = ప్రకాశంగా) విసర్జితవ్యస్య–వా = నన్ను విడిచిపెట్టడానికిగానీ, రోద్ధవ్యస్య–వా = నిలువరించడానికిగానీ, కా–త్వమ్ = నువ్వెవతెవు?

**రాజా : (శకుంతలాం విలోక్య ఆత్మగతమ్) కిం ను ఖలు యథా వయమ్ అస్యామ్, ఏవమియమపి అస్మాన్‌ప్రతి స్యాత్? అథవా లబ్ధావకాశా మే ప్రార్థనా. కుతః–**

**వాచం న మిశ్రయతి యద్యపి మద్వచోభిః**
**కర్ణం దదాత్యవహితా మయి భాషమానే**
**కామం న తిష్ఠతి మదానన సమ్ముఖీయమ్**
**భూయిష్ఠ మన్యవిషయా న తు దృష్టిరస్యాః** **27**

**(నేపథ్యే)**

---

**కిం ను ఖలు:** (శకుంతలామ్ = శకుంతలను, విలోక్య = విలోకించి; ఆత్మగతమ్ = తనలో) అస్యామ్ = ఈమె విషయంలో, వయమ్ + యథా = మేమెలా (అనురక్తులం) అవుతున్నామో, ఏవమ్ = అలా, అస్మాన్–ప్రతి = మా విషయంలో, ఇయమపి = ఈమె సైతం, కిమ్+ను+ఖలు+స్యాత్ = అవుతోందా?! అథవా = అవులే! మే = నా, ప్రార్థనా = ఈ కోరిక, లబ్ధ+అవకాశా = నేరవేరిందనడానికి అవకాశమున్నట్టే కన్పిస్తోంది. కుతః = ఎందుకంటే –

**వాచమ్:** మత్+వచోభిః = నా మాటలతో, ఇయమ్ = ఈమె, వాచమ్ = తన మాటను, యద్యపి–న–మిశ్రయతి = కలపడంలేదుగానీ, మయి = నేను, భాషమానే (సతి) = మాట్లాడుతుండగా, అవహితా = సావధానురాలై, కర్ణమ్ + దదాతి = చెవి ఒగ్గుతోంది. ఇయమ్ = ఈమె, మత్+ఆనన–సమ్ముఖీ = నాకు ముఖాముఖురాలై, కామమ్ = మిక్కిలిగా (ఎక్కువ సేపు), యద్యపి–న–తిష్ఠతి = ఉండటం లేదుగానీ, అస్యాః = ఈమె, దృష్టిః – తు = చూపు మాత్రం, భూయిష్ఠమ్ = కచ్చితంగా (అధికంగా), అన్యవిషయా+న = (నామీదనే తప్ప) మరో విషయం మీద లేదు.

**తాత్పర్యం:** ఈమె నేను మాట్లాడుతూంటే చెవి ఒగ్గి వింటోంది గానీ మాటలో మాట కలపడం లేదు. నా వైపే చూస్తూ ఎక్కువ సేపు ఉండటం లేదు గానీ ఈమె దృష్టి అంతా కచ్చితంగా నామీదనే – మరోదానిమీద కాదు. ఈమె నామీద అనురాగవతి అయ్యింది అనడానికి ఈ నిదర్శనాలు చాలు కనుక మే ప్రార్థనా లబ్ధావకాశా – అని.

(నేపథ్యే= తెరలో)

**భోభోస్తపస్వినః! సన్నిహితాస్తపోవనసత్త్వరక్షాయై భవత. ప్రత్యాసన్నః కిల మృగయావిహారీ పార్థివో దుష్యంతః.**

**తురగఖురహతస్తథా హి రేణుః**
**విటప విషక్త జలార్ద్రవల్కలేషు**
**పతతి పరిణతారుణప్రకాశః**
**శలభ సమూహ ఇవాశ్రమద్రుమేషు. 28**

**అపిచ –**

**తీవ్రాఘాతా దభిముఖ తరుస్కంధ భగ్నైకదంతః**
**పాదాకృష్ట వ్రతతి వలయాసంగ సంజాతపాశః**
**మూర్తో విఘ్నస్తపస ఇవ నో భిన్నసారంగయూథో**
**ధర్మారణ్యం ప్రవిశతి గజః స్యందనాలోకభీతః 29**

---

**భోభోః:** భోభోః + తపస్వినః = ఓయోయీ! మునులారా!

తపోవన–సత్త్వ = మన ఆశ్రమంలోని ప్రాణుల, రక్షాయై = రక్షణకు, సన్నిహితాః + భవత = (సన్నద్ధులు అవ్వండి). గుమికూడండి! మృగయా–విహారీ = వేటాడేవాడై, పార్థివః = మహారాజు, దుష్యంతః = దుష్యంతుడు, ప్రత్యాసన్నః+కిల = సమీపించి ఉన్నాడు సుమా!

**తురగ:** తథాహి = అంతేకదా! తురగ = రాజుగారి గుర్రాల, ఖుర = డెక్కలతో, హతః = ఎగురగొట్టబడినదై, రేణుః = దుమ్ము, ఆశ్రమ ద్రుమేషు = తపోవనరువుల, విటప = కొమ్మలకు, విషక్త = ఆరగట్టబడిన, జలార్ద్ర – వల్కలేషు = తడి–నారచీరలమీద; పరిణత+అరుణ = వృద్ధసూర్యుడి (అస్తమించబోయే సూర్యుడు), ప్రకాశః = కాంతి కలదైన, శలభ–సమూహః = మిడతల దండులాగా, పతతి = పడుతోంది.

**తాత్పర్యం:** వేటకు వచ్చిన దుష్యంతుడి సైన్యంలోని గుర్రాల డెక్కల తాకిడికి ఎగిరిన ఎర్రటి ధూళి–సాయంకాలపు సూర్యుడి కాంతికలదై, మన ఆశ్రమంలోని చెట్ల కొమ్మలకు ఆరగట్టిన తడి–నారచీరలమీద, మిడతలగుంపులాగా వచ్చి పడుతోంది. దుష్యంతుడు సేనాసమేతుడై ధర్మారణ్యం ప్రవేశించి చేరువలోకి వచ్చాడని.

**తీవ్రాఘూతాత్:** అపిచ = ఇంకా, తీవ్ర + ఆఘూతాత్ = మహాతీవ్రంగా ఢీ కొనడంవల్ల, అభిముఖ = ఎట్టయెదుటి, తరు–స్కంధ = మ్రానుచేత, భగ్న = విరిగిన, ఏకదంతః = ఒక దంతం కలదీ; పాద+ఆకృష్ట = కాళ్లతో లాగబడిన, వ్రతతి–వలయ = తీగల

**(సర్వాః కర్ణం దత్త్వా కించిదివ సంభ్రాంతాః)**

**రాజా : (ఆత్మగతమ్) అహోధిక్! సైనికాః అస్మ దన్వేషిణస్తపోవనమ్ ఉపరుంధంతి. భవతు; ప్రతిగమిష్యామస్తావత్.**

**సఖ్యౌ : అజ్జ! ఇమిణా ఆరణ్ణఅ వుత్తాంతేణ పజ్జాఉలంహ. అణుజాణీహి ణో ఉడఅగమణస్స. (ఆర్య! అనే నారణ్యక వృత్తాంతేన పర్యాకులాః స్మ. అనుజానీహి నః ఉటజగమనాయ.)**

---

గుంపు, ఆసంగ = బాగా చుట్టుకోవడంవల్ల, సంజాత-పాశః = ఏర్పడిన కట్టుత్రాళ్లు కలదీ; నః = మన, తపసః = తపస్సుకు (ఏకాంతానికి), మూర్తః = రూపుగొన్న, విఘ్నః + ఇవ = అంతరాయం వంటిదీ; భిన్న = చెదరగొట్టబడ్డ, సారంగయూథః = లేళ్ల గుంపు కలదీ; స్యందన+ఆలోక = రాజుగారి రథాన్ని చూడటంవల్ల, భీతః = భయపడినదీ అయిన, గజః = అడవి ఏనుగు, ధర్మారణ్యమ్ =ధర్మారణ్యమనబడే మన తపోవనాన్ని, ప్రవిశతి = ప్రవేశిస్తోంది.

**తాత్పర్యం:** రాజుగారి రథాన్ని చూసి బెదిరిపోయిన ఒక అడవి యేనుగు మన ధర్మారణ్యం ప్రవేశిస్తోంది. అది – ఎట్ట యెదుటి మహావృక్షం పెనుమ్రానును ఢీకొట్టింది. ఆ దెబ్బకు దాని దంతం ఒకటి విరిగింది. అది – కాళ్లతో లాక్కున్న తీగలే దట్టంగా దిట్టంగా చుట్టుకొని దాని పాలిటి కట్టు గొలుసులయ్యాయి. అది – మన తపస్సుకు మూర్తీభవించిన విఘ్నంలాగా ఉంది. దాన్ని చూసి లేళ్లు చెల్లా చెదురైపోతున్నాయి. ఆశ్రమవాసులారా! మన పెంపుడు జంతువులను రక్షించుకోండి! అందరూ గుమికూడి కాపాడుకోండి!!

(సర్వాః = శకుంతలానసూయాప్రియంవదలందరూ, కర్ణమ్+దత్త్వా = ఆలకించి, కించిత్ + ఇవ = కొద్దిగా, సంభ్రాంతాః = కలవరపడతారు).

**అహోధిక్:** (ఆత్మగతమ్ = తనలో) అహో– ధిక్ = ఛా! ఛా! అస్మత్+అన్వేషిణః = మమ్మల్ని వెతుక్కుంటూ వచ్చిన, సైనికాః = భటులు (పౌరాః – అని పాఠాంతరం), తపోవనమ్ = ఈ ఆశ్రమాన్ని, ఉపరుంధంతి = ఆక్రమిస్తున్నారు. భవతు = కానిమ్ము. ప్రతిగమిష్యామః+తావత్ = ఎదురు వెళ్ళెదముగాక!

**ఇమిణా:** ఆర్య = మాన్యుడా! అనేన = ఈ, ఆరణ్యక-వృత్తాంతేన = అడవియేనుగుకథతో, పర్యాకులాః + స్మ = మేము బాగా కలత చెందాం. ఉటజ-గమనాయ = పర్ణశాలకు వెళ్ళడానికి, నః = మమ్మల్ని, అనుజానీహి = అనుమతించు.

**రాజా : (ససంభ్రమమ్) గచ్ఛంతు భవత్యః. వయమప్యాశ్రమపీడా యథా న భవతి తథా ప్రయతిష్యామహే.**

**(సర్వ ఉత్తిష్ఠంతి)**

**సఖ్యౌ : అజ్జ! అసంభావిద అదిహిసక్కారం భూఓ వి పేక్ఖణ ణిమిత్తం లజ్జేమో అజ్జం విణ్ణవేదుం (ఆర్య! అసంభావిత అతిథి సత్కారం భూయోఽపి ప్రేక్షణ నిమిత్తం లజ్జామహే ఆర్యం విజ్ఞాపయితుమ్).**

**రాజా : మా మైవమ్. దర్శనే నైవాత్రభవతీనాం పురస్కృతోఽస్మి.**

**శకుం : అహిణవకుససూఇ పరిక్ఖదం మే చలణం. కురవఅ సాహాపరిలగ్గం చ మే వక్కలం. తా పడివాలేధ మం జావణ మోఆవేమి. (అభినవకుశసూచి పరిక్షతౌ మే చరణౌ. కురవక శాఖాపరిలగ్నం చ మే వల్కలమ్. తత్ ప్రతిపాలయతమ్ మామ్, యావదేతత్ మోచయామి).**

---

**గచ్ఛంతు:** (ససంభ్రమమ్ = త్వరపడుతూ) గచ్ఛంతు – భవత్యః = వెళ్ళండి మీరు. వయమ్+అపి = మేమేమో, ఆశ్రమపీడా–యథా–న–భవతి–తథా = ఆశ్రమానికి వచ్చిపడ్డ ఇబ్బంది తొలగేట్టుగా, ప్రయతిష్యామహే = ప్రయత్నం చేస్తాం!

(సర్వే = అందరూ, ఉత్తిష్ఠంతి = లేస్తారు)

**అసంభావిద:** ఆర్య = మాన్యుడా! అసంభావిత + అతిథి సత్కారమ్ = చెయ్యబడని అతిథి సత్కారం కలవాడివైన (అతిథి సత్కారం చెయ్యకుండానే), ఆర్యమ్ = మాన్యుడివైన నిన్ను, భూయః+అపి = మరొక్కసారి, ప్రేక్షణ నిమిత్తం = దర్శనం కోసంగా, విజ్ఞాపయితుమ్ = అభ్యర్థించడానికి, లజ్జామహే = మేము సిగ్గుపడుతున్నాం. (ఇప్పుడు నీకు అతిథి సత్కారం చెయ్యలేదు మేము. మరోసారి దర్శనమిప్పించమని నిన్ను ఎలా కోరగలం? సిగ్గు పడుతున్నాం – అనడం).

**మా–మైవమ్:** మా–మా+ఏవమ్ = వద్దు వద్దు అలా అనకండి! అత్రభవతీనామ్ = మాన్యురాండ్రయిన మీ, దర్శనేన+ఏవ = దర్శనమాత్రంతోనే, పురస్కృతః+అస్మి = సత్కృతుణ్ని అయ్యాను.

**అహిణవ:** మే = నా, చరణౌ = పాదాలు, అభినవ = కొత్తగా మొలిచిన, కుశసూచి = దర్భల మొనలతో, పరిక్షతౌ = గాయపడ్డాయి. మే = నా, వల్కలమ్ = నారచీర,

**(శకుంతలా రాజానమవలోకయంతీ సవ్యాజం విలంబ్య సహసఖీభ్యాం నిష్క్రాంతా).**

**రాజా : (నిశ్వస్య) హంత! గతాః సర్వాః. అహం పునః మందౌత్సుక్యోఽస్మి గమనం ప్రతి. యావదానుయాత్రికాన్ సమేత్య నాతిదూరే తపోవనస్య నివేశయేయమ్. (ద్విపదికయా). న ఖలు శక్నోమి శకుంతలావ్యాపారా దాత్మానం నివర్తయితుమ్.**

---

కురవక-శాఖ = ఎర్రగోరింట కొమ్మలకు, పరిలగ్నమ్ + చ = తగులుకొంది. తత్ = అందుకని, ఏతత్ = దీనిని, యావత్+మోచయామి = విడిపించుకునేంతదాకా, మామ్ = నన్ను, ప్రతిపాలయతమ్ = మీ ఇద్దరూ నిరీక్షించండి. (ఇది కాళిదాసగ్రంథావళీ ప్రతిలోని అధిక పాఠం).

(శకుంతలా = శకుంతల, రాజానమ్ = దుష్యంతుణ్ని, విలోకయంతీ = చూస్తూ, సవ్యాజమ్ = ఏదో ఒక వంకతో, విలంబ్య = ఆలస్యం చేస్తూ, సహసఖీభ్యామ్ = చెలికత్తెలిద్దరితోనూ, నిష్క్రాంతా = నిష్క్రమిస్తుంది.)

**హంత:** (నిశ్వస్య = నిట్టూర్చి) హంత = అయ్యో, సర్వాః = ముగ్గురూ, గతాః = వెళ్ళిపోయారు. అహమ్+పునః = నేనుమాత్రం, గమనమ్ + ప్రతి = ఇక్కడినుంచి వెళ్ళడానికి, మంద+ఔత్సుక్యః+అస్మి = మందగించిన ఉత్సాహం కలవాడినయ్యాను. వెళ్ళాలనిపించడం లేదు – అని. యావత్ = ఇంతలో, అనుయాత్రికాన్ = నాతో వచ్చినవారిని (సహయాత్రికులైన సైనికులూ సేవకులూ), సమేత్య = చేరి, తపోవనస్య = ఈ తపోవనానికి, న+అతిదూరే = చేరువలో, నివేశయేయమ్ = విడిదిచేయింతునుగాక! (ద్విపదికయా = రెండు అడుగులు నడిచి ఆగి-ఇదీ అధిక పాఠమే) శకుంతలా-వ్యాపారాత్ = ఈ శకుంతలా వ్యవహారంనుంచి, ఆత్మానమ్ = మనస్సును, నివర్తయితుమ్ = మళ్ళించుకోవడానికి, న-శక్నోమి-ఖలు = సమర్థుణ్ని కాలేకపోతున్నాను సుమా! మమ-హి = నాకేమో-

**గచ్ఛతి:** శరీరమ్ = తనువు, పురః+గచ్ఛతి = ముందుకు వెడుతోంది. అసంస్తుతమ్ = అపరిచితమైన (సంస్తవః స్యాత్ పరిచయః – అమరం. మునుపెన్నడూ ఎరుగని అవస్థను పొందినదైన), చేతః = మనస్సు. ప్రతివాతమ్ = గాలికెదురుగా, నీయమానస్య

**మమ హి- గచ్ఛతి పురః శరీరం ధావతి పశ్చాదసంస్తుతం చేతః**
**చీనాంశుకమివ కేతోః ప్రతివాతం నీయమానస్య. 30**

**(నిష్క్రాంతా స్సర్వే)**

**-: ఇతి ప్రథమోஉంకః : -**

---

= కొనిపోబడుతున్న, కేతోః = ధ్వజానికున్న, చీన+అంశుకమివ = పట్టువస్త్రంలాగా (చీనదేశంలో తయారైన వస్త్రమని కొందరు), పశ్చాత్ + ధావతి = వెనక్కి పరుగిడుతోంది.

**తాత్పర్యం:** నా శరీరం ముందుకి వెడుతోంది. అపరిచితమైన అనుభవానికి లోనైన నా మనస్సు మాత్రం వెనక్కి పరుగిడుతోంది – గాలికి ఎదురు వెడుతున్న ధ్వజానికి కట్టిన జెండా గుడ్డలాగా, అదీ పట్టుగుడ్డలాగా వెనక్కి ఎగురుతోంది!

(సర్వే = అందరూ, నిష్క్రాంతాః = నిష్క్రమిస్తారు)

-: ఇది మొదటి అంకం :-

# ద్వితీయోఽంకః

(తతః ప్రవిశతి విషణ్ణో విదూషకః)

**విదూషకః: (నిశ్శ్వస్య) భో కట్ఠం. ఏదస్స మిఅఆసీలస్స రణ్ణో వఅస్స భావేణ ణివ్విణ్ణోంహి. అఅంమఓ అఅం వరాహో అఅం సద్దూలోత్తి మజ్ఝణ్ణోవి గింహవిరల పాఅవచ్ఛా ఆసు వణరాఈసు ఆహిండీ అది అడవీదో అడవీ. పత్తసంకరకసాఆఈ కడుఆఇం గిరణఈ జలాఇం పోఅంతి అణిఅదవేలం సుల్లమంసభూఇట్ఠో ఆహారో అణ్హీ అది. తురగాణు ధావణక్ఖండిత సంధిణో రత్తిమ్మివి ణికామం సఇద్వవం ణత్థి. తదో మహంతే ఏవ్వ పచ్చూసే దాసీఏ పుత్తేహిం సఉణిలుద్ధ ఏహిం వణగ్గహణకోలాహలేణ పడివోధిదోంహి. ఏత్తఏణ దాణింవి పీడా ణ ణిక్కమది. తదో గండస్స ఉవరి పిడఓ సంవుత్తో. హిఓ కిల అంహేసు ఓహీణేసు తత్తహోదో మాఆణుసారేణ అస్సమపదం పవిట్ఠస్స తావసకణ్ణాఅ సఉందలా మమ అఘణ్ణదాఏ దంసిదా. సంపదంణఅర**

---

(తతః = అంతట, విషణ్ణః = విచారగ్రస్తుడైన, విదూషకః = విదూషకుడు, ప్రవిశతి = ప్రవేశిస్తాడు)

**భో కట్ఠం:** (నిశ్శ్వస్య = నిట్టూర్చి) భోః + కష్టమ్ = ఎంత కష్టం! ఎంత కష్టం!! ఏతస్య = ఈ, మృగయాశీలస్య = వేట పిచ్చిగలవాడైన, రాజ్ఞః = దుష్యంత మహారాజుకి, వయస్యభావేన = మిత్రుణ్ని కావడంచేత, నిర్విణ్ణః + అస్మి = ఇలా దుఃఖితుణ్ని అవుతున్నాను –ఇలా కష్టాలు అనుభవిస్తున్నానని. అయమ్ = ఇదిగో, మృగః = లేడి, అయమ్+వరాహః = ఇదిగో అడవిపంది, అయమ్+శార్దూలః = అదిగో పులి, ఇతి = అంటూ, మధ్యాహ్నే+అపి = మిట్టమధ్యాహ్నంవేళ సయితం, గ్రీష్మ = గ్రీష్మర్తువు కారణంగా, విరళ = పలచబారిన, పాదప = చెట్ల, ఛాయాసు = నీడలు కలవైన, వన–రాజీషు = అరణ్య సమూహాలలో, అటవీతః + అటవీ = ఒక అడవి నుంచి మరొక అడవి, ఆహిండ్యతే = తిరుగాడబడుతోంది. తిరుగుతున్నామని. పత్ర = రకరకాల చెట్ల ఆకులు, సంకర = రాలిపడి కలగలిసి, కషాయాణి = సారం దిగి కషాయాలుగా మారినవై, కటూని = వగరెక్కిన, గిరినదీ–జలాని = సెలయేళ్ల జలాలు, పీయంతే = తాగబడుతున్నాయి. వగరునీళ్లు తాగుతున్నామని, శూల్యమాంసభూయిష్ఠః = ఇనుప

**గమణస్స మణం కహంవిణ కరేది. అజ్జ వి సే తం ఏవ్వ చింతఅంతస్స అక్ఖోసు పభాదం ఆసి. కా గదీ? జావణం కిదాచారపరిక్కమం పేక్ఖామి (పరిక్రమ్యావలోక్యచ). ఏసో బాణాసణహత్థాహిం జవణీహిం వణపుప్ఫ మాలాధారిణీహిం పడివుదో ఇదో ఏవ్వ ఆఅచ్ఛది పిఅవఅస్సో. హోదు. అంగభంగవిఅలో వి భవిఅ చిట్ఠిస్సం జఇ ఏవ్వం వి ణామ విస్సమం లహేఅం. (నిశ్శ్వస్య) (భోః! కష్టమ్. ఏతస్య మృగయాశీలస్య రాజ్ఞో వయస్యభావేన నిర్విణ్ణోఽస్మి. అయం మృగః, అయం వరాహః అయం శార్దూల ఇతి మధ్యాహ్నేఽపి గ్రీష్మవిరళపాదపచ్ఛాయాసు వనరాజీష్వాహిండ్యతేఽటవీతోఽటవీ. పత్ర సంకరకషాయాణి కటూని గిరినదీజలాని పీయంతే. అనియతవేళం శూల్యమాంసభూయిష్ఠ ఆహారో భుజ్యతే. తురగానుధావనఖండితసంధేః రాత్రావపి నికామం శయితవ్యం నాస్తి. తతో మహత్యేవ ప్రత్యూషే దాస్యాః పుత్రైః శకునిలుబ్ధకైః వన గ్రహణకోలాహలేన ప్రతిబోధితోఽస్మి. ఇయతేదానీమపి పీడా న**

---

ఊచకు గుచ్చి కాల్చిన మాంసంతో నిండిన, ఆహారః = భోజనం, అనియతవేళమ్ = ఒకవేళా పాళా లేకుండా, భుజ్యతే = తింటున్నాం. తురగ+అనుధావన = గుర్రాల వెంట పరుగుతో, ఖండిత సంధేః (సంక్షుభిత సంధేః – పాఠాంతరం) = సడలిన కీళ్లూ సంధిబంధాలూ కలిగిన, మే = నాకు, రాత్రౌ+అపి = రాత్రివేళలో సయితం, శయితవ్యమ్ = నిద్ర, నికామమ్ + నాస్తి = బొత్తిగా లేదు. తతః = అంతట్లోనే, మహతి + ప్రత్యూషే + ఏవ = అత్యంత ప్రాతఃకాలంలోనే – తెలతెలవారుతుండగానే, దాస్యాః+పుత్రైః = తొత్తు కొడుకులైన, శకునిలుబ్ధకైః = పిట్టలుపట్టేవాళ్లతోనైన, వన–గ్రహణ–కోలాహలేన = అడవికి పోయే కోలాహలంతో, పిట్టల వేటగాళ్లు తెల్లవారకుండానే ఎరలూ తెరలూ వలలూ మొదలైనవాటితో అడవికి పోతున్న కోలాహలంవల్ల, ప్రతిబోధితః+అస్మి = నిద్రలేపబడినవాడినయ్యాను. వాళ్ల కోలాహలంతో చాలా పెందరాళే నిద్ర లేచాననడం. ఇదానీమ్ = ఇప్పుడు, ఇయతా+అపి = ఇంతటితోనైనా, పీడా = ఈ పీడ (ఈ కష్టం), న–నిష్క్రామతి = వదలడం లేదు. తతః = అంతలోకీ, గండస్య+ఉపరి = గాయంమీద, పిటకః+సంవృత్తః = కురుపు వేసింది. (గండో విస్ఫోటకః – అమరం. పుండుమీద కారం జల్లినట్టు – గోరుచుట్టుమీద రోకటిపోటు ఇత్యాదులవంటిది గండస్యోపరి పిటకస్సంవృత్తః అనేది. ఇక్కడ దుష్యంతుడివేట – గండం. శకుంతలాదర్శనం –

**నిష్క్రామతి. తతో గండస్యోపరి పిటకః సంవృత్తః. హ్యః కిలాస్మాసు అవహీనేషు తత్రభవతో మృగానుసారేణాశ్రమపదం ప్రవిష్టస్య తాపస కన్యకా శకుంతలా మమాధన్యతయా దర్శితా. సాంప్రతం నగరగమనస్య మనః కథమపి న కరోతి. అద్యాపి తస్య తామేవ చింతయతోఽక్ష్ణోః ప్రభాతమాసీత్. కా గతిః? యావత్తం కృతాచారపరిక్రమం పశ్యామి (పరిక్రమ్యావలోక్యచ). ఏష బాణాసనహస్తాభిర్యవనీభిర్వనపుష్ప మాలాధారిణీభిః పరివృతః ఇత ఏవాగచ్ఛతి ప్రియవయస్యః. భవతు;**

---

పిటకం. ఈ వనవాసపీడ మరికొన్నాళ్లు కొనసాగుతుందని విదూషకుడి బాధ). హ్యః+కిల = నిన్ననేమి జరిగిందంటే – అస్మాసు + అవహీనేషు = మేము వెంటలేకుండా – ఒంటరిగా, మృగానుసారేణ = ఒక లేడిని వెంబడిస్తూ, ఆశ్రమపదం ప్రవిష్టస్య = కణ్వాశ్రమంలోకి ప్రవేశించిన, తత్రభవతః = మాన్యుడికి = మహారాజు దుష్యంతుడికి, తాపస కన్యకా = ఒకానొక మునికన్య, శకుంతలా(నామ) = శకుంతలానామధారిణి, మమ+అధన్యతయా = నా దురదృష్టం కొద్దీ, దర్శితా = కంటబడింది.

సాంప్రతమ్ = ప్రస్తుతం, నగరగమనస్య = రాజధానికి వెళ్ళడానికి, కథమ్ + అపి = ఏ విధంగానూ, మనః + న – కరోతి = ఇష్టపడదు – సమ్మతించదు. (కథామపి న కరోతి – అని పాఠాంతరం). అద్య + అపి = ఇవ్వేళసైతం (ఇప్పుడు కూడా), తామ్ + ఏవ = ఆ శకుంతలనే, చింతయతః = ధ్యానిస్తున్న, తస్య = దుష్యంతుడి, అక్ష్ణోః = కన్నులకు, ప్రభాతమ్ + ఆసీత్ = తెల్లవారింది – ఆమెను ధ్యానిస్తూనే నిద్రలేచి కళ్లు తెరిచాడనడం. (అద్య = ఇవ్వేళ, సవిశేషమ్ = సవిశేషంగా, తత్ + ఏవ = ఆ విషయాన్నే, చింతయతః = ఆలోచిస్తుండగా, మే = నా, అక్ష్ణోః = కన్నులకు, ప్రభాతమ్ + ఆసీత్ = తెల్లవారింది – అని పాఠాంతరం.) కా–గతిః = ఏది దారి?! ఈ దురవస్థనుంచి బయట పడడానికి ఏది ఉపాయం? – అని. (గతిః పరాయణే గీతిమార్గే చ గమనే మతౌ – విశ్వనిఘంటువు).

కృత+ఆచార పరిక్రమమ్–తమ్ = నిర్వర్తించిన స్నానాది కార్యక్రమాల వరుస కలవాడైన దుష్యంతుణ్ని, (కృతాచార–పరికర్మాణమ్ = అలంకృతుడైన దుష్యంతుణ్ని) యావత్ + పశ్యామి = ఇంతలో వెళ్ళి దర్శిస్తాను. (పరిక్రమ్య = నాలుగడుగులు వేసి, అవలోక్య–చ = దర్శించి) ఏషః = ఇడిగో, బాణాసనహస్తాభిః = విండ్లు చేతబట్టిన వారూ, వనపుష్పమాలాధారిణీభిః = అడవిపూల దండలు ధరించినవారూ అయిన, యవనీభిః = యవనదేశవనితలచేత, పరివృతః = పరివృతుడై, ప్రియవయస్యః = నా

**అంగభంగవికల ఇవ భూత్వా స్థాస్యామి. యద్యేవమపి నామ విశ్రమం లభేయ. (దండకాష్ఠమవలంబ్య స్థితః)**

**– ఇతి ప్రవేశకః –**

**(తతః ప్రవిశతి యథానిర్దిష్టపరివారో రాజా)**

**రాజా : (ఆత్మగతమ్)**

**కామం ప్రియా న సులభా మనస్తు తద్భావదర్శనాశ్వాసి**
**అకృతార్థేఽపి మనసిజే రతిముభయప్రార్థనా కురుతే. 01**

---

నెచ్చెలి దుష్యంతుడు, ఇతః + ఏవ = ఇటువైపే, ఆగచ్ఛతి = వస్తున్నాడు. (రాజుగారి వెంట ఆయుధం మోసుకువచ్చే స్త్రీ = యవని. చామరం మోసుకువచ్చే స్త్రీ = కిరాతి. కిరాతీ చామరధరా, యవనీ శస్త్రధారిణీ ఇత్యుక్తం శబ్దార్ణవే). భవతు = కానిమ్ము! అంగభంగవికలః+ ఇవ–భూత్వా = అంగవైకల్యం సంభవించినవాడిలాగా అయ్యి, స్థాస్యామి = ఇక్కడ ఉంటాను. యది + ఏవమ్ + అపి–నామ = ఇల్లాగైనా, విశ్రమమ్ = ఈ పూటకు విశ్రాంతి, లభేయ = పొందుతానేమో!! వేటకు వెళ్ళకుండా తప్పించుకోగలనని. (దండకాష్ఠమ్ = చేతికర్రను, అవలంబ్య = ఆసరా చేసుకొని, స్థితః = నిల్చుంటాడు).

**ఇది ప్రవేశకం**

(తతః = అంతట, యథానిర్దిష్టపరివారః = యథోక్తంగా యవనీ పరివృతుడై, రాజా = దుష్యంతుడు, ప్రవిశతి = ప్రవేశిస్తాడు).

**కామమ్:** (ఆత్మగతమ్ = తనలో) ప్రియా = ప్రేయసి శకుంతల, కామమ్ = మిక్కిలి, న–సులభా = దుర్లభ. తు = కానీ, మనః = నా మనస్సు, తత్ = ఆమె, భావ = చేష్టలు వెల్లడించిన భావాన్ని (అభిప్రాయాన్ని), దర్శన = చూచి గ్రహించడంతో, ఆశ్వాసి = స్తిమితపడుతోంది. ఆమె చేష్టలద్వారా ఆమె నాపట్ల అనురాగవతి అనే భావాన్ని గ్రహించి మనస్సు సంబరపడుతోందని. మనసిజే = ఆలింగన చుంబనాదులతో మన్మథుడు, అకృతార్థే + అపి = కృతార్థుడు కాకపోయినా (అటువంటివి జరగకపోయినా), ఉభయప్రార్థనా = (ప్రేయసీ ప్రియులు) ఒకరి నొకరు అభిలషించడమనేదే – పరస్పరాభిలాష, రతిమ్ + కురుతే = ప్రమోదం కలిగిస్తుంది. (ప్రమోదాత్మా మనోవృత్తి

**(స్మితం కృత్వా) ఏవమాత్మాభిప్రాయ సంభావితేష్టజన చిత్తవృత్తిః ప్రార్థయితా విడంబ్యతే –**

**స్నిగ్ధం వీక్షితమన్యతోఽపి నయనే యత్ ప్రేరయంత్యా తయా**
**యాతం యచ్చ నితంబయోర్గురుతయా మందం విలాసాదివ**
**మామా ఇత్యుపరుద్ధయా యదపి సా సాసూయముక్తా సఖీ**
**సర్వం తత్కిల మత్పరాయణమహో కామీ స్వతాం పశ్యతి. 02**

---

విశేషో రతిరుచ్యతే – నారీపురుషయోస్తుల్యా పరస్పరవిభావికా స్పృహాహ్వాయా చిత్తవృత్తీ రతి రిత్యభిధీయతే – భావప్రకాశికాదుల నిష్కర్ష.) (భావదర్శనాయాసి = భావాన్ని గ్రహించడానికి శ్రమిస్తోందని – పాఠాంతరం).

**తాత్పర్యం:** నా ప్రేయసి శకుంతల మునికన్య కాబట్టి చాలా దుర్లభ. అయినా ఆమె చేష్టల ద్వారా నాపట్ల ఆమెకున్న అభిలాషను గుర్తించి సంబరపడుతోంది నా మనస్సు. అవును! మన్మథుడు కృతార్థుడు కాకపోయినా పరస్పరాభిలాష చాలు యువతియువకులకు ప్రమోదం కల్గిస్తుంది!

**ఏవమ్:** (స్మితమ్ – కృత్వా = చిరునవ్వు నవ్వి) ఏవమ్ = ఇలా, ఆత్మాభిప్రాయ = తన అభిప్రాయం ప్రకారం (తదనుగుణంగా), సంభావిత = ఊహించుకోబడిన, ఇష్టజన = ప్రియురాలి, చిత్తవృత్తిః = మనస్సుకలవాడై, ప్రార్థయితా = ప్రియుడు, విడంబ్యతే = (ఒక్కొక్కసారి) నవ్వులపాలవుతుంటాడు! (తాను ప్రేమించాడు కనుక ఆమెకూడా తనను ప్రేమిస్తోందని ఆమె చేష్టలతో ఊహించుకొని ప్రియుడు పరిహసింపబడుతుంటాడు – అని).

**స్నిగ్ధమ్:** అన్యతః = మరొకవైపునకు, నయనే = కన్నులను, ప్రేరయంత్యా + అపి = త్రిప్పుచున్నదే అయినా, తయా = ఆ శకుంతలచేత, స్నిగ్ధమ్ = మైత్రీమధురంగా, వీక్షితమ్–యత్ = చూడబడటం ఏది ఉందో; నితంబయోః = పిరుదుల, గురుతరయా = భారాధిక్యంచేత, విలాసాత్ + ఇవ = అదొక విలాసంవల్ల అన్నట్టుగా, మందమ్ = మెల్లమెల్లగా, యాతమ్ + యత్ + చ = నడవబడటం ఏది ఉందో; మా–మా = వద్దు వద్దు, ఇతి = అని, ఉపరుద్ధయా = అడ్డగింపబడిన ఆమెచేత, సా + సఖీ = అలా నిషేధించిన ఆ ఇష్టసఖి, స+అసూయమ్ = ఈర్ష్యతో, ఉక్తా+యత్ = వచింపబడినది ఏది ఉందో; తత్ + సర్వమ్ = అది అంతా, మత్ + పరాయణమ్–కిల = నన్ను

**విదూ : (తథా స్థిత ఏవ) భో వహస్స! హత్తేణమే పసరంది. వాఆ మత్తేణ విఅఈ హోహి. (భో వయస్య! హస్తే న మే ప్రసరతః వాఙ్మాత్రేణ విజయీ భవ).**

**రాజా : (సస్మితమ్) కుతోఽయం గాత్రోపఘాతః?**

**విదూ : కుదో కిల సఅం ఏవ్వ అచ్ఛీ ఆఉలీకరిఅ అస్సుకారణం పుచ్ఛసి? (కుతః కిల? స్వయమేవాక్షిణీ ఆకులీకృత్యాశ్రుకారణం పృచ్ఛసి?)**

**రాజా : న ఖల్వవగచ్ఛామి.**

---

ఉద్దేశించిందేగదా!! (అహం పరాయణమాశ్రయో యస్య తత్). అహో = ఆశ్చర్యం. కామీ = కాముకుడు, స్వతామ్ = స్వకీయతను, పశ్యతి = అన్నింటా భావిస్తాడు సుమా!

**తాత్పర్యం:** శకుంతల-ఎటో కన్నులు తిప్పుతూ ఒక్కసారి నావైపు మైత్రీమధురంగా చూసింది. నితంబభారం వల్ల విలాసగమనం అన్నట్టు మెల్లగా ఆగి ఆగి నడిచివెళ్ళింది. వెళ్లవద్దు వద్దు అని వారిస్తున్న ప్రియసఖి ప్రియంవద వైపు అసూయగా చూసింది. ఇది అంతా నాకోసమే. నాకు తన అభిలాషను ప్రకటించడం కోసమే. అహో! నాలాంటి కాముకుడు అన్నింటా ఇలా స్వకీయతనే చూస్తాడు సుమా! (స్వతామాత్మీయతాం పశ్యతి అనీ, స్వతామ్ = స్వకీయత్వం పశ్యతి అనీ పూర్వ వ్యాఖ్యాతలు.)

**భో వహస్స:** (తథా-స్థితః+ఏవ = చేతికర్ర ఊతంగా అలా నిలిచే) భో-వయస్య = ఓయీ! మిత్రమా! మే+హస్తే = నా చేతులు, న-ప్రసరతః = లేవడం లేదు. వాఙ్మాత్రేణ = అందుకని కేవలం మాటతోనే చెబుతున్నాను, విజయీ+భవ = వేంచేయి - వేంచేయి! విజయుడవు కమ్మి - అని దీవెనగానీ.

**కుతోఽయమ్:** (సస్మితమ్ = చిరునవ్వుతో) అయమ్ = ఈ, గాత్ర + ఉపఘాతః = అంగవైకల్యం, కుతః = ఏమి? ఎందువల్ల?

**కుదో కిల:** కుతః+కిల = ఎందువల్లనంటావా? అక్షిణీ = కన్నులను, స్వయమ్+ఏవ = స్వయంగా నీవే, ఆకులీకృత్య = నొప్పించి (పొడిచి), అశ్రుకారణమ్ = కన్నీటికి కారణం, పృచ్ఛసి = అడుగుతున్నావా?

**నఖలు:** న+ఖలు+అవగచ్ఛామి = అర్థం కావడంలేదు సుమా!

**విదూ : భో వఅస్స! జం వేదసో ఖుజ్జలీలం విడంబేది తం కిం అత్తణో పహావేణ ఉద ణఈవేఅస్స? (భో వయస్య! యదా వేతసః కుబ్జలీలాం విడంబయతి తత్కిమాత్మనః ప్రభావేణ ఉత నదీవేగస్య?)**

**రాజా : నదీవేగస్తత్ర కారణమ్.**

**విదూ : మమ వి భవం. (మమాపి భవాన్).**

**రాజా : కథమివ?**

**విదూ : ఏవ్వం రాఅకజ్జాణి ఉజ్ఝిఅ తారిసే ఆఉలప్పదేసే వణచర వుత్తిణా తుఏ హోదవ్వం జంసచ్చం పచ్చహం సావద సముచ్చారణేహిం సంఖోహిఅసంధిబంధాణం మమ గత్తాణం అణీసో ంహి సంవుత్తో.**

---

**జంవేదసో:** భో వయస్య = ఓయీ మిత్రమా! వేతసః = ప్రబ్బలి, కుబ్జలీలామ్ = (వంగి వాలిపోయిన) కురుచదనాన్ని, విడంబయతి–యత్ = అవలంబించడం ఏది ఉన్నదో, తత్ = అది, ఆత్మనః + ప్రభావేణ = తన మహిమ చేతనా? ఉత = లేక, నదీవేగస్య – ప్రభావేణ = నదీ ప్రవాహం తాలూకు వేగమహిమచేతనా?

**నదీవేగః:** తత్ర = ప్రబ్బలి కుబ్జలీల విషయంలో, నదీవేగః = ప్రవాహ వేగమే, కారణమ్ = హేతువు.

**మమ వి:** మమ+అపి = అలాగే నాకు, భవాన్ = నువ్వు, కారణమ్ = హేతువు.

**కథమ్:** కథమ్+ఇవ = ఎలాగ?

**ఏవ్వం:** రాజకార్యాణి = రాచకార్యాలను, ఉజ్ఝిత్వా = విడిచిపెట్టేసి, తాదృశ = అలాంటి, ఆకులప్రదేశే = ప్రమాదకరమైన ప్రదేశంలో, వనచర–వృత్తినా = ఆటవికుడి ప్రవృత్తితో, ఏవమ్ = ఈ విధంగా, త్వయా–భవితవ్యమ్ = నువ్వు ఉండు! యత్+సత్యమ్ = నిజం చెబుతున్నాను. ప్రత్యహమ్ = ప్రతిదినమూ, శ్వాపద–సముత్సారణైః = పులులు మొదలైన క్రూరమృగాలను పారద్రోలుకోవడాలతో, సంక్షోభిత–సంధిబంధానామ్ = సడలిపోయిన కీళ్లుకలవైన, మమ = నా ఈ, గాత్రాణామ్ = అవయవాలకు, అనీశః = (భరించడానికి) అశక్తుడను, సంవృత్తః + అస్మి = అయ్యాను. కీళ్లనొప్పులు భరించలేక పోతున్నానని. తత్ = అందుచేత, మామ్ = నన్ను, ఏకాహమ్+అపి = ఒక్క దినమైనా,

తా పసాదఇస్సం. విసజ్జేహి మం ఏక్కాహం వి దావ విస్సమిదుం. (ఏవం రాజకార్యాణి ఉజ్ఝిత్వా తాదృశ ఆకులప్రదేశే వనచరవృత్తినా త్వయా భవితవ్యమ్. యత్సత్యమ్, ప్రత్యహం శ్వాపదసముత్సారణైః సంక్షోభిత సంధిబంధానాం మమ గాత్రాణామనీశోఽస్మి సంవృత్తః. తత్ ప్రసాదయిష్యామి. విసర్జయ మామేకాహమపి తావద్విశ్రమితుమ్).

రాజా : (ఆత్మగతమ్). అయం చైవమాహ, మమాపి కాశ్యప సుతామనుస్మృత్య మృగయాం ప్రతి నిరుత్సుకం చేతః. తథాహి–

న నమయితు మధిజ్యమస్మి శక్తో
ధనురిదమాహితసాయకం మృగేషు
సహవసతిముపేత్య యైః ప్రియాయాః
కృత ఇవ ముగ్ధ విలోకితోపదేశః. 03

---

విశ్రమితుమ్+తావత్ = కాసింత విశ్రాంతి తీసుకోవడానికి, విసర్జయ = విడిచిపెట్టు. ప్రసాదయిష్యామి = బతిమాలుకొంటున్నాను!!

**అయమ్:** (ఆత్మగతమ్ = తనలో) అయమ్+చ = ఇతడేమో, ఏవమ్+ఆహ = ఇలా పలుకుతున్నాడు. మమ+అపి = నాకు కూడా, కాశ్యపసుతామ్+అనుస్మృత్య = శకుంతలను క్షణక్షణమూ స్మరిస్తూ, చేతః = మనస్సు, మృగయామ్+ప్రతి = వేట విషయంలో, నిరుత్సుకమ్ = ఉత్సాహ రహితం! తథా–హి = అవును గదా! (మృగయావిక్లబం చేతః–అని పాఠాంతరం).

**న నమయితుమ్:** సహవసతిమ్ = ఒకే వనంలో కలిసి నివసించడం అనే దాన్ని, ఉపేత్య = పొందినవై, యైః (మృగైః) = ఏ లేళ్ల చేత, ప్రియాయాః = నా ప్రియురాలు శకుంతలకు, ముగ్ధవిలోకిత+ఉపదేశః = అందమైన బెదురుచూపుల ఉపదేశం, కృతః+ఇవ = చేయబడినట్లున్నదో, (తేషు+) మృగేషు = ఆ లేళ్లమీద, అధిజ్యమ్ = నారి తొడగబడినదీ, ఆహితసాయకమ్ = పూన్చబడిన బాణంకలదీగా చేసి, ఇదమ్+ధనుః = ఈ ధనువును, నమయితుమ్= (చెవిదాకా నారిలాగి) వంచడానికి, న+శక్తః+అస్మి = అశక్తుణ్ని అవుతున్నాను.

**తాత్పర్యం:** ఈ వనంలోని లేళ్లమీద – విల్లువంచి బాణం ప్రయోగించడానికి మనసొప్పడం లేదు. ఇవి ఈ వనంలో నా ప్రియురాలు శకుంతలతో సహనివాసం

**విదూ : (రాజ్ఞో ముఖం విలోక్య) అత్తభవం కిం వి హిఅఏ కరిఅ మంతేది. అరణ్ణే మఏ రుదిఅం ఆసి. (అత్రభవాన్ కిమపి హృదయే కృత్వా మంత్రయతే. అరణ్యే మయా రుదితమాసీత్).**

**రాజా : (సస్మితమ్) కిమన్యత్! అనతిక్రమణీయం మే సుహృద్వాక్యమితి స్థితోఽస్మి.**

**విదూ : చిరం జీఅ. (చిరం జీవ). (గంతు మిచ్ఛతి)**

**రాజా : వయస్య! తిష్ఠ! సావశేషం మే వచః.**

**విదూ : ఆణవేదు భవం. (ఆజ్ఞాపయతు భవాన్)**

---

చేశాయి, శకుంతలకు తమవైన బెదురుచూపులను నేర్పాయి. వీటిమీద సాయకాలు ఎలా ప్రయోగించను!!

**అత్తభవం:** (రాజ్ఞః = దుష్యంతుడి, ముఖమ్ = ముఖం, విలోక్య = చూసి), అత్రభవాన్ = మాన్యుడు, కిమపి = ఏదో, హృదయే–కృత్వా = మనసులో ఆలోచిస్తూ, మంత్రయతే = మాట్లాడుతున్నాడు. మయా = నాచేత–నేను పలికినదంతా, అరణ్యే–రుదితమ్–ఆసీత్ = అరణ్యరోదనమయ్యింది.

**కిమన్యత్:**(సస్మితమ్ = చిరునవ్వుతో), కిమ్+అన్యత్ = మరొకటి ఏముంది! మే = నాకు, సుహృద్వాక్యమ్ = మిత్రుడి మాట, అనతిక్రమణీయమ్ = అనుల్లంఘ్యం, ఇతి = అని, స్థితః+ అస్మి = ఆగిపోయాను.

**చిరం:** చిరం జీవ = చిరం జీవ! చిరం జీవ! (గంతుమ్ + ఇచ్ఛతి = వెళ్ళిపోవడానికి ప్రయత్నిస్తాడు).

**వయస్య:** వయస్య = మిత్రుడా! తిష్ఠ = ఆగు. మే–వచః = నా మాట, సావశేషమ్ = మిగిలే ఉంది– ఇంకా పూర్తికాలేదు.

**ఆణవేదు:** భవాన్ = నువ్వు, ఆజ్ఞాపయతు = ఆజ్ఞాపించు.

**విశ్రాంతేన:** విశ్రాంతేన–భవతా = విశ్రాంతిగొంటున్న నీవు, మమ + అపి = నాకుకూడా, అనాయాసే – కర్మణి = శ్రమలేని ఒక పనిలో, సహాయేన–భవితవ్యమ్ = సహాయం చెయ్యాలి.

**రాజా : విశ్రాంతేన భవతా మమాప్యనాయాసే కర్మణి సహాయేన భవితవ్యమ్.**

**విదూ : కిం మోదఅ ఖాఅణే? తేణ హి అఅం సుగహీదో ఖణో (కిం మోదకఖాదనే? తేన హ్యయం సుగృహీతః క్షణః).**

**రాజా : యత్ర వక్ష్యామి. కః కోఽత్ర భోః?**

**(ప్రవిశ్య)**

**దౌవారికః : (ప్రణమ్య) ఆణవేదు భట్టా. (ఆజ్ఞాపయతు భర్తా).**

**రాజా : రైవతక! సేనాపతిస్తావదాహూయతామ్.**

**దౌవా : తహ. (తథా).**

**(నిష్క్రమ్య సేనాపతినా సహ పునః ప్రవిశ్య)**

---

**కిం మోదఅ:** కిమ్-మోదకఖాదనే = ఏమీ లడ్డూలు తినడంలోనా? తేన-హి = అందుచేతనే అయితే, అయమ్+క్షణః = ఈ సమయం, సుగృహీతః = పరమపావనం – చరితార్థం!!

**యత్ర:** యత్ర = ఏ పనిలోనో, వక్ష్యామి = చెబుతానుండు. కః-కః+అత్ర-భోః = ఎవరక్కడ?

(ప్రవిశ్య = ద్వారపాలకుడు ప్రవేశించి)

**ఆణవేదు:** (ప్రణమ్య = నమస్కరించి) భర్తా = ప్రభువు, ఆజ్ఞాపయతు = ఆజ్ఞాపించుగాక!

**రైవతక:** రైవతక = రైవతకుడా! సేనాపతిః = సేనాపతి, ఆహూయతామ్ + తావత్ = పిలవబడుగాక! పిలుచుకురమ్మనడం.

**తహ:** తథా = అట్లే.

(నిష్క్రమ్య = నిష్క్రమించి, సేనాపతినా-సహ = సేనాపతితో సహా, పునః+ప్రవిశ్య = మళ్ళీ ప్రవేశించి).

**ఏసో:** ఏషః = ఇడిగో, ఆజ్ఞావచన + ఉత్కంఠః = ఆజ్ఞాపించడానికి సముత్సుకుడై, భర్తా = ప్రభువు, ఇతః + ఏవ = ఇటువైపే, దత్త దృష్టిః = చూపు నిల్పినవాడై, తిష్ఠతి = కూర్చొన్నాడు. ఆర్యః = మాన్యసేనాపతి, ఉపసర్పతు = సమీపించుగాక!

**ఏసో అణ్ణావఅణుక్కంఠో భట్టా ఇదో దిణ్ణాదిట్టీ ఏవ్వ చిట్టది. ఉవసప్పదు అజ్జో. (ఏష ఆజ్ఞావచనోత్కంఠో భర్తా ఇతో దత్తదృష్టిరేవ తిష్ఠతి. ఉపసర్పత్వార్యః).**

**సేనాపతిః : (రాజానమవలోక్య) కథం దృష్టదోషాపి స్వామిని మృగయా కేవలం గుణ ఏవ సంవృత్తా. తథా హి. దేవః –**

**అనవరతధనుర్జ్యాస్ఫాలనక్రూర పూర్వం**
**రవికిరణసహిష్ణు స్వేదలేశైరభిన్నమ్**
**అపచితమపి గాత్రం వ్యాయతత్వాదలక్ష్యం**
**గిరిచర ఇవ నాగః ప్రాణసారం బిభర్తి. 04**

---

**కథమ్:** (రాజానమ్ + అవలోక్య = మహారాజును చూసి) కథమ్ = ఎట్టా! దృష్టదోషా+అపి = ఏవో కొన్ని దోషాలు కలదే అయినప్పటికీ, మృగయా = ఈ వేట అనేది, స్వామిని = ఈ మహారాజు విషయంలో, కేవలమ్+గుణః+ఏవ–సంవృత్తా = కేవలం గుణమే అయ్యింది. తథాహి = అవునుగదా! దేవః = మహారాజు –

**అనవరత:** అనవరత = నిరంతరంగా, ధనుః+జ్యా = వింటినారిని, ఆస్ఫాలన = ఎక్కుపెట్టడాలవల్ల, క్రూర = కఠినంగా మారిన (గట్టిబడ్డ), పూర్వమ్ = వక్షస్థలాదికమైన పైభాగం కలదీ; రవికిరణ = సూర్యకిరణాల వేడిమిని, సహిష్ణు = తట్టుకొంటున్నదీ; స్వేదలేశైః = చెమట బొట్టులతోనైనా, అభిన్నమ్ = సక్తం కానిదీ – కాసింతయినా చెమట లేనిది–అని; అపచితమ్ + అపి = కృశించినదే అయినప్పటికీ, వ్యాయతత్వాత్ = (వ్యాయామంతో సిద్ధించిన) దృఢత్వంవల్ల (వ్యాయతో దీర్ఘ దృఢయోరితి వైజయంతీ), అలక్ష్యమ్ = కృశించినట్టు కనబడనిదీ, ప్రాణసారమ్ = జీవశక్తి కలదీ – శక్తి సంపన్నమూ అయిన, గాత్రమ్ = శరీరాన్ని, గిరిచరః = పర్వతాలలో సంచరించే, నాగః + ఇవ = ఏనుగులాగా, బిభర్తి = వహిస్తున్నాడు.

**తాత్పర్యం:** ప్రాణశక్తి సంపన్నమైన శరీరంతో కొండ ఏనుగులాగా ఉన్నాడు. నిరంతరం వింటినారిని ఎక్కుపెడుతూండటంవల్ల ఇతడి శరీరపు పూర్వభాగం రాటుదేలింది – కఠినతరమయ్యింది. (ప్రియాళు వృక్షాల అడవులలో తిరగడంవల్ల కొండఏనుగు శరీరమూ ఇలాగే కఠినతరమయ్యింది అని సామ్యం. ధనుస్సంజ్ఞా ప్రియాళుద్రౌ రాశిభేదే శరాసనే – ఇతి విశ్వః. జ్యా మౌర్వీ చ వసుంధరా – ఇతి ధరణిః. ఇలాగే

**(ఉపేత్య) జయతు స్వామీ! నిగృహీతశ్వాపదప్రచారమరణ్యమిదమ్. కిమన్యత్రావస్థీయతే?**

**రాజా : భద్రసేన! మందోత్సాహః కృతోఽస్మి మృగయాపవాదినా మాధవ్యేన.**

**సేనా : (జనాంతికమ్) సఖే! స్థిరప్రతిబంధో భవ. అహం తావత్ స్వామినశ్చిత్త వృత్తిమనువర్తిష్యే. (ప్రకాశమ్). ప్రలపత్వేష వైధేయః. నను ప్రభురేవ నిదర్శనమ్ –**

---

మిగతా విశేషణాలు కూడా కొండఏనుగుకీ వర్తిస్తాయి). ఇతడి శరీరం ఎండవేడిమిని తట్టుకుంటోంది. కాసింత చెమటయినా పట్టడం లేదు. శరీరం కాస్త కృశించిందిగానీ దృఢత్వంవల్ల అది తెలియడంలేదు. అంతటి ప్రాణసారసంపన్నమైన శరీరంతో ఈ మహారాజు అచ్చం ఒక కొండ ఏనుగులా ఉన్నాడు.

**జయతు:** (ఉపేత్య = సమీపించి) స్వామీ = మహారాజు, జయతు = జయించుగాక! ఇదమ్ + అరణ్యమ్ = ఈ అడవి, నిగృహీత = అంతమొందించబడిన, శ్వాపదప్రచారమ్ = క్రూరమృగాల సంచారం కలది అయ్యింది. ఇక్కడి క్రూరమృగాలన్నింటినీ సంహరించేశామని. అన్యత్ర = మరో చోటు – మరో అడవి, కిమ్ + అవస్థీయతే = వసింపబడుతుందా? మరో అడవికి వెడదామా – అని. (కిమన్యదనుష్ఠీయతామ్ – కిమద్యాప్యనుష్ఠీయతే – పాఠాంతరాలు).

**భద్ర:** భద్రసేన = భద్రసేనుడా! మృగయా+అపవాదినా = వేటను వ్యతిరేకించే, మాధవ్యేన = ఈ మిత్రుడు మాధవ్యుడిచేత, మంద+ఉత్సాహః+కృతః+అస్మి = చల్లార్చబడిన ఉత్సాహం కలవాడనయ్యాను. వేటపట్ల నాకున్న ఉత్సాహంమీద ఇతడు నీళ్లు జల్లాడనడం. (మాఢవ్యుడని కొన్ని ముద్రణలు).

**సఖే:** (జనాంతికమ్ = జనాంతికంగా – రాజుకీ విదూషకుడికీ తప్పించి ప్రేక్షకులకు వినిపించేలాగా) సఖే = మిత్రమా! మాఢవ్యా! స్థిర ప్రతిబంధః+భవ = రాజుగారి వేటకు గట్టి అడ్డంకివే కమ్ము! నువ్వు గట్టిగా అడ్డుకో, మేమూ సుఖపడతామని. అహమ్+తావత్ = సేనాపతిని కాబట్టి నేనుమాత్రం, స్వామినః = మహారాజుగారి, చిత్తవృత్తిమ్ = మనస్సును, అనువర్తిష్యే = అనుసరిస్తాను. నాకు తప్పదుగదా–అని. (ప్రకాశమ్ = అందరికీ వినిపించేట్టు) ఏషః = ఈ, వైధేయః = మూర్ఖుడు మాఢవ్యుడు, ప్రలపతు = ఇలాగే (వేట పనికిమాలినది అని) వాగుగాక! (అజ్ఞే మూఢయథాజాత మూర్ఖ వైధేయ

**మేదశ్ఛేదకృశోదరం లఘు భవత్యుత్థానయోగ్యం వపుః**
**సత్త్వానామపి లక్ష్యతే వికృతిమచ్చిత్తం భయక్రోధయోః**
**ఉత్కర్షః స చ ధన్వినాం యదిషవః సిధ్యంతి లక్ష్యే చలే**
**మిథ్యైవ వ్యసనం వదంతి మృగయా మీదృగ్వినోదః కుతః? 05**

**విదూ : అవేహి రే ఉచ్చా హ హేతుణ! అత్తభవం పకిదిం ఆపణ్ణో. తుమం దావ అడవీదో అడవీం ఆహిండంతో ణరణాసికాలోలువస్స జిణ్ణ రిచ్ఛస్స కస్స వి ముహే పడిస్ససి. (అవేహి రే ఉత్సాహహేతుక! అత్రభవాన్ ప్రకృతిమాపన్నః. త్వం తావదటవీతోఽటవీమాహిండమానో నర నాసికాలోలుపస్య జీర్ణ ఋక్షస్య కస్యాపి ముఖే పతిష్యసి).**

---

బాలిశాః – అమరః). నను = నిజానికి, అత్ర = వేట మంచిది అనే విషయంలో, ప్రభుః + ఏవ = మహారాజే, నిదర్శనమ్ = దృష్టాంతం.

**మేదశ్ఛేద:** మేదస్+ఛేద = కొవ్వు కరగడంతో, కృశ+ఉదరమ్ = సన్నబడ్డ నడిమిభాగం కలదై, వపుః = శరీరం, ఉత్థానయోగ్యమ్ = చటుక్కున లేవడానికి వీలైనదిగా, లఘు + భవతి = తేలిక పడుతుంది. (శరీరం ఏ ప్రయత్నానికైనా యోగ్యమవుతుందని. ఉద్యోగే చ తథోత్థానమితి ధరణిః). భయక్రోధయోః = భయమూ క్రోధమూ కలగడం వల్ల, వికృతిమత్ = వికారం పొందినదైన, సత్త్వానామ్+చిత్తమ్+అపి = జంతువుల అంతరంగంసైతం, లక్ష్యతే = ఎరుగనవుతుంది – ఎరుకపడుతుంది. చలే = కదులుతున్న, లక్ష్యే = గురియందు, ఇషవః = తమ బాణాలు, సిధ్యంతి– యది = సఫలీకృతాలయితే, సః = అది, ధన్వినామ్ = విలుకాండ్రకు, ఉత్కర్షః+చ = విజయోత్సవం! మృగయామ్ = వేటను, వ్యసనమ్ = చెడు అలవాటు అని, వదంతి = చెబుతున్నారు, తత్ = అది, మిథ్యా+ఏవ = అసత్యమే. ఈదృక్ + వినోదః = ఇలాంటి మరో వినోదం, కుతః = ఎక్కడిది?

**తాత్పర్యం:** వేటను ఒక వ్యసనంగా చెప్పడం. కేవలం మిథ్య. దీనివల్ల ఎన్ని ప్రయోజనాలున్నాయో! కొవ్వు కరిగి బొజ్జ తరిగి శరీరం తేలిక పడుతుంది. చటుక్కున లేవడానికీ పోవడానికీ వీలవుతుంది. భయమూ క్రోధమూ ఆవేశించినప్పుడు జంతువులలో వచ్చే శారీరకమైన మార్పులు ఏమిటి? వాటి ఆవిష్కార పద్ధతులేమిటి? ఇత్యాదులన్నీ చూడవచ్చు, తెలుసుకోవచ్చు. అటూ ఇటూ పరుగులు తీసే జంతువులు

**రాజా : భద్రసేన! ఆశ్రమ సన్నికృష్టే స్థితాః స్మః. అతస్తే వచో నాభినందామి. అద్య తావత్ –**

**గాహంతాం మహిషా నిపానసలిలం శృంగైర్ముహుస్తాడితం**
**ఛాయాబద్ధకదంబకం మృగకులం రోమంథమభ్యస్యతు**
**విస్రబ్ధం క్రియతాం వరాహతతిభి ర్ముస్తాక్షతిః పల్వలే**
**విశ్రామం లభతామిదం చ శిథిలజ్యాబంధమస్మద్ధనుః 06**

**సేనా : యత్ప్రభవిష్ణవే రోచతే.**

---

లక్ష్యంగా విలుకాండ్రు బాణాలు ప్రయోగిస్తే, అవి గురితప్పకుండా వెళ్ళి వాటికి నాటుకున్నప్పుడు వాళ్లు పొందే విజయగర్వం దానంతట అదొక మహోత్కర్ష! ఇన్ని ప్రయోజనాలున్న వేటను మించిన వినోదం మరొకటి ఏది? ఎక్కడ?!

**అవేహి:** ఉత్సాహ హేతుక = వేటకు ఎగదోసేవాడా! అవేహి–రే = నువ్వు ఒకటి తెలుసుకోవయ్యా! అత్రభవాన్ = మాన్యుడు మహారాజు, ప్రకృతిమ్+ఆపన్నః = తన స్వాభావికస్థితికి వచ్చేశాడు (పూర్వస్థితిని పొందాడని వేటకు రాడనీ). త్వమ్ + తావత్ = నువ్వు మాత్రం, అటవీతః+అటవీమ్ = ఒక అడవినుంచి మరో అడవికి, ఆహిండమానః = తిరుగుతున్నవాడివై, నరనాసికా–లోలుపస్య = మనిషి ముక్కుకోసం వెంపర్లాడే, కస్య+అపి = ఏదో ఒక, జీర్ణ ఋక్షస్య = ముసలి ఎలుగుబంటి, ముఖే = నోటియందు, పతిష్యసి = పడతావులే! ఎక్కడో ఎప్పుడో ఏదో ఒక ఎలుగుబంటి నీ ముక్కు పట్టుకుంటుంది – అనడం. (నరమాంస లోలుపస్య – నాసికామిషలోలుపస్య – అని పాఠాంతరాలు. ఎలుగుబంటి మాంసాహారి కాదు. కానీ విదూషకుడి వచనం కదా ఇది!!)

**ఆశ్రమ:** భద్రసేనా! ఆశ్రమ–సన్నికృష్టే= కణ్వాశ్రమానికి చేరువలో, స్థితాః+స్మః = మనమున్నాం. అతః = అందుచేత, తే–వచః = నీ మాటను, న+అభినందామి = అభినందించలేను. వేటను అంగీకరించను–అని. అద్య–తావత్ = ఇక ఇప్పుడు–

**గాహంతామ్:** మహిషాః = అడవి దున్నలు, నిపాన–సలిలమ్ = దిగుడు బావుల చెంగటి రాతితొట్టెలలోని నీటిని, శృంగైః = తమ కొమ్ములతో, ముహుః+తాడితమ్ = మాటిమాటికి ఆస్ఫాలితమయ్యేట్టుగా, గాహంతామ్ = ఎగజిమ్ముకొనుగాక!

**రాజా : తేన హి నివర్తయ పూర్వగతాన్ వనగ్రాహిణః. యథా న మే సైనికాస్తపోవనముపరుంధంతి తథా నిషేద్ధవ్యాః. పశ్య –**

**శమప్రధానేషు తపోధనేషు**
**గూఢం హి దాహాత్మకమస్తి తేజః**
**స్పర్శానుకూలా అపి సూర్యకాంతా**
**స్తేజోఽన్యతేజోఽభిభవా ద్వమంతి. 07**

---

కొమ్ములతో కొట్టి స్వేచ్ఛగా ఎగజిమ్ముకోనీ–అని. మృగకులమ్ = లేడిపిండు, ఛాయాబద్ధ – కదంబకమ్ = చెట్ల నీడలలో గుంపుగొన్నవై – గుంపులుగా విశ్రమించి, రోమంథమ్ = నెమరువేతను, అభ్యస్యతు = అభ్యసించునుగాక! తీరికగా నెమరువేయనీ– అని. వరాహతతిభిః = అడవి పందుల గుంపులతో, పల్వలే = నీటిగుంట(ల)లో, ముస్తా–క్షతిః = ముస్తె దుంపల వినాశం, విస్రబ్ధమ్ = నిరాఘాటంగా, క్రియతామ్ = చేయబడుగాక. ముట్టెలతో ముస్తె దుంపల్ని తవ్విపొయ్యనీ – అని. శిథిల – జ్యాబంధమ్ = సడలిన అల్లెత్రాటి కట్టు కలదై, ఇదమ్ = ఈ, అస్మత్ = మా, ధనుః+చ = విల్లు కూడా, విశ్రామమ్ = విశ్రాంతిని, లభతామ్ = పొందుగాక. మా ధనుస్సును కాసింత విశ్రాంతి తీసుకోనీ – అని.

**తాత్పర్యం:** భద్రసేనా! అడవి దున్నలు నీటితొట్టెలలోని నీటిని కొమ్ములతో కొట్టి హాయిగా విరజిమ్ముకోనీ. చెట్ల నీడలలో గుంపులు గుంపులుగా విశ్రమించి మృగాలు తీరికగా నెమరువేసుకోనీ. అడవి పందులు నీటి పడియల్లోని ముస్తె దుంపలను ముట్టెలతో నిరాఘాటంగా తవ్విపొయ్యనీ. ఇప్పటికే అల్లెతాటిని సడలించిన ఈ ధనుస్సును కాసింత విశ్రాంతి తీసుకోనీ!!

**యత్:** ప్రభవిష్ణవే = ప్రభువులవారికి, యత్+రోచతే = ఏది ఇష్టమో అదే. మీ ఇష్టమే మా ఇష్టం – అనడం.

**తేన:** తేన–హి = అందువల్ల, పూర్వగతాన్ = ఇప్పటికే (వలలూ వగైరాలతో) అడవిలోకి వెళ్ళిన, వనగ్రాహిణః = వేటగాండ్రను, నివర్తయ = వెనక్కి రప్పించు. మే–సైనికాః = మన భటులు, తపోవనమ్ = ఈ చేరువలోని ఆశ్రమాన్ని, యథా+న–ఉపరుంధంతి = ఎలా ఆక్రమించరో, తథా = అలా, నిషేద్ధవ్యాః =నిషేధింపబడాలి. ఆశ్రమంజోలికి – దరిదాపులకు – వెళ్ళకుండా తక్షణం నిషేధించు అని ఆజ్ఞాపించడం. పశ్య = (తెలుసుకో) చూడూ –

**సేనా : యదాజ్ఞా పయతి స్వామీ.**

**విదూ : భో ఉచ్చాహాఇత్థఆ ణిక్కమ్మ ణిక్కమ్మ: (భో ఉత్సాహయితః! నిష్క్రామ! నిష్క్రామ!!)**

**(నిష్క్రాంతస్సేనాపతిః)**

**రాజా : (పరిజనం విలోక్య) అపనయంతు భవత్యో మృగయావేషమ్. రైవతక! త్వమపి స్వం నియోగమశూన్యం కురు.**

---

**శమ:** శమ-ప్రధానేషు = శాంతగుణమే ప్రధానంగా ఉన్న, తపోధనేషు = తపోధనులలో (మహాతపస్వులందు), దాహాత్మకమ్ = అగ్నిమయమైన (కాల్చివేసే), తేజః = ఒకానొక తేజస్సు-తపశ్శక్తి, గూఢమ్ = నిగూఢంగా, అస్తి-హి = ఉంటుంది సుమా! స్పర్శ+అనుకూలాః+అపి = తాకడానికి వీలైనవిగా కనిపించినా, సూర్యకాంతాః = సూర్యకాంతమణులు, అన్యతేజః+అభిభవాత్ = ఇతర తేజస్సు తాలూకు తిరస్కారంవల్ల, తేజః = తమ లోపలి తేజస్సును, వమంతి = వెలుపలికి (వెళ్ళ గక్కుతాయి) పెల్లుబికిస్తాయి. (తదన్యతేజోఽభిభవాత్ – అని పాఠాంతరం).

**తాత్పర్యం:** మహాతపస్వులు శాంతగుణప్రధానులే. కానీ వారిలో దాహాత్మకమైన ఒక తేజస్సు దాగి ఉంటుంది సుమా! సూర్యకాంతమణులు తాకడానికి వీలుగానే కన్పిస్తాయి. కానీ మరొక తేజస్సు ఏదైనా వాటిని ధిక్కరిస్తే అప్పుడవి తమ లోపలి తేజస్సును వెలుపలికి పెల్లుబికిస్తాయి.

**యదాజ్ఞా:** స్వామీ – మహారాజు, యత్ + ఆజ్ఞాపయతి = ఆనతిచ్చినట్టే!

**భో ఉచ్చాహా:** భోః = ఓయీ! ఉత్సాహయితః = ఉత్సాహకారకా! సేనాపతీ! నిష్క్రామ- నిష్క్రామ = ఇక నిష్క్రమించు నిష్క్రమించు (ధ్వంసితస్తే ఉత్సాహవృత్తాంతః. గచ్ఛ దాస్యాః పుత్ర! అని కొన్నింట పాఠం).

(సేనాపతిః = సేనాపతి భద్రసేనుడు, నిష్క్రాంతః = నిష్క్రమిస్తాడు).

**అపనయంతు:** (పరిజనమ్ = సేవకురాండ్రను, విలోక్య = చూసి) భవత్యః = మీరు, మృగయావేషమ్ = నా వేట దుస్తులను, అపనయంతు = కొనిపొండి! రైవతక = ఓయీ (ద్వారపాలక) రైవతక! త్వమ్+అపి = నువ్వుకూడా, స్వమ్-నియోగమ్ = నీ

**పరి : జం దేవో ఆణవేది. (యద్ దేవ ఆజ్ఞాపయతి).**

**(నిష్క్రాంతః)**

**విదూ : కిదం భవదా నిమ్మచ్ఛిఅం. సంపదం ఏదస్సిం పాదవచ్ఛాఆఏ విరఇద లదావిదాణదంసణీఆఏ ఆసణే ణిసీదదు భవం, జావ అహం వి సుహాసీణో హోమి. (కృతం భవతా నిర్మక్షికమ్. సాంప్రతమ్ ఏతస్యాం పాదపచ్ఛాయాయాం విరచితలతావితానదర్శనీయాయామ్ ఆసనే నిషీదత భవాన్. యావదహమపి సుఖాసీనో భవామి).**

---

ఉద్యోగాన్ని, అశూన్యమ్+కురు = సమర్థంగా నిర్వహించు. బయటకు వెళ్ళి గుమ్మం దగ్గర ఏకాగ్రతతో కావలి ఉండు –అని. (శూన్యతా = absentmindedness. శూన్యదృక్).

**విశేషాలు:** నియోగమ్ = అధికారమ్, అశూన్యమ్+కురు = సనాథం కురు–అని కాటయవేముని వ్యాఖ్య. సమర్థంగా నిర్వహించు అని తాత్పర్యం. రైవతకా! నీవును నా యాజ్ఞ నడిపింపుము – అని కందుకూరి వారి అనువాదం. Here, women! Take my hunting dress; and you Raivataka! Keep guard carefully outside – అని మోనియర్ – విలియమ్స్ ఆంగ్లీకరణ. వీరే తమ నిఘంటువులో a–sunyam+kri = అశూన్యమ్ + కృ =to effect, accomplish – అని ఇచ్చారు. సమర్థంగా – సమగ్రంగా నిర్వహించు అని.

**జం దేవో:** దేవః = మహారాజు, యత్+ఆజ్ఞాపయతి = ఆజ్ఞాపించినట్టే.

(నిష్క్రాంతః = రైవతకుడూ నిష్క్రమిస్తాడు)

**కిదం:** భవతా = నీచేత, నిర్మక్షికమ్ = ఒక్క ఈగ అయినా లేనిదిగా, కృతమ్ = ఈ గుడారం చేయబడింది. అందరినీ తోలేశావనడం. సాంప్రతమ్ = ఇప్పుడు, విరచిత = అల్లుకోబడిన, లతా = తీగలే, వితాన = మేల్కట్టుగా, దర్శనీయాయామ్ = చూడచక్కనిదైన (దట్టంగా అల్లుకున్న లతాసమూహంతో అందంగాఉన్న), ఏతస్యామ్ = ఈ, పాదప+ఛాయాయామ్ = చెట్టు నీడలో, ఆసనే = రాతిపీటమీద, భవాన్ = నువ్వు, నిషీదత = కూర్చో! యావత్ = ఇంతలో, అహమ్+అపి = నేనున్నూ, సుఖాసీనః + భవామి = హాయిగా కూర్చొంటాను.

**రాజా : గచ్ఛాగ్రతః.**

**విదూ : ఏదు భవం (ఏతు భవాన్).**

**(ఉభౌ పరిక్రమ్యోపవిష్టౌ)**

**రాజా : మాధవ్య! అనవాప్తచక్షుఃఫలోఽసి, యేన త్వయా ద్రష్టవ్యానాం పరం న దృష్టమ్.**

**విదూ : ణం భవం అగ్గదో మే వట్టది. (నను భవానగ్రతో మే వర్తతే!)**

**రాజా : సర్వః ఖలు కాంతమాత్మీయం పశ్యతి. అహం తు తామేవాశ్రమ లలామభూతాం శకుంతలామధికృత్య బ్రవీమి.**

---

**గచ్ఛ:** అగ్రతః+గచ్ఛ = ముందు నడు!!

**ఏదు:** భవాన్+ఏతు = నువ్వూ రా! (ఏతు ఏతు భవాన్ అనీ ఇత ఇతో భవాన్ అనీ పాఠాంతరాలు. ఇటు, ఇటు–మహారాజా! అన్నట్టు).

(ఉభౌ = ఇద్దరూ, పరిక్రమ్య = నాలుగడుగులు నడిచి, ఉపవిష్టౌ = కూర్చొంటారు)

**మాధవ్య:** మాధవ్య = మాధవ్యుడా! అనవాప్తచక్షుఃఫలః= కన్నులు ఉన్నందుకు తగ్గ ఫలం పొందనివాడవు, అసి = అయ్యావు సుమా! యేన = ఎందుకంటే – త్వయా = నీచేత, ద్రష్టవ్యానామ్+పరమ్ = చూడదగ్గవాటిలో ఉత్తమోత్తమమైనది, న–దృష్టమ్ = చూడబడనే లేదు. (దర్శనీయం న దృష్టమ్–అని పాఠాంతరం).

**ణం భవం:** భవాన్ = నువ్వు, మే + అగ్రతః = నా ఎట్టఎదుట, వర్తతే–నను = ఉన్నావు గదా! కన్నులున్నందుకు ఫలంగా దర్శనీయుడివైన నిన్ను దర్శిస్తున్నాను, చాలదా? - అనడం.

**సర్వః:** సర్వః = ప్రతివాడూ, ఆత్మీయమ్ = తనదైనదానిని, కాంతమ్ = మనోహర మైనదిగా, పశ్యతి = భావిస్తాడు. ప్రతివాడూ తనవాడిని అందగాడనే భావిస్తాడు. అహమ్+తు = నేనుమాత్రం, ఆశ్రమలలామభూతామ్ = తపోవనానికే చేర్చుక్కలాంటి దైన (లలామం = భూషణం), తామ్ + శకుంతలామ్ + ఏవ = ఆ శకుంతలనే, అధికృత్య = ఉద్దేశించి, బ్రవీమి = మాట్లాడుతున్నాను (లలామా స్త్రీ లలామాపి ప్రభావే పుష్కరే ధ్వజే శ్రేష్ఠే భూషా పుండ్ర శృంగ పుచ్ఛ చిహ్న విలింగకే – ఇది యాదవః).

**విదూ : (ఆత్మగతమ్) హోదు, సే అవసరం న దాఇస్సం (ప్రకాశమ్). భోవఅస్స! అజ్జ సా తావసకణ్ణఆ కిం అబ్భద్ధణీఆ దీసఇ? (భవతు, అస్య అవసరం న దాస్యామి. భో వయస్య! అద్య సా తాపసకన్యకా కిమ్ అభ్యర్థనీయా దృశ్యతే?)**

**రాజా : సఖే! న పరిహార్యే వస్తుని పౌరవాణాం మనః ప్రవర్తతే.**

**విదూ : తా కహం ఏదం? (తత్ కథమేతత్?)**

**రాజా : సురయువతిసంభవం కిల**
**మునేరపత్యం తదుజ్ఝితాధిగతమ్**

---

**హోదు:** (ఆత్మగతమ్ = తనలో) భవతు = అగుగాక! అస్య = ఇతడికి, అవసరమ్ = (శకుంతలను వర్ణించే) అవకాశం, న–దాస్యామి = ఇవ్వను.

(ప్రకాశమ్ = ప్రకాశంగా) భో వయస్య = మిత్రమా! అద్య = ఇవ్వేళ, సా+తాపసకన్యకా = ఆ మునికన్య, అభ్యర్థనీయా = అర్థింపదగినదిగానూ వలసినదిగానూ, దృశ్యతే + కిమ్ = కనబడుతోందా? మునికన్యను కోరవచ్చునా? ఆమె అంతటి అర్హురాలా? – అనడం.

**సఖే:** సఖే = మిత్రుడా! పౌరవాణామ్+మనః = పురువంశోద్భవుల మనస్సు, పరిహార్యే–వస్తుని = పరిహరించదగ్గ విషయంలో, న + ప్రవర్తతే = తలదూర్చదు. పౌరవుడనైన నా మనస్సు – కోరదగని దానిని కోరదు – అనడం.

**తా కహం:** తత్ = అయితే, ఏతత్ + కథమ్ = మరి ఇదేమిటి? వాంఛింపదగని ఒక ముని కన్యను నువ్విలా వాంఛించడమేమిటి? – అని.

**సురయువతి:** సురయువతి – సంభవమ్ = అప్సరసకు (మేనక) పుట్టినది. మునేః + అపత్యమ్ = మహర్షి (విశ్వామిత్రుడి) బిడ్డ. తత్ = వారిద్దరిచేత, ఉజ్ఝిత + అధిగతమ్ + కిల = విడువబడి (కణ్వుడిచేత) అందుకోబడినది సుమా! నవమాలికా–కుసుమమ్ = ఒక విరజాజి పువ్వు, చ్యుతమ్ = తనంత తాను రాలి, అర్కస్య+ఉపరి = జిల్లేడు చెట్టుమీద, పతితమ్+ఇవ = పడ్డ చందం!!

**తాత్పర్యం:** మిత్రమా! శకుంతల – మేనక అనే అప్సరసకూ విశ్వామిత్రర్షికీ జన్మించిన బిడ్డ. వారిద్దరూ విడిచిపెట్టేస్తే కణ్వుడికి లభించింది – విరజాజిపువ్వు రాలి జిల్లేడు మొక్కమీద పడ్డట్టు!!

**అర్కస్యోపరి పతితం**
**చ్యుతమివ నవమాలికా కుసుమమ్. 08**

విదూ : **(విహస్య) జహ కస్స వి పిండఖజ్జురేహిం ఉవ్వేజిదస్స తితిణీఏ అహిలాసో భవే తహ ఇత్థిఆ రఅణపరిభాఇణో భవదో ఇఅం అబ్భత్థణా. (యథా కస్యాపి పిండఖర్జూరైరుద్వేజితస్య తింత్రిణ్యామభిలాషో భవేత్, తథా స్త్రీరత్న పరిభావినో భవత ఇయమభ్యర్థనా).**

రాజా : **న తావదేనాం పశ్యసి యేనైవమవాదీః.**

విదూ : **తం క్ఖు రమణిజ్జం జం భవదో వి విహ్మఅం ఉప్పాదేది. (తత్ఖలు రమణీయం యద్భవతోఽపి విస్మయముత్పాదయతి)**

రాజా : **వయస్య! కిం బహునా-**

---

**జహ కస్స:** (విహస్య = నవ్వి) పిండఖర్జూరైః = ముంత ఖర్జూరాలతో, ఉద్వేజితస్య = మొహంమొత్తిన, కస్య + అపి = ఒకానొకడికి, తింత్రిణ్యామ్ = చింతకాయమీద, అభిలాషః = కోరిక, యథా-భవేత్ = ఎలా కలుగుతుందో, తథా = అలా, స్త్రీ రత్న = రత్నాల్లాంటి వనితలను, పరిభావినః = (మొహం మొత్తి) తిరస్కరించేవాడివైన, భవతః = నీకు, ఇయమ్ + అభ్యర్థనా = ఈ కోరిక! ఒక మునికన్యకమీద మనసయ్యిందా అనడం. (స్త్రీరత్నాని పరిభవితుం తిరస్కర్తుం శీలం యస్య – స్త్రీ రత్నపరిభావీ).

**న తావత్:** ఏనామ్ = ఈ శకుంతలను, యేన-తావత్-న+పశ్యసి = నువ్వు చూడలేదు కాబట్టి, ఏవమ్+అవాదీః = ఇలా మాట్లాడుతున్నావు.

**తం క్ఖు:** భవతః+అపి = నీకుసైతం, విస్మయమ్ = ఆశ్చర్యం, యత్ + ఉత్పాదయతి = కలిగిస్తోందంటే, తత్ = అది, రమణీయమ్ + ఖలు = తప్పకుండా సుందరమే సుమా!

**చిత్రే:** వయస్య = మిత్రమా! కిమ్ + బహునా = వెయ్యేల?! చిత్రే = చిత్రపటంలో, నివేశ్య = సమగ్రసుందరంగా చిత్రించి, విధినా = బ్రహ్మచేత, పరికల్పిత = (అటుపైని) సమకూర్చబడిన, సత్త్వయోగా+ను = ప్రాణసంయోగంకలదియా? ముందు బొమ్మ గీసి అటుపైని దానికి ప్రాణాలు పోశాడా? రూప+ఉచ్చయేన = చంద్రపద్మాదులైన సుందరవస్తువుల సంపుటితో (ముడిసరుకుతో), విధినా = సృష్టికర్తచేత, మనసా = కేవలం మనస్సుతో, కృతా+ను = చేయబడిందా? మనస్సుతో సృష్టించాడా? ధాతుః =

**చిత్రే నివేశ్య పరికల్పిత సత్త్వయోగా**
**రూపోచ్చయేన మనసా విధినా కృతా ను**
**స్త్రీరత్న సృష్టి రపరా ప్రతిభాతి సా మే**
**ధాతుర్విభుత్వమనుచింత్య వపుశ్చ తస్యాః** **09**

**విదూ : జయి ఎవ్వం పచ్చాదేసో దాణిం రూపవదీణం. (యద్యేవం ప్రత్యాదేశ ఇదానీం రూపవతీనామ్)**

**రాజా : ఇదం చ మే మనసి వర్తతే -**

**అనాఘ్రాతం పుష్పం కిసలయమలూనం కరరుహై**
**రనావిద్ధం రత్నం మధు నవమనాస్వాదితరసమ్**

---

బ్రహ్మదేవుడి, విభుత్వమ్ = సామర్థ్యమూ, తస్యాః = ఆమె, వపుః+చ = (శరీరమూ), రూపమూ, అనుచింత్య = అనుశీలించినమీదట, మే = నాకు, సా = ఆ శకుంతల, అపరా = అపూర్వమైన మరొక బ్రహ్మదేవుడిదైన, స్త్రీరత్నసృష్టిః = స్త్రీరత్న సృష్టి, ప్రతిభాతి = అనిపిస్తోంది.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు ఒక స్త్రీ రత్నాన్ని అద్భుతంగా బొమ్మగీసి, అటుపైని దానికి ప్రాణం పోశాడా? లేదంటే సుందరాతి సుందరమైన ముడిసరుకును సమకూర్చుకుని కేవలం మనస్సుతో ఈమెను సృష్టించాడా? రెండూ కాదు. బ్రహ్మదేవుడి – సామర్థ్యమూ శకుంతలారూపమూ అనుశీలించి చూస్తే నాకనిపిస్తోంది – శకుంతల కచ్చితంగా అపర స్త్రీరత్న సృష్టి, మరో బ్రహ్మదేవుడి మరో వినూతన సృష్టి!! (రూపోచ్చయేన ఘటితా మనసా కృతాను అని పాఠాంతరం. రూపోచ్చయంతో కూర్చబడిందా? మనస్సుతో చేయబడిందా?)

**జయి ఎవ్వం:** ఏవమ్ + యది = ఇట్లే అయినచో, ఇదానీమ్ = ఇప్పుడింక, రూపవతీనామ్ = సమస్త సుందరాంగులకూ, ప్రత్యాదేశః + ఏవ = నిరాకరణమే. (ప్రత్యాదేశో నిరాకృతిః – ఇత్యమరః) వీడ్కోలే అనడం.

**అనాఘ్రాతమ్:** ఇదమ్+చ = ఇదికూడా, మే–మనసి–వర్తతే = నాకు మనస్సులో అనిపిస్తోంది. అనాఘ్రాతమ్ = వాసన చూడబడని, పుష్పమ్ = పువ్వు. కరరుహైః = చేతిగోరులతో, అలూనమ్ = గిచ్చబడని, కిసలయమ్ = చిగురాకు. అనావిద్ధమ్ = నిర్దుష్టమైన – సానపెట్టబడని (ఆవిద్ధం కుటిలం భగ్నమిత్యమరః – రంధ్రం

**అఖండం పుణ్యానాం ఫలమివ చ తద్రూపమనఘం**
**న జానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః 10**

విదూ : **తేణ హి లహు పరిత్తాఅదు ణంభవం. మా కస్స వి తవస్సిణో ఇంగుదీ తేల్లమిస్స చిక్కణ సీస్సస్స హత్థే పడిస్సది. (తేన హి లఘుపరిత్రాయతా మేనాం భవాన్. మా కస్యాపి తపస్వినః ఇంగుదీతైలమిశ్రచిక్కణశీర్షస్య హస్తే పతిష్యతి).**

రాజా : **పరవతీ ఖలు తత్రభవతీ. న చ సన్నిహితోఽత్ర గురుజనః**

---

చెయ్యబడని) రత్నమ్ = రత్నం. అనాస్వాదితరసమ్ = (తుమ్మెదలతో) రుచిచూడబడని, నవమ్-మధు = క్రొత్త పూదేనె. చ = ఇంకా, తత్ + రూపమ్ = ఆమె ఆకృతి, అఖండమ్ = అపరిమితమైన - పరిపూర్ణమైన, పుణ్యానామ్-ఫలమ్ + ఇవ = పుణ్యాల ఫలమన్నట్టుగా, అనఘమ్ = పరమపావనం. పుణ్యాల పరిపూర్ణ (అఖండ) ఫలమనిగానీ. (మధు మద్యే పుష్పరసే క్షౌద్రేఽపి. అమలమ్ = మనోజ్ఞం అని పాఠాంతరం) ఇహ = ఇంతటి సుందర రూపం విషయంలో, భోక్తారమ్ = అనుభవకర్తగా, కమ్ = ఎవడిని, విధిః = సృష్టికర్త, సముపస్థాస్యతి = ఏర్పరుస్తాడో, న-జానే = ఎరుగను.

**తాత్పర్యం:** చెలికాడా! ఈమె రూపం - వాసన చూడని పువ్వు. గోరు సోకని చిగురు. తరుగు లేని రత్నం. మూజూడని పూదేనె. అఖండ పుణ్యఫలంలాగా పరమపావనం. ఇంతకీ ఈ రూపాన్ని అనుభవించడానికి ఆ బ్రహ్మదేవుడు ఎవడిని ఏర్పరుస్తాడో తెలియదు గదా!

**తేణ హి:** తేన-హి = అలాగయితే, లఘు = వెంటనే, భవాన్ = నువ్వు, ఏనామ్ = ఈ శకుంతలను, పరిత్రాయతామ్ = కాపాడు. ఇంగుదీ-తైల-మిశ్ర = ఇంగుది గింజల నూనె పులుముకోవడంతో, చిక్కణ = నునుపుదేరిన - జిడ్డుగొన్న, శీర్షస్య = శిరస్సుకలవాడైన, కస్య+అపి-తపస్వినః = ఎవడో ఒక జడదారి మునికుమారుడి, హస్తే = చేతిలో, మా-పతిష్యతి = పడకుండుగాక!

**పరవతీ:** తత్రభవతీ = ఆ మాన్యురాలు, పరవతీ-ఖలు = పరాధీనురాలు గదా! గురుజనః = (పెద్దలు-) కణ్వుడు, అత్ర = ఆశ్రమంలో, సన్నిహితః+న+చ = (సన్నిహితుడై) లేడుకూడా.

విదూ : అత్తభవంతం అంతరేణ కీదిసో సే దిట్ఠిరాఓ? (అత్రభవంతమంతరేణ కీదృశస్తస్యా దృష్టిరాగః?)

రాజా : నిసర్గాదప్రగల్భస్తపస్వికన్యాజనః. తథాపి తు –

**అభిముఖే మయి సంహృతమీక్షితం**
**హసితమన్యనిమిత్త కృతోదయమ్**
**వినయవారితవృత్తి రతస్తయా**
**న వివృతో మదనో న చ సంవృతః** **11**

---

**అత్తభవంతం:** అత్రభవంతమ్ + అంతరేణ = నిన్ను ఉద్దేశించి, తస్యాః = ఆమె, దృష్టిరాగః = అనురాగదృష్టి – చక్షుఃప్రీతి, కీదృశః = ఎలా ఉంది? ఏ స్థాయిలో ఉంది?

(అత్ర అంతరేణేత్యయం నిపాతః ఉద్దేశ్యార్థే వర్తతే. అంతరాంతరేణ యుక్తే – ఇతి సూత్రేణ ద్వితీయా – అని కాటయవేముడు శ్రీనివాసాచార్యుడూను. అత్ర భవంతమితి సప్తమ్యర్థే ద్వితీయా. తేన అత్రభవతి = పూజ్యే, అంతరేణ = విశేషేణ కీదృశః తస్యాః దృష్టిరాగః? "అంతరం రంధ్రావకాశయోః మధ్యే వినార్థే తాదర్థ్యే విశేషేఽవసరేఽవధౌ" – ఇతి హైమః అని రాఘవభట్టు. ఇతడూ కాటయవేముడూ మాళవికాగ్నిమిత్రం నుంచి ఇలాంటి మరో ప్రయోగాన్ని ఉదాహరించారు. అచిరప్పవుత్తోవదేసఅం ఛలిఅ అణామణహం అంతరేణ కిరీసీ మాలవిఏత్తి అజ్జ ణట్టా అరిణం గణదాసం పుచ్ఛిదుం తి.)

**నిసర్గాత్:** తపస్వి–కన్యా–జనః = తాపసకన్యాజనం, నిసర్గాత్ = స్వభావతః, అప్రగల్భః = జాణతనం కలది కాదు. తథా + అపి –తు = అయినప్పటికీ –

**అభిముఖే:** మయి = నేను, అభిముఖే (సతి) = అభిముఖంగా ఉన్నప్పుడు, ఈక్షితమ్ = శకుంతల చూపు, సంహృతమ్ = మరలింపబడింది – మరల్చుకొంది. హసితమ్ = ఆమె నవ్వు, అన్యనిమిత్త – కృత+ఉదయమ్ = అభిలాషను ప్రకటించడం కాకుండా మరొక కారణంతో కావింపబడిన ఆవిర్భావం కలదయ్యింది. అతః = అందుచేత, వినయ = వినయంవల్ల, వారిత = వారింపబడ్డ, వృత్తిః = ఆవిష్కారం కలవాడై, మదనః = మన్మథుడు, తయా = ఆమెచేత, న+వివృతః = ప్రకటితుడు కాలేదు, న–చ–సంవృతః = అప్రకటితుడూ కాలేదు.

**తాత్పర్యం:** ఆమె నావైపు చూసింది. కానీ నేను అభిముఖంగా ఉండి ఆమెవైపు చూస్తున్నప్పుడు మాత్రం ఆమె తన చూపులు మరల్చుకొంది. నవ్వడమైతే నవ్వింది.

**విదూ : ణఖు దిట్ఠమేత్తస్స తుహ అంకం సమారోహది. (న ఖలు దృష్టమాత్రస్య తవాంకం సమారోహతి.)**

**రాజా : మిథః ప్రస్థానే పునః శాలీనతయాపి కామమావిష్కృతో భావః తత్ర భవత్యా. తథాహి –**

**దర్భాంకురేణ చరణః క్షత ఇత్యకాండే**
**తన్వీ స్థితా కతిచిదేవ పదాని గత్వా**
**ఆసీద్వివృత్తవదనా చ విమోచయంతీ**
**శాఖాసు వల్కలమసక్తమపి ద్రుమాణామ్. 13**

---

కానీ వేరేదో కారణంగా వచ్చిన నవ్వు అన్నట్టు నవ్వింది. అంచేత ఆమెలోని మన్మథుడు ప్రకటితుడూ కాలేదు, అలా అని ఆచ్ఛాదితుడూ కాలేదు.

**ణఖు:** దృష్టమాత్రస్య = చూడబడినవాడివైనంతమాత్రంచేత, తవ+అంకమ్ = నీ ఒడిని, న+ సమారోహతి+ఖలు = అధిరోహించదుగదా! చూసినంతమాత్రాన నీ ఒడిలో వచ్చి వాలుతుందా? (ఇంతకన్నా స్పష్టమైన అనురాగ ప్రకటన కావాలనడం).

**మిథః:** మిథః = స్నేహితురాండ్రతో కలిసి, ప్రస్థానే–పునః = వెళ్ళేటప్పుడు మాత్రం, శాలీనతయా+అపి = సిగ్గరితనంతోనే అయినా, తత్రభవత్యా = ఆ మాన్యురాలిచేత, భావః = అభిలాష, కామమ్ + ఆవిష్కృతః = బాగా స్పష్టంగానే ఆవిష్కృతమయ్యింది. (శాలీన కౌపీనే అధృష్టాకార్యయోః). తథా హి = అవును సుమా!

**దర్భాంకురేణ:** దర్భ + అంకురేణ = దర్భ మొలకతో, చరణః = పాదం, క్షతః+ఇతి = గాయపడింది అని, అకాండే = నిష్కారణంగానే, తన్వీ = ఆ కృశాంగి శకుంతల, కతిచిత్ + ఏవ = ఒకటి రెండు మాత్రమే, పదాని = అడుగులు, గత్వా = వెళ్ళి, స్థితా = ఆగింది. ద్రుమాణామ్ = చెట్ల, శాఖాసు = కొమ్మలలో, అసక్తమ్+అపి = తగుల్కొననిదే అయినప్పటికీ, వల్కలమ్ = తన నారచీరను, విమోచయంతీ = విడిపించుకొంటున్నదై, వివృత్త వదనా+చ = నావైపు త్రిప్పబడిన ముఖం కలదికూడా, ఆసీత్ = అయ్యింది.

**తాత్పర్యం:** కాలికి దర్భ గుచ్చుకుంది అని వంకపెట్టి ఆ తన్వి, అలతి దూరంలోనే ఆగింది. చెట్టుకొమ్మలకు తన చీరకొంగు తగుల్కోకపోయినా తగుల్కొన్నట్టూ దాన్ని విడిపించుకొంటున్నట్టూ (నటిస్తూ) నావైపు ముఖం త్రిప్పి చూసింది కూడా!!

**విదూ : తేణం హి గహీదపాహేఓ హోహి. కిదం తుఏ ఉవవణం తవోవణం త్తి పేక్ఖామి. (తేన హి గృహీతపాథేయో భవ. కృతం త్వయోపవనం తపోవనమితి పశ్యామి).**

**రాజా : సఖే! తపస్విభిః కైశ్చిత్పరిజ్ఞాతోఽస్మి. చింతయ తావత్కేనాపదేశేన సకృదప్యాశ్రమే వసామః?**

**విదూ : కో అవరో అవదేసో తుమ రాఅణం. ణీవారచ్ఛట్ఠ భాఅం అంహాణం ఉవహరంతు త్తి. (కోఽపరోఽపదేశస్తవ రాజ్ఞః. నీవారషష్ఠభాగమ్ అస్మాక ముపహరంత్వితి.)**

**రాజా : మూర్ఖ! అన్యద్భాగధేయమేతేషాం రక్షణే నిపతతి, యద్రత్నరాశీనపి విహాయాభినంద్యమ్. పశ్య –**

---

**తేణం హి:** తేన–హి = అలాగయితే, గృహీతపాథేయః = (శకుంతలను ఆహ్వానించడానికి) అర్ఘ్యపాద్యాలు చేతబట్టినవాడవు, భవ = కమ్ము. తపోవనమ్ = ఈ ఆశ్రమం, త్వయా = నీచేత, ఉపవనమ్ + కృతమ్ + ఇవ = ఉద్యానవనంగా మార్చబడినట్టు, పశ్యామి = భావిస్తున్నాను. తపోవనాన్ని శృంగారవనం చేశావనడం.

**సఖే:** సఖే = మిత్రుడా! తపస్విభిః+కైశ్చిత్ = ఇక్కడి కొందరు మునులచేత, పరిజ్ఞాతః + అస్మి = గమనింపబడ్డాను. నేను ఇక్కడ ఉన్నట్టు కొందరు వైఖానసులు ఇప్పటికే గుర్తించారనడం. చింతయ–తావత్ = బాగా ఆలోచించు. కేన+అపదేశేన = ఏ వంకతో, సకృత్+అపి = కనీసం ఒక్కసారికైనా – కొంచెం సేపైనా, ఆశ్రమే = ఈ ఆశ్రమంలో, వసామః = ఉండగలం? ఏ వంకతో ఇక్కడ ఉందామనడం.

**కో అవరో:** రాజ్ఞః + తవ = మహారాజువైన నీకు, అపరః + అపదేశః = మరొక వంక, కః = ఏమిటి? నీవారషష్ఠభాగమ్ = మీ నివ్వరి ధాన్యంలో ఆరవ వంతు, అస్మాకమ్ = మాకు, ఉపహరంతు = కప్పంగా తెండి, ఇతి = అనేదే. ఈ రాచకార్యమే ఉండగా మరొక మిష ఎందుకు – అని.

**మూర్ఖ:** మూర్ఖ = తెలివితక్కువవాడా! ఏతేషామ్ = ఈ తపస్వులను, రక్షణే = రక్షించడంలో, అన్యత్ = నీవారషష్ఠాంశంకన్నా అతిరిక్తమైన, భాగధేయమ్ = కప్పం, నిపతతి = వచ్చిపడుతుంది, యత్ = అయ్యది, రత్నరాశీన్ + అపి = రత్నరాశులను సైతం,

**యదుత్తిష్ఠతి వర్ణేభ్యో నృపాణాం క్షయి తత్ఫలమ్**
**తపః షడ్భాగమక్షయ్యం దదత్యారణ్యకా హి నః** **13**

(నేపథ్యే)

**హంత, సిద్ధార్థౌ స్వః.**

రాజా : **(కర్ణం దత్వా) అయే, ధీరప్రశాంతస్వరైస్తపస్విభిర్భవితవ్యమ్!**

(ప్రవిశ్య)

దౌవారికః : **జేదు భట్టా. ఏదే దువే ఇసికుమారఆ పడిహారభూమిం ఉవవిట్ఠిదా.**
**(జయతు భర్తా. ఏతౌ ద్వౌ ఋషికుమారౌ ప్రతీహారభూమి ముపస్థితౌ.)**

---

విహాయ = త్రోసిరాజని, అభినంద్యమ్ = ప్రశంసింపదగినది – ఆకాంక్షింపదగ్గది. పశ్య = చూడు –

**యదుత్తిష్ఠతి:** వర్ణేభ్యః = బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యాలనుంచీ, నృపాణామ్ = రాజులకు, యత్ = ఏ కప్పం, ఉత్తిష్ఠతి = ఉత్పన్నం అవుతుందో, తత్ + ఫలమ్ = ఆ ఫలరూపమైన కప్పం, క్షయి = నానాటికీ తరిగిపోతుంది – వ్యయమైపోతుంది. ఆరణ్యకాః = ఈ తపస్విజనులు, నః = మనకు, అక్షయ్యమ్ = ఏనాటికీ తరిగిపోని, తపః+షడ్భాగమ్ = తపస్సులో ఆరో వంతును కప్పంగా, దదతి+హి = ఇస్తారు సుమా! వీరు చెల్లించే కప్పం క్షయించనిది సుమా – అని.

**తాత్పర్యం:** ప్రజలనుంచి మనం వసూలుచేసే కప్పం వ్యయంతో క్షయించి పోతుంది. ఈ తపస్వులు తామై చెల్లించే కప్పం – తమ తపస్సులో ఆరో భాగం – అది ఎన్నటికీ క్షయించదు – అక్షయ్యం. ఇది గ్రహించు.

(నేపథ్యే = తెరలో)

హంత = ఆహా! సిద్ధార్థౌ+స్వః = ఇద్దరమూ కృతార్థులమయ్యాము. (హంత హర్షేఽనుకంపాయాం వాక్యారంభవిషాదయోః)

**అయే:** (కర్ణమ్ + దత్వా = చెవి ఒగ్గి – విని) అయే = అహో! ధీరప్రశాంతస్వరైః = గంభీరంగానూ ప్రశాంతంగానూ ఉన్న ఈ దినుసు కంఠస్వరాలుగలవారైన, తపస్విభిః = మునులచేత, భవితవ్యమ్ = కానోపు. కంఠస్వరాలు ఇంత ధీరంగానూ

**రాజా : తేన హ్యవిలంబితం ప్రవేశయ తౌ.**

**దౌవారి : ఏసో పవేసామి (ఏష ప్రవేశయామి). (ఇతి నిష్క్రమ్య ఋషికుమారాభ్యాం సహ ప్రవిశ్య) ఇదో ఇదో భఅవంతౌ. (ఇత ఇతో భగవంతౌ).**

**(ఉభౌ రాజానం విలోకయతః)**

**ప్రథమః : అహో! దీప్తిమతోஉపి విశ్వసనీయతాస్య వపుషః! అథవోపపన్న మేతదృషిభ్యో నాతిభిన్నే రాజని. కుతః–**

---

ప్రశాంతంగానూ ఉన్నాయంటే ఈ వినిపించిన మాట కచ్చితంగా ఎవరో తపస్విజనులదే అయ్యుంటుంది – అని.

(ప్రవిశ్య = ద్వారపాలకుడు ప్రవేశించి)

**జేదు:** భర్తా = ప్రభువు, జయతు = జయించుగాక! ఏతౌ = ఇరిగో, ద్వౌ–ఋషికుమారౌ = ఇద్దరు మునికుమారులు, ప్రతీహారభూమిమ్ = వాకిలివద్ద, ఉపస్థితౌ = నిలిచారు – వాకిలిని సమీపించారు.

**తేన:** తేన = అయితే, తౌ = వారిద్దరినీ, అవిలంబితమ్ = ఆలస్యం లేకుండా, ప్రవేశయ = ప్రవేశపెట్టు. వెంటనే లోపలికి పంపు – అని.

**ఏసో:** ఏషః = ఇదిగో, ప్రవేశయామి = ప్రవేశ పెడుతున్నాను. (ఇతి = అని, నిష్క్రమ్య = నిష్క్రమించి, ఋషికుమారాభ్యామ్ + సహ = ముని కుమారులతో సహా, ప్రవిశ్య = తిరిగివచ్చి) భగవంతౌ = మహానుభావులారా! ఇతః + ఇతః = ఇటు ఇటు!!

(ఉభౌ = ఆ ఋషికుమారులిద్దరూ, రాజానమ్ = రాజును, విలోకయతః = చూస్తారు).

**అహో:** అహో = ఎంత ఆశ్చర్యం! దీప్తిమతః + అపి = ఎంతో తేజస్వంతమే అయినా, అస్య = ఈతని, వపుషః = శరీరరూపానికి, విశ్వసనీయతా = ఎంతటి చనవరికం!! తేజస్సు చూస్తే జంకు కలుగుతున్నా, లేచి ఎదురురావడం ఇత్యాదిగా ఇతడి వినయం చూస్తే చనవుగా సమీపించవచ్చు అనే నమ్మకం కలుగుతోందని – ఆశ్చర్యం. అథవా = అయినా, ఏతత్ = ఈ తేజస్సు ఈ విశ్వసనీయత అనేవి, ఋషిభ్యః + న + అతిభిన్నే = ఋషులకన్నా పెద్ద తేడాలేని – అంటే –

> **అధ్యాక్రాంతా వసతిరమునాప్యాశ్రమే సర్వభోగ్యే**
> **రక్షాయోగాదయమపి తపః ప్రత్యహం సంచినోతి**
> **అస్యాపి ద్యాం స్పృశతి వశినశ్చారణ ద్వంద్వగీతః**
> **పుణ్యః శబ్దో మునిరితి ముహుః కేవలం రాజపూర్వః** **14**

**ద్వితీయః : గౌతమ! అయం స బలభిత్సఖః పార్థివో దుష్యంతః?!**

**ప్రథమః : అథకిమ్.**

---

ఋషితుల్యుడే అయిన, రాజని = ఈ మహారాజు విషయంలో, ఉపపన్నమ్ = యుక్తమే. కుతః = ఎందుకంటే – (దుష్యంతుణ్ని రాజఋషిగా సంభావిస్తున్నాడు –)

**అధ్యాక్రాంతా:** సర్వభోగ్యే = అందరికీ హక్కు కలదైన, ఆశ్రమే = రాజ్యపాలన అనే ఆశ్రమంలో, అమునా+అపి = ఇతడిచేతకూడా, వసతిః = ఉపస్థితి (ఉనికి), అధ్యాక్రాంతా = స్వీకృతమయ్యింది. రక్షా–యోగాత్ = ప్రజలందరికీ తపోవనాలకూ రక్షణ కల్పించడం అనే కర్మాచరణవల్ల, ప్రత్యహమ్ = నిత్యమూ, అయమ్+అపి = ఇతడు సైతం, తపః = తపస్సును, సంచినోతి = సమకూర్చుకుంటున్నాడు. వశినః = నిగ్రహ సంపన్నుడైన, అస్య+అపి = ఇతడికి కూడా, మునిః + ఇతి = ఋషి అనే, పుణ్యః+శబ్దః = పవిత్ర పదం, కేవలమ్ = కేవలమూ, రాజపూర్వః = రాజశబ్ద పూర్వకమై, ముహుః = మాటిమాటికీ, చారణద్వంద్వగీతః = చారణుల జంటతో కీర్తింపబడుతున్నదై, ద్యామ్+స్పృశతి = మిన్నంటుతోంది.

**తాత్పర్యం:** ఋషి ఒక ఆశ్రమంలో నివసించినట్టు – ఇతడు కూడా సర్వోపభోగ్యమైన రాజ్యపాలన అనే ఆశ్రమంలో నివసిస్తున్నాడు. ప్రజలకూ ఋషులకూ సంరక్షణ కల్పించడంవల్లనూ ఋషుల తపస్సులలోని ఆరవ భాగాన్ని కప్పంగా పొందుతున్నాడు కనుకనూ నిత్యమూ స్వయంగా తపస్సును పోగుచేసుకుంటున్నాడు. ఆశ్రమవాసం ఒక సామ్యం. తపస్సంపాదన మరొక సామ్యం. కనుకనే – నిగ్రహ సంపన్నుడైన ఇతడినికూడా పవిత్రమైన ఋషి శబ్దంతో – రాజపూర్వకమైన ఋషి శబ్దంతో చారణులు మిన్నంటేలా కీర్తిస్తున్నారు. నిగ్రహసంపన్నత ఒక సామ్యం. చారణులతో కీర్తింపబడటం మరొక సామ్యం. వెరసి ఇతడు రాజర్షి అనడం.

**గౌతమ:** గౌతమ = గౌతముడా! అయమ్ = ఇతడేనా, బలభిత్ + సఖః = ఇంద్రుడి మిత్రుడైన, సః+పార్థివః = ఆ మహారాజు, దుష్యంతః = దుష్యంతుడు?

**ద్వితీయః : తేన హి –**

**నైతచ్చిత్రం యదయముదధిశ్యామసీమాం ధరిత్రీ**
**మేకః కృత్స్నాం నగరపరిఘప్రాంశుబాహుర్భునక్తి.**
**ఆశంసంతే సురయువతయః త్యక్తభోగా హి దైత్యై**
**రస్యాధిజ్యే ధనుషి విజయం పౌరుహూతే చ వజ్రే. 15**

**ఉభౌ : (ఉపగమ్య) విజయస్వ రాజన్!**

**రాజా : అభివాదయే భవంతౌ.**

---

**అథకిమ్:** అథకిమ్ = అవును.

**నైతచ్చిత్రమ్:** తేన–హి = అందుకోసమే సుమా! ఉదధి = సముద్రమే, శ్యామసీమామ్ = నల్లని పొలిమేరయైన, కృత్స్నామ్+ధరిత్రీమ్ = సమస్త భూమినీ, నగరపరిఘ = రాజధాని చుట్టూ ఉండే అగడ్తలాంటి, ప్రాంశు–బాహుః = దీర్ఘ బాహువులు కలవాడైన, అయమ్ = ఇతడు, ఏకః = ఒక్కడే అద్వితీయుడై, భునక్తి+యత్ = అనుభవిస్తున్నాడనేది ఏది కలదో, ఏతత్ = అయ్యిది, న+చిత్రమ్ = విడ్డూరమేమీ కాదు. దైత్యైః = రాక్షసుల భయంవల్ల, త్యక్త భోగాః = భోగాలకూ సుఖాలకూ దూరమైన, సురయువతయః = దేవకాంతలు, అస్య = ఇతడి, అధిజ్యే + ధనుషి = ఎక్కుపెట్టిన ధనుస్సునందూ, చ = ఇంకా, పౌరుహూతే = ఇంద్రుడి, వజ్రే = వజ్రాయుధమునందూ, విజయమ్ = విజయాన్ని, ఆశంసంతే = ఆకాంక్షిస్తున్నారు. (దైత్యైః సక్తవైరాః – బద్ధవైరాః సుర యువతయః అని పాఠాంతరాలు. రాక్షసులతో శత్రుత్వం కలవారైన అప్సరసలు – అని అర్థం).

**తాత్పర్యం:** సముద్రమే పొలిమేరగా ఉన్న సకలభూమినీ ఇతడొక్కడే బాహుబల సంపన్నుడై ఏలుకొంటున్నాడంటే – ఆశ్చర్యం లేదు. కేవలం భూలోకవాసులే కాదు స్వర్గలోకవాసులైన అప్సరసలు సైతం రాక్షసులనుండి తమకు రక్షణ కల్పించడానికి ఇతడి ధనుస్సునూ (ముందుగానూ) ఇంద్రుడి వజ్రాయుధాన్నీ (రెండవదిగానూ) నమ్ముకుంటున్నారు.

**విజయ:** (ఉపగమ్య = సమీపించి) రాజన్ = మహారాజా! విజయస్వ = జయించుము – జయించుము!!

**ఉభౌ : స్వస్తి భవతే! (ఇతి ఫలాన్యుపహరతః)**

**రాజా : (సప్రణామం ప్రతిగృహ్య) ఆజ్ఞాపయితు మిచ్ఛామి.**

**ఉభౌ : విదితో భవానాశ్రమవాసినా మిహస్థః తేన భవంతం ప్రార్థయంతే.**

**రాజా : కిమాజ్ఞాపయంతి?**

**ఉభౌ : అత్రభవతః కణ్వస్యాసాన్నిధ్యా ద్రక్షాంసి న ఇష్టివిఘ్నముత్పాదయంతి తత్కతిపయరాత్రం సారథిద్వితీయేన భవతా సనాథీక్రియతామాశ్రమ ఇతి.**

**రాజా : అనుగృహీతోఽస్మి.**

---

**అభి:** భవంతౌ = మిమ్మిద్దరినీ, అభివాదయే = ఇదే నమస్కరిస్తున్నాను.

**స్వస్తి:** భవతే = నీకు, స్వస్తి = శుభమగుగాక! (ఇతి = అని, ఫలాని = పండ్లు, ఉపహరతః = అందిస్తారు).

**ఆజ్ఞా:** (సప్రణామమ్ = నమస్కారపూర్వకంగా, ప్రతిగృహ్య = స్వీకరించి, ఆజ్ఞాప యితుమ్ = ఆజ్ఞాపింపబడుటకు, ఇచ్ఛామి = అభిలషిస్తున్నాను. (ఆజ్ఞాపనాం ప్రయోజయితుమ్ – శ్రీనివాసాచార్యః)

**విదితః:** భవాన్ = నీవు, ఇహస్థః = ఇక్కడ ఉన్నవాడవుగా, ఆశ్రమ వాసినామ్ = మునులందరికీ, విదితః = తెలియబడ్డావు. నువ్వు ఇక్కడ ఉన్నట్టు మా మునులు అందరికీ తెలిసింది – అనడం. తేన = అందుచేత, భవంతమ్ = నిన్ను, ప్రార్థయంతే = ఒకటి అర్థిస్తున్నారు.

**కిమ్:** కిమ్ + ఆజ్ఞాపయంతి = ఏమి ఆజ్ఞాపిస్తున్నారు?

**అత్ర:** అత్రభవతః = మహానుభావుడైన, కణ్వస్య = కణ్వుడి, అసాన్నిధ్యాత్ = సన్నిధి లేకపోవడంవల్ల – ప్రస్తుతం కణ్వుడు ఇక్కడ ఆశ్రమంలో లేకపోవడంవల్ల; రక్షాంసి = రాక్షసులు, నః = మాకు, ఇష్టివిఘ్నమ్ = యాగవిఘ్నం, ఉత్పాదయంతి = కల్పిస్తున్నారు. మా యాగాలను భంగపరుస్తున్నారని. తత్ = అందుచేత, కతిపయరాత్రమ్ = కొన్ని రాత్రుల దాకా, సారథి ద్వితీయేన = సారథి ఒక్కడు మాత్రమే తోడుగా ఉన్నవాడవైన, (ఒకడు – రాజు. రెండు – సారథి – అంతే అని) భవతా = నీచేత, ఆశ్రమః = ఈ

**విదూ : (అపవార్య) ఇఅం దాణిం అనుఊలా అబ్భత్థణా. (ఇయమిదానీమ్ అనుకూలాభ్యర్థనా.)**

**రాజా : రైవతక! మద్వచనాదుచ్యతాం సారథిః, సబాణకార్ముకం రథముప స్థాపయేతి.**

**దౌవారిక : జేదు భట్టా! జం దేవో ఆణవేది. (జయతు భర్తా. యద్దేవ ఆజ్ఞాపయతి)**

**(ఇతి నిష్క్రాంతః)**

**ఉభౌ : (సహర్షమ్).**

**అనుకారిణి పూర్వేషాం యుక్తరూపమిదం త్వయి**
**ఆపన్నాభయసత్రేషు దీక్షితాః ఖలు పౌరవాః 16**

---

ఆశ్రమం, సనాథీక్రియతామ్ = రక్షకుడు కలదిగా చేయబడుగాక! కొన్నాళ్లపాటు మాకు రక్షకుడుగా ఇక్కడ ఉండమనడం. నువ్వూ నీ సారథీ ఉండండి, చాలు, మిగతా సేననంతటినీ నగరానికి పంపివేయమనడం – ఆశ్రమ శాంతికి భంగకరం కాబట్టి.

**అనుగృహీత:** అనుగృహీతః + అస్మి = అనుగృహీతుణ్ని అయ్యాను!!

**ఇఅం:** (అపవార్య = అపవారించి) ఇయమ్ + అభ్యర్థనా = ఈ అభ్యర్థన, ఇదానీమ్ = ఇప్పుడు, అనుకూలా = రాజుకు బాగా అనుకూలించేదే. అతడికి కావలసినదే వీళ్ళు కోరారు – అనడం.

**రైవతక:** రైవతక = రైవతకుడా! మద్వచనాత్ = నామాటగా, సారథిః = రథచోదకుడు, ఉచ్యతామ్ = ఆజ్ఞాపింపబడుగాక – సబాణకార్ముకమ్ = విల్లంబులతో సహా, రథమ్ + ఉపస్థాపయ – ఇతి = రథం సన్నద్ధపరచమని – సిద్ధం చేసి తెమ్మని.

**జేదు:** భర్తా = ప్రభువు, జయతు = జయించుగాక! దేవః = మహారాజు, యత్ + ఆజ్ఞాపయతి = ఆనతిచ్చినట్టే!

(ఇతి = అని, నిష్క్రాంతః = నిష్క్రమించును.)

**అనుకారిణి:** (సహర్షమ్ = ఆనందంగా) పూర్వేషామ్ = పూర్వికులను, అనుకారిణి = అనుసరించే, త్వయి = నీ విషయంలో, ఇదమ్ = ఇది (ఆశ్రమ రక్షణకోసం

**రాజా : గచ్ఛతాం పురో భవంతౌ. అహమప్యనుపదమాగత ఏవ.**

**ఉభౌ : విజయస్వ రాజన్! (ఇతి నిష్క్రాంతౌ).**

**రాజా : మాధవ్య! అప్యస్తి శకుంతలా దర్శనకుతూహలమ్?**

**విదూ : పథమం సపరివాహమాసీ. దాణిం రక్ఖసవుత్తంతేణ బిందూ వి నావసేసిదో. (ప్రథమం సపరివాహమాసీత్. ఇదానీం రాక్షసవృత్తాంతేన బిందురపి నావశేషితః).**

---

నిల్చిపోవడం), యుక్తరూపమ్ = అత్యంతమూ యుక్తం. (రూపప్ – అనేది ఇక్కడ ప్రశంసార్థక ప్రత్యయం). ఆపన్న = ఆపదలో ఉన్నవారికి, అభయ = అభయమివ్వడం అనే, సత్రేషు = యజ్ఞాలలో, పౌరవాః = పురువంశోద్భవులందరూ, దీక్షితాః ఖలు = కంకణధారులే కదా!

**తాత్పర్యం:** ఆశ్రమంలో జరిగే యాగాల రక్షణ కోసమని నువ్వు ఇలా నిల్చిపోవడం – పూర్వీకులను అనుసరించే నీకు అన్ని విధాలా అత్యంతమూ తగినదే సుమా! నీ పురువంశంలో జన్మించినవారందరూ ఇలా ఆపన్నసంరక్షమనే యాగదీక్షలను వహించినవారే కదా!

**గచ్ఛతామ్:** భవంతౌ = తమరిద్దరూ, పురః + గచ్ఛతామ్ = ముందుగా వెళ్ళండి. అహమ్+అపి = నేను సైతం, అనుపదమ్ = వెంబడినే, ఆగతః+ఏవ = వచ్చినవాడినే – రానే వస్తాను అని.

**విజయస్వ:** రాజన్ = మహారాజా! విజయస్వ = జయింపుము – జయింపుము. (ఇతి = అని, నిష్క్రాంతౌ = ఋషికుమారులిద్దరూ నిష్క్రమిస్తారు).

**మాధవ్య:** మాధవ్య = మిత్రమా! మాధవ్యా! శకుంతలా దర్శన–కుతూహలమ్ = శకుంతలను చూడాలనే కుతూహలం, అపి+అస్తి = నీకున్నదా?

**పథమం:** ప్రథమమ్ = ఇంతకు ముందు, సపరివాహమ్+ఆసీత్ = ప్రవాహ సదృశంగా ఉంది; ఇదానీమ్ = ఇప్పుడు, రాక్షసవృత్తాంతేన = ఈ రాక్షసప్రస్తావనతో, బిందుః+అపి = బిందు మాత్రంగానైనా, న+అవశేషితః = మిగలలేదు. ఆ కుతూహలం ఇర్రింకి పోయిందని.

**రాజా : మా భైషీః, నను మత్సమీపే వర్తిష్యసే?**

**విదూ : ఏసో రక్ఖసాదో రక్ఖిదోహ్మి. (ఏష రాక్షసాద్రక్షితోஉస్మి).**

**(ప్రవిశ్య దౌవారికః)**

**దౌవారి : జేదు భట్టా. సజ్జో రహో. భట్టిణో విఅఅపత్థాణం అవేక్ఖది. ఏసో ఉణ ణఅరాదో దేవీణం ఆణత్తిహరో కరభఓ ఉవట్ఠిదో. (జయతు భర్తా. సజ్జో రథః భర్తుర్విజయప్రస్థానమపేక్షతే. ఏష పునర్నగరాద్దేవ్యాః ఆజ్ఞప్తిహరః కరభక ఉపస్థితః).**

**రాజా : (సాదరం) కిమంబయా ప్రేషితః?**

**దౌవారి : అహ కిమ్. (అథకిమ్).**

**రాజా : నను ప్రవేశ్యతామ్.**

---

**మా భైషీః:** మా–భైషీః = (రాక్షసులకు మరీ అంతగా) భయపడకు, మత్+సమీపే = నా చెంతనే, వర్తిష్యసే – నను = ఉంటావుగదా!

**ఏసో:** రాక్షసాత్ = రాక్షసుడివల్ల, ఏషః = ఇదే, రక్షితః + అస్మి = రక్షింపబడ్డాను. (రాక్షసప్రస్తావనవల్ల ఆశ్రమంనుంచి రాజధానికి వెంటనే వెళ్ళే అవకాశం లభించి రక్షింపబడ్డానని ఆనందం).

(దౌవారికః = రైవతకుడు, ప్రవిశ్య = ప్రవేశించి)

**జేదు:** భర్తా = మహారాజు, జయతు = జయించుగాక! సజ్జః = సర్వసన్నద్ధమైన, రథః = రథం, భర్తుః = దేవరవారి, విజయ ప్రస్థానమ్ = విజయయాత్రను – విజయంచేతను, అపేక్షతే = ఆకాంక్షిస్తోంది. తమరి రాకకు వేచి ఉంది అని. పునః = మరియు, దేవ్యాః = రాజమాతగారి, ఆజ్ఞప్తి హరః = ఆజ్ఞను తెచ్చువాడైన, కరభకః = కరభకుడు, ఏషః = ఇదే, నగరాత్ = రాజధాని నుంచి, ఉపస్థితః = విచ్చేసి ఉన్నాడు.

**కిమ్:** (సాదరమ్ = ఆదరంగా) కిమ్ = ఏమీ, అంబయా = మా తల్లిగారి చేత, ప్రేషితః = పంపబడినవాడా?

**అహ కిం:** అథకిమ్ = అవును.

**నను:** నను–ప్రవేశ్యతామ్ = వెంటనే ప్రవేశపెట్టు.

**దౌవా : తహ. (తథా).**

**(ఇతి నిష్క్రమ్య కరభకేణ సహ ప్రవిశ్య) ఏసో భట్టో. ఉపసప్పా. (ఏష భర్తా. ఉపసర్ప).**

**కరభకః : (ఉపసృత్య)జేదు జేదు భట్టా. దేవీ ఆణవేది –ఆఆమిణి చఉత్థే దిఅహే ణివుత్తపాలణో ఉవవాసో మహ భవిస్సది. తహిం దిఅహే దీహాఉణా అవస్సం సణ్ణిహిదేణ హోదవ్వం త్తి. (జయతు జయతు భర్తా. దేవ్యాజ్ఞాపయతి – ఆగామిని చతుర్థే దివసే నిర్వృత్త పారణ ఉపవాసో మమ భవిష్యతి. తస్మిన్ దివసే దీర్ఘాయుషా అవశ్యం సన్నిహితేన భవితవ్యమ్ – ఇతి.**

**రాజా : ఇతస్తపస్వి కార్యమ్. ఇతో గురుజనాజ్ఞా. ద్వయమప్యనతిక్రమణీయమ్. కిమత్ర ప్రతివిధాతవ్యమ్?**

---

**తహ:** తథా = అట్లే! (ఇతి = అని, నిష్క్రమ్య = నిష్క్రమించి, కరభకేణ సహ = కరభకుడితో సహా, ప్రవిశ్య = ప్రవేశించి) ఏషః = ఇదిగో, భర్తా = మహారాజు, ఉపసర్ప = సమీపించు.

**జేదు జేదు:** (ఉపసృత్య = సమీపించి) భర్తా = ప్రభువు, జయతు – జయతు = జయించుగాక! జయించుగాక! దేవీ = రాజమాత, ఆజ్ఞాపయతి = ఆజ్ఞాపిస్తున్నది – ఆగామిని = రాబోయే, చతుర్థే దివసే = నాల్గవనాడు, మమ+ఉపవాసః = నా ఉపవాసదీక్ష, నిర్వృత్తపారణః = జరపబడ్డ పారణ కలది, భవిష్యతి = కానుంది. (పారణ = ఉపవాసానంతర భోజనం). తస్మిన్ + దివసే = ఆనాడు, దీర్ఘాయుషా = ఆయుష్మంతుడివైన (పుత్రుడివైన) నీచేత, అవశ్యమ్ = తప్పకుండా, సన్నిహితేన– భవితవ్యమ్ = సన్నిహితుడిగా ఉండబడాలి. మూడునాళ్ళ ఉపవాసదీక్ష ముగిసి నాల్గవనాడు పారణ జరుగుతుంది, ఆ వేళ నువ్వు ఇక్కడ ఉండితీరాలి, ఎక్కడఉన్నా రావలసిందే – ఇతి = అని.

**విశేషాలు:** ఈ ఘట్టంలో దేవీనామాజ్ఞప్తిహరః, అంబాభిః ప్రేషితః, దేవ్యః ఆజ్ఞాపయంతి – ఇత్యాదిగా బహువచన పాఠం కొన్ని ప్రతులలో కనిపిస్తోంది. ఇది గౌరవసూచక బహువచనం. అందుకే కరభకవచనంలో నిర్వృత్తపారణః మే ఉపవాసః – మమ ఉపవాసః అని అస్మద్వాచకం ఏకవచనంలోనే అన్నింటా కనపడుతోంది. (జ్యేష్ఠ పూర్ణిమనాడు చేసే తటాక సావిత్రీ వ్రతమన్నారు దీనిని కొందరు).

**విదూ : తిసంకూ విఅ అంతరాళే చిట్ఠ! (త్రిశంకురివాంతరాళే తిష్ఠ).**

**రాజా : అలం పరిహాసేన. సత్యమాకులీభూతోఽస్మి.**

**కృత్యయోర్భిన్నదేశత్వాత్ ద్వైధీభవతి మే మనః**
**పురః ప్రతిహతం శైలే స్రోతః స్రోతోవహో యథా. 17**

**(విచింత్య) సఖే, త్వమంబయా పుత్ర ఇతి ప్రతిగృహీతః. అతో భవాన్**

---

**ఇతః:** ఇతః = ఇటువైపు, తపస్వికార్యమ్ = మహర్షుల పని, ఇతః = మరొకవైపు, గురుజన+ ఆజ్ఞా = తల్లిగారి ఆనతి. ద్వయమ్ + అపి = రెండున్నూ (జోడీ), అనతిక్రమణీయమ్ = అతిక్రమింపరానివి(ది). అత్ర = ఇప్పుడు, కిమ్ + ప్రతివిధాతవ్యమ్ = ఏమి చెయ్యాలి? (ప్రతివిధేయమ్ = ప్రతికర్మ, కిమ్ = ఏమిటి?) ఈ సంకటానికి విరుగుడు ఏమిటి – అని.

**తిసంకూ :** త్రిశంకుః + ఇవ = త్రిశంకుడిలాగా, అంతరాళే = అంతరాళంలో (ద్యావాపృథ్వుల నట్టనడుమ), తిష్ఠ = ఉండిపో. ఈ పనీ చెయ్యకు, ఆ పనీ చెయ్యకు – అని పరిహాసం.

**అలమ్:** పరిహాసేన + అలమ్ = పరిహాసం చాలు (చాలించు). సత్యమ్ = నిజంగానే, ఆకులీభూతః + అస్మి = కలత చెందుతున్నాను.

**కృత్యయోః:** కృత్యయోః = చెయ్యవలసిన పనులు రెండూ, భిన్న దేశత్వాత్ = విభిన్న ప్రదేశాలకు చెందినవి కావడంతో, మే + మనః = నా మనస్సు; పురః = ఎట్టయెదుట, శైలే = కొండ ఉండగా, స్రోతోవహః = నది తాలూకు, స్రోతః = ప్రవాహం, యథా = ఎలా, ద్వైధీభవతి = రెండుగా చీలిపోతుందో, తథా = అలా, ద్వైధీభవతి = రెండుగా అవుతోంది. (స్రోతోవహ్–షష్ఠీ. స్రోతోవహః – స్రోతోవహోః – స్రోతోవహామ్).

**తాత్పర్యం:** ఇప్పటి నా కర్తవ్యాలు రెండింటిలో ఒకటి ఇక్కడ ఉండి చేయవలసినది, మరొకటి అక్కడకు వెళ్ళి చెయ్యవలసినది. అందుకని ఇక్కడ ఉండనా అక్కడికి వెళ్ళనా – తేల్చుకోలేక నా మనస్సు కలత చెందుతోంది. ఒక కొండ ఎదురుతగిలితే నదీప్రవాహం రెండుగా చీలిపోయినట్టు నా మనస్సు ఇరువాగులై దిగులుపడుతోంది. (స్రోతోవహం యథా – అని పాఠాంతరం. స్రోతోవహాం సంబంధి = స్రోతోవహం స్రోతః అని సమన్వయం).

**ఇతఃప్రతినివృత్య తపస్వికార్యవ్యగ్రమానసం మామావేద్య తత్రభవత్యాః పుత్రకృత్యమనుష్ఠాతుమర్హతి.**

**విదూ : ణ క్ఖు మం రక్ఖోభీరుఅం గణేసి. (న ఖలు మాం రక్షోభీరుకం గణయ).**

**రాజా : (సస్మితమ్) కథమేతద్భవతి సంభావ్యతే!**

**విదూ : జహ రాఅణుఏణ గంతవ్వం తహ గచ్ఛామి. (యథా రాజానుజేన తథా గచ్ఛామి)**

**రాజా : నను తపోవనోపరోధః పరిహరణీయ ఇతి సర్వాననుయాత్రికాన్ త్వయైవ సహ ప్రస్థాపయామి.**

---

**సఖే త్వమ్:** (విచింత్య = ఆలోచించి) సఖే = మిత్రుడా! మాధవ్యా! త్వమ్ = నువ్వు, అంబయా = మా తల్లిగారిచేత, పుత్రః + ఇతి = కొడుకుగా, ప్రతిగృహీతః = స్వీకరింపబడ్డావు. అతః = అందుకని, భవాన్ = నువ్వు, ఇతః + ప్రతినివృత్య = ఇక్కడినుంచి బయలుదేరివెళ్ళి, తపస్వికార్య – వ్యగ్రమానసమ్ = ఋషికార్యంపట్ల సంలగ్నమైన మనస్సుకలవాడినిగా, మామ్ = నన్ను, ఆవేద్య = విన్నవించి, తత్రభవత్యాః = తల్లిగారికి, పుత్రకృత్యమ్ = పుత్రకార్యాన్ని, అనుష్ఠాతుమ్ = ఆచరించడానికి, అర్హతి = తగినవాడవు. నా బదులు పారణవ్రతంలో పాల్గొమనడం.

**ణ క్ఖు:** రక్షోభీరుకమ్ = రాక్షసులంటే భయపడేవాడిగా, మామ్ = నన్ను, న–ఖలు–గణయ = పరిగణించకు సుమా!

**కథమేతత్:** (సస్మితమ్ = చిరునవ్వుతో) భవతి = తమరి విషయంలో, ఏతత్ = ఇలా పరిగణించడమనేది, కథమ్ – సంభావ్యతే = అసలు ఎలా సంభావ్యం!?

**జహ:** రాజ+అనుజేన –యథా = రాజుగారి తమ్ముడెలాగో, తథా = అలా, గచ్ఛామి = వెడతాను!

**నను తపో:** తపోవన+ఉపరోధః = తపోవనానికి అవరోధం, పరిహరణీయః+నను+ఇతి = తొలగించాలి గదా అని, సర్వాన్+ అనుయాత్రికాన్ = సమస్త పరివారజనాన్నీ, త్వయా+ఏవ – సహ = నీతోనే, ప్రస్థాపయామి = పంపిస్తాను.

**విదూ : తేణ హి జువరాఓ ష్మి దాణిం సంవుత్తో. (తేన హి యువరాజోఽస్మీదానీం సంవృత్తః)**

**రాజా : (స్వగతమ్) చపలోఽయం వటుః కదాచిదస్మత్ప్రార్థనామ్ అంతః పురేభ్యః కథయేత్. భవతు, ఏనమేవం వక్ష్యే. (విదూషకం హస్తే గృహీత్వా, ప్రకాశమ్). వయస్య! ఋషిగౌరవాదాశ్రమం గచ్ఛామి. న ఖలు సత్యమేవ తాపసకన్యాయాం మమాభిలాషః. పశ్య –**

**క్వ వయం క్వ పరోక్ష మన్మథో**
**మృగశాబైస్సమమేధితో జనః?**

---

**తేణ హి:** తేన+హి = అలాగయితే, ఇదానీమ్ = ఇప్పుడు, యువరాజః = యువరాజునే, సంవృత్తః + అస్మి = అయ్యాను!!

**చపలః:** (స్వగతమ్ = తనలో) అయమ్ = ఈ, వటుః = బ్రహ్మచారి, చపలః = బహుచపలుడు. అస్మత్ + ప్రార్థనామ్ = (శకుంతలాగతమైన) నా అభిలాషను, అంతఃపురేభ్యః = అంతఃపురకాంతాజనాలకు, కదాచిత్+కథయేత్ = ఒకవేళ చెప్పినా చెబుతాడు! భవతు = కానిమ్ము. ఏనమ్ = ఇతడినుద్దేశించి, ఏవమ్ + వక్ష్యే = ఇలా పలుకుతాను. (విదూషకమ్ = మాధవ్యుణ్ని, హస్తే + గృహీత్వా = చేతితో చెయ్యి పట్టుకొని, ప్రకాశమ్ = ప్రకాశంగా). వయస్య = మిత్రమా! ఋషిగౌరవాత్ = ఋషులపట్ల గౌరవంతో, ఆశ్రమమ్ + గచ్ఛామి = ఆశ్రమం ప్రవేశిస్తున్నాను. తాపసకన్యాయామ్ = ముని కన్యయైన శకుంతలపట్ల, మమ+అభిలాషః = నా అభిలాష (ఆదరం), సత్యమ్+న+ఏవ-ఖలు = నిజం కానే కాదుసుమా! పశ్య = ఆలోచించి చూడు–

**క్వ వయమ్:** వయమ్ = (నగరవాసులమైన) మనం, క్వ = ఎక్కడ? పరోక్ష = దూరీకరింపబడిన – లేదా – జ్ఞాతాలు కాని, మన్మథః = మన్మథభావాలు కల్గినవారై, మృగశాబైః + సమమ్ = జింక పిల్లలతో సరిసమంగా, ఏధితః = పెంచబడినవారైన, జనః = (ఆశ్రమవాసులైన) ఈ జనులు, క్వ = ఎక్కడ? మనమెక్కడ? వీరెక్కడ? పోలికే లేదని. సఖే = మిత్రుడా! పరిహాస–విజల్పితమ్ = మునికన్యను అభిలషించాను అన్నది – కేవలం పరిహాసం కోసం చెప్పిన, (అదొక హాస్యోక్తి మాత్రమే) వచః = పలుకు, పరమార్థేన = సత్యవచనంగా, న–గృహ్యతామ్ = స్వీకరించకు.

**పరిహాసవిజల్పితం సఖే**
**పరమార్థేన న గృహ్యతాం వచః** **18**

**(ఇతి నిష్క్రాంతా స్సర్వే)**

**-: ఇతి ద్వితీయోఽంకః :-**

---

**తాత్పర్యం:** విజ్ఞాత మన్మథులమైన మనమెక్కడ? అజ్ఞాత మన్మథులైన వీరెక్కడ? జింక పిల్లలతో సరి సమానంగా పుట్టి పెరిగిన అమాయక ప్రాణులు ఈ ఆశ్రమవాసి జనులు. శకుంతలను అభిలషించాను, తన అభిలాషను తానూ వ్యక్త పరిచింది (దర్భాంకురేణ...) – ఇత్యాదికమంతా కేవలం పరిహాస విజల్పితం!! దీన్ని పరమార్థంగా స్వీకరించకు మిత్రమా! (పరమార్థే – న – న – గృహ్యతాం వచః. న గృహ్యతామితి న. పరమార్థంగానే స్వీకరించు – అని కూడా స్ఫూర్తి). (ఇతి = అని, సర్వే = అందరూ, నిష్క్రాంతాః = నిష్క్రమిస్తారు)

-: ఇది రెండవ అంకం:-

# తృతీయోఽంకః

**(తతః ప్రవిశతి కుశానాదాయ యజమానశిష్యః)**

**శిష్యః : అహో, మహానుభావః పార్థివో దుష్యంతః. ప్రవిష్టమాత్ర ఏవాశ్రమం తత్రభవతి రాజని నిరుపద్రవాణి నః కర్మాణి సంవృత్తాని.**

**కా కథా బాణసంధానే జ్యాశబ్దేనైవ దూరతః**
**హుంకారేణేవ ధనుషః స హి విఘ్నానపోహతి. 01**

**యావదిమాన్ వేదిసంస్తరణార్థాన్ దర్భాన్ ఋత్విగ్భ్య ఉపహరామి. (పరిక్రమ్యావలోక్య చాకాశే) ప్రియంవదే! కస్యేదముశీరానులేపనం మృణాలవంతి చ నలినీపత్రాణి నీయంతే? (శ్రుతిమభినీయ) కిం బ్రవీషి? ఆతపలంఘనాద్బలవదస్వస్థా శకుంతలా. తస్యాః శరీరనిర్వాపణాయేతి? తర్హి త్వరితం గమ్యతామ్ సాహి కులపతేః కణ్వస్యోచ్ఛ్వసితమ్.**

---

(తతః = అంతట, కుశానాదాయ = దర్భలు తీసుకొని, యజమాన శిష్యః = యజమాన శిష్యుడు, ప్రవిశతి = ప్రవేశిస్తాడు)

**అహో:** అహో = ఆహా! పార్థివః + దుష్యంతః = దుష్యంతమహారాజు, మహానుభావః = ఎంత మహానుభావుడు!! తత్రభవతి = మాన్యుడైన, రాజని = ఆ మహారాజు, ఆశ్రమమ్ = ఈ ఆశ్రమాన్ని, ప్రవిష్టమాత్రే (సతి) + ఏవ = ప్రవేశించినంతమాత్రంచేతనే, నః = మా, కర్మాణి = తపోయజ్ఞయాగాదులు (క్రతువులు), నిరుపద్రవాణి (నిరుపప్లవాని) – సంవృత్తాని = నిరాటంకాలు అయ్యాయి. రాక్షసవిఘ్నాలన్నీ తొలగిపోయాయి – అనడం.

**కా కథా:** ధనుషః = ధనుస్సు తాలూకు, హుంకారేణ + ఇవ = హుంకారంలాంటిదైన, జ్యా – శబ్దేన + ఏవ = అల్లెత్రాటి టంకార ధ్వనితోనే, సః = ఆ మహారాజు, విఘ్నాన్ = విఘ్నకారులైన రాక్షసులను, అపోహతి + హి = పారద్రోలుతున్నాడు సుమా! బాణసంధానే = అమ్ముతొడగడంలో, కా + కథా = ప్రసక్తి ఏముంది? దాని అవసరమే లేదని.

**తాత్పర్యం:** దుష్యంతమహారాజు తన ధనుస్సు తాలూకు హుంకారంలాంటి – అల్లెత్రాటి టంకారంతోనే రాక్షసులను పారద్రోలుతున్నాడు. ధనుస్సుకు అమ్ముతొడగవలసిన అవసరమే లేకపోయె!!

**అహమపి తావద్వైతానికం శాంత్యుదకమస్యై గౌతమీహస్తే విసర్జయిష్యామి. (ఇతి నిష్క్రాంతః)**

**: శుద్ధవిష్కంభః:**

**(తతః ప్రవిశతి కామయమానావస్థో రాజా)**

---

**యావత్:** యావత్ = ఇంతలో, వేది–సంస్తరణార్థాన్ = యజ్ఞవేదిక మీద పరచడానికి ఉద్దేశించిన, ఇమాన్ = ఈ, దర్భాన్ = కుశలను, ఋత్విగ్భ్యః = ఋత్విక్కులకోసం, ఉపహరామి = కొనిపోతాను. తీసుకువెళ్లి వారికి అందిస్తానని. (పరిక్రమ్య = నాలుగడుగులు వేసి, అవలోక్య = పార్శ్వభాగానికి దృష్టిసారించి, ఆకాశే = ఆకాశభాషితంగా పలుకుతున్నాడు) ప్రియంవదే = ఓయీ ప్రియంవదా! ఇదమ్ = ఈ, ఉశీరానులేపనమ్ = వట్టి వేళ్లు నూరిన మైపూత, మృణాలవంతి + చ = తూడులతో కూడిన, నలినీపత్రాణి = తామర ఆకులూ, కస్య = ఎవరికని, నీయంతే = కొనిపోబడుతున్నాయి. వీటిని తీసుకువెడుతున్నావు – ఎవరికోసమని? (శ్రుతిమ్ + అభినీయ = ప్రియంవద ఏదో చెప్పినట్టూ తాను విన్నట్టూ అభినయంతో ప్రదర్శించి) కిమ్ + బ్రవీషి = ఏమంటున్నావ్? ఆతప–లంఘనాత్ = తాపం ఆక్రమించడంవల్ల (తాపం ముసురుకోవడంతో), శకుంతలా = శకుంతల, బలవత్+అస్వస్థా = (ఎక్కువగా) తీవ్రంగా (అస్వస్థురాలు) పీడితురాలు అయ్యింది, తస్యాః = ఆమెకు, శరీర – నిర్వాపణాయ + ఇతి = శారీరక ఆహ్లాదం కోసం (తాపోపశమనంకోసం) వీటిని తీసుకువెడుతున్నాను – అనియా? ఇదా నీవంటున్నది? తర్హి = అయితే, త్వరితమ్ – గమ్యతామ్ = త్వరగా వెళ్ళు. సా = ఆ శకుంతల, కులపతేః = మన కులపతియైన, కణ్వస్య = కణ్వుడికి, ఉచ్ఛ్వసితమ్–హి = ప్రాణం కదా! అహమ్ + అపి – తావత్ = నేను కూడా, వైతానికమ్ = యజ్ఞ సంబంధమైన, శాంతి + ఉదకమ్ = శాంతిమంత్రోదకాన్ని, తస్యై = ఆమె కోసం, గౌతమీహస్తే = గౌతమి చేతిలో (కణ్వ సోదరి), విసర్జయిష్యామి = ఉంచుతాను. గౌతమికిచ్చి పంపుతాను – అని. (ఇతి = అని, నిష్క్రాంతః = నిష్క్రమిస్తాడు).

**విశేషాలు :** కింబ్రవీష్యేవమిత్యాది వినా పాత్రం బ్రవీతియత్, శ్రుత్వేవ అనుక్తమప్యేకస్తత్ స్యాదాకాశభాషితమ్ (దశరూపకం). తత్ర విష్కంభకో భూతభావివస్త్వంశ సూచకః అముఖ్య పాత్ర రచితః సంక్షేపైకప్రయోజనః ద్విధా స శుద్ధో మిశ్రశ్చ

**రాజా** : (నిఃశ్వస్య)

**జానే తపసో వీర్యం సా బాలా పరవతీతి మే విదితమ్**
**అలమస్మి తతో హృదయం తథాపి నేదం నివర్తయితుమ్. 02**

**(మదనబాధాం నిరూప్య) భగవన్ కుసుమాయుధ! త్వయా చంద్రమసా చ విశ్వసనీయాభ్యా మతిసంధీయతే కామిజనసార్థః. కుతః –**

**తవ కుసుమశరత్వం శీతరశ్మిత్వమిందోః**
**ద్వయమిదమయథార్థం దృశ్యతే మద్విధేషు**

---

మిశ్రః స్యాన్నీచమధ్యమైః శుద్ధః కేవల మధ్యోఽయమేకానేకకృతో ద్వేధా – (రసార్ణవసుధాకరం)

–: ఇది శుద్ధ విష్కంభం :–

(తతః = అంతట, కామయమాన + అవస్థః = విరహావస్థలో ఉన్న, రాజా = దుష్యంతుడు, ప్రవిశతి = ప్రవేశిస్తాడు).

**జానే:** (నిఃశ్వస్య = నిట్టూర్చి) తపసః = తపస్సు తాలూకు, వీర్యమ్ = శక్తి, జానే = ఎరుగుదును. సా = ఆ, బాలా = కన్యక, పరవతి + ఇతి = తండ్రిచాటుబిడ్డ అని, మే = నాకు, విదితమ్ = తెలుసు. తథాపి = అయినప్పటికీ, తతః = ఆమెనుంచి, ఇదమ్ = ఈ, హృదయమ్ = నా మనస్సును, నివర్తయితుమ్ = మరలించుకోడానికి, న + అలమ్ + అస్మి = సమర్థుణ్ని కాలేకపోతున్నాను.

**తాత్పర్యం:** మహర్షుల తపస్సు ఎంతటి శక్తిమంతమో నాకు తెలుసు. (కణ్వుడు శపిస్తాడని ఎరుగుదును). ఆ శకుంతల స్వతంత్రురాలు కాదనీ తెలుసు. (తండ్రిచాటు బిడ్డ. కనుక తెగింపు కుదరదని). అయినా ఆమెనుంచి మనస్సు మరలించుకోలేకపోతున్నాను.

**భగవన్:** (మదనబాధామ్ = విరహవేదనను, నిరూప్య = అభినయంతో ప్రదర్శిస్తూ) భగవన్ = భగవంతుడా! కుసుమాయుధ = పూలబాణాలవాడా! విశ్వసనీయాభ్యామ్ = నిజానికి నమ్మదగ్గవారైన, త్వయా–చంద్రమసా–చ = నీతోనూ చంద్రుడితోనూ, కామిజన సార్థః = విరహిజన సమూహం, అతిసంధీయతే = వంచింపబడుతోంది. కుతః = ఎందుకంటే –

**విసృజతి హిమగర్భై రగ్నిమిందు ర్మయూఖైః**
**త్వమపి కుసుమబాణాన్ వజ్రసారీకరోషి. 03**

**(సఖేదం పరిక్రమ్య) క్వనుఖలు సంస్థితే సవనకర్మణి సదస్యైః అనుజ్ఞాతః క్లాంతమాత్మానం వినోదయామి? (నిఃశ్వస్య) కింను ఖలు మే ప్రియాదర్శనాదృతే శరణ్యమన్యత్? యావదేనామ్ అన్విష్యామి. (సూర్యమవలోక్య) ఇమాముగ్రాతపాం వేళాం ప్రాయేణ లతావలయవత్సు మాలినీతీరేషు ససఖీజనా శకుంతలా గమయతి. అత్రైవ తావద్గచ్ఛామి. (పరిక్రమ్య స్పర్శసుఖం రూపయిత్వా) అహో! ప్రవాతసుభగోఽయముద్దేశః**

---

**తవ:** తవ = నీ, కుసుమ శరత్వమ్ = పూల బాణాల కలిమి, ఇందోః = చంద్రుడి, శీతరశ్మిత్వమ్ = చలివెలుగుల కలిమి; ఇదమ్ = ఈ, ద్వయమ్ = రెండూ (జంట), మద్విధేషు = నాబోటి విరహులపట్ల, అయథార్థమ్ + దృశ్యతే = అసత్యమనిపిస్తోంది. మన్మథుడి బాణాలు మృదువులుగా లేవు, చంద్రుడి కిరణాలు చల్లనివిగా లేవు – అనడం. ఇందుః = చంద్రుడు, హిమగర్భైః = మంచునిండిన, మయూఖైః = కిరణాలతో, అగ్నిమ్ = చిచ్చును, విసృజతి = వెదజల్లుతున్నాడు. త్వమ్ + అపి = నువ్వుసైతం, కుసుమ–బాణాన్ = పువ్వుటమ్ములను, వజ్రసారీకరోషి = వజ్రాయుధంలా కఠోరాలు చేస్తున్నావు.

**తాత్పర్యం:** మదనుడా! నిన్ను పుష్పశరుడు అనడం, చంద్రుణ్ని శీతకిరణుడు అనడం – రెండూ – నాబోంట్ల విషయంలో అసత్యాలే సుమా! – చంద్రుడేమో చల్లదనం నిండిన కిరణాలతోనే అగ్నులు కురిపిస్తున్నాడు. నువ్వేమో విరిశరాలను వజ్రసారాలు చేస్తున్నావు.

**క్వనుఖలు:** (సఖేదం = దిగులుపడుతూ, పరిక్రమ్య = నాలుగడుగులు వేసి) సవనకర్మణి = యజ్ఞం చెయ్యడం, సంస్థితే (సతి) = సమాప్తం కావడంతో (ముగియగా), సదస్యైః = ఋత్విక్కులచేత, అనుజ్ఞాతః = అనుమతింపబడినవాడనైన నేను, క్లాంతమ్ = అలసిపోయిన, ఆత్మానమ్ = నన్ను, క్వ–ను–ఖలు–వినోదయామి = ఎక్కడని వినోదింపజేసుకోను? ఎక్కడ ఎలా వినోదం పొందాలి – అని. (నిఃశ్వస్య = నిట్టూర్చి) ప్రియాదర్శనాత్ + ఋతే = శకుంతలా దర్శనం మినహా, మే = నాకు, అన్యత్–శరణ్యమ్ = మరొక దిక్కు, కిమ్ + ను – ఖలు = ఏముంది? యావత్ = ఇంతకూ, ఏనామ్ =

**శక్యమరవిందసురభిః కణవాహీ మాలినీతరంగాణామ్**
**అంగైరనంగతప్తైః అవిరళమాలింగితుం పవనః** **04**

**(పరిక్రమ్యావలోక్య) సత్యమేతస్మిన్ వేతసపరిక్షిప్తే లతామండపే సన్నిహితయా శకుంతలయా భవితవ్యమ్. తథాహి –**

**అభ్యున్నతా పురస్తాదవగాఢా జఘనగౌరవాత్ పశ్చాత్**
**ద్వారేఽస్య పాండుసికతే పదపంక్తిః దృశ్యతేఽభినవా.** **05**

---

శకుంతలనే, అన్విష్యామి = అన్వేషిస్తాను. (సూర్యమ్ = సూర్యుణ్ని, అవలోక్య = చూసి) ఇమామ్ = ఈ, ఉగ్ర + ఆతపామ్ = తీవ్రమైన వేడితోకూడిన, వేళామ్ = సమయాన్ని, ప్రాయేణ = బహుశ, లతా–వలయవత్సు = పూలతీగల జొంపాలతో కూడినవైన, మాలినీతీరేషు = మాలినీ నదీ తీరాలలో, ససఖీజనా = మిత్రురాండ్రతో కలిసినదై, శకుంతలా = శకుంతల, గమయతి = గడుపుతూంటుంది. అత్ర + ఏవ + తావత్ = అక్కడికే, గచ్ఛామి = వెడతాను. (పరిక్రమ్య = ముందుకునడిచి), స్పర్శసుఖమ్ = చల్లదనపు సుఖాన్ని, రూపయిత్వా = అభినయంతో ప్రదర్శించి), అహో = ఆహా! అయమ్ = ఈ, ఉద్దేశః = ప్రదేశం, ప్రవాత = మంచిగాలితో, సుభగః = మనోహరం!!

**శక్యమ్:** అరవింద–సురభిః = పద్మపరిమళభరితమూ, మాలినీ తరంగాణామ్ = మాలినీ నది కెరటాల, కణవాహీ = జలబిందువులను మోస్తున్నదీ అయిన, పవనః = ఈ గాలి; అనంగతప్తైః = మన్మథ తాపంతో రగిలిపోతున్న, అంగైః = నా శరీరావయవాలతో, అవిరళమ్ = గాఢంగా, ఆలింగితుమ్ = కౌగిలించుకోడానికి, శక్యమ్ = యోగ్యం!!

**తాత్పర్యం:** ఆహా! ఈ గాలి పద్మాల పరిమళంతో నిండినది, మాలినీనది జలబిందువులు మోస్తూ బరువెక్కినది. మన్మథ తాపంతో రగిలిపోతున్న నా తనువు – గాఢంగా కౌగిలించుకోడానికి ఇది ఎంతైనా తగినది సుమా!!

**సత్యమ్:** (పరిక్రమ్య = మరికొంత నడిచి. అవలోక్య = ఆలోకించి) సత్యమ్ = నిజంగానే, ఏతస్మిన్ = ఈ, వేతసపరిక్షిప్తే = ప్రబ్బలిచెట్లతో ఆవరింపబడిన, లతామండపే = పూలతీగల పొదరింట, శకుంతలయా – సన్నిహితయా – భవితవ్యమ్ = శకుంతల ఉండితీరాలి. (శకుంతలచేత ఉండబడాలి). తథాహి =అవును సుమా–

**అభ్యున్నతా:** అస్య = ఈ పొదరింటి, ద్వారే = ముంగిటిలో, పాండు సికతే = తెల్లటి ఇసుకమీద, పురస్తాత్ = (వేళ్లవైపు) ముందరిభాగాన, అభ్యున్నతా = ఎత్తుగానూ,

**యావద్విటపాంతరిత ఏవావలోకయామి. (పరిక్రమ్య తథా కృత్వా) అయే! లబ్ధం నేత్రనిర్వాణమ్. యదేషా మే మనోరథప్రియతమా సకుసుమాస్తరణం శిలాపట్టమధిశయానా సఖీభ్యామన్వాస్యతే. భవతు. శ్రోష్యామ్యాసాం విస్రంభకథితాని. (ఇతి విలోకయన్ స్థితః)**

**(తతః ప్రవిశతి యథోక్తవ్యాపారా సహసఖీభ్యాం శకుంతలా).**

**సఖ్యౌ : (ఉపవీజ్య సస్నేహమ్) హలా సఉందలే అవి సుహేది దే ణలినీపత్తవాదో?**

**(హలా! శకుంతలే! అపి సుఖయతి తే నలినీపత్రవాతః?)**

**శకుం : కిం వీఅఅంతి మం సహీఓ? (కిం వీజయతో మాం సఖ్యౌ?)**

**(సఖ్యౌ విషాదం నాటయిత్వా పరస్పరమవలోకయతః)**

---

పశ్చాత్ = (మడమవైపు) వెనుకభాగాన, జఘన గౌరవాత్ = కటిభారంవల్ల, అవగాఢా = లోతుగానూ ఉన్నదైన, అభినవా = ఇప్పుడే ఏర్పడినదైన, పదపంక్తిః = అడుగుజాడల వరుస, దృశ్యతే = కనిపిస్తోంది.

**తాత్పర్యం:** అదిగో! ఇప్పుడే ఏర్పడ్డ అడుగుజాడల వరుస – ఈ పొదరింటి ముంగిట తెల్లటి ఇసుకమీద స్పష్టంగా కనిపిస్తోంది. ఈ అడుగుజాడలు శకుంతలవే. అందుకే వీటి ముందుభాగం ఉన్నతంగానూ, వెనుకభాగం (మడమ) జఘనభారంవల్ల లోతుగానూ ఏర్పడింది.

**యావత్:** విటప + అంతరితః + ఏవ = కొమ్మల మాటున దాగినవాడనే అయ్యి, అవలోకయామి + యావత్ = పరికింతునుగాక! (పరిక్రమ్య = నాలుగడుగులు వేసి, తథా = ఆ విధంగా, కృత్వా = పరికించి) అయే = అహో! నేత్ర నిర్వాణమ్ = నయనానందం, లబ్ధమ్ = లభించింది (దక్కింది). ఏషా = ఇదిగో, మే = నా, మనోరథ–ప్రియతమా = మనోరథానికి (అభిలాషకు) ఎంతగానో ఇష్టురాలైన (ప్రియతమయైన) శకుంతల!! స–కుసుమ + ఆస్తరణమ్ = పువ్వులే పరుపుగా పరచబడ్డ; శిలాపట్టమ్ = రాతిబల్లను, అధిశయానా = అధిరోహించి పరున్నదై, సఖీభ్యామ్ = చెలిమికత్తెలిద్దరితోనూ, అన్వాస్యతే = కలిసి ఉన్నది. భవతు = ఉండుగాక! ఆసామ్ = వీరి, విస్రంభ – కథితాని = స్వేచ్ఛా సంభాషణలను, శ్రోష్యామి = వింటాను. (ఇతి = అని, విలోకయన్ + స్థితః = అలా చూస్తూ నిలబడతాడు).

**రాజా : బలవదస్వస్థా తత్రభవతీ శకుంతలా దృశ్యతే. తత్కిమ్ ఆతపదోషః స్యాత్? ఉత మదనదోషో వా స్యాత్? ఉభయథాపి మే మనసి వర్తతే. (సాభిలాషం నిర్వర్ణ్య) అథవా కృతం సందేహేన.**

**స్తనన్యస్తోశీరం శిథిలితమృణాలైకవలయం**
**ప్రియాయాః సాబాధం కిమపి కమనీయం వపురిదమ్**
**సమస్తాపః కామం మనసిజ నిదాఘప్రసరయోః**
**న తు గ్రీష్మస్యైవం సుభగమపరాద్ధం యువతిషు. 06**

---

(తతః = అంతటా, యథోక్తవ్యాపారా = చెప్పబడిన అవస్థలో ఉండి, సహ సఖీభ్యామ్ = మిత్రురాండ్రిద్దరితోనూ, శకుంతలా = శకుంతల, ప్రవిశతి = ప్రవేశిస్తుంది).

**హలా:**(ఉపవీజ్య = తామరాకుతో విసురుతూ, సస్నేహమ్ = చెలిమితో-) హలా = ఓయీ! శకుంతలే = శకుంతలా!! నలినీపత్ర-వాతః = ఈ తామరాకు గాలి, తే = నీకు, అపి + సుఖయతి = హాయి గొలుపుతోందా?

**కిం వీఅఅంతి:** కిమ్ = ఏమీ? సఖ్యౌ = చెలులు మీరిద్దరూ, మామ్ = నన్ను, వీజయతః = తామరాకులతో విసురుతున్నారా? (సఖ్యౌ = అనసూయా ప్రియంవదలిద్దరూ, విషాదమ్ = దిగులును, నాటయిత్వా = అభినయంతో చూపి, పరస్పరమ్ + అవలోకయతః = పరస్పరం ముఖాలు చూసుకుంటారు).

**బలవత్:** తత్రభవతీ = మాన్యురాలు, శకుంతలా = ఈ శకుంతల, బలవత్ + అస్వస్థా = చాలా తీవ్రంగా అస్వస్థురాలైనట్టు (బలవత్ = అధికంగా. బలవత్సుష్ఠు కిముత – ఇత్యమరః), దృశ్యతే = కనిపిస్తోంది. తత్ = అది, ఆతపదోషః = ఎండవేడిమివలని నేరం, స్యాత్ + కిమ్ = అవుతుందా? ఇది ఎండ చేసిన నేరమా? అనడం. ఉత = లేదా, మదనదోషః – వా – స్యాత్ = మన్మథుడి నేరమా? ఉభయథా + అపి = రెండు విధాలుగానూ, మే-మనసి = నా మనస్సులో, వర్తతే = అనిపిస్తోంది. (సాభిలాషమ్ = మరింత ఉత్సుకతతో, నిర్వర్ణ్య = పరిశీలనగా చూసి) అథవా = అయినా, సందేహేన – కృతమ్ = సందేహించడం ఇక చాలు (కృతమ్ = అలమ్).

**స్తన:** స్తన – న్యస్త =కుచాలమీద పులుమబడిన, ఉశీరమ్ = వట్టివేళ్ల అనులేపం కలదీ; శిథిలిత = వదలి సడలిపోయిన, మృణాల + ఏక – వలయమ్ = తామరతూడుల

**ప్రియం : (జనాంతికమ్) అణసూఏ, తస్స రాఏసిణో పఢమదంసనాదో ఆరహిఅ పజ్జుసిఅ ఆపణ్ణా విఅ సఉందలా. కిం ణు ఖు తణ్ణిమిత్తా ఏవ్వ అఅం ఆతంకో భవే? (అనసూయే! తస్య రాజర్షేః ప్రథమదర్శనాదారభ్య పర్యుత్సుకా ఇవ శకుంతలా. కిమస్యాః తన్నిమిత్త ఏవ అయమాతంకో భవేత్?)**

**అనసూ : సహి, మమ వి ఖు ఈరిసీ ఆసంకా హిఅఅస్స. హోదు, పుచ్ఛిస్సం దావణం. (సఖి, మమాపి ఖలు ఈదృశీ ఆశంకా హృదయస్య. భవతు, ప్రక్ష్యామి తావదేనామ్.) (ప్రకాశమ్) సహి, పుచ్ఛి దవ్వాసి-**

---

ఒకే ఒక్క చుట్ట కలదీ అయిన, ప్రియాయాః = నా ప్రియురాలి, స + ఆ + బాధమ్ = తీవ్రతాపంతోకూడిన, ఇదమ్ = ఈ, వపుః = శరీరం, కిమ్ + అపి – కమనీయమ్ = ఏదో తెలియని (లోకోత్తర) మనోహరం!! నీరసించినా మనోజ్ఞంగానే ఉంది – అనడం. మనసిజ + నిదాఘ = మన్మథగ్రీష్మాల, ప్రసరయోః = తాకిడుల, తాపః = వేడిమి, కామమ్ = మిక్కిలి, సమః = సమానం. మన్మథతాపం – గ్రీష్మతాపం రెండూ ఒక్కలా ఉంటాయని. తు = కానీ, యువతిషు = కన్యలయందు, ఏవమ్ = ఈ విధంగా (శకుంతల నుద్దేశించి), సుభగమ్ = అందగించిన(ది) తాపం, గ్రీష్మస్య = గ్రీష్మంచేసిన, అపరాద్ధమ్ = నేరం, న = కానేరదు.

**తాత్పర్యం:** వట్టివేళ్లు నూరిన విలేపనం ఈమె గుండెలమీద ఉంచారు. ఈమె శరీరంమీద – పొందికగా వేసిన తామరతూడుల ఒకే ఒక్క చుట్ట–వడిలిపోయి సడలిపోయింది. ఇంతగా తాపం అనుభవిస్తున్నప్పటికీ ఈ నా ప్రియురాలి శరీరంలో – ఏదో తెలియని ఒక అందం కనిపిస్తోంది. మరి ఇది గ్రీష్మతాపమా? మన్మథ తాపమా? ఎవరి నేరమిది? రెండూ ఒక్కలాగానే ఉంటాయి. కానీ, తాపంలోనూ – యువతుల శరీరాలలో ఒక అందం భాసించడమనేది గ్రీష్మం చేసిన నేరం కానేరదు. ఇది మన్మథుడి పనే కావచ్చు – అనడం.

**అణసూఏ:** (జనాంతికమ్ = జనాంతికంగా) అనసూయే = అనసూయా! తస్య = ఆ, రాజర్షేః = రాజర్షి దుష్యంతుడి, ప్రథమదర్శనాత్ + ఆరభ్య = తొలి దర్శనం మొదలుకొని, శకుంతలా = మన శకుంతల, పర్యుత్సుకా + ఇవ = బెంగటిల్లినదానిలాగా– పర్యుత్సుకవలె కనిపిస్తోంది (దృశ్యతే – అధ్యాహార్యం). అస్యాః = ఈమెయొక్క, అయమ్ = ఈ, ఆతంకః = దురవస్థ (వ్యాధి. బెంగ. దుఃఖపరంపరా అని శ్రీనివాసాచార్య

**కిం వి. బలిఅం ఖు దే సందావో. (సఖి! ప్రష్టవ్యాసి కిమపి. బలవత్ ఖలు తే సంతాపః?)**

**శకుం : (పూర్వార్ధేన పుష్పశయనాదుత్థాయ) హలా! కిం వత్తుకామాసి. (హలా! కిం వక్తుకామాసి?)**

---

వ్యాఖ్య) తన్నిమిత్తః + ఏవ – భవేత్ + కిమ్ = ఆ నిమిత్తంగానే అయ్యుంటుందా? అతడి దర్శనం కారణంగానే నంటావా? – అని.

**సహి మమ:** సఖి = చెలీ ప్రియంవదా! మమ+ హృదయస్య = నా మదికికూడా, ఈదృశీ = ఇలాంటి, ఆశంకా = సంశయమే (ఉంది). భవతు = కానిమ్ము. ఏనామ్ = ఈమెనే, తావత్ + ప్రక్ష్యామి = అడుగుతాను. (ఇంతవరకూ ఇది అనసూయా ప్రియంవదల జనాంతిక సంభాషణ. ఇటుపైని ప్రకాశమ్ = ప్రకాశంగా. అంటే శకుంతలకు సైతం వినపడేట్టు). సఖి = చెలీ! కిమపి = ఒకానొకటి, ప్రష్టవ్యా + అసి = ప్రశ్నింపబడవలసినదానవు అయ్యావు. నిన్ను ఒక విషయం అడగాలి – అనడం. తే = నీకు, సంతాపః = పరితాపం, బలవత్ + ఖలు = చాలా ఎక్కువగా ఉంది కదా!?

**హలా కిం:** (పూర్వ + అర్ధేన = శరీరపు ఊర్ధ్వభాగంతో – నడుమువరకూ, పుష్ప + శయనాత్ + ఉత్థాయ = పూలపానుపునుంచి లేచి) హలా = చెలీ! కిమ్ – వక్తుకామా + అసి = ఏమిటి మాట్లాడగోరుతున్నావు? ఏమైనా చెప్పాలనుకొంటున్నావా? –అని.

**అణబ్భంతరా:** సఖీ = హలా! శకుంతలే = శకుంతలా! మదన గతస్య = మన్మథుడికి సంబంధించిన, వృత్తాంతస్య = కథా కమామీషుకు, వయమ్ = మేము, అనభ్యంతరాః + ఖలు = బొత్తిగా అజ్ఞానినులం కదా! ఏమాత్రమూ ప్రవేశం లేనివాళ్ళమని. (అనభ్యంతరాః తత్త్వేన అజ్ఞాః – అని రాఘవభట్టు. అవిషయాః మదనవృత్తాంతానభిజ్ఞాః యావత్ – అని శ్రీనివాసాచార్య). కింతు = కానీ, ఇతిహాస–నిబంధేషు = పురాణాలలో, కామయమానానామ్ = కామపరవశులకు – విరహులకు, యాదృశీ = ఎలాంటి, అవస్థా = అవస్థ, శ్రూయతే = వినబడుతోందో, తాదృశీమ్ = అలాంటి స్థితినే, తవ = నీకు, పశ్యామి = చూస్తున్నాను. తే = నీ, సంతాపః = ఈ దుఃఖం, కిమ్ + నిమిత్తమ్ = ఏ నిమిత్తంగానో, కథయ = చెప్పు. సంతాపకారణం చెప్పమనడం. వికారమ్ = వ్యాధిని, పరమార్థతః = మూలతత్త్వంతో, అజ్ఞాత్వా = తెలుసుకోకుండా, ప్రతీకారస్య = విరుగుడుకు, అనారంభః + ఖలు = ఆరంభం ఉండదు సుమా! (పరిహారస్య – అని పాఠాంతరం). రోగతత్త్వాన్ని పూర్తిగా తెలుసుకోకుండా వైద్యం ఆరంభించరాదన్నట్టు.

**అనసూ : హలా సఉందలే, అణబ్భంతరా ఖు వఅం మఅణగదస్స ఉత్తందస్స. కిం దు జారిసీ ఇదిహాస నిబంధనేసు కామఅమాణాణం సమవత్థా సుణిఅది తారిసిం దే పేక్ఖామి. కహేహి కింణిమిత్తో దే సందావో? విఆరం పరమత్థదో అజాణిఅ అణారంభో ఖు పడిఆరస్స. (సఖి! శకుంతలే! అనభ్యంతరాః ఖలు వయం మదనగతస్య వృత్తాంతస్య. కింతు యాదృశీతిహాసనిబంధేషు కామయమానానామవస్థా శ్రూయతే తాదృశీం తవ పశ్యామి. కథయ కిం నిమిత్తం తే సంతాపః? వికారం పరమార్థతోఽజ్ఞాత్వానారంభః ఖలు ప్రతీకారస్య).**

**రాజా : అనసూయామప్యనుగతో మదీయస్తర్కః.**

**శకుం : (ఆత్మగతమ్) బలిఅం ఖు మే అహిణివేసో. సహసా ఏదాణం వి ణ సక్కుణోమి ణివేదేదుమ్. (బలవాన్ ఖలు మే అభినివేశః. సహసా ఏతయోరపి న శక్నోమి నివేదయితుమ్).**

---

**అనసూ:** మదీయః + తర్కః = నా సందేహమే, అనసూయామ్ + అపి = ఈ అనసూయనుకూడా, అనుగతః = వెంటాడింది. నాకు వచ్చిన సందేహమే ఈమెకూ వచ్చిందని.

**బలిఅం:**(ఆత్మగతమ్ = తనలో) మే + అభినివేశః = నా బింకం – నా పట్టుదల, బలవాన్ + ఖలు = చాలా గట్టిది సుమా! అందుకే– సహసా = ఒక్కసారిగా, ఏతయోః + అపి = ఈ నా ఇష్టసఖులిద్దరికి సైతం, నివేదయితుమ్ = విన్నవించడానికి, న–శక్నోమి = సమర్థురాలిని కాలేకపోతున్నాను.

(అభినివేశః = ఆగ్రహః అకథనే = చెప్పకూడదనే పట్టుదల. అభినివేశః = ప్రయత్నవిశేషః. అనురాగప్రకర్షః, బలవాన్ = మరణాఖ్యం మదనావస్థాంతరం గతః – అని శ్రీనివాసాచార్య. అందుకే పెదవి కదపలేకపోతోందట.)

**సహి సుట్ఠు:** సఖి = నేస్తురాలా! ఏషా = ఈ అనసూయ, సుష్ఠు – భణతి = బాగా చెప్పింది. ఆత్మనః – ఆతంకమ్ = నీ వ్యాధిని, కిమ్ + ఉపేక్షసే = ఉపేక్షిస్తావెందుకు? అనుదివసమ్ = నానాటికీ, అంగైః = శరీరావయవాలతో, పరిహీయసే–ఖలు = చిక్కిపోతున్నావు సుమా! కేవలమ్ = కేవలమూ, లావణ్యమయీ = లావణ్యరూపమైన, ఛాయా = కాంతిమాత్రం, త్వామ్ = నిన్ను, న–ముంచతి = విడిచిపెట్టడం లేదు. శరీరం కృశిస్తోంది, లావణ్యరేఖమాత్రం అట్టే ఉంది – అని.

**ప్రియం : సహి, సుట్ఠు ఏసా భణాది. కిం అత్తణో ఆదంకం ఉవేక్ఖసి. అణుదిఅహం ఖు పరిహీఅసి అంగేహిం. కేవలం లావణ్ణమఈ ఛాఆ తుమం ణ ముంచది. (సఖి! సుష్ఠు ఏషా భణతి. కిమాత్మనః ఆతంకముపేక్షసే. అనుదివసం ఖలు పరిహీయసేఽంగైః. కేవలం లావణ్యమయీ ఛాయా త్వాం న ముంచతి.)**

**రాజా : అవితథమాహ ప్రియంవదా. తథా హి –**

**క్షామక్షామకపోల మాననమురః కాఠిన్యముక్త స్తనం**
**మధ్యః క్లాంతతరః ప్రకామవినతావంసౌ ఛవిః పాండురా**
**శోచ్యా చ ప్రియదర్శనా చ మదనక్లిష్టేయమాలక్ష్యతే**
**పత్రాణా మివ శోషణేన మరుతా స్పృష్టా లతా మాధవీ. 07**

---

**క్షామక్షామ:** ప్రియంవదా = ఈ ప్రియంవద, అవితథమ్ + ఆహ = నిజం పలికింది. తథా–హి = అవునుగదా! ఆననమ్ = ఈ శకుంతల ముఖం, క్షామక్షామ – కపోలమ్ = బాగా చిక్కిపోయిన బుగ్గలు కలది. ఉరః = వక్షస్థలం, కాఠిన్య–ముక్త–స్తనమ్ = కాఠిన్యం కోల్పోయిన కుచాలు కలది. మధ్యః = నడుము, క్లాంతతరః = మునుపటికన్నా బాగా సన్నబడింది. అప్పుడు క్లాంతం – ఇప్పుడు క్లాంతతరం. అంసౌ = బుజాలు, ప్రకామ–వినతౌ = అప్పటికన్నా ఎక్కువగా వంగాయి. ఛవిః = శరీరం (రంగు) కాంతి, పాండురా = చాలా (తెల్లగా ఉంది) తెల్లన. శోచ్యా–చ = దయనీయంగానూ ఉంది, ప్రియదర్శనా–చ = చూపులకింపుగొలుపుతూనూ ఉంది. (ప్రియం కలిగించే దర్శనం కలది). ఇయమ్ = ఈమె, మదనక్లిష్టా = మన్మథ పీడితురాలై, పత్రాణామ్ = ఆకులు, శోషణేన = ఎండించునదైన (శోష్యతే అనేనేతి శోషణః. కరణాధికరణయోశ్చేతి ల్యుట్), మరుతా = గ్రీష్మవాయువుతో, స్పృష్టా = సోకబడిన, మాధవీ–లతా+ఇవ = మాధవీ లతలాగా (అతిముక్తః పుండ్రకః స్యాద్వాసంతీ మాధవీలతా – అమరః), ఆలక్ష్యతే = కనబడుతోంది. వేడిగాలి సోకి ఆకులు రాల్చిన వాసంతి పూలతీగలాగా ఉన్నదని.

**తాత్పర్యం:** శుష్కించిన కపోలాలతో ఈవిడ ముఖం. బిగి సడలిన కుచాలతో వక్షస్థలం. అసలే సన్నని నడుము మరింత సన్నబడింది. జారు బుజాలు మరింతగా జారాయి. తనువంతటా పాండిమం వ్యాపించింది. దయనీయంగా ఉన్నా చూపులకు ఇంపుగొలుపుతూనే ఉంది. మదన పీడితురాలైనట్టు కనబడుతున్న ఈ శకుంతల, గ్రీష్మవాయువు సోకి ఆకురాలిన మాధవీలతలాగా భాసిస్తోంది.

**శకుం : (సలజ్జమ్) సహి, కస్స వా అణ్ణస్స కహఇస్సం? కిందు ఆఆసఇత్తిఆ దాణిం వో భవిస్సం. (సఖి! కస్య వాన్యస్య కథయిష్యామి? కింతు ఆయాసయిత్రికేదానీం వాం భవిష్యామి).**

**ఉభే : అదో ఏవ్వక్ఖు ణిబ్బంధో. సిణిద్ధజణ సంవిభత్తం ఖు దుక్ఖం సజ్ఝవేఅణం హోది! (అత ఏవ ఖలు నిర్బంధః. స్నిగ్ధజన సంవిభక్తం ఖలు దుఃఖం సహ్యవేదనం భవతి).**

**రాజా : పృష్టా జనేన సమదుఃఖసుఖేన బాలా<br>నేయం న వక్ష్యతి మనోగతమాధిహేతుమ్.<br>దృష్టో వివృత్య బహుశోఽ ప్యనయా సతృష్ణమ్<br>అత్రాంతరే శ్రవణకాతరతాం గతోఽస్మి. 08**

---

**కస్సవా:**(సలజ్జమ్ = సిగ్గుపడుతూ) సఖి = నేస్తురాలా! కస్య–వా + అన్యస్య = వేరే ఎవడికి, కథయిష్యామి = చెప్పుకొంటాను? కింతు = కానీ, ఇదానీమ్ = ప్రస్తుతం, వామ్ = మిమ్మల్ని ఇద్దరినీ, ఆయాసయిత్రికా = శ్రమపెట్టిన దానను, భవిష్యామి = అవుతాను.

**అదో ఏవ్వ:** అతః + ఏవ + ఖలు = అందుకే గదా, నిర్బంధః = ఈ ప్రయాస! స్నిగ్ధజన = మిత్రులతో, సంవిభక్తమ్ = పంచుకోబడినదైన, దుఃఖమ్ = దుఃఖం, సహ్యవేదనమ్ = తట్టుకోజాలిన వేదనకలది, భవతి–ఖలు = అవుతుంది సుమా! మిత్రులకు చెప్పుకున్నప్పుడే దుఃఖవేదనను తట్టుకోగలమని.

**పృష్టా:** సమదుఃఖ సుఖేన = కష్టసుఖాలను తనతో సమంగా పంచుకునే, జనేన = మిత్రజనంతో, ఆధిహేతుమ్ = అస్వస్థతా కారణాన్ని, పృష్టా = (నిర్బంధించి) అడుగబడినదైన, ఇయమ్ – బాలా = ఈ ముద్దరాలు, మనోగతమ్ = మనస్సులో ఉన్న నిజం, న + వక్ష్యతి + ఇతి + న = చెప్పదు అనేది లేదు – చెప్పకపోదు – చెబుతుంది – అని. (పుంస్యాధిర్మానసీ వ్యథా – ఇత్యమరః). వివృత్య = ముఖం వెనక్కి తిప్పి, బహుశః = పలుసార్లు, అనయా = ఈమెచేత, సతృష్ణమ్ = సాభిలాషంగా, దృష్టః + అపి = చూడబడ్డవాడనైనప్పటికీ, అత్రాంతరే = ఇంతలోకే, శ్రవణకాతరతామ్ = ఆమె మాటను వినడానికి ఒక భయాన్ని (ఆకర్ణనభీరుత్వాన్ని), గతః + అస్మి = పొందినవాడనయ్యాను.

**శకుం : సహీ, జదో పహుది మమ దంసణపహం ఆఅదో సో తవోవణ రిక్ఖిదా రాయసీ, తదో ఆరహిఅ తగ్గదేణ అహిలాసేణ ఏతదవత్థహ్మి సంవుత్తా. (సఖి! యతః ప్రభృతి మమ దర్శనపథమాగతః స తపోవనరక్షితా రాజర్షిః, తత ఆరభ్య తద్గతేనాభిలాషేణైతదవస్థాస్మి సంవృత్తా.)**

**రాజా : (సహర్షమ్) శ్రుతం శ్రోతవ్యమ్.**

**స్మర ఏవ తాపహేతుః నిర్వాపయితా స ఏవ మే జాతః**
**దివస ఇవాభ్రశ్యామస్తపాత్యయే జీవలోకస్య. 09**

---

**తాత్పర్యం:** కష్టసుఖాలను కలబోసుకునే నేస్తురాండ్రు తనను నిర్బంధించి అస్వస్థతాకారణం ఏమిటి చెప్పు –అని అడిగారు కాబట్టి ఈ ముద్దరాలు తన మనోగతాన్ని చెప్పకపోదు. చెబుతుంది. కానీ ఇంతలోకే నాకు భయం – ఏమి చెబుతుందో, ఏమి వినాల్సి వస్తుందో అని. ఈ శకుంతల – వెడుతూ వెడుతూ ముఖం వెనక్కు తిప్పీ, తానే వెనక్కు తిరిగీ చాలాసార్లు నావైపు సాభిలాషంగా చూసింది. (2–12). అయినా ఎందుకనో ఇంతలోకే ఆకర్ణనభీరువు నవుతున్నాను!!

**జదో:** సఖి = హలా! తపోవన– రక్షితా = మన ఆశ్రమ రక్షకుడు, సః రాజర్షిః = ఆ రాజర్షి (దుష్యంతుడు), యతః – ప్రభృతి = ఏ క్షణం నుంచి, మమ = నా, దర్శనపథమ్ = దృష్టిమార్గంలోకి, ఆగతః = వచ్చాడో, తతః + ఆరభ్య = అప్పటినుంచి, తద్గతేన + అభిలాషేణ = అతనిపట్ల అభిలాషతో, ఏతత్ = ఈ, అవస్థా = అవస్థ, సంవృత్తా = పొందినదానను, అస్మి = అయ్యాను.

**స్మర:** (సహర్షమ్ = ఆనందంతో) శ్రోతవ్యమ్ = వినదగ్గది, శ్రుతమ్ = విన్నాను (వినబడినది). స్మరః + ఏవ = మన్మథుడే, మే = నా, తాప–హేతుః = విరహతాపానికి కారణం. సః + ఏవ = అతడే, నిర్వాపయితా = తాపాన్ని తొలగించేవాడూ, జాతః = అయ్యాడు. (తనలోని మన్మథుడు తాపకర్త. ఆమెలోని మన్మథు డితడికి తాపహర్త). ఇది ఎలా ఉన్నదంటే – తప + అత్యయే = గ్రీష్మాంతంలో (వర్షాకాలారంభంలో), అభ్రశ్యామః = కారుమబ్బులు పట్టి నలుపెక్కిన, దివసః = పగటిపూట, జీవలోకస్య = ప్రాణికోటికి, తాపహేతుః –నిర్వాపయితా + ఇవ = తాపకర్త తాపహర్త అయినట్టుగా!

**తాత్పర్యం:** వినదగ్గమాట విన్నాను. మన్మథతాపం కాసింత తగ్గింది. నాకు తాపం కల్గించిన మన్మథుడే ఇప్పుడు తొలగించినవాడూ అయ్యాడు. గ్రీష్మం గడిచి వానకాలం

**శకుం : తం జహి వో అణుమదం తా తహావట్టహ జహ తస్స రాఏసిణో అణుకంపణిజ్జా హోమి. అణ్ణహా అవస్సం సించధ మే తిలోదఅం. (తద్యది వామనుమతం తదా తథా వర్తేథాం యథా తస్య రాజర్షే రనుకంపనీయా భవామి. అన్యథావశ్యం సించతం మే తిలోదకమ్!)**

**రాజా : సంశయచ్ఛేది వచనమ్!**

**ప్రియం : (జనాంతికమ్) అణసూఏ! దూరగఅ మమ్మహా అక్ఖమా ఇఅం కాలహరణస్స. జస్సిం బద్ధభావా ఏసా సో లలామభూదో పోరవాణం. తా జుత్తం సే అహిలాసో అహిణందిదుం. (అనసూయే! దూరగతమన్మథా అక్షమేయం కాలహరణస్య. యస్మిన్ బద్ధభావైషా స లలామభూతః పౌరవాణామ్. తద్యుక్తమస్యాః అభిలాషోఽభినందితుమ్)**

---

మొదలైన దశలో కారుమబ్బులు దట్టంగా కమ్మి చీకట్లు ముసిరిన పగటిపూట – ఉక్కబోత ఒకవైపూ చల్లదనం ఒకవైపూ ఉన్నట్టుగా ఒకే మన్మథుడు తాపకర్త తాపహర్త అయ్యాడు.

**తం జహి:** తత్ = అతడిపై నా అనురాగమనేది, వామ్ = మీ ఇద్దరికీ, అనుమతమ్ + యది = సమ్మతమైతే – సముచితమనిపిస్తే, తదా = అప్పుడు, తస్య = ఆ, రాజర్షేః = రాజర్షికి దుష్యంతుడికి, యథా = ఏ విధంగా, అనుకంపనీయా = కరుణింపదగ్గదానను, భవామి = అవుతానో, తథా = ఆ విధంగా, వర్తేథామ్ = వ్యవహరించండి. అతడు నన్ను కరుణించేలాగా గట్టి ప్రయత్నం చెయ్యండి – అని. అన్యథా = కానిపక్షంలో, మే = నాకు, అవశ్యమ్ = తప్పక, తిలోదకమ్ = నువ్వులూ నీళ్లూ, సించతమ్ = విడువండి. తిలోదకాలివ్వండి – అంటే – మరణిస్తానని.

**సంశయ:** వచనమ్ = ఈమె పలికిన ఈ మాట, సంశయ + ఛేది = అన్ని సందేహాలనూ పటాపంచలు చేస్తోంది.

**దూరగఅ:**(జనాంతికమ్ = జనాంతికంగా. శకుంతలను వారించి అని) అనసూయే = ఓ అనసూయా, దూరగతమన్మథా – ఇయం = చాలా దూరం వెళ్ళిన మన్మథావస్థ కలిగిన ఈమె – (అత్ర మన్మథశబ్దేన మదనావస్థా సూచ్యతే – అన్నారు వ్యాఖ్యాతలు. మన్మథావస్థలు పదింటిలో చాలావాటిని దాటి మరణోద్యోగందాకా వచ్చేసిందని) కాలహరణస్య = కాలహరణానికి – ఆలస్యానికి, అక్షమా = ఓర్వలేనిది. ఆలస్యం

**అన : (జనాంతికమ్) తహ జహ భణసి. (తథా యథా భణసి.)**

**ప్రియ : (శకుంతలాం దృష్ట్వా - ప్రకాశమ్) సహి, దిట్ఠిఆ అణురూవో దే అహిణివేసో. సాఅరం ఉజ్ఝి అ కహిం వా మహాణఈ ఓదరఇ. (సఖి. దిష్ట్యా అనురూపస్తేఽభినివేశః. సాగరముజ్ఝిత్వా కుత్రవా మహానదీ అవతరతి)**

**అన : కో దాణిం సహఆరం అంతరేణ అదిముత్తలదం పల్లవిదం సహేది. (క ఇదానీం సహకారమంతరేణ అతిముక్తలతాం పల్లవితాం సహతే?)**

**రాజా : కిమత్ర చిత్రమ్? యది విశాఖే శశాంకలేఖామనువర్తేతే.**

---

సహించదు – భరించదని. ఏషా = ఈమె, యస్మిన్ = ఎవనిపట్ల, బద్ధభావా = అనురక్త అయ్యిందో, సః = అతడు, పౌరవాణామ్ = పురువంశీయులలో, లలామభూతః = ఉత్తమోత్తముడు. తత్ = కాబట్టి, అస్యాః + అభిలాషః = ఈమె అనురక్తి, అభినందితుమ్ + యుక్తమ్ = అభినందించదగ్గదే. యోగ్యుణ్నే వరించిందనడం.

**తహ:** (జనాంతికమ్ = జనాంతికంగా) ప్రియంవదా! యథా + భణసి – తథా = అవును, నువ్వు అంటున్నట్టే.

**దిట్ఠిఆ:** (శకుంతలామ్–దృష్ట్వా = శకుంతలను చూస్తూ, ప్రకాశమ్ = ప్రకాశంగా) సఖి = చెలీ! శకుంతలా! దిష్ట్యా = అదృష్టవశాత్తు, తే = నీ, అభినివేశః = గాఢానురాగం (= అనురాగప్రకర్షః), అనురూపః = నీకు తగ్గదే – తగినవాడినే వరించావనడం. మహానదీ = ఒక గొప్ప నది, సాగరమ్ + ఉజ్ఝిత్వా = సముద్రుణ్ని విడిచి, కుత్ర–వా = వేరెక్కడ, అవతరతి = సంగమిస్తుంది.

**కో దాణిం:** పల్లవితామ్ = చిగురులు తొడిగిన, అతిముక్తలతామ్ = మాధవీలతను, సహకారమ్ +అంతరేణ = సహకారతరు రాజును తప్పిస్తే, కః = ఎవడు, ఇదానీమ్ = ఇప్పట్టున, సహతే = వహించడానికి అర్హుడవుతాడు? నాయికా కర్తృత్వంతో ప్రియంవద, నాయక కర్తృత్వంతో అనసూయ– సమర్థించారు.

**కిమత్ర:** విశాఖే = విశాఖా నక్షత్రశాఖలు రెండు, శశాంకలేఖామ్ = చంద్రరేఖను, అనువర్తేతే – యది = అనుసరిస్తున్నవయితే, కిమ్ + అత్ర – చిత్రమ్ = ఇక్కడ ఆశ్చర్యం ఏముంది? (అనసూయాప్రియంవదలు = విశాఖ జంట. ఇంద్రుడూ అగ్నీ దీనికి

**అన : కో ఉణ ఉవాఓ భవే జేణ అవిలంబిఅం ణిహుఅం అ సహీఏ మనోరహం సంపాదేహ్మ. (కః పునరుపాయో భవేద్యేనావిలంబితం నిభృతం చ సఖ్యా మనోరథం సంపాదయావః?)**

**ప్రియం : ణిహుఅంత్తి చింతణిజ్జం భవే. సిగ్ఘంతి సుఅరం. (నిభృతమితి చింతనీయం భవేత్. శీఘ్రమితి సుకరమ్).**

**అన : కహం విఅ? (కథమివ?)**

**ప్రియం : ణం సో రాఏసీ ఇమస్సిం సిణిద్ధదిట్ఠీఏ సూఇదాహిలాసో ఇమాఇం దిఅహాఇం పజాఅరకిసో లక్ఖీ అది (నను స రాజర్షిరేతస్యాం స్నిగ్ధ దృష్ట్యా సూచితాభిలాష ఏతాన్ దివసాన్ ప్రజాగరకృశో లక్ష్యతే).**

---

అధిదేవతలు కనుక ద్వివచనం. శశిలేఖ = శకుంతల. ఇది అప్రస్తుత ప్రశంసాలంకారం. ఇక్కడ రాఘవభట్టు వాక్యాలు పాఠకులకోసం – ద్విదైవత్వాత్ విశాఖయోః ద్విత్వమ్. యుక్తమేవైతయోరేతస్యా అనుమోదనమితి భావః. ఏతత్ అభిప్రాయమేవ విశాఖయోః ద్విత్వమ్, శశిలేఖాత్వేన స్త్రీలింగ నిర్దేశశ్చ. విశాఖే శశాంకలేఖా చాప్రస్తుతాః. విశాఖ చంద్ర కళననుసరించునేని అందు చిత్రమే మున్నది?– అని కందుకూరివారి అనువాదం. అలమ్ అతిప్రసంగేణ.)

**కో ఉణ:** కః + పునః = ఏది, ఉపాయః + భవేత్ = తగిన ఉపాయమవుతుంది? యేన = దేనితోనైతే, సఖ్యాః + మనోరథమ్ = శకుంతల కోరికను, అవిలంబితమ్ = శీఘ్రంగానూ (ఆలస్యం కాకుండాను), నిభృతమ్ + చ = గుట్టుగానూ, సంపాదయావః = నెరవేర్చగలమో అలాంటి ఉపాయమేమిటి?

**ణిహుఅం:** నిభృతమ్ + ఇతి = గుట్టుగా అనేది, చింతనీయమ్ + భవేత్ = ఆలోచించాలి. శీఘ్రమ్ + ఇతి = శీఘ్రంగా అనేది, సుకరమ్ = తేలిక.

**కహం:** కథమ్ + ఇవ = అదెలా?

**ణం సో:** సః + రాజర్షిః = ఆ రాజర్షి, స్నిగ్ధదృష్ట్యా = ప్రేమనిండిన చూపుతో, ఏతస్యామ్ = ఈమెపట్ల, సూచిత + అభిలాషః = తన అనురాగం ప్రకటించినవాడై, ఏతాన్ – దివసాన్ = ఇన్నినాళ్లూ, ప్రజాగర + కృశః = నిద్రలేమితో కృశించినవాడుగా, లక్ష్యతే = కనిపిస్తున్నాడు.

**రాజా : సత్యమిత్థంభూత ఏవాస్మి. తథాహి –**

**ఇదమశిశిరైరంతస్తాపాద్వివర్ణమణీకృతం**
**నిశి నిశి భుజన్యస్తాపాంగప్రసారిభి రశ్రుభిః**
**అనభిలులితజ్యాఘాతాంకం ముహుర్మణిబంధనాత్**
**కనకవలయం స్రస్తం స్రస్తం మయా ప్రతిసార్యతే. 10**

---

**సత్యమ్:** సత్యమ్ = నిజమే, ఇత్థమ్ + భూతః + ఏవ + అస్మి = ఇలా అయినవాడినే. ప్రజాగరణతో కృశించినవాడనే అయ్యాను – అని. తథాహి = అవును గదా –(తన ప్రజాగరణ కృశత్వాలను చెబుతున్నాడు).

**ఇదమ్:** నిశి – నిశి = ప్రతిరాత్రీ, భుజన్యస్త = భుజంపై ఆన్చబడిన, అపాంగ = క్రేగంటినుంచి, ప్రసారిభిః = (రేయంతా) జాలువారుతున్నవీ, అంతస్తాపాత్ = లోపలి విరహతాపంవల్ల, అశిశిరైః = వేడెక్కినవీ అయిన, అశ్రుభిః = కన్నీళ్లతో, ఇదమ్ = ఈ, కనకవలయమ్ = నా సువర్ణకంకణం, వివర్ణమణీకృతమ్ = కగ్గిపోయిన మణులు కలదిగా చేయబడింది. కంకణం మణులు కగ్గిపోయాయని. అనభిలులిత = (అస్పృష్ట) తాకబడని, జ్యాఘాత + అంకం = అల్లె త్రాటి దెబ్బలవల్లనైన గుర్తు (కాయ) కలదైన, కనకవలయమ్ = నా బంగారు కంకణం, స్రస్తమ్ – స్రస్తమ్ = జారుతుండగా – జారుతుండగా, మయా = నాచేత, ముహుః = మాటిమాటికీ, మణిబంధనాత్ = చేతి మణికట్టునుంచి, ప్రతిసార్యతే = పైకి నెట్టబడుతోంది.

**తాత్పర్యం:** రెండు చేతులకూ రెండు కంకణాలతో విరహావస్థలో ఉన్న దుష్యంతుడు తనలో తాను (ఆత్మగతమ్) అనుకొంటున్న మాట ఇది. (కుడి) బుజమే దిండుగా, తల ఆన్చి పరుంటున్న నా కన్గోసలనుంచి ఎడతెరిపి లేకుండా జాలువారుతున్నాయి కన్నీళ్ళు. ఇప్పటికి ఎన్నో రాత్రులుగా ఇదే పరిస్థితి (నిశి–నిశి). విరహ వేదనతో వేడెక్కిన ఆ కన్నీళ్ళు సోకి నా (కుడిచేతి) సువర్ణ కంకణంలోని మణులు పూర్తిగా కగ్గిపోయాయి. (కన్నీరే తప్ప నిద్ర ఎరుగని – జాగరణ ఇది).

బాణాలు వేసేటప్పుడు అల్లెత్రాటి దెబ్బలు తాకి తాకీ (ఎడమ) చేతి మణికట్టుమీద కాయ కాసింది. ఆ చేతి బంగారు కంకణం ఏనాడూ ఆ కాయను సోకలేదు – అంతదాకా జారలేదు. కానీ ఇప్పుడు ఆ కంకణం మాటిమాటికీ జారుతూంటే మణికట్టునుంచి పైకి పైకి మళ్ళీ మళ్ళీ నెట్టుకుంటున్నాను. (కంకణాలు జారిపోయే కృశత ఇది)

**ప్రియం : (విచింత్య) హలా! మఅణలేహోసే కరీఅదు. ఇమం దేవప్పసాదస్స అవదేసేణ సుమణోగోవిదం కరిఅ సే హత్థఅం పావఇస్సం. (హలా! మదనలేఖోఽస్య క్రియతామ్. ఇమం దేవప్రసాదస్యాపదేశేన సుమనోగోపితం కృత్వా తస్య హస్తం ప్రాపయిష్యామి).**

**అన : రోఅఇ మే సుఉమారో పఓఓ. కిం వా సఉందలా భణాది? (రోచతే మే సుకుమారః ప్రయోగః. కిం వా శకుంతలా భణతి?)**

**శకుం : కో ణిఓఓ వాం వికప్పీ అది! (కో నియోగో వాం వికల్ప్యతే!)**

**ప్రియ : తేణ హి అత్తణో ఉవణ్ణాసపువ్వం చింతేహి దావ లలిఅ పద బంధణం. (తేన హ్యాత్మన ఉపన్యాసపూర్వం చింతయ తావల్లలిత పదబంధనమ్.**

---

**మఅణ:**(విచింత్య = ఆలోచించి) హలా = సఖీ! అస్య = ఇతడికి, మదన లేఖః = మన్మథలేఖ, క్రియతామ్ = సిద్ధం చేయబడుగాక! దేవప్రసాదస్య + అపదేశేన = దేవతాప్రసాదం అనే వంకతో, ఇమమ్ = ఈ కమ్మను, సుమనోగోపితమ్ - కృత్వా = పూవులలో దాచబడినదిగా చేసి, తస్య-హస్తమ్ = అతడి చేతిని, ప్రాపయిష్యామి = పొందిస్తాను. పువ్వుల్లో దాచి ప్రసాదమని అందిస్తాననడం.

**రోఅఇ:** సుకుమారః = సున్నితమైన (ప్రయాస రహితః), ప్రయోగః = ఈ ఉపాయం (గూఢప్రయోగః), మే = నాకు, రోచతే = నచ్చింది. శకుంతలా = మరి శకుంతల, కిమ్ + వా + భణతి = ఏమంటుందో?

**కో ణిఓఓ:** వామ్ = మీ, కః + నియోగః = ఏ ఆజ్ఞ, వికల్ప్యతే = కాదన్నాను గనుక!

**తేణ హి:** తేన-హి = అలాగయితే, ఆత్మనః = నీకు నువ్వు, ఉప + న్యాస + పూర్వమ్ = సమర్పణపూర్వకంగా, లలిత-పదబంధనమ్ = సుందర సుకుమారమైన పదాల కూర్పును, తావత్ + చింతయ = బాగా ఆలోచించు. (ఉపపత్తియుతం వాక్యముపన్యాసం ప్రచక్షతే = యుక్తియుక్తమైన వాక్యం. ఆత్మనః ఉపన్యాసపూర్వమ్ = స్వస్య ఉల్లేఖపూర్వమ్ = స్వనామాదివిలిఖ్య. ఇత్యాదిగా శ్రీనివాసాచార్య - బసు వ్యాఖ్యలు)

శకుం : హలా! చింతేమి అహం. అవహీరణభీరుఅం పుణో వేవఇ మే హిఅఅం. (హలా! చింతయామ్యహమ్. అవధీరణభీరు పునర్వేపతే మే హృదయమ్)

రాజా : (సహర్షమ్).

అయం స తే తిష్ఠతి సంగమోత్సుకో
విశంకసే భీరు యతోఽవధీరణామ్
లభేత వా ప్రార్థయితా న వా శ్రియం
శ్రియా దురాపః కథమీప్సితో భవేత్. 11

సఖ్యౌ : అయి, అత్తగుణావమాణిణి! కో దాణిం సరీరణివ్వావఇత్తిఅం సారదిఅం జోసిణిం పడంతేణ వారేది. (అయి, ఆత్మగుణావమానిని! క ఇదానీం శరీరనిర్వాపయిత్రీం శారదీం జ్యోత్స్నాం పటాంతేన వారయతి.)

---

**చింతేమి:** హలా = సఖీ, అహమ్–చింతయామి = నేను ఆలోచిస్తాను. పునః = కానీ, అవధీరణభీరు = తిరస్కరిస్తాడేమో అన్న భయంకలదై, మే = నా, హృదయమ్ = ఎడద, వేపతే = వణుకుతోంది.

**అయమ్:** (సహర్షమ్ = ఆనందంతో). భీరు = పిరికిదానా! యతః = ఎవడినుంచి, అవధీరణామ్ = తిరస్కారాన్ని, విశంకసే = ఆశంకిస్తున్నావో, సః = అతడు, అయమ్ = ఇడిగో (వీడే), తే–సంగమ + ఉత్సుకః = నీ కలయికకు తహతహలాడుతున్నవాడై, తిష్ఠతి = నిల్చి ఉన్నాడు. ప్రార్థయితా = ప్రార్థన చేసినవాడు, శ్రియమ్ = (కోరుకున్న) లక్ష్మిని, లభేత–వా–న–వా = పొందుతాడో లేదోకానీ, శ్రియా = లక్ష్మితోనే, ఈప్సితః = కోరబడినవాడు, దురాపః = అందనివాడు, కథమ్ + భవేత్ = ఎలా అవుతాడు?

**తాత్పర్యం:** ఓసి పిరికిదానా! తిరస్కరిస్తాడేమో అని నువ్వు ఎవరి గురించి ఆశంకిస్తున్నావో ఆ జనుడు ఇడిగో నీ కలయికకు ఉత్సుకుడై వేచి ఉన్నాడు. కోరినవాడికి లక్ష్మీదేవి దొరకక పోవచ్చుగానీ, లక్ష్మీదేవికి కోరినవాడు దొరకడా!?

**అత్తగుణ:** అయి = ఓసీ! ఆత్మగుణ + అవమానిని = నీ రూపయౌవనాదికాన్ని కొంచె పరుచుకొంటున్నదానా! శరీర – నిర్వాపయిత్రీం = శరీరానికి హాయిని గొలిపే, శారదీమ్ + జ్యోత్స్నామ్ = శరత్కాలపు వెన్నెలను, పటాంతేన = ఉత్తరీయపు కొంగుతో, కః = ఎవడు, వారయతి = వారించుకొంటాడు? (వారయిష్యతి – అని పాఠాంతరం).

శకుం : (సస్మితమ్) ణిఓఇఆ దాణిం హ్మి (నియోజితేదానీ మస్మి).

(ఇత్యుపవిష్టా చింతయతి)

రాజా : స్థానే ఖలు విస్మృతనిమేషేణ చక్షుషా ప్రియామవలోకయామి. యతః–

ఉన్నమితైకభ్రూలతమాననమస్యాః పదాని రచయంత్యాః
కంటకితేన ప్రథయతి మయ్యనురాగం కపోలేన. **12**

శకుం : హలా, చింతితా మఏ గీదిఆ. ణ క్ఖు సణ్ణిహిదాణి ఉణ లేహణ సాహణాణి.
(సఖి! చింతితా మయా గీతికా. న ఖలు సన్నిహితాని పునర్లేఖనసాధనాని.

---

**ణిఓఇఆ:** (సస్మితమ్ = చిరునవ్వుతో) ఇదానీమ్ = ఇప్పుడు, (కామలేఖే = మదనలేఖ రచనలో) నియోజితా + అస్మి = నియుక్తురాలనయ్యాను. ఇక ఇప్పుడు రచిస్తాను – అని. మీ ఆజ్ఞకు బద్ధురాలినయ్యాననిగానీ.

(ఇతి = అని, ఉపవిష్టా = కూర్చున్నదై, చింతయతి = ఆలోచన సాగిస్తుంది).

**స్థానే:** విస్మృత–నిమేషేణ = రెప్పపాటును మరిచిపోయిన, చక్షుషా = కన్నుదోయితో, ప్రియామ్ = ప్రేయసినిని, అవలోకయామి = తిలకిస్తాను, స్థానే–ఖలు = యుక్తమేకదా! యతః = ఎందుకంటే –

**ఉన్నమిత:** పదాని = లలితపదాలను (సుప్తిజంతాలను), రచయంత్యాః = ఆలోచించి కూరుస్తున్నదైన, అస్యాః = ఈ శకుంతలయొక్క, ఉన్నమిత = పైకెత్తబడ్డ, ఏక–భ్రూలతమ్ = ఒక్క కన్బొమకలదైన, ఆననమ్ = ముఖం, కంటకితేన = పులకించిన, కపోలేన = చెక్కిలితో – (ఏ వైపు భ్రూలత ఉన్నమితమో ఆ వైపు కపోలం పులకితమని. దుష్యంతుడికి ముఖాముఖి దర్శనం కాక, పార్శ్వ దర్శనం లభిస్తోందని.) మయి = నాపట్లగల, అనురాగమ్ = ప్రేమను, ప్రథయతి = తెలియపరుస్తోంది.

**తాత్పర్యం:** ఆలోచించి మనస్సులోనే పదాలను కూరుస్తోంది. ఈమె ఒక కన్బొమ పైకి లేచింది. అదే వైపు చెక్కిలి పులకించింది. పులకించిన కపోలంతో ఈ ముఖం – ఈమెకు నాపై గల అనురాగాన్ని వెల్లడిస్తోంది.

**చింతితా:** సఖి = హలా! గీతికా = (అనురాగ) గీతిక, మయా–చింతితా = నాచేత ఆలోచించబడినది. గీతికను మనసులో కూర్చడం అయ్యింది – అని. పునః = కానీ,

ప్రియ : ఇమస్సిం సుఓదరసుఉమారే ణళిణీపత్తే ణహేహిం ణిక్ఖిత్తవణ్ణం కరేహి.
(ఏతస్మిన్ శుకోదర సుకుమారే నళినీపత్రే నఖైః నిక్షిప్తవర్ణాం కురు).

శకుం : (యథోక్తం రూపయిత్వా) హలా, సుణుహ దాణిం సంగదత్థం ణ వేత్తి.
(హలా! శృణుతమిదానీం సంగతార్థా న వేతి).

ఉభే : అవహిదహ్మ (అవహితే స్వః).

శకుం : (వాచయతి)

తుజ్ఝ ణ ఆణే హిఅఅం మమ ఉణ కామో దివావి రిత్తిమ్మి
ణిగ్ఘిణ తవఇ బలిఅం తుఇ వుత్తమణోరహాఇం అంగాఇం. 13

---

లేఖన సాధనాని = లిఖించడానికి అవసరమైన సాధనాలు, సన్నిహితాని-న-ఖలు = అందుబాటులో లేవుగదా!

**ఇమస్సిం:** శుక + ఉదర – సుకుమారే = చిలుక పొట్టలాగా మృదువైన, ఏతస్మిన్ = ఈ, నళినీపత్రే = తామరపువ్వు రేకమీద, నఖైః = కొనగోళ్లతో, నిక్షిప్తవర్ణామ్ = లిఖింపబడిన అక్షరాలు కలదిగా (గీతికామ్), కురు = గీతికను చెయ్యి. గీతికను లిఖించు-అని.

**సుణుహ:** (యథోక్తమ్ = చెప్పినట్టుగా చేయడాన్ని, రూపయిత్వా = నటనతో ప్రదర్శించి) హలా = సఖీ! సంగతార్థా (గీతికా) న-వా + ఇతి = గీతిక అర్థం సరిగా కుదిరిందో లేదో, ఇదానీమ్ = ఇప్పుడు, శృణుతమ్ = దయచేసి వినండి.

**అవహిదహ్మ:** అవహితే – స్వః = ఇద్దరమూ సన్నద్ధురాంౖడమై ఉన్నాం.

**తుజ్ఝ:** (వాచయతి = పఠిస్తుంది) నిర్ఘృణ = దయలేనివాడా! తవ = నీ, హృదయమ్ = (గుండె) మనస్సు, న-జానే = నేను ఎరుగను, పునః = కానీ, మమ-హృదయమ్ = నా గుండెను, కామః = మన్మథుడు, దివా + అపి – రాత్రౌ + అపి = పగలూ రాత్రీ, బలవత్+తపతి = తీవ్రంగా తపింపజేస్తున్నాడు. త్వయి = నీపట్ల, వృత్త-మనోరథాని = ప్రవర్తించిన కోరికలు కలవైన (యుక్తమనోరథాని = కోరిక కలవైన – అని పాఠాంతరం), అంగాని = నా శరీరావయవాలనూ, కామః = మన్మథుడు, దివాపి – రాత్రావపి = పగలూ రేయీ, బలవత్ + తపతి = తీవ్రంగా తపింపజేస్తున్నాడు. (నిర్ఘృణః + తపతి – అని మరో పాఠం. దయలేని కామః బలవత్ తపతి అని అన్వయం).

**(తవ న జానే హృదయం మమ పునః కామో దివాపి రాత్రావపి నిర్ఘృణ తపతి బలవత్ త్వయి వృత్తమనోరథాన్యంగాని. )**

**రాజా : (సహసోపసృత్య ).**

**తపతి తనుగాత్రి! మదనస్త్వామనిశం మాం పునర్దహత్యేవ**
**గ్లపయతి యథా శశాంకం న తథా హి కుముద్వతీం దివసః. 14**

**సఖ్యౌ : (సహర్షమ్)సాఅదం అవిలంబిణో మణోరహస్స. (స్వాగతమవిలంబినో మనోరథస్య)**

**(శకుంతలాభ్యుత్థాతు మిచ్ఛతి)**

---

**తాత్పర్యం:** దయలేనివాడా! నీ మనసు సంగతి నాకు తెలీదు. నా మనసును మాత్రం మన్మథుడు పగలూ రేయీ తీవ్రంగా తపింపజేస్తున్నాడు. నిన్ను కోరుకొంటున్న నా శరీరంలో అణువణువునూ అదే కాముడు అలాగే దివారాత్రాలు తీవ్రంగా తపింపజేస్తున్నాడు. తవ న జానే!!

**విశేషాలు:** ఈ శ్లోకంలో అక్షరాక్షరానా వ్యంగ్యార్థాలే. వ్యాఖ్యాతలు విజృంభించి పుటలు పుటలు వివరించారు. సారాంశంగా – అత్ర శ్లోకే త్రయస్త్రింశత్ వ్యభిచారిభావాః అష్టౌ సాత్త్వికాః, అష్టౌ స్థాయినః, ఆహత్య ఏకోనపంచాశద్భావాః యథాసంభవం ప్రతీయంతే – అని శ్రీనివాసాచార్య నిరూపించారు.

**తపతి:** (సహసా = హఠాత్తుగా, ఉపసృత్య = సమీపించి) తనుగాత్రి = కృశాంగీ! మదనః = మన్మథుడు, త్వామ్ = నిన్ను, తపతి = తపింపజేస్తున్నాడు. మామ్ + పునః నన్నయితే, అనిశమ్ = పగలూ రేయీ, దహతి + ఏవ = దహించి వేస్తున్నాడు. దివసః = పట్టపగలు అనేది, శశాంకమ్ = చంద్రుణ్ని, యథా = ఏ తీరుగా, గ్లపయతి = రూపు మాపుతుందో, తథా = ఆ విధంగా, కుముద్వతీమ్ = కలువకన్నెను, న–గ్లపయతి + హి = రూపుమాపదు ఒడిలిస్తుంది అంతే కదా!

**తాత్పర్యం:** కృశాంగీ! మన్మథుడు నిన్ను కేవలం తపింప జేస్తున్నాడంతే. మరి నన్నో పగలూ రేయీ ఏకంగా దహించి వేస్తున్నాడు. దివసమనేది – చంద్రుణ్ని రూపుమాపుతుంది. కలువ కన్నెను మాత్రం ముకుళింపజేసి ఊరుకుంటుంది. కదూ! (ఈ శ్లోకంలోనూ ప్రతి పదమూ వ్యంజకమే. గ్రహించినవారికి గ్రహించినంత).

**రాజా : అలమలమాయాసేన.**

**సందష్టకుసుమశయనా న్యాశుక్లాంతబిసభంగ సురభీణి**
**గురు పరితాపాని న తే గాత్రా ణ్యుపచారమర్హంతి. 15**

**అన : ఇదో సిలాతలేక్కదేసం అలంకరేదు వఅస్సో. (ఇతః శిలాతలైకదేశమ్ అలంకరోతు వయస్యః). (రాజా ఉపవిశతి. శకుంతలా సలజ్జా తిష్ఠతి)**

---

**సాஉదం:** (సహర్షమ్ = ఆనందంతో) అవిలంబినః = జాగుసేయని, మనోరథస్య = కోరికకు, స్వాగతమ్ = ఇదే ఆహ్వానమ్! (సమయానికి విచ్చేసిన రాజుకు స్వాగతమని ఉపమేయవాక్యం. శకుంతలా మనోరథ స్వరూపుడు దుష్యంతుడు. ఉపమేయాన్ని చెప్పకుండా ఉపమానమే చెప్పి ఊరుకున్నాడు కనుక రూపకాతిశయోక్తి)

(శకుంతల, అభ్యుత్థాతుమ్ = లేచేందుకు, ఇచ్ఛతి = ప్రయత్నిస్తుంది.)

**అలమ్:** ఆయాసేన = శ్రమతో, అలమ్ + అలమ్ = చాలు, చాలు. శ్రమ పడకు – అని వారించడం.

**సందష్ట:** సందష్ట = ఒత్తుకున్న, కుసుమ – శయనాని = పూలపాన్పు కలవీ –పూలపాన్పు నీ అవయవాలకు ఒత్తుకుంది అని. పూలకన్నా సుకుమారాలని స్ఫూర్తి; ఆశు = వేగంగా, క్లాంత = వడలిపోయిన, బిస = తామరతూడుల, భంగ = నలుగుడుతో, సురభీణి = పరిమళిస్తున్నవీ – వేసీ వెయ్యగానే వాడిపోయాయి తామరతూడులు. అంతటి విరహతాపం. వాటిమీద దొర్లడంవల్ల అవి నలిగి వాటి వాసన అవయవాలకు అంటిందని; గురు–పరితాపాని = తీవ్రమైన విరహతాపంతో కూడినవీ అయిన, తే = నీ, గాత్రాణి = అవయవాలు, ఉపచారమ్ = ఉపచారకృత్యాన్ని (లేవడం – ఎదురు వెళ్ళడం – అర్ఘ్యపాద్యాదులు ఇవ్వడం ఇత్యాది), న + అర్హంతి = ఓర్వవు.

**తాత్పర్యం:** నీ శరీరాంగాలు పూలపాన్పును హత్తుకున్నాయి – ఒత్తుకున్నాయి. నలిగిన తామరతూడుల పరిమళాన్ని పులుముకున్నాయి. తీవ్రమైన విరహతాపం అనుభవిస్తున్నాయి. నా ఉపచారాల కోసమని వీటిని శ్రమపెట్టకు. ఇవి ఓర్చుకోలేవు సుమా!

**విశేషాలు:** సందష్టమ్ అంటే సంలగ్నమ్ అని అర్థం చెప్పి, గాత్రాణామ్ ఉత్థానే కర్తవ్యే కుసుమశయ్యాపి అంగలగ్నా ఉత్తిష్ఠతీతి భావః అన్నాడు రాఘవభట్టు. శకుంతల లేస్తే ఆమె ఒంటికి హత్తుకొని పూలపానుపు సైతం లేస్తుందట!!

**ప్రియం : దువేణం ఖు వో అణ్ణోణ్ణాణురాఓ పచ్చక్ఖో. సహీసిణేహో మం పుణరుత్తవాదిణిం కరేది. (ద్వయోర్నను యువయోః అన్యోన్యానురాగః ప్రత్యక్షః. సఖీస్నేహో మాం పునరుక్తవాదినీం కరోతి).**

**రాజా : భద్రే! నైతత్పరిహార్యమ్. వివక్షితం హ్యనుక్తమనుతాపం జనయతి.**

**ప్రియ : ఆవణ్ణస్స విసఅణివాసిణో జణస్స అత్తిహరేణ రణ్ణా హోదవ్వంత్తి ఏసో ణం వో ధమ్మో. (ఆపన్నస్య విషయనివాసినో జనస్యార్తి హరేణ రాజ్ఞా భవితవ్యమిత్యేష నను యుష్మాకం ధర్మః.**

**రాజా : నాస్మాత్పరమ్.**

---

**ఇదో:** ఇతః = ఇటువైపు, శిలాతల + ఏకదేశమ్ = రాతిబండకు చెందిన ఈ భాగాన్ని, వయస్యః = మిత్రుడు, అలంకరోతు = అలంకరించుగాక! మిత్రమా! ఈ శిలాతలం మీదనే ఇదిగో ఇక్కడ కూర్చో – అనడం.

(రాజా = దుష్యంతుడు, ఉపవిశతి = కూర్చొంటాడు. శకుంతలా = శకుంతల, సలజ్జా + తిష్ఠతి = సిగ్గుపడుతూ ఉంటుంది).

**దువేణం:** యువయోః + ద్వయోః = మీ ఇద్దరికీ, అన్యోన్య + అనురాగః = పరస్పరాభిలాష, ప్రత్యక్షః + నను = (చిక్కిపోవడం పాలిపోవడం ఇత్యాదులతో –) కనపడుతూనే ఉందిగదా! సఖీస్నేహః = శకుంతలపట్ల చెలికారం, మామ్ = నన్ను, పునరుక్త – వాదినీమ్ = మళ్ళీ మళ్ళీ మాట్లాడేదానినిగా, కరోతి = చేస్తోంది. ఆమెపై నాకున్న స్నేహమే నన్నిలా పదే పదే మాట్లాడిస్తోందనీ, అన్యథా భావించవద్దనీ.

**నైతత్:** భద్రే = కల్యాణీ! ఏతత్ = ఇలా మాట్లాడటమనేది, న + పరిహార్యమ్ = పరిహరింపదగినదికాదు. వివక్షితమ్ = చెప్పాలనుకొన్నది, అనుక్తమ్ = చెప్పకపోతే, అనుతాపమ్ = గుబులు, జనయతి–హి = పుట్టిస్తుంది సుమా!

**ఆవణ్ణస్స:** విషయనివాసినః = స్వదేశంలో నివసిస్తూ, ఆపన్నస్య = కష్టాల పాలైన, జనస్య = జనానికి, ఆర్తిహరేణ = కష్టం తొలగించేవాడుగా, రాజ్ఞా = రాజుచేత, భవితవ్యమ్ = ఉండబడాలి – ఆర్తుల ఆర్తిని తొలగించేవాడవ్వాలి రాజు, ఇతి + ఏషః = అనేది ఇయ్యది, నను + యుష్మాకమ్ + ధర్మః = నీ ధర్మం కదూ!

**నాస్మాత్:** అస్మాత్ + పరమ్ + న = ఇంతకన్నా వేరొకటి లేదు.

**ప్రియ : తేణ హి ఇఅం ణో పిఅసహీ తుమం ఉద్దిసిఅ ఇమం అవత్థంతరం భఅవతా మఅణేణ ఆరోవిదా. తా అరుహసి అబ్భువ వత్తిఆ జీవిదం సే అవలంబిదుం. (తేన హి ఇయం నౌ ప్రియసఖీ త్వాముద్దిస్య ఇదమవస్థాంతరం భగవతా మదనేన ఆరోపితా. తదర్హసి అభ్యుపపత్త్యా జీవితం తస్యా అవలంబితుమ్)**

**రాజా : భద్రే! సాధారణోஉయం ప్రణయః. సర్వథానుగృహీతోஉస్మి.**

**శకుం : (ప్రియంవదామవలోక్య) హలా! అలం అంతేఉర విరహపజ్జుస్సుఅస్స రాఏసిణో ఉవరోహేణ. (హలా, అలమంతఃపురవిరహపర్యుత్సుకస్య రాజర్షే రుపరోధేన.)**

---

**తేణ హి:** తేన – హి = అందుచేత; నౌ + ప్రియసఖీ = మా నెచ్చెలి, ఇయమ్ = ఈ శకుంతల, త్వామ్ + ఉద్దిశ్య = నిన్ను అభిలషించి, ఇదమ్ + అవస్థాంతరమ్ = ఈ విరహావస్థను (మామూలు అవస్థ కన్నా భిన్నమైనది = అవస్థాంతరమ్), భగవతా– మదనేన = భగవంతుడైన మన్మథుడిచేత, ఆరోపితా = పొందింపబడింది. తత్ = ఈమె ఈ దురవస్థకు –ఆర్తికి – కారణం నువ్వే కాబట్టి, అభ్యుపపత్త్యా = అనుగ్రహంతో (అథాభ్యుపపత్తి రనుగ్రహః – ఇతి శాశ్వతః నిఘంటుః), తస్యాః + జీవితమ్ = ఆమె జీవితాన్ని, అవలంబితుమ్ = ఆదుకోవడానికి, అర్హసి = నువ్వే అర్హుడవు.

**సాధారణః:** భద్రే = కల్యాణీ! అయమ్ = ఈ, ప్రణయః = అభ్యర్థన, సాధారణః = ఇరుపక్షాలకూ సమానం. మీ నెచ్చెలి నా జీవితాన్నీ ఆదుకోవాలి అనడం. సర్వథా = అన్నివిధాలా, అనుగృహీతః + అస్మి = అనుగృహీతుణ్ని అయ్యాను. (ప్రణయః ప్రేమ్ణి విస్రంభే యాఞ్చా ప్రత్యయయోరపి – ఇతి విశ్వః).

**అలం అంతేఉర:** (ప్రియంవదాం = ప్రియంవదను, అవలోక్య = ఆలోకించి) హలా = సఖీ! ప్రియంవదా! అంతఃపుర = అంతఃపురకాంతల, విరహ = విరహంతో, పర్యుత్సుకస్య = బెంగటిల్లుతున్న, రాజర్షేః = ఈ రాజర్షిని(కి), ఉపరోధేన = నిర్బంధించడంతో, అలమ్ = చాలు. బలవంతంగా ఒప్పించవద్దులే – అనడం. అతడిలో కనిపిస్తున్న విరహలక్షణాలు తనమీద వలపుతోనేనా లేక అంతఃపురకాంతలకు దూరమైనందువల్లనా అనేది తేల్చుకోడానికి.

**ఇదమనన్య:** హృదయ సన్నిహితే = నా హృదయంలో సుప్రతిష్ఠితురాలా! నిత్యసన్నిహితా! అనన్యపరాయణమ్ = అన్యలకు అధీనంకాని – నీకే అంకితమైన,

**రాజా : ఇదమనన్యపరాయణ మన్యథా**
**హృదయసన్నిహితే హృదయం మమ**
**యది సమర్థయసే మదిరేక్షణే**
**మదనబాణహతోఽస్మి హతః పునః. 16**

**అనసూ : వఅస్స, బహువల్లహా రాజాణో సుణీఅంతి. జహణో పిఅసహీ బంధుజణ సోఅణిజ్జా ణ హోహి తఇ నివ్వత్తేహి. (వయస్య! బహువల్లభా రాజానః శ్రూయంతే. యథా నౌ ప్రియసఖీ బంధుజన శోచనీయా న భవతి తథా నిర్వర్తయ.)**

---

ఇదమ్ = ఈ, మమ–హృదయమ్ = నా హృదయాన్ని, అన్యథా = మరోలాగా – అన్యపరాయణంగా, సమర్థయసే – యది = సంభావింతువేని, మదిరేక్షణే = కాటుక కన్నులదానా! మదనబాణ – హతః + అపి = మన్మథబాణాలతో హింసింపబడినవాడ నైనప్పటికీ, పునః = మళ్ళీ, హతః (అస్మి) = హింసింపబడ్డవాడను అవుతున్నాను. (మదిరశబ్దానికి మత్తఖంజనమ్ అనే అర్థం – మోనియర్విలియమ్స్).

**తాత్పర్యం:** నా హృదయంలోనే నివసిస్తున్నదానా! నా హృదయాన్ని తెలుసుకోలేక పోయావు. నా హృదయం నీకే అంకితం. మరింక ఎవ్వరికీ కాదు. అలాంటి దీన్ని నువ్వు శంకించి మరోలా భావిస్తున్నావంటే – ఓ మదిరేక్షణా! మన్మథబాణాల దెబ్బలతో ఇప్పటికే ప్రాణాలు కడబట్టిన నేను మళ్ళీ హతుడనవుతున్నాను.

**బహువల్లహా:** వయస్య = చెలికాడా! రాజానః = మహారాజులు, బహువల్లభాః = బహుపత్నీకులని, శ్రూయంతే = వినవస్తున్నారు. నౌ + ప్రియసఖీ = మా నెచ్చెలి, బంధుజన – శోచనీయా = బంధువర్గంచేత జాలి గొనవలసినది, యథా–న–భవతి = ఎలా కాదో, తథా = అలా, నిర్వర్తయ = ఏలుకో. సవతిపోరుతో ఈమె పరిస్థితి శోచనీయమూ దయనీయమూ కాకుండా చూసుకో – ఏలుకో – అని.

**పరిగ్రహా:** భద్రే = కల్యాణీ! కిమ్–బహునా = వెయ్యి (మాటలు) ఏల? పరిగ్రహ–బహుత్వే + అపి = పత్నుల బాహుళ్యం ఉన్నప్పటికీ (పరిగ్రహః పరిజనే పత్న్యాం స్వీకారమూలయోః – ఇతి విశ్వః), మే = నా, కులస్య = వంశానికి, ప్రతిష్ఠే =ప్రతిష్ఠలు (గౌరవహేతువులు), ద్వే = ఇదర్దే ఇద్దరు (రెండే రెండు), సముద్ర–వసనా = సముద్రమే

**రాజా : భద్రే! కిం బహునా?**

**పరిగ్రహబహుత్వేఽపి ద్వే ప్రతిష్ఠే కులస్య మే**
**సముద్రవసనాచోర్వీ సఖీ చ యువయోరియమ్. 17**

**ఉభే : ణివ్వుద మ్హ(నిర్వృతే స్వః).**

**ప్రియ : (సదృష్టిక్షేపమ్) అణసూఏ, జహ ఏసో ఇదోదిణ్ణదిట్ఠీ ఉస్సుఓ మిఅపోదఓ మాదరం అణ్ణేసది. ఏహి. సంజోఏమ ణం. (ఇత్యుభే ప్రస్థితే). (అనసూయే యథైష ఇతో దత్తదృష్టిరుత్సుకో మృగపోతకో మాతరమన్విష్యతి. ఏహి. సంయోజయావ ఏనమ్).**

**శకుం : హలా, అసరణ హ్మి. అణ్ణదరా వో ఆఅచ్ఛదు. (హలా! అశరణాస్మి. అన్యతరా యువయో రాగచ్ఛతు).**

---

చీరగా కలిగిన, ఉర్వీ – చ = భూమిన్నీ; యువయోః = మీ ఇద్దరి, ఇయమ్ = ఈ, సఖీ–చ = నెచ్చెలిన్నీ. (సముద్ర రశనా = సముద్రమే మొలనూలైన ఉర్వీచ – అని పాఠాంతరం).

**తాత్పర్యం:** అంతఃపురకాంతలు చాలామంది ఉండవచ్చుగాక. నా వంశానికి ప్రతిష్ఠా హేతువులు – కీర్తిపతాకలు – ఇద్దరే. ఒకరు – సప్తసాగర పరివేష్టితయైన వసుంధర. మరొకరు మీ ఈ ప్రియసఖి.

**ణివ్వుద మ్హ:** నిర్వృతే = ఆనందపడినవారం, స్వః = అయ్యాం!! పరమానంద భరితలమయ్యామని.

**జహ ఏసో:**(సదృష్టిక్షేపమ్ = కనుసన్న చేస్తూ) అనసూయే = ఓ అనసూయా! ఏషః – మృగపోతకః= అదిగో ఈ మగ లేడికూన, ఇతః = ఇటువైపు, దత్తదృష్టిః = చూపు నిల్పినదై, ఉత్సుకః = ఉబలాటపడుతున్నదై, మాతరమ్ = తల్లిని, అన్విష్యతి = వెదుకులాడుతోంది. ఏహి = రా! రా! ఏనమ్ = ఈ మగలేడికూనను, సంయోజయావ = కలుపుదాం!! (ఇతి = అని, ఉభే = ఇద్దరూ, ప్రస్థితే = బయలుదేరుతారు).

**అసరణ:** హలా = సఖీ! అశరణా + అస్మి = దిక్కులేనిదాననయ్యాను. యువయోః = మీలో, అన్యతరా = ఎవరో ఒకరు (ఎవ్వతె యేనొక్కతె), ఆగచ్ఛతు = రండి (వచ్చుగాక)!

**ఉభే : పుహవీఏ జో సరణం సో తుహ సమీవే వట్టఇ (ఇతి నిష్క్రాంతే)**
**(పృథివ్యా యః శరణం స తవ సమీపే వర్తతే).**

**శకుం : కహం గదాఓ ఏవ్వ. (కథం గతే ఏవ!)**

**రాజా : అలమావేగేన. నన్వయమారాధయితా జనస్తవ సమీపే వర్తతే.**

**కిం శీతలైః క్లమవినోదిభిరార్ద్రవాతాన్**
**సంచారయామి నలినీదళతాళవృంతైః?**
**అంకే నిధాయ కరభోరు! యథాసుఖం తే**
**సంవాహయామి చరణావుత పద్మతామ్రౌ? 18**

---

**పుహవీఏ:** పృథివ్యాః = సమస్త భూమికీ, యః = ఎవడు, శరణమ్ = దిక్కో, సః = అతడు, తవ = నీ, సమీపే = చెంతనే, వర్తతే = ఉన్నాడు! (ఇతి = అని, నిష్క్రాంతే = నిష్క్రమిస్తారు).

**కహం:** కథమ్ = ఎట్టూ!! గతే + ఏవ = వెళ్ళనే వెళ్ళారు!!

**అలమ్:** ఆవేగేన = వ్యాకులపాటుతో, అలమ్ = చాలు. వ్యాకులత చెందవద్దు –అని. ఆరాధయితా = ఉపచారకర్తయైన, జనః = వ్యక్తి, అయమ్ = వీడు, తవ–సమీపే = నీ చెంగటనే, వర్తతే – నను = ఉన్నాడుగదా!! సేవలు చేసేందుకు నేనున్నాను గదా – అనడం.

**కిం శీతలైః:** శీతలైః = చల్లనివీ, క్లమ–వినోదిభిః = అలసటను తీర్చేవీ (తొలగించేవి. వి + నుద్) అయిన, నలినీదళ –తాళవృంతైః = తామరపాకు వీవనలతో, ఆర్ద్రవాతాన్ = చల్లగాలులను, సంచారయామి – కిమ్ = వీతునో?! ఉత = లేదా, కరభోరు = కరభాలలాంటి ఊరువులు కలదానా! (మణిబంధా దాకనిష్ఠం కరస్య కరభో బహిః. మణికట్టునుంచి చిటికెన వేలి చివరిదాకా ఉన్న అరచేతి వెలుపలిభాగాన్ని కరభం అంటారు). పద్మతామ్రౌ = చెంగలువల్లాగా ఎర్రగా ఉన్న, తే–చరణౌ = నీ పాదాలను, అంకే = నా ఒడిలో, నిధాయ = ఉంచుకొని, తే = నీకు, యథాసుఖమ్ = హాయిగా ఉండేట్టు (ఎలా అయితే నీకు సుఖంగా ఉంటుందో అలా), సంవాహయామి కిమ్ = ఒత్తుదునో?! (తాళవృంతం = తాటి ఆకు విసనకర్ర – యౌగికార్థం. వీవన అనేది రూఢార్థం.)

శకుం : ణ మాణణీఏసు అత్తాణం అవరాహఇస్సం (ఇత్యుత్థాయ ప్రస్థితా) (న మాననీయేష్వాత్మానమపరాధయిష్యామి)

రాజా : సుందరి! అపరినిర్వాణోఽయం దివసః. ఇయం చ తే శరీరావస్థా.

ఉత్సృజ్య కుసుమశయనం నలినీదళకల్పితస్తనావరణమ్
కథమాతపే గమిష్యసి పరిబాధా పేలవైరంగైః? **19**

---

**తాత్పర్యం:** తామరపాకులే – తామర పువ్వు రేకులే –వీవనలుగా చల్లని గాలులను నీ సర్వాంగాలకూ తగిలేలాగా అలసట తీరేలాగా విసరనా?! కరభోరూ! చెంగలువల్లాంటి నీ పాదాలను ఒడిలో పెట్టుకొని నీకు హాయి గొలిపేలాగా మెల్లమెల్లగా ఒత్తనా?!

**విశేషాలు:** నళినీదళమంటే తామరపువ్వురేకు అనేది ప్రసిద్ధార్థం. కానీ రాఘవభట్టు "తామరపాకు" అనే అర్థంలో సమన్వయించి, అది చిరిగిపోయినప్పుడల్లా ఆకు మార్చాలి కాబట్టి వృంతైః అనే బహువచనం సార్థకమనీ సమర్థించాడు. నలినం పద్మం విద్యతే యస్యాః సా నలినీ. తస్యాః దళాని = కమలినీ పలాశాని. తాన్యేవ తాళవృంతాని – వ్యజనాని – తైః. బహువచనేన ప్రతిక్షణం భిన్నస్యోపాదీయమానతా సూచితా. సంచారయామి అనే క్రియా పదాన్ని వివరిస్తూ శ్రీనివాసాచార్య – ఆర్ద్రవాతాన్ సంచారయామి = యథాసుఖం సర్వావయవేషు సమ్యక్చాలయామి?– అన్నారు.

**ణ మాణణీఏసు:** మాననీయేషు = గౌరవించదగినవారి విషయంలో, ఆత్మానమ్ = నన్ను నేను, న + అపరాధయిష్యామి = అపరాధిని చేసుకోలేను. నీ సేవలు అంగీకరించే అపరాధం చెయ్యలేననడం. (ఇతి = అని, ఉత్థాయ = పూలుపరచిన శిలా తల్పంనుంచి లేచి, ప్రస్థితా = పొదరింటి గుమ్మంవైపు నడుస్తుంది).

**సుందరి:** సుందరి = సుందరాంగీ! అయమ్ = ఈ, దివసః = పగటివేళ, అపరినిర్వాణః = ఇంకా పరిణతం కాలేదు. (అనిర్వాణః = అపరిణతః – రాఘవభట్టః, అప్రశాంతతాపః – అని శ్రీనివాసాచార్య). ఎండవేడిమి ఇంకా తగ్గలేదనడం. తే = నీ, శరీరావస్థా = తనువు పరిస్థితి, ఇయమ్ + చ = ఇదీ. అసలే విరహతాపంతో వేగిపోతోంది – అని.

**ఉత్సృజ్య:** కుసుమ శయనమ్ = పూలపాన్పును, ఉత్సృజ్య = విడిచి, నళినీ దళ = తామరాకులతో – పూరేకులతో, కల్పిత = సమకూర్చబడిన, స్తనావరణమ్ = పయ్యెదను, ఉత్సృజ్య = జారవిడిచి, పరిబాధా – పేలవైః = విరహతాపంతో (మన్మథపీడతో) కృశించినవైన (పేశలైః = మృదువులైన – పాఠాంతరం), అంగైః = అవయవాలతో, ఆతపే = ఇంత ఎండలో, కథమ్ – గమిష్యసి = ఎలా వెడతావు?!

(ఇతి బలాదేనాం నివర్తయతి)

**శకుం : పోరవ! రక్ఖ విణఅం. మఅణసంతత్తావి ణ హు అత్తణో పహవామి.**
**(పౌరవ! రక్ష వినయమ్. మదనసంతప్తాపి న ఖలు ఆత్మనో ప్రభవామి).**

**రాజా : భీరు! అలం గురుజనభయేన. దృష్ట్వా తే విదితధర్మా తత్రభవాన్ న అత్ర దోషం గ్రహీష్యతి కులపతిః. అపిచ –**

**గాంధర్వేణ వివాహేన బహ్వ్యః రాజర్షికన్యకాః**
**శ్రూయంతే పరిణీతాస్తాః పితృభిశ్చాభినందితాః. 20**

---

**తాత్పర్యం:** పూలపాన్పును విడిచి, తామరాకుల పయ్యెదను జారవిడిచి, అసలే విరహతాపంతో కృశించిపోయిన ఈ సుకుమార సుందర శరీరంతో ఈ మండుటెండలో ఎలా వెడతావు?!

(ఇతి = అని, బలాత్ = బలవంతంగా, ఏనామ్ = శకుంతలను,
నివర్తయతి = వెనక్కి లాగుతాడు).

**పోరవ:** పౌరవ = పురువంశోద్భవా! వినయమ్ = సత్ప్రవర్తనను, (సద్వృత్తమ్ – సౌశీల్యాదికమ్ – అని వ్యాఖ్యాతలు), రక్ష = కాపాడు! మదనసంతప్తా + అపి = మన్మథ పీడితురాలినే అయినప్పటికీ, ఆత్మనః = నాకు నేను, న + ప్రభవామి + ఖలు = స్వతంత్రురాలను కాదుగదా! కణ్వుడికి అధీనురాలను, నన్ను నేను సమర్పించుకోజాలను – అనడం. (మదనబాధితాః అపి కన్యకాః ఆత్మనో న ప్రభవంతి – అని పాఠాంతరం. ఎంత మదనపీడితలైనా కన్యలు స్వతంత్రలు కాజాలరని).

**భీరు:** భీరు = బేలా! గురుజన భయేన = పెద్దలవలని భయంతో, అలమ్ = ఇక చాలు. గురుజనభయం చాలించు – అని. దృష్ట్వా + అపి = తపోదృష్టితో దర్శించినప్పటికీ (శ్రుత్వా + అపి = అంతా విన్నప్పటికీ), విదిత ధర్మా = అన్ని ధర్మాలూ తెలిసినవాడైన, తత్రభవాన్ = పూజ్యుడు, కులపతిః = కులపతి కణ్వుడు (కాశ్యపుడు), తే + అత్ర = నిన్ను నేను పరిగ్రహించడం అనే ఈ విషయంలో, దోషమ్ = ఏ తప్పునూ ఏ ధర్మలోపాన్నీ, న–గ్రహీష్యతి = ఎన్నబోడు. (తే = తవ, అత్ర = మత్పరిగ్రహే – అని వ్యాఖ్యాతలు) అపి చ = అంతే కాదు –

**గాంధర్వేణ:** గాంధర్వేణ – వివాహేన = గాంధర్వవివాహపద్ధతితో, పరిణీతాః = పెళ్ళాడిన, రాజర్షి కన్యకాః = (నీవంటి) రాచకన్నెలు, బహ్వ్యః = పలువురు, శ్రూయంతే

**శకుం : ముంచ దావ మం. భూఓ వి సహీజణం అణుమాణఇస్సం. (ముంచ తావన్మామ్. భూయోఽపి సఖీజనమనుమానయిష్యే)**

**రాజా : భవతు. మోక్ష్యామి.**

**శకుం : కదా?**

**రాజా : అపరిక్షత కోమలస్య యావత్**
**కుసుమస్యేవ నవస్య షట్పదేన**

---

= వినబడుతున్నారు. తాః = వారంతా, పితృభిః = తల్లిదండ్రులతో (గురుజనంతో), అభినందితాః + చ = అభినందింపబడ్డారుకూడా!!

**తాత్పర్యం:** గాంధర్వపద్ధతిలో – కోరినవాడిని పెళ్ళాడిన రాచకన్నెలు ఎందరెందరో ఎప్పటినుంచో వినబడుతున్నారు. వాళ్లందరూ తమ గురుజనంతో అభినందింపబడ్డారు కూడా!!

**ముంచ:** తావత్ = ఇంతకీ, మామ్ = నన్ను, ముంచ = విడిచిపెట్టు! భూయః + అపి = మరొకసారి, సఖీజనమ్ = చెలిమికత్తెలను, అనుమానయిష్యే = సంప్రదిస్తాను. (భూయోఽపి = మరొక్కసారి, సఖీజనం = చెలుల్ని, ద్రక్ష్యామి = చూసి వస్తాను –చూస్తాను – అని పాఠాంతరం).

**భవతు:** భవతు = అగుగాక! మోక్ష్యామి = విడిచిపెడతానులే.

**కదా:** కదా = ఎప్పుడు?

**అపరి:** సుందరి = సుందరాంగీ! అపరిక్షత = మొక్కవోని (అచుంబితమైన), కోమలస్య = మృదుత్వంకలదీ, నవస్య = అప్పుడే వికసించినదీ అయిన, కుసుమస్య = పువ్వులోని, యావత్ + రసః = మొత్తం మకరందం, షట్పదేన + ఇవ = ఒక తుమ్మెదచేత–వలె; తే = నీ, అస్య = ఈ, అధరస్య = క్రింది పెదవియొక్క, రసః = అమృతం, పిపాసతా = త్రాగగోరువాడనైన, మయా = నాచేత, సదయమ్ = మృదువుగా (దయగలిగి), గృహ్యతే = స్వీకరింపబడుతోంది. అధరమధువును గ్రోలుతున్నానని.

**తాత్పర్యం:** అప్పుడే వికసించిన పువ్వు. ఏ తుమ్మెదా ఇంతవరకూ వాలని పువ్వు. సుకుమార సుందరమైన పువ్వు. ఆ పువ్వులోని మధువును గండు తుమ్మెద – మృదువుగా

**అధరస్య పిపాసతా మయా తే**
**సదయం సుందరి! గృహ్యతే రసోఽస్య. 21**

**(ఇతి ముఖమస్యాః సమున్నమయితు మిచ్ఛతి. శకుంతలా పరిహరతి నాట్యేన)**

**(నేపథ్యే)**

**చక్కవాకవహూఏ, ఆమంతే హి సహఅరం. ఉవవిట్ఠిఆ రఅణీ**
**(చక్రవాకవధూః! ఆమంత్రయస్వ సహచరమ్. ఉపస్థితా రజనీ)**

**శకుం : (ససంభ్రమమ్) పోరవ, అసంసఅం మమ సరీరవుత్తంతోవలంభస్స అజ్జా గోదమీ ఇదో ఏవ్వ ఆఅచ్ఛది. జావ విడవందరిదో హోహి.**

**(పౌరవ! అసంశయం మమ శరీరవృత్తాంతోపలంభాయార్యా గౌతమీ ఇత ఏవాగచ్ఛతి. యావద్విటపాంతరితో భవ.)**

---

మొత్తం ఆస్వాదించినట్టు, ఓ సుందరీ! దప్పికగొన్న నేను నీ ఈ అధరామృతాన్ని చాలా మృదువుగా స్వీకరిస్తాను.

(ఇతి = అని, అస్యాః + ముఖమ్ = ఆమె మోమును, సమున్నమయితుమ్ = పైకి ఎత్తడానికి, ఇచ్ఛతి = ముచ్చటపడతాడు. శకుంతలా = శకుంతల, నాట్యేన–పరిహరతి = అతడి ప్రయత్నాన్ని తప్పించడం అభినయంతో చూపుతుంది).

**(నేపథ్యే = తెరలో)**

చక్రవాకవధూః = ఓ జక్కవకన్నియా! (చక్రవాకీ!) సహచరమ్ = సఖుడిని, ఆమంత్రయస్వ = వీడ్కోలుపు. రజనీ = రేయి, ఉపస్థితా = సమీపించింది.

**పోరవ:** (ససంభ్రమమ్ = కళవళపడుతూ) పౌరవ = పురువంశోద్భవా! అసంశయమ్ = సందేహం లేదు. మమ = నా, శరీరవృత్తాంత = శరీర (ఆరోగ్య) స్థితిని, ఉపలంభాయ = స్వయంగా తెలుసుకోవడం కోసం (ఉపలభస్త్వనుభవః – ఇత్యమరః), ఆర్యా = మాన్యురాలు, గౌతమీ = గౌతమి, ఇతః + ఏవ = ఇటే, ఆగచ్ఛతి = వస్తోంది. యావత్ = అంతలోకీ, విటప + అంతరితః + భవ = కొమ్మల చాటున దాగినవాడవు కమ్ము. చెట్ల గుబురులో దాక్కో – అని.

**రాజా : తథా. (ఇత్యాత్మానమావృత్య తిష్ఠతి)**

**(తతః ప్రవిశతి పాత్రహస్తా గౌతమీ. సఖ్యౌ చ)**

**సఖ్యౌ : ఇదో ఇదో అజ్జా గోదమీ. (ఇత ఇత ఆర్యే గౌతమి)**

**గౌతమీ : (శకుంతలాముపేత్య) జాదే! అవి లహుసందావాఇం దే అంగాఇం? (జాతే! అపి లఘుసంతాపాని తే అంగాని?)**

**శకుం : అత్థి మే విసేసో. (అస్తి మే విశేషః)**

**గౌత : ఇమిణా దబ్భోదఏణ ణిరాబాధం ఏవ్వ దే సరీరం భవిస్సది. (శిరసి శకుంతలామభ్యుక్ష్య) వచ్చే! పరిణదో దివఓ. ఏహి. ఉడజం ఏవ్వ గచ్ఛహ్మ. (అనేన దర్భోదకేన నిరాబాధమేవ తే శరీరం భవిష్యతి. వత్సే! పరిణతో దివసః. ఏహి. ఉటజమేవ గచ్ఛామః)**

---

**తథా:** తథా = అలాగే (ఇతి = అని, ఆత్మానమ్ + ఆవృత్య = తనను తాను దాచుకొని, తిష్ఠతి = ఉంటాడు. దాగుకుంటాడని భావం).

(తతః = అంతట, పాత్రహస్తా = కలశం చేతబట్టుకొన్నదై, గౌతమీ = గౌతమి, ప్రవిశతి = ప్రవేశిస్తుంది. సఖ్యౌ + చ = అనసూయాప్రియంవదలూను, ప్రవిశంతి – అని ముగ్గురికీ బహువచనమైనా కావచ్చు).

**ఇదో ఇదో:** ఆర్యే = మాన్యురాలా! గౌతమి = గౌతమీ! ఇతః + ఇతః = ఇటు–ఇటు.

**జాదే:** (శకుంతలామ్ + ఉపేత్య = శకుంతలను చేరి) జాతే = పుత్రీ! తే + అంగాని = నీ శరీరాంగాలు, అపి–లఘు సంతాపాని = తగ్గిన తాపం కలవి అయ్యాయా? శారీరకతాపం తగ్గిందా?– అని అడగడం. వాక్యారంభంలో అపి ఉంటే అది ప్రశ్న. (అపీతి ప్రశ్నే. లఘుః స్వల్పః సంతాపో యేషు తాని = లఘుసంతాపాని).

**అత్థి:** మే = నాకు, విశేషః = విశేషంగా – అధికంగా, అస్తి = ఉంది. ఈ పూట తాపం మరీ ఎక్కువగా ఉంది – అని.

**ఇమిణా:** అనేన = ఈ, దర్భ + ఉదకేన = దర్భోదకంతో, తే–శరీరమ్ = నీ తనువు, నిరాబాధమ్ + ఏవ – భవిష్యతి = బాధ తొలగినది అవుతుంది. (శిరసి = శిరస్సున, శకుంతలామ్ + అభ్యుక్ష్య = శకుంతలను దర్భనీటితో చల్లి) వత్సే = పుత్రీ! దివసః =

**(ఇతి ప్రస్థితాః)**

**శకుం : (ఆత్మగతమ్) హిఅఅ, పఢమం ఏవ్వ సుహోవణదే మణోరహే కాదరభావం ణ ముంచసి. సాణుసఅం విహడిఅస్స అహం దే సంపదం సందాబో. (హృదయ! ప్రథమమేవ సుఖోపనతే మనోరథే కాతరభావం న ముంచసి. సానుశయం విఘటితస్య కథం తే సాంప్రతం సంతాపః?) (పదాంతరే స్థిత్వా. ప్రకాశమ్) లదావలఅ! సందావహారఅ, ఆమంతేమి తుమం భూఓ వి పరిభోఅస్స. (లతావలయ! సంతాపహారక! ఆమంత్రయే త్వాం భూయోఽపి పరిభోగాయ.)**

**(ఇతి దుఃఖేన నిష్క్రాంతా శకుంతలా సహేతరాభిః)**

---

దివసం, పరిణతః = పరిణతి చెందింది – సాయంవేళ అయ్యింది అని. ఏహి = రమ్ము. ఉటజమ్ + ఏవ = మన కుటీరానికే, గచ్ఛామః = వెడదాం.

(ఇతి = అని, ప్రస్థితాః = అందరూ బయలుదేరుతారు)

**హిఅఅ:** (ఆత్మగతమ్ = తనలో). హృదయ = మనసా! ప్రథమమ్ = ఇంతకు ముందు, మనోరథే = నీ కోరిక (కోరినవాడు), సుఖ + ఉపనతే (సతి) = (తనంతతానుగా వచ్చి) తేలికగా సమీపిస్తే – నెరవేరబోతే, కాతరభావమ్ = పిరికితనాన్ని – భయాన్ని, న–ముంచసి = విడిచిపెట్టలేకపోయావు. ధైర్యం చెయ్యలేకపోయావనడం. సానుశయమ్ = గౌతమి రాకతో పశ్చాత్తాపపూర్వకంగా, విఘటితస్య = భంగపరుపబడిన కోరికకలదానవైన, తే = నీకు (అథానుశయో దీర్ఘద్వేషానుతాపయోః – అమరః), సాంప్రతమ్ = ఇప్పుడు, సంతాపః + కథమ్ = సంతాపమేమిటి? సంతాపపడే అర్హత కూడా నీకులేదని. (పదాంతరే – స్థిత్వా = మరో అడుగువేసి – ఆగి, ప్రకాశమ్ = ప్రకాశంగా) లతావలయ = ఓ లతా నికుంజమా! సంతాపహారక = నా మనస్తాపాన్ని తొలగించేదానా!! భూయః + అపి = మరోసారి ఎప్పుడో తిరిగివచ్చి, పరిభోగాయ = సుఖించడానికీ అనుభవించడానికీ, త్వామ్ = నిన్ను, ఆమంత్రయే = ప్రస్తుతం వీడ్కొల్పుతున్నాను. (ఇది పొదరింటిలోని దుష్యంతుడికి వీడ్కోలు). (ఇతి = అని పలికి, దుఃఖేన = దిగులుపడుతూ, సహ + ఇతరాభిః = తక్కినవారు ముగ్గురితోనూ, శకుంతలా = శకుంతల, నిష్క్రాంతా = నిష్క్రమిస్తుంది).

**రాజా : (పూర్వస్థానముపేత్య. సనిఃశ్వాసమ్) అహో! విఘ్నవత్యః ప్రార్థితార్థ సిద్ధయః. మయా హి –**

**ముహురంగుళిసంవృతాధరోష్ఠం**
**ప్రతిషేధాక్షరవిక్లబాభిరామమ్**
**ముఖ మంసవివర్తి పక్ష్మలాక్ష్యాః**
**కథమప్యున్నమితం న చుంబితం తు. 22**

**క్వ ను ఖలు సంప్రతి గచ్ఛామి? అథవా ఇహైవ ప్రియాపరిభుక్తముక్తే లతావలయే ముహూర్తం స్థాస్యామి. (సర్వతోఽవలోక్య)**

---

**అహో:** (పూర్వస్థానమ్ + ఉపేత్య = చెట్లమాటునుంచి మునుపటిచోటికి వచ్చి, సనిఃశ్వాసమ్ = నిట్టూరుస్తూ) అహో = ఆహా! ప్రార్థిత + అర్థసిద్ధయః = కోరినవి సిద్ధించడాలు (కోరిన ప్రయోజన సిద్ధులు), విఘ్నవత్యః = విఘ్నవంతాలు గదా! కోరికలు తీరడానికి ఎన్ని అడ్డంకులో – అనడం. మయా + హి = నాచేతనేమో –

**ముహుః:** ముహుః = మాటిమాటికీ, అంగుళి–సంవృత = చేతివేళ్ళతో కప్పివేయబడిన, అధరోష్ఠమ్ = క్రిందిపెదవి కలదీ; ప్రతిషేధ + అక్షర = వద్దు వద్దు (న–న) అనే నిషేధాక్షరాల, విక్లబ = అస్ఫుటోచ్చారణతో, అభిరామమ్ = అందగించినదీ అయిన, పక్ష్మలాక్ష్యాః = ఒత్తయిన కనురెప్పల కన్నులున్న శకుంతలయొక్క, అంసవివర్తి = బుజాల వైపు మాటిమాటికీ మళ్ళించుకొంటున్న, ముఖమ్ = మొగము, కథమ్ + అపి = ఎలాగోలాగా, ఉన్నమితమ్ = పైకెత్తబడింది, తు = కానీ, న–చుంబితమ్ = ముద్దాడబడలేదు.

**తాత్పర్యం:** అధరాన్ని చుంబించబోతే వేళ్ళతో కప్పుకొనేది, వద్దు వద్దు అని అస్ఫుటంగా పలుకుతుండేది, ముఖం అటూఇటూ బుజాలమీదకి మళ్ళించుకొనేది, ఒత్తయిన కనురెప్పల కన్నులు గల ఆ శకుంతల ముఖాన్ని చుంబించడానికి వీలుగా ఎలాగోలా కష్టపడి పైకైతే ఎత్తగలిగాను గానీ చుంబించడం అవ్వలేదు.

**విశేషాలు:** ముహుః అనే పదాన్ని అన్ని పనులకూ అన్వయించారు కొందరు వ్యాఖ్యాతలు. ముహుః ఉన్నమితమ్, ముహుః న చుంబితమ్ – ఒకసారే చుంబనం ఒక్కసారే కలయిక జరిగిందన్నారు. తు శబ్దః పునశ్శబ్దార్థవాచకః. పునర్న చుంబితమి

**తస్యాః పుష్పమయీ శరీరలులితా శయ్యా శిలాయామియం**
**క్లాంతో మన్మథలేఖ ఏష నలినీపత్రే నఖైరర్పితః**
**హస్తాద్ భ్రష్టమిదం బిసాభరణమిత్యాసజ్యమానేక్షణో**
**నిర్గంతుం సహసా న వేతసగృహాత్ శక్నోమి శూన్యాదపి. 23**

---

త్యనేన ఏకవారమేవ చుంబితమితి వ్యజ్యతే. ఏకవార సంభోగో జాత ఇత్యర్థః అన్నాడు శ్రీనివాసాచార్య. ముగింపులోని ఈ 'తు' నాయకుడి మూతి తదుచ్చారణభంగిమలో నిలిచిపోయిందనడాన్ని సూచిస్తోందట.

**క్వ ను:** సంప్రతి = ప్రస్తుతం, క్వ–ను–ఖలు–గచ్ఛామి = ఎక్కడికని వెళ్ళను? అథవా = వద్దులే, ఇహ + ఏవ = ఇక్కడే, ప్రియాపరిభుక్త–ముక్తే = ప్రేయసి అనుభవించి విడిచిన, లతావలయే = ఈ పొదరింటిలోనే, ముహూర్తమ్ – స్థాస్యామి = కొంతసేపు ఉంటాను. (సర్వతః + అవలోక్య = అన్నివైపులకూ చూసి).

**తస్యాః:** తస్యాః = ఆమెయొక్క, శరీరలులితా = తనువుతో నలిగిపోయినదీ, పుష్పమయీ = పూలతో ఏర్పరిచినదీ అయిన, శయ్యా = పానుపు, శిలాయామ్ = ఈ రాతిమీద, ఇయమ్ = ఇదిగో! నలినీపత్రే = తామరరేకమీద, నఖైః = గోళ్లతో, అర్పితః = లిఖింపబడ్డ, మన్మథలేఖః = ప్రేమలేఖ, క్లాంతః = వడిలిపోయినది, ఏషః = ఇదిగో! హస్తాత్ = చేతినుండి, భ్రష్టమ్ = జారిపడిన, బిసాభరణమ్ = తామరతూడు కంకణం, ఇదమ్ = ఇదిగో! ఇతి = ఇలా, ఆసజ్యమాన + ఈక్షణః = పోల్చుకొంటున్న చూపులు కలవాడనై, శూన్యాత్ + అపి = (ప్రియారహితమై) బావురుమంటున్నదే అయినప్పటికీ, వేతసగృహాత్ = ఈ ప్రబ్బలి పొదరింటి నుంచి, సహసా = వెంటనే, నిర్గంతుమ్ = నిర్గమించడానికి, న + శక్నోమి = సమర్థుణ్ని కాలేకపోతున్నాను – మనసొప్పడం లేదు – అని.

**తాత్పర్యం:** శకుంతల శయనించడంతో నలిగిపోయిన పూలపాన్పు – ఇదిగో ఈ శిలాతలంమీద. ఆమె గోళ్లతో తామరపూరేక మీద లిఖించిన ప్రేమలేఖ ఇదిగో – వడిలిపోయింది. ఇదిగో ఇది – ఆమె చేతినుంచి జారిపడ్డ తామరతూడు కంకణం! ఇలా చూపులతోనే పోల్చుకుంటూ ఇంకా ఇక్కడే గడపాలి అనిపిస్తోంది గానీ ఈ శూన్య వేతసగృహంనుంచి త్వరగా నిర్గమించాలని మాత్రం అనిపించడం లేదు. నిర్గమించడానికి మనసు రావడం లేదు.

(ఆకాశే)

రాజన్!

> సాయంతనే సవనకర్మణి సంప్రవృత్తే
> వేదీం హుతాశనవతీం పరితః ప్రయస్తాః
> ఛాయాశ్చరంతి బహుధా భయమాదధానాః
> సంధ్యాపయోదకపిశాః పిశితాశనానామ్. **24**

రాజా : అయమయమాగచ్ఛామి. (ఇతి నిష్క్రాంతః)

-: ఇతి తృతీయోఽంకః :-

---

(ఆకాశే = ఆకాశంలో)

**సాయంతనే:** రాజన్ = దుష్యంతమహారాజా! సాయంతనే = ఇప్పుడు ఈ సాయంసంధ్యావేళ, సవనకర్మణి = యజ్ఞానుష్ఠానం, సంప్రవృత్తే = ప్రారంభించగా, హుతాశనవతీమ్ = అగ్నిపూర్ణమైన, వేదీమ్ = యజ్ఞవేదికను, పరితః + ప్రయస్తాః = చుట్టుముట్టినవై (ప్రకీర్ణాః అని పాఠాంతరం), సంధ్యా – పయోద – కపిశాః = సంజ మబ్బుల్లాగా ఎర్రనివైన, పిశితాశనానామ్ + ఛాయాః = రాక్షసుల నీడలు (ప్రతిబింబాలు), బహుధా = అత్యధికంగా, భయమ్ = వెరపును, ఆదధానాః = కల్గిస్తున్నవై, చరంతి = కదలాడుతున్నాయి. (బహుధా – చరంతి = పలువిధాలుగా సంచరిస్తున్నాయి).

**తాత్పర్యం:** మహారాజా! ఆశ్రమంలో సాయంకాల యజ్ఞం ప్రారంభమయ్యింది. హోమవేదిక చుట్టూ ఏవో నీడలు కదలాడుతున్నాయి. చెల్లాచెదరుగా సాగుతున్నాయి. సంజమబ్బుల్లాగా ఎర్రగా ఉన్నాయి. చాలా భయంకరంగా ఉన్నాయి. సందేహం లేదు అవి రాక్షసుల నీడలే!!

**అయమ్:** అయమ్ + అయమ్ = ఇదే ఇదే, ఆగచ్ఛామి = వస్తున్నాను. (ఇతి = అని, నిష్క్రాంతః = నిష్క్రమిస్తాడు).

-: ఇది మూడవ అంకం :-

# చతుర్థోఽంకః

(తతః ప్రవిశతః కుసుమాపచయమభినయంత్యౌ సఖ్యౌ)

**అన : పి అంవదే. జఇ వి గంధవ్వేణ వివాహవిహిణా నివ్వుత్తకళ్యాణా సఉందలా అణురూవభత్తుగామిణీ సంవుత్తేతి ణివ్వుదం మే హిఅఅం. తహ వి ఏదం చింతణిజ్జమ్. (ప్రియంవదే! యద్యపి గాంధర్వేణ వివాహవిధినా నిర్వృత్త కల్యాణా శకుంతలా అనురూపభర్తృగామినీ సంవృత్తేతి నిర్వృతం మే హృదయమ్. తథాపి ఏతచ్చింతనీయమ్.**

**ప్రియ : కహం విఅ? (కథ మివ?)**

**అన : అజ్జ సో రాఏసీ ఇట్ఠిం పరిసమావిఅ ఇసీహిం విసజ్జిదో అత్తణో అఅరం పవిసిఅ అంతేఉర సమాఅదో ఇదోగదం వుత్తందం సుమరేది వా ణవేత్తి. (అద్య స రాజర్షిః ఇష్టిం పరిసమాప్య ఋషిభిర్విసర్జితః ఆత్మనో నగరం ప్రవిశ్యాంతఃపురసమాగతః ఇతోగతం వృత్తాంతం స్మరతి వా న వేతి).**

---

(తతః = అంతట, కుసుమాపచయమ్ = పూలుకొయ్యడాన్ని, అభినయంత్యౌ = నటనతో చూపుతూ, సఖ్యౌ = అనసూయా ప్రియంవదలు, ప్రవిశతః = ప్రవేశిస్తారు).

**జఇ వి:** ప్రియంవదే = ఓ ప్రియంవదా! గాంధర్వేణ – వివాహవిధినా = గాంధర్వ వివాహపద్ధతిలో, నిర్వృత్తకల్యాణా = జరిగిన వివాహం కలదై, శకుంతలా = మన శకుంతల, అనురూప – భర్తృగామినీ = తగిన పెనిమిటిని పొందినది, సంవృత్తా + ఇతి = అయ్యింది అని, మే – హృదయమ్ = నా మనస్సు, యద్యపి – నిర్వృతమ్ = కుదుటపడటమైతే పడింది. తథాపి = అయినా, ఏతత్ + చింతనీయమ్ = ఇదొకటి ఆలోచించాల్సింది ఉంది సుమా!

**కహం:** కథమ్ + ఇవ = అదెట్లా?

**అజ్జ సో:** ఇష్టిమ్ + పరిసమాప్య = యాగం ముగించి, ఋషిభిః = ఋషులచేత, విసర్జితః = వీడ్కొల్పబడినవాడైన, సః – రాజర్షిః = ఆ రాజర్షి దుష్యంతుడు, అద్య = నేడు, ఆత్మనః – నగరమ్ = తన రాజధానిని, ప్రవిశ్య = ప్రవేశించి, అంతఃపుర – సమాగతః = తన అంతఃపురకాంతలతో సమాగమించినవాడై, ఇతోగతమ్ = ఇక్కడ జరిగిన, వృత్తాంతమ్ = కథను, స్మరతి – వా – న వా + ఇతి = స్మరిస్తాడా? లేదా? అని. (ఇతః+గతమ్)

ప్రియ : **విస్సద్ధా హోహి. ణ తాదిసా ఆకిదివిసేసా గుణవిరోహిణో హోంది. తాదో దాణిం ఇమం వుత్తందం సుణియ ణ ఆణే కిం పడివజ్జిస్సదిత్తి (విస్రబ్ధా భవ. న తాదృశా ఆకృతివిశేషా గుణవిరోధినో భవంతి. తాత ఇదానీ మిమం వృత్తాంతం శ్రుత్వా న జానే కిం ప్రతిపత్స్యతీతి).**

అన : **జహ అహం పెక్ఖామి, తహ తస్స అణుమదం. (యథాహం పశ్యామి, తథా తస్యానుమతమ్).**

ప్రియ : **కహం విఅ? (కథమివ?)**

అన : **గుణవదే కణ్ణఆ పడివాదణిజ్జత్తి అఅం దావ పుఢమో సంకప్పో తాదస్స. తం జఇ దెవ్వం ఏవ సంపాదేది, ణం అప్పా ఆసేణ కిదద్దోణామ గురుఅణో. (గుణవతే కన్యకా ప్రతిపాదనీయేత్యయం తావత్ప్రథమః సంకల్పస్తాతస్య. తం యది దైవమేవ సంపాదయతి, నన్వల్పాయాసేన కృతార్థో నామగురుజనః).**

---

**విస్సద్ధా:** విస్రబ్ధా - భవ = నిశ్చింతగా ఉండు (విశ్వాసయుక్తా భవ). తాదృశాః = అటువంటి, ఆకృతి విశేషాః = ఉత్తమ రూపాలు, గుణ విరోధినః = సద్గుణరహితాలు, న - భవంతి = కావు. మంచి ఆకృతి గలవారికి మంచి గుణాలూ ఉంటాయని. యత్రాకృతిస్తత్ర గుణా వసంతి. ఇదానీమ్ = ప్రస్తుతం, ఇమమ్ - వృత్తాంతమ్ = ఈ వృత్తాంతం, శ్రుత్వా = విని, తాతః = జనకుడు కణ్వమహర్షి, కిమ్ + ప్రతిపత్స్యతి + ఇతి = ఏమంటారు అనేది, న - జానే = ఎరుగను (ఊహించలేను - అని)

**జహ:** యథా + అహమ్ - పశ్యామి - తథా = నే నెరిగినంతవరకూ (కణ్వుడి స్వభావాన్ని నేను గ్రహించినదాన్ని బట్టి - అని. అత్ర దృశిః జ్ఞానార్థః. యథా శబ్దో యోగ్యతాయామ్. యథేతి యోగ్యతా వీప్సా పదార్థానతివృత్తి సాదృశ్యేషు - ఇతి దండనాథః - రాఘవభట్టః) తస్య = కణ్వుడికి, అనుమతమ్ = సమ్మతమే అవుతుంది.

**కహం:** కథ మివ = అదెలా?

**గుణవదే:** గుణవతే = గుణవంతుడికి, కన్యకా = ఈ కన్నియ శకుంతల, ప్రతిపాదనీయా + ఇతి + అయమ్ - తావత్ = సమర్పింపబడాలి అనేది కదా, తాతస్య = తండ్రిగారైన కణ్వుడికి, ప్రథమః - సంకల్పః = ముమ్మొదటి సంకల్పం! తమ్ = దానిని, దైవమ్ + ఏవ = దైవమే, యది - సంపాదయతి = నెరవేర్చినట్లయితే, గురుజనః = తండ్రిగారు, అల్పాయాసేన = అట్టే శ్రమలేకుండానే, కృతార్థః + నామ = గట్టెక్కినవాడు గదా!

ప్రియ : (పుష్పభాజనం విలోక్య) సహి, అవఇదాఇం బలికమ్మ పజ్జత్తాఇం కుసుమాఇం. (సఖి! అపచితాని బలికర్మ పర్యాప్తాని కుసుమాని).

అన : ణం సహిఏ సఉందలాఏ సోహగ్గదేవఆ అచ్చణీఆ. (నను సఖ్యాః శకుంతలాయాః సౌభాగ్యదేవతార్చనీయా).

ప్రియ : జుజ్జది. (యుజ్యతే) (ఇతి తదేవ కర్మారభేతే)

(నేపథ్యే) అయమహం భోః!

అన : (కర్ణం దత్త్వా) సహి, అదిధీణం విఅ ణివేదిదం. (సఖి! అతిథీనామ్ ఇవ నివేదితమ్!!)

ప్రియ : ణం ఉడజ సంణిహిదా సఉందలా. (నను ఉటజసన్నిహితా శకుంతలా)

అన : ణఉణ హిఅఏణ సంణిహిదా (న పునః హృదయేన సన్నిహితా)

---

**సహి:** (పుష్పభాజనమ్ = పూలబుట్టను, విలోక్య = చూసి) సఖి = చెలీ! బలికర్మ – పర్యాప్తాని = పూజకు సరిపడినన్ని, కుసుమాని = పూలు, అపచితాని = కోయబడినాయి. (ఈ కోసినవి పూజకు సరిపోతాయి, ఇక చాలు – అని)

**ణం సహిఏ:** సఖ్యాః – శకుంతలాయాః = మన చెలి శకుంతల యొక్క, సౌభాగ్యదేవతా = సౌభాగ్యదేవత (అనురూపభర్తను కూర్చిన దేవత), నను + అర్చనీయా = అర్చింపబడాలి కదా! ఇప్పుడు మనం ఆమెనూ అర్చించాలి – అనడం.

**జుజ్జది:** యుజ్యతే = అవును! (ఇతి = అని, తత్ + కర్మ + ఏవ = ఆ పూలుకోయు పనినే, ఆరభేతే = ఇద్దరూ మళ్ళీ ఆరంభిస్తారు.)

(నేపథ్యే = తెరలో)

భోః = ఎవరక్కడ? అయమ్ + అహమ్ = ఇదిగో నేను!! (ఆగతః = వచ్చాను – అధ్యాహార్యం)

**అదిధీణం:** (కర్ణమ్ + దత్త్వా = చెవి ఒగ్గి ఆలకించి) సఖి = ప్రియంవదా! అతిథీనామ్ = ఎవరో అతిథుల, నివేదితమ్ + ఇవ = విజ్ఞప్తి లాగా (అస్తి = ఉంది – అధ్యాహార్యం)!!

**ణం ఉడజ:** శకుంతలా = శకుంతల, నను + ఉటజసన్నిహితా = కుటీరం దగ్గరే ఉంది కదా!

**ప్రియ : హోదు. అలం ఏత్తిఏహిం కుసుమేహిం. (భవతు అలమేతావద్భిః కుసుమైః)**

**(ఇతి నిష్క్రాంతే)**

**(నేపథ్యే)**

**ఆః! అతిథి పరిభావిని!**

**విచింతయంతీ యమనన్యమానసా**
**తపోధనం వేత్సి న మాముపస్థితమ్**
**స్మరిష్యతి త్వాం న స బోధితోఽపి సన్**
**కథాం ప్రమత్తః ప్రథమం కృతామివ** **01**

---

**ఞ ఉణ:** పునః = కానీ, హృదయేన = మనస్సుతో, సన్నిహితా + న = సన్నిహితురాలు కాదు. మనిషయితే ఉంది గానీ ఆవిడకు మనసు మనసులో లేదు – అనడం.

**హోదు:** భవతు = సరే, ఏతావద్భిః – కుసుమైః = ఈ పాటి పువ్వులతో, అలమ్ = చాలు. ఇప్పటికి కోసిన పూలు చాలు – అని. (ఇతి = అని, నిష్క్రాంతే = ఇద్దరూ నిష్క్రమిస్తారు).

(నేపథ్యే = తెరలో)

**విచింతయంతీ:** ఆః = ఓసీ! అతిథి – పరిభావినీ = అతిథుల్ని అవమానించేదానా! అనన్యమానసా = తదేక ధ్యాసతో (చిత్తంతో), యమ్ = ఎవడిని, విచింతయంతీ = తలపోస్తూ, తపోధనమ్ = మహాతపస్సంపన్నుడనూ – (తపోనిధిమ్ – పాఠాంతరం), ఉపస్థితమ్ = ఇక్కడికి వచ్చినవాడనూ అయిన, మామ్ = నన్ను, న + వేత్సి = గమనింపవైతివో; సః = వాడు, బోధితః + అపి – సన్ = ప్రబోధింపబడినవాడైనప్పటికీ; ప్రమత్తః = మధుపానమత్తుడు, ప్రథమమ్ + కృతామ్ = తాను ముందు పలికినదైన, కథామ్ + ఇవ = వార్తనువలె – మాటను వలె, త్వామ్ = నిన్ను, న+స్మరిష్యతి = స్మరింపడుగాక! (పూర్వక్షణోక్తాం వార్తామివ – అని వ్యాఖ్యాతలు).

**తాత్పర్యం:** అతిథులంటే లెక్కలేనిదానా! ఇంతటి తపోనిధిని ఇక్కడికివస్తే నన్నే గమనించవా? ఎవడినో మనసులో పెట్టుకొని తదేకధ్యాసతో తలపోస్తూ కూర్చున్నావా? నువ్వు ఎవడిని ధ్యానిస్తున్నావో వాడు నిన్ను మరిచిపోవుగాక! ఎన్ని మాటలతో ఎవరు ఎంతగా జ్ఞాపకం చేసినా – బోధితోఽపిసన్ – నిన్ను స్మరించడుగాక! మత్తిల్లినవాడు

**ప్రియ : హద్ధీ! అప్పిఅం ఏవ్వ సంవృత్తం. కస్సిం పి పూఆరుహే అవరద్ధా సుణ్ణహిఅఆ సఉందళ. (హాధిక్! అప్రియమేవ సంవృత్తమ్. కస్మిన్నపి పూజార్హే అపరాద్ధా శూన్య హృదయాశకుంతలా.)**

**అన : (పురోఽవలోక్య) ణహు జస్సిం కస్సింపి. ఏసో దువ్వాసో సులహకోబో మహేసీ. తహ సవిఅ వేఅ బలుప్ఫుల్లాఏ దువ్వారాఏ గఈఏ పడిణివుత్తో. (నఖలు యస్మిన్కస్మిన్నపి. ఏష దుర్వాసాః సులభకోపో మహర్షిః. తథా శప్త్వా వేగబలోత్ఫుల్లయా దుర్వారయా గత్యా ప్రతినివృత్తః.)**

**ప్రియ : కో అణ్ణో హుదవహాదో దహిదుం పహవది? (కోఽన్యో హుతవహాద్దగ్ధుం ప్రభవతి?)**

---

తాను ముందుచెప్పినదాన్ని మరునిముషంలో మరిచిపోయినట్టు నిన్ను వాడు మరిచిపోవుగాక!

**హద్ధీ:** హాధిక్ = అయ్యయ్యో! అప్రియమ్ + ఏవ – సంవృత్తమ్ = జరగకూడనిదే జరిగింది!! పూజార్హే = అర్చింపదగినవాడైన, కస్మిన్ + అపి = ఏ వ్యక్తి విషయంలోనో, శూన్యహృదయా = మనసు మనసులో లేనిదైన, శకుంతలా = శకుంతల, అపరాద్ధా = (గమనించకపోవడమనే) అపరాధం చేసింది.

**ణహు:** (పురః + అవలోక్య = ముందుకుచూసి) యస్మిన్ + కస్మిన్ + అపి – న – ఖలు = ఎవరో ఒక వ్యక్తి విషయంలో కాదు (ఎవడో ఒక అనామకుణ్ని అవమానించడం కాదు), ఏషః =ఇతడు, సులభకోపః = ముక్కుమీద కోపం వాడు, మహర్షిః = మహాఋషి, దుర్వాసాః = దుర్వాససుడు!! తథా + శప్త్వా = అలా శపించి, వేగబల = కోపావేశబలంతో, ఉత్ఫుల్లయా = విజృంభించినదైన, దుర్వారయా + గత్యా = వారింపరాని నడకతో (చటుల పదగత్యా అని పాఠాంతరం), ప్రతినివృత్తః = తిరిగివెళ్ళిపోయాడు.

**కో అణ్ణో:** హుతవహాత్ + అన్యః = అగ్నికన్నా వేరొకడు, కః = ఎవడు, దగ్ధుమ్ = దహించివేయడానికి, ప్రభవతి = సమర్థుడవుతాడు? (దుర్వాసుడే అగ్ని అని. ''అగ్ని లేక దహించుటకు మఱి యెవ్వడు శక్తుడగును?'' – అని కందుకూరి)

**గచ్ఛ:** గచ్ఛ = వెళ్ళు. పాదయోః = పాదాల మీద, ప్రణమ్య = సాష్టాంగ పడి (పాదయోః = పాదాలను, ప్రణమ్య =నమస్కరించి – ఇది ద్వితీయార్థక సప్తమి అన్నాడు రాఘవభట్టు),

**అన : గచ్ఛ. పాదేసు పణమిఅ ణివత్తేహి ణం జావ అహం అర్ఘోదఅం ఉపకప్పేమి. (గచ్ఛ. పాదయోః ప్రణమ్య నివర్తయైనం యావదహమ్ అర్ఘోదక ముపకల్పయామి)**

**ప్రియ : తహ. (తథా) (ఇతి నిష్క్రాంతా)**

**అన : (పదాంతరే స్ఖలితం నిరూప్య) అవ్వో! ఆవేణక్ఖలిదాఏ గఈఏ పబ్భట్టం మే అగ్గహత్థాదో పుప్ఫభాఅణం. (ఇతి పుష్పోచ్చయం రూపయతి). (అహో! ఆవేగస్ఖలితయా గత్యా ప్రభ్రష్టం మమ అగ్రహస్తాత్ పుష్పభాజనమ్)**

**(ప్రవిశతి)**

**ప్రియ : సహి, పకిదివక్కో సో కస్స అణుణఅం పడిగేణ్హది. కించి ఉణ సాణుక్కోసో కిదో. (సఖి! ప్రకృతివక్రః స కస్యానునయం ప్రతిగృహ్ణాతి! కించిత్ పునః సానుక్రోశః కృతః).**

---

ఏనమ్ = ఈతనిని, నివర్తయ = వెనక్కి రప్పించు (శాపం మళ్ళింపజెయ్యి అనికూడా). యావత్ = ఇంతలోకీ, అహమ్ = నేను, అర్ఘోదకమ్ = పవిత్రోదకం (అర్ఘ్యం), ఉప కల్పయామి = సమకూరుస్తాను.

**తహ:** తథా = అలాగే. (ఇతి = అని, నిష్క్రాంతా =ప్రియంవద నిష్క్రమిస్తుంది)

**అవ్వో:** (పదాంతరే = అడుగుతీసి అడుగువేస్తూ, స్ఖలితమ్ = తొట్రుపాటును, నిరూప్య = అభినయంతో చూపి) అహో = అయ్యో! ఆవేగ = సంభ్రమంతో, స్ఖలితయా =తొట్రువడిన, గత్యా =నడకచేత, మమ = నా, అగ్రహస్తాత్ = హస్తాగ్రం నుంచి (హస్తాగ్రాగ్రహస్తాదయో గుణగుణినోః భేదాభేదాభ్యామ్ – ఇతి వామనః – రాఘవభట్టః), పుష్పభాజనమ్ = పూలబుట్ట, ప్రభ్రష్టమ్ = జారిపడింది!! (ఇతి = అని, పుష్ప + ఉచ్చయమ్ = పూలను బుట్టలోకి ఎత్తడం, రూపయతి = అభినయంతో ప్రదర్శిస్తుంది.)

(ప్రవిశతి = ప్రియంవద పునఃప్రవేశిస్తుంది)

**పకిదివక్కో:** సఖీ! ప్రకృతివక్రః = స్వభావతః వంకరమనిషి, సః = ఆ దుర్వాససుడు, కస్య + అనునయమ్ = ఎవడి బుజ్జగింపును (ప్రార్థనను), ప్రతిగృహ్ణాతి = అంగీకరిస్తాడు!

**అన : (సస్మితమ్) తస్సిం బహు ఏదం పి. కహేహి. (తస్మిన్ బహ్వేతదపి. కథయ!!)**

**ప్రియ : జదా ణివత్తిదుం ణ ఇచ్ఛది తదా విణ్ణవిదో మఏ. భఅవం, పఢమం త్తి పేక్ఖిఅ అవిణ్ణాద తబప్పహావస్స దుహిదుజణస్స భఅవదా ఏక్కో అబరహో మరిదవ్వోత్తి. (యదా నివర్తితుం నేచ్ఛతి తదా విజ్ఞాపితో మయా. భగవన్, ప్రథమ ఇతి ప్రేక్ష్య అవిజ్ఞాతతపఃప్రభావస్య దుహితృజనస్య భగవతైకోఽపరాధో మర్షితవ్య ఇతి)**

**అన : తదో దదో? (తతస్తతః)**

**ప్రియ : తదో మే వఅణం అణ్ణహాభవిదుం ణారిహది. కిందు అహిణ్ణాణాహరణ దంసణేణ సావో ణివత్తిస్సది త్తి మంతఅంతో సఅం అంతరిహిదో. (తతో**

---

కించిత్ + పునః = కొంచెంగా మాత్రం, సానుక్రోశః = దయా సహితుడిగా, కృతః = చేయబడ్డాడు. కాసింత దయ వహించాడు – అని.

**తస్సిమ్:** (సస్మితమ్ = చిరునవ్వుతో), తస్మిన్ = ఆయన విషయంలో, ఏతదపి = ఇదికూడా, బహు = అధికమే – చాలా ఎక్కువ. అంతటి కఠినాత్ముడు కొంచెంపాటిగానైనా మెత్తబడటం= దయామయుడు కావడం అక్కడికి అదే గొప్ప సుమా – అని. కథయ = చెప్పు, చెప్పు!

**జదా:** యదా = ఎప్పుడైతే, నివర్తితుమ్ = (తాను) మళ్ళడానికీ (శాపం) మళ్ళించడానికీ, న + ఇచ్ఛతి = సమ్మతించలేదో, తదా =అప్పుడు, మయా = నాచేత, విజ్ఞాపితః = ఇలా విన్నవింపబడ్డాడు. నేనిలా విన్నవించాను – అని. భగవన్ = మహాత్మా! అవిజ్ఞాత = తెలుసుకోబడని, తపః ప్రభావస్య = నీ తపశ్శక్తి కలదైన (నీ తపశ్శక్తిని ఎరుగనిదని), దుహితృజనస్య = పుత్రికాప్రాయమైన వ్యక్తియొక్క, ఏకః + అపరాధః = ఒకేఒక్క అపరాధం, ప్రథమః – ఇతి – ప్రేక్ష్య = ఇదే మొదటిది అని భావించి, భగవతా = మహాత్ములైన తమచేత, మర్షితవ్యః = క్షమింపదగినది, ఇతి – అని విజ్ఞాపితః.

**తదో:** తతః + తతః = అటుపైని, అటుపైని?

**తదో మే:** తతః = అంతట, మే + వచనమ్ = నామాట (శాపోక్తి), అన్యథా భవితుమ్ = మరోలా అవ్వడానికి – మరల్చడానికి, న + అర్హతి = తగదు – సాధ్యంకాదు. కింతు = కానీ, అభిజ్ఞాన + ఆభరణ = ఆనవాలైన ఆభరణం యొక్క, దర్శనేన = దర్శనంతో

**– మే వచనమన్యథా భవితుం నార్హతి. కింతు అభిజ్ఞానాభరణ దర్శనేన శాపో నివర్తిష్యత ఇతి మంత్రయన్ స్వయమంతర్హితః).**

**అన : సక్కం దాణిం అస్ససిదుం. అత్థి తేణ రాఏసిణా సంపత్థిదేణ సణామహే అంకిఅం అంగులీఅఅం సుమరణీఅంత్తి సహం పిణద్ధం. తస్సిం సాహీణోవఆ సఉందలా భవిస్సది. (శక్యమిదానీమ్ ఆశ్వసితుమ్. అస్తి తేన రాజర్షిణా సంప్రస్థితేన స్వనామధేయాంకిత మంగుళీయకం స్మరణీయమితి స్వయం పినద్ధమ్. తస్మిన్ స్వాధీనోపాయా శకుంతలా భవిష్యతి).**

**ప్రియ : సహి, ఏహి. దేవకజ్జం దావ ణివ్వత్తేంహ. (సఖి! ఏహి! దేవకార్యం తావన్నిర్వర్తయావః)**

**(ఇతి పరిక్రామతః)**

---

(ఆభరణాన్ని చూడటంతో) శాపః = నేనిచ్చిన శాపం, నివర్తిష్యతే = మళ్ళుతుంది (ఉపసంహరింపబడుతుంది) – ఇతి = అని, మంత్రయన్ = పలుకుతూనే, స్వయమ్ + అంతర్హితః = స్వయంగా అంతర్ధానం చెందాడు.

**సక్కం:** ఇదానీమ్ = ఇప్పుడు, ఆశ్వసితుమ్ = ఊరడిల్లడానికి, శక్యమ్ = సాధ్యం. ఊరడిల్లవచ్చు – అంతగా ఆందోళన పడవలసిన పనిలేదు అని. సంప్రస్థితేన = రాజధానికి బయలుదేరినవాడైన, తేన = ఆ, రాజర్షిణా = రాజర్షి దుష్యంతుడిచేత, స్వనామధేయ + అంకితమ్ = తన పేరు చెక్కబడి ఉన్న, అంగుళీయకమ్ = ఉంగరం, స్మరణీయమ్ + ఇతి = గుర్తుచేసుకోడానికి అని, స్వయమ్ = స్వయంగా, పినద్ధమ్ = తొడగబడింది. శకుంతలచేతికి తానుగా ఉంగరం తొడిగాడు – అని. తస్మిన్ = ఆ విషయంలో (అందుచేత), శకుంతలా = మన శకుంతల, స్వాధీన + ఉపాయా = చేతిలో ఉన్న ఉపాయం కలదే, భవిష్యతి = అవుతుంది. శాపనివారణోపాయం శకుంతలకు స్వాధీనంగా "చేతిలోనే" ఉంది – అనడం.

**ఏహి:** సఖీ! ఏహి =రమ్ము. దేవకార్యమ్ = సౌభాగ్యదేవతను అర్చించే పనిని, నిర్వర్తయావః + తావత్ = నిర్వర్తింతుము గాక! (ఇతి = అని, పరిక్రామతః = నాలుగడుగులు వేస్తారు)

**పేక్ష:** (విలోక్య = ముందుకు చూసి), అనసూయే = ఓసీ అనసూయా! పశ్య – తావత్ = అదిగో చూడు! వామహస్త = ఎడమ అరచేతిలో, ఉపహిత = ఆన్చబడిన, వదనా =

**ప్రియ : (విలోక్య) అణసూఏ, పేక్ఖ దావ, వామహత్థోవహిదవఅణా ఆలిహిదా విఅ పిఅసహీ. భత్తుగదాఏ చింతాఏ అత్తాణం వి ణ ఏసా విభావేది. కిం ఉణ ఆఅంతుఅం! (అనసూయే! పశ్య తావత్. వామహస్తోపహిత వదనా ఆలిఖితేవ ప్రియసఖీ. భర్తృగతయా చింతయాత్మానమపి నైషా విభావయతి. కిం పునరాగంతుకమ్!)**

**అన : పిఅంవదే, దువేణం ఏవ్వ ణం తో ముహే ఏసో వుత్తాంతో చిట్ఠదు. రక్ఖిదవ్వా క్ఖు పకిదివేసలా పిఅసహీ. (ప్రియంవదే! ద్వయోరేవ నను నౌ ముఖ ఏష వృత్తాంతస్తిష్ఠతు. రక్షితవ్యా ఖలు ప్రకృతిపేశలా ప్రియసఖీ)**

**ప్రియ : కోణామ ఉణ్హోదఏణ ణోమాలిఅం సంచేది? (కో నామోష్ణోదకేన నవమాలికాం సించతి?) (ఇత్యుభే నిష్క్రాంతే)**

**– విష్కంభః –**

---

నెమ్మొగం కలదై, ప్రియసఖీ = మన నెచ్చెలి శకుంతల, ఆలిఖిత + ఇవ =చిత్తరువుగా లిఖింపబడినదానిలాగా ఉంది. నిశ్చలంగా ఎలా కూర్చుని ఉందో చూడు – అని. భర్తృగతయా + చింతయా = పెనిమిటికి సంబంధించిన ధ్యాసతో, ఏషా = ఈమె, ఆత్మానమ్ + అపి = తనను తానైనా, న + విభావయతి = గమనించుకోవడంలేదు, కిం – పునః + ఆగంతుకమ్ – విభావయతి = ఇక అతిథిని గమనిస్తుందా? అందుకే దుర్వాససుడి రాకపోకలు గమనించలేకపోయింది – అని.

**దువేణం:** ప్రియంవదే = ప్రియంవదా! ఏషః – వృత్తాంతః = ఈ విషయం (ఈ దుర్వాసశ్శాప వృత్తాంతం), నౌ + ద్వయోః + ఏవ = కేవలం మన ఇద్దరి, ముఖే = నోటిలో, నను + తిష్ఠతు = ఉండిపోవుగాక! పెదవి దాటనివ్వవద్దు. శకుంతలకైనా చెప్పవద్దు – అని. ప్రకృతి పేశలా = సహజంగానే మృదుస్వభావయైన, ప్రియసఖీ = మన నెచ్చెలి ఈ శకుంతల, రక్షితవ్యా + ఖలు = మనకు కాపాడవలసినది గదా! ఈమెను మనం రక్షించుకోవాలి – అనడం.

**కోణామ:** ఉష్ణోదకేన = వేడినీటితో, నవమాలికామ్ = విరజాజిని, కః + నామ – సించతి = ఎవడు గాని తడుపుతాడు?! (ఇతి = అని, ఉభే = ఇద్దరూ, నిష్క్రాంతే = నిష్క్రమిస్తారు)

– ఇది శుద్ధ విష్కంభం –

**(తతః ప్రవిశతి సుప్తోత్థితః శిష్యః)**

**శిష్య : వేళోపలక్షణార్థ మాదిష్టోఽస్మి తత్రభవతా ప్రవాసాదుపావృత్తేన కాశ్యపేన. ప్రకాశం నిర్గతస్తావదవలోకయామి కియదవశిష్టం రజన్యా ఇతి. (పరిక్రమ్యావలోక్య చ) హంత ప్రభాతమ్! తథాహి –**

**యాత్యేకతోఽస్తశిఖరం పతిరోషధీనామ్**
**ఆవిష్కృతోఽరుణపురస్సర ఏకతోఽర్కః**
**తేజోద్వయస్య యుగపద్ వ్యసనోదయాభ్యాం**
**లోకో నియమ్యత ఇవాత్మదశాంతరేషు 02**

---

(తతః = అంతట, సుప్త + ఉత్థితః =నిద్రలేచినవాడై, శిష్యః = కణ్వ శిష్యుడు, ప్రవిశతి = ప్రవేశిస్తాడు)

**వేళా:** ప్రవాసాత్ = సోమతీర్థమనే పరప్రాంత నివాసం నుంచి, ఉపావృత్తేన = తిరిగివచ్చినవాడైన, తత్రభవతా = మాన్యుడైన, కాశ్యపేన = కణ్వ మహర్షిచేత, వేళా + ఉపలక్షణార్థమ్ = కాలం ఎంత అయ్యిందో గుర్తించడం కోసం, ఆదిష్టః + అస్మి = ఆజ్ఞాపింపబడ్డాను. ప్రకాశమ్ = కుటీరం నుంచి ఆరుబయటకు, నిర్గతః = వెళ్ళినవాడనై, రజన్యాః = రాత్రియొక్క, కియత్ = ఎంతభాగం, అవశిష్టమ్ + ఇతి = మిగిలి ఉన్నదో, తావత్ + అవలోకయామి = చూతునుగాక! (పరిక్రమ్య = నడచి, అవలోక్య – చ = చూసి) హంత = అరే! ప్రభాతమ్ = తెల్లవారిపోయింది!! తథాహి = అవునుగదా –

**యాతి:** ఓషధీనామ్ + పతిః = ఓషధుల అధిపతియైన చంద్రుడు, ఏకతః = ఒకవైపు, అస్తశిఖరమ్ = అస్తగిరి శిఖరం, యాతి = చేరుకొంటున్నాడు. ఏకతః = మరొకవైపు, అర్కః = సూర్యుడు, అరుణ పురస్సరః = అరుణుణ్ని ముందు నిలుపుకొన్నవాడై, ఆవిష్కృతః = ఉదయిస్తున్నాడు. తేజోద్వయస్య = తేజస్సుల జంట యొక్క (చంద్ర సూర్యులు), యుగపత్ = ఏకకాలికమైన, వ్యసన + ఉదయాభ్యామ్ = అస్తమించడం ఉదయించడాలతో, లోకః = ప్రజ, ఆత్మదశాంతరేషు = తమ (కష్టసుఖాల రూపమైన) ఆయా దశలలో, నియమ్యతే + ఇవ = ఉపదేశింపబడుతోంది అన్నట్టుగా – ఉంది.

**తాత్పర్యం:** ఒకవైపు చంద్రుడు అస్తమిస్తోంటే, మరోవైపు సూర్యుడు ఉదయిస్తున్నాడు. ఏకకాలంలో జరుగుతున్న రెండు తేజఃపుంజాల ఈ అస్తమయ – ఉదయాలు లోకానికి

**అపి చ –**

> **అంతర్హితే శశిని సైవ కుముద్వతీ మే**
> **దృష్టిం న నందయతి సంస్మరణీయశోభా**
> **ఇష్టప్రవాసజనితాన్యబలాజనస్య**
> **దుఃఖాని నూన మతిమాత్రసుదుస్సహాని.** **03**

**యావదుపస్థితాం హోమవేళాం గురవే నివేదయామి.** (ఇతి నిష్క్రాంతః)

---

గొప్ప ఉపదేశం చేస్తున్నట్టున్నాయి. దుఃఖావస్థలూ సుఖావస్థలూ (దశాంతరాలు) ఒకదాని వెంబడి ఒకటి వస్తూ పోతూ ఉంటాయని.

**అంతర్హితే:** అపిచ = ఇంకా – శశిని = చంద్రుడు, అంతర్హితే (సతి) = కనుమరుగయ్యే సరికి (అంతర్ధానం చెందేసరికి), సా + ఏవ – కుముద్వతీ = అదే కలువభామ, సంస్మరణీయశోభా = గుర్తుతెచ్చుకోవలసిన సౌందర్యం కలదై, మే = నా, దృష్టిమ్ = చూపును, న + నందయతి = అలరించడం లేదు – ఆనంద పరచడం లేదు. ఇష్ట = ప్రియుడి, ప్రవాస = విరహం వల్ల, జనితాని = కల్గినవైన, అబలాజనస్య = ప్రియురాండ్ర, దుఃఖాని = వేదనలు, నూనమ్ = కచ్చితంగా, అతిమాత్ర – సుదుస్సహాని = మేరమీరినంతగా సుతరామూ భరింపరానివి – అవధికి మించి అత్యంతమూ భరింపరానివని.

**తాత్పర్యం:** చంద్రుడున్నంత సేపూ కలువభామ తన శోభతో లోకుల చూపులను ఆకట్టుకొంది. చంద్రుడు కనిపించకపోయేసరికి వైదొలగేసరికి అదే కలువభామ – శోభ కోల్పోయి ఇంతకు ముందు ఎంత అందంగా ఉండేదో అని తలుచుకొని గుర్తుచేసుకోవలసిన శోభకలదై, దృష్టిని ఆనందపరచడం లేదు. అవును మరి – ప్రియుడి విరహం రగిలించే దుఃఖాలు ప్రియురాలికి అత్యంతమూ సుతరామూ భరింపరానివే సుమా!

**యావత్:** యావత్ = ఇంతకూ, హోమవేళామ్ = ప్రాతఃకాల హోమసమయం, ఉపస్థితామ్ = సమీపించినదిగా– ప్రాతర్ హోమానికి వేళ అయ్యిందని, గురవే = గురువుగారికి, నివేదయామి = విన్నవిస్తాను.

(ఇతి = అని, నిష్క్రాంతః = శిష్యుడు నిష్క్రమిస్తాడు)

అన : (ప్రవిశ్యాపటీక్షేపేణ) ఏవ్వం ణామ. విసఅ పరమ్ముహస్స వి జణస్స చ ఏదం విదిదం. జం తహావిహేణ రణ్ణా సఉందలాఏ అణ్ణాఅం ఆఅరిదమ్. అహవా పడిబుద్ధా వి కిం కరిస్సం? ణ మే ఉఇదేసు వి కరణిజ్జేసు హత్థ పాదా పసరంతి. సకామో దాణిం కామో హోదు. జేణ అసచ్చ సంధే జణే సుణ్ణహిఅఅ సఉందళా పదం కారిదా. అహవా దువ్వాసకోవో ఏవ్వం విఆరేది. అణ్ణహా కహం సో రాఏసీ తారిసాఇ మంతిఅ ఏత్తిఅస్స కాళస్స లేహమేత్తం వి ణ విసజ్జేది. తా ఇదో అహిణ్ణాణం అంగులీఅఅం సే విసజ్జేమి. దుఃఖసీళే తపస్సిజణే కోవా అబ్భత్థీ అది. నను సహీగామిదోసో త్తి వవసిదా వి ణ పారేమి పవాసపడిణివుత్తస్స తాదకస్సవస్స దుస్సందపరిణీదం ఆవణ్ణసత్తం సఉందళాం నివేదేదుం. ఇత్థం గదే కిం ఖు అంహేహిం కరణిజ్జమ్? (ఏవం నామ. విషయ పరాఙ్ముఖస్యాపి జనస్య చైతద్విదితమ్. యత్తథావిధేన రాజ్ఞా శకుంతలాయా మన్యాయ్య మాచరితమ్. అథవా ప్రతిబుద్ధాపి కిం కరిష్యామి? న మే ఉచితేష్వపి

---

**ఏవ్వం:** (అపటీక్షేపేణ = వెనుక తెరను తోసుకొని, ప్రవిశ్య = వేగంగా ప్రవేశించి) (అపటీ కాండపటీకా ప్రతిసీరా జవనికా తిరస్కరిణీ ఇతి హలాయుధః నిఘంటుః) ఏవమ్ – నామ = ఇదీ పరిస్థితి. విషయపరాఙ్ముఖస్య = లౌకికమైన ఇంద్రియ సుఖాలకు విముఖుడై, జనస్య + అపి = వీతరాగుడైన జనుడికి సైతం, ఏతత్ = విరహవేదన సుదుస్సహమనే ఈ విషయం, విదితమ్ = తెలుసు. (విషయః స్యాదింద్రియార్థే దేశే జనపదేఽపిచ – ఇతి విశ్వః). యత్ = మరి, తథావిధేన = అంతలేసి ప్రతిజ్ఞలు చేసినవాడైన, రాజ్ఞా = (నాగరకుడైన) దుష్యంతుడి చేత, శకుంతలాయామ్ = మా శకుంతల విషయంలో, అన్యాయ్యమ్ + ఆచరితమ్ = అన్యాయమే చేయబడింది. విరహవేదనకు గురిచేసి అన్యాయం చేశాడని. అథవా = సరే, ప్రతిబుద్ధా + అపి = మేల్కొన్నదాననే – అన్యాయం గ్రహించినదాననే, కిమ్ + కరిష్యామి = ఏమి చెయ్యగలను? ఉచితేషు – కరణీయేషు = చేయదగిన నిత్యకృత్యాలలోనే, మే = నా, హస్తపాదాః = చేతులూ కాళ్లూ, న – ప్రసరంతి = ఆడటం లేదు. పాలుపోక ఏ పనీ చెయ్యలేకపోతున్నాను – అని. కామః = మన్మథుడు, ఇదానీమ్ = ఇప్పుడు, సకామః + భవతు = (శకుంతలను హింసించడం అనే) కోరిక తీరినవాడు అగుగాక! యేన = ఎందుచేతనంటే, అసత్యసంధే – జనే = అబద్ధాలకోరైన మనిషి విషయంలో, శూన్యహృదయా = శూన్యమనస్కయైన, శకుంతలా = శకుంతల, పదమ్ + కారితా = అడుగుపెట్టింది. అథవా = ఒకవేళ, దుర్వాసఃకోపః = దుర్వాసో

**కరణీయేషు హస్తపాదాః ప్రసరంతి. సకామ ఇదానీం కామో భవతు. యే నాసత్యసంధే జనే శూన్యహృదయా శకుంతలా పదం కారితా. అథవా దుర్వాసఃకోప ఏవం వికారయతి. అన్యథా కథం స రాజర్షిః తాదృశాని మంత్రయిత్వా ఏతావతః కాలస్య లేఖమాత్రమపి న విసర్జయతి. తస్మాదితః అభిజ్ఞాన మంగులీయకమస్య విసర్జయామి. దుఃఖశీలే తపస్విజనే కోవాభ్యర్థ్యతే? నను సఖీగామిదోష ఇతి వ్యవసితాపి న పారయామి ప్రవాసప్రతినివృత్తాయ తాత కాశ్యపాయ దుష్యంతపరిణీతాం ఆపన్నసత్వాం శకుంతలాం నివేదయితుమ్. ఇత్థం గతే కిం ను ఖల్వస్మాభిః కరణీయమ్?)**

---

మహర్షి కోపమూ శాపమూ, ఏవమ్ = ఇలా (శకుంతలను తలవనైనా తలవని స్థితికి), వికారయతి =(దుష్యంతుణ్ని) మార్చి వేస్తోందా? ఈ వృత్తాంతాన్ని ఇలా వికృతరూపం ధరింపజేస్తోందా – అని. అన్యథా = అదే కాకపోయినట్టయితే. సః + రాజర్షిః = ఉత్తముడైన ఆ మహారాజు (రాజసు ఋషిః శ్రేష్ఠః), తాదృశాని = పరిగ్రహబహుత్వేఽపి.. లాంటి మాటలు, మంత్రయిత్వా =పలికి (బాసలు చేసి), ఏతావతః + కాలస్య = ఇన్నాళ్ళదాకా, లేఖ మాత్రమ్ + అపి = కనీసం ఉత్తరమైనా, కథమ్ – న – విసర్జయతి = పంపడా?! శాపమే కారణం. తస్మాత్ = అందుచేత, అభిజ్ఞానమ్ = ఆనవాలైన, అంగులీయకమ్ = ఉంగరాన్ని, ఇతః = ఇక్కడి నుంచి (శకుంతలనుంచి తీసుకుని), అస్య = అతడికి, విసర్జయామి = పంపుతాను. దుఃఖశీలే = అన్నింటా ఉదాసీనస్వభావులైన, తపస్విజనే = ఈ మునిజనంలో, కః + వా = ఎవడు, అభ్యర్థ్యతే = ఇందుకోసం అభ్యర్థింపబడతాడు. అందరూ విరసులేనాయే, ఎవడిని అభ్యర్థించను? – అనడం. ప్రవాస – ప్రతినివృత్తాయ = ప్రవాసంనుంచి తిరిగివచ్చినవాడైన, తాత–కాశ్యపాయ = తండ్రి కణ్వుడికి, దుష్యంత పరిణీతామ్ = దుష్యంతుడిచే వివాహితయై, ఆపన్నసత్వామ్ = గర్భిణియైనదిగా, శకుంతలామ్ = శకుంతలను, నివేదయితుమ్ = విన్నవించడానికి, వ్యవసితా + అపి = ప్రయత్నించినదాననయ్యూ, సఖీగామి – దోషః ఇతి = సఖినే చెందుతుంది తప్పు కాబట్టి (తండ్రి అనుమతి తీసుకోకుండా స్వతంత్రించిన దోషం శకుంతలదే), న – పారయామి–నను = విన్నవించలేకపోయాను. ధైర్యం చెయ్యలేకపోయాననడం. ఇత్థమ్ + గతే = పరిస్థితి ఇలా ఉండగా, ఇదానీమ్ = ఇప్పుడు, అస్మాభిః = మాచేత, కిమ్ + ఖలు – కరణీయమ్ = చెయ్యబడవలసినది ఏమిటి? మేమిప్పుడేమి చెయ్యాలని?

**ప్రియ : (ప్రవిశ్య సహర్షమ్) హళా! తువర తువర. సఉందళాఏ పత్థాణ కౌదుఅం ణివ్వత్తిదుం (సఖి! త్వరయ త్వరయ. శకుంతలాయాః ప్రస్థానకౌతుకం నిర్వర్తయితుమ్).**

**అన : కహం ఏదం? (కథమేతత్?)**

**ప్రియ : సుణాహి. దాణిం సుహసఇదపుచ్ఛిఆ సఉందళఏ సఆసం గదంహి. (శృణు. ఇదానీం సుఖశయితపృచ్ఛికా శకుంతలాయాస్సకాశం గతాస్మి)**

**అన : తదో తదో. (తతస్తతః)**

---

**విశేషాలు:** ఈ సుదీర్ఘవచనానికి చాలా చోట్ల పాఠాంతరాలున్నాయి. చాలా అధిక పాఠాలూ ఉన్నాయి. కాళిదాస గ్రంథావళీ (బెనారస్ హిందూ యూనివర్సిటీ – 1976) సంపాదకులు శ్రీ రేవాప్రసాదద్వివేదిగారు అన్నింటినీ అథస్సూచికలో ఇచ్చి ఒక పాఠాన్ని సంయోజించి పైకి తెచ్చారు. యోజనేయమస్మత్కృతా – అన్నారు. మహాజనో యేన గతస్స పంథా!!

**తువర:** (సహర్షమ్ = సంతోషంతో, ప్రవిశ్య = ప్రవేశించి) సఖీ! అనసూయా! త్వరయ – త్వరయ = త్వరపడు. శకుంతలాయాః = శకుంతలకు, ప్రస్థాన కౌతుకమ్ = వీడ్కోలు సంబరం, నిర్వర్తయితుమ్ = నిర్వర్తించడానికి త్వరగా త్వరగా రా!

(ప్రస్థానకౌతుకమ్ = వధువును అత్తవారింటికి పంపించేటప్పటి సంబరం. ప్రస్థానసమయే కౌతుకమ్. పారంపర్య ఆగత మంగళం నిర్వర్తయితుమ్ = సంపాదయితుమ్. "కౌతుకం నర్మణీచ్ఛాయామ్ ఉత్సవే కౌతుకే ముది పారంపర్యాగతఖ్యాత మంగళోద్వాహ సూత్రయోః" – ఇతి హైమః అన్నాడు రాఘవభట్టు. ప్రయాణమంగళమ్ – అన్నాడు శ్రీనివాసాచార్య).

**కహమ్:** కథమ్ + ఏతత్ = ఇదెట్లు?!

**సుణాహి:** శృణు = చెబుతా, విను. సుఖశయిత – పృచ్ఛికా = రాత్రి నిద్ర బాగా పట్టిందా అని అలవాటు ప్రకారం అడిగేదాననై (సౌఖశాయనికా), ఇదానీమ్ =ఇప్పుడే, శకుంతలాయాః + సకాశమ్ = శకుంతల దగ్గరకు, గతా + అస్మి = వెళ్ళాను.

**తదో:** తతః + తతః = అటుపైని, అటుపైని?

**ప్రియ : జావ ణం ళజ్జావణదవఅణం పరిస్సజిఅ తాదకస్సవేణ ఎవ్వం అహిణందిదం. దిట్ఠిఆ ధూమావరుద్ధదిట్ఠిణో వి జఅమాణస్స పావఏ ఎవ్వ ఆహుదీ పడిదా. వచ్ఛే సుసిస్సపరిదిణ్ణా విఅ విజ్జా అసోఅణిజ్జాసి మే సంవృత్తా. అజ్జ ఎవ్వ రాఏసిపరిగహీదం తుమం భత్తుణో సఆసం విసజ్జేమి త్తి. (యావదేనాం లజ్జావనత వదనాం పరిష్వజ్య, తాతకాశ్యపేనైవమభినందితమ్. దిష్ట్యా ధూమావరుద్ధ దృష్టేఽపి యజమానస్య పావక ఏవాహుతిః పతితా. వత్సే! సుశిష్యపరిదత్తేవ విద్యా అశోచనీయాసి మే సంవృత్తా. అద్యైవ రాజర్షిపరిగృహీతాం త్వాం భర్తుస్సకాశం విసర్జయామీతి).**

**అన : అహ కేణ సూఇదోఅం తాదకస్సవస్స వుత్తందో? (అథ కేన సూచితోఽయం తాతకాశ్యపస్య వృత్తాంతః?)**

---

**జావ:** యావత్ = అంతలోనే, లజ్జా + అవనతవదనామ్ = సిగ్గుతో తలవంచుకొని ఉన్న, ఏనామ్ = శకుంతలను, పరిష్వజ్య = దగ్గరకు తీసుకొని, తాతకాశ్యపేన = తండ్రి కణ్వుని చేత, ఏవమ్ = ఈ విధంగా, అభినందితమ్ = అభినందింపబడింది. ఇలా అభినందించాడు – అని. వత్సే + పుత్రీ! ధూమ + అవరుద్ధ – దృష్టేః + అపి = హోమధూమంతో అడ్డగింపబడ్డ దృష్టికలవాడైనప్పటికీ, యజమానస్య = యజ్ఞ కర్తయొక్క, ఆహుతిః = పురోడాశం, దిష్ట్యా = అదృష్టవశాత్తు, పావకే + ఏవ = కుండలోని అగ్నిలోనే, పతితా = పడింది. కళ్లల్లోకి పొగవెళ్ళి చూపు సరిగ్గా ఆనకపోయినా యజమానుడు విడిచిన పురోడాశం (ఆహుతి) సరిగ్గా అగ్నిలోనే పడింది. యోగ్యస్థానంలోనే పడింది – అని. సుశిష్య = మంచి శిష్యుడికి, పరిదత్త = దానంచేయబడిన, విద్యా + ఇవ = చదువులాగా! అశోచనీయా = శోచనీయస్థితి లేనిదానవు – నిన్ను గురించి చింతించవలసిన అవసరం లేనిదానవు, సంవృత్తా + అసి = అయ్యావు. దుష్యంతుణ్ని పెళ్ళాడటం సముచితమే అనీ, కృతకృత్యురాలవు అయ్యావు – అనీ. రాజర్షి పరిగృహీతామ్ = రాజోత్తముడిచేత స్వీకరింపబడ్డదానవైన, త్వామ్ = నిన్ను, అద్య + ఏవ = నేడే, భర్తుః + సకాశమ్ = పెనిమిటి చెంతకు, విసర్జయామి = పంపిస్తాను, ఇతి = అని – అభినందించాడు. (ఋషిరక్షితామ్ = ఋషుల రక్షణ కలదానినిగా చేసి – ఋషులను రక్షణగా తోడు ఇచ్చి – పాఠాంతరం).

**అహ కేణ:** అథ = ఇంతకీ, తాతకాశ్యపస్య = తండ్రి కణ్వుడికి, అయమ్ = ఈ, వృత్తాంతః = విషయం, కేన – సూచితః = ఎవరు తెలిపారు?

**ప్రియ : అగ్గిసరణం పవిట్ఠస్స సరీరం విణా ఛందోమఈఏ వాఆఏ. (అగ్ని శరణం ప్రవిష్టస్య శరీరం వినా ఛందోమయ్యా వాచా)**

**అన : (సస్మితమ్) కహేహి, కహేహి! (కథయ, కథయ!)**

**ప్రియ : (సంస్కృతమాశ్రిత్య)**

**దుష్యంతేనాహితం తేజో దధానాం భూతయే భువః**
**అవేహి తనయాం బ్రహ్మన్! అగ్ని గర్భాం శమీమివ 04**

**అన : (ప్రియంవదామాశ్లిష్య) సహి, పిఅం మే. కిందు అజ్జ ఎవ్వ సఉందళా ణీఅదిత్తి ఉక్కంఠాసాహారణం పరితోసం అణుహోమి. (సఖి, ప్రియం మే. కింతు అద్యైవ శకుంతలా నీయతే ఇతి ఉత్కంఠా సాధారణం పరితోషమనుభవామి).**

---

**అగ్గిసరణం:** అగ్నిశరణమ్ = (ప్రాతర్హోమంకోసం) అగ్నిహోత్రగృహం, ప్రవిష్టస్య = ప్రవేశించినవాడైన తాతకాశ్యపుడికి, శరీరమ్ + వినా = శరీరం లేని, ఛందోమయ్యా = ఛందోబద్ధమైన, వాచా = వాక్కుతో – (అశరీరవాణితో) సూచితః = తెలుపబడింది.

**కహేహి:** (సస్మితమ్ = చిరునవ్వుతో) కథయ – కథయ = చెప్పు, చెప్పు!!

**దుష్యంతేన:** (సంస్కృతమ్ + ఆశ్రిత్య = సంస్కృతభాషను ఆశ్రయించి. అశరీరవాణిని యథాతథంగా చెప్పడానికి సంస్కృతాశ్రయణం. కార్యతశ్చోత్తమాదీనాం కార్యో భాషావిపర్యయః దేశౌచిత్యాద్రసౌచిత్యాత్కార్యా వేషక్రియాభిదాః). బ్రహ్మన్ = ఓ బ్రహ్మర్షీ! భువః = భూమికి (లోకానికి), భూతయే = ఐశ్వర్యాభివృద్ధి కోసం, దుష్యంతేన = రాజర్షి దుష్యంతుడిచేత, ఆహితమ్ = నిక్షిప్తం కావించబడిన, తేజః = తేజస్సును (వీర్యాన్ని), దధానామ్ = గర్భంలో ధరిస్తున్నదైన, తనయామ్ = నీ పుత్రిని, అగ్నిగర్భామ్ = అగ్నిని గర్భాన నిక్షిప్తపరుచుకొన్న, శమీమ్ + ఇవ = శమీలతనువలె, అవేహి = తెలిసికొనుము!

**తాత్పర్యం:** భూలోకానికి మేలు జరగడం కోసమని నీ పుత్రిక ఇప్పుడు దుష్యంతుడి తేజస్సును గర్భాన ధరిస్తోంది. అగ్ని గర్భయైన శమీలత అని తెలుసుకో.

**కిందు:** (ప్రియంవదామ్ + ఆశ్లిష్య = ప్రియంవదను కౌగిలించుకొని) సఖీ! ఓ ప్రియంవదా! మే = నాకు, ప్రియమ్ = ఇది ప్రియమైన విషయమే. కింతు = కానీ, అద్య + ఏవ = నేడే, శకుంతలా = శకుంతల, నీయతే = కొనిపోబడుతోంది, ఇతి = అని, ఉత్కంఠా+ సాధారణమ్ = వేగిరపాటుతో కూడిన, పరితోషమ్ = ఆనందాన్ని,

**ప్రియ : సహి, వఅం దావ ఉక్కంఠం కహం విఅ విణోదిఇస్సామో. సా తవస్సిణీ ణివ్వదా హోదు. (సఖి, ఆవాం తావదుత్కంఠాం కథమపి వినోదయిష్యావః. సా తపస్వినీ నిర్వృతా భవతు).**

**అన : తేణ హి ఏదస్సిం చూదసాహావలంబిదే ణాలిఏరసముగ్గఏ తణ్ణిమిత్తం ఎవ్వ కాళందరక్ఖమా ణిక్ఖిత్తా మఏ కేసరమాళిఆ. తం తుమం హత్థ సణ్ణిహిదం కరేహి. జావ అహం వి సే గోరోఅణం తిత్థమిత్తిఅం దువ్వాకిసళఆఇ త్తి మంగళసమాలంభణాఇ విరఏమి. (తేన హి ఏతస్మిన్ చూతశాఖావలంబితే నారికేళసముద్గకే తన్నిమిత్తమేవ కాలాంతరక్షమా నిక్షిప్తా మయా కేసరమాలికా. తాం త్వం హస్త సన్నిహితాం కురు. యావదహమప్యస్యా గోరోచనాం తీర్థమృత్తికాం దూర్వాకిసలయానీతి మంగళసమాలంభనాని విరచయామి).**

---

అనుభవామి = అనుభవిస్తున్నాను (ఆత్రుత – ఆనందాల కలయిక). ఉత్కంఠానామ – విరహ పర్యుత్సుకత్వమ్ – అని వ్యాఖ్యాత. "నా సంతోషము కొంత చింతతో కూడిన దైనది – అని కందుకూరివారు. Maloncaly mingles with my joy – మోనియర్విలియమ్సు.

**వఅం దావ:** సఖీ! అనసూయా! ఆవామ్ + తావత్ = మనమిద్దరం, కథమపి = ఎలాగోలాగా, ఉత్కంఠామ్ = ఆత్రుతను, వినోదయిష్యావః = శకుంతలను సాగనంపిన తరవాత తొలగించుకొందాములే (వి + నుద్). We shall find a means of consoling our selves after the departure అని మోనియర్విలియమ్సు. విరహపర్యుత్సుకతను నెమ్మదిగా దిగమింగుకొని ఆనందిద్దామని గానీ. సా – తపస్వినీ = ఆ అమాయకురాలు శకుంతల, నిర్వృతా – భవతు = సుఖసంపన్న అగుగాక! (తపస్వీ చానుకంపార్హః – ఇత్యమరః. జాలిపడవలసిన శకుంతల – అని. శాపవృత్తాంతం తెలిసినవాళ్లు కనుక వీళ్ల భయం వీళ్ళది. అందుకే నిర్వృతా భవతు = ఏ ఇబ్బందులూ రాకుండా సుఖపడుగాక అనే ఆకాంక్ష. "మన చింతకేమి? ఆమెను వినోదింపజేయుదము. అందువలన మన శకుంతల సుఖపడనీ" – అన్నారు కందుకూరివారు. వీరికి దొరికిన పాఠమేదో?)

**తేణ హి:** తేన–హి = అందుకని, ప్రియంవదా! చూతశాఖా + అవలంబితే = మామిడికొమ్మకు వేలాడగట్టిన, ఏతస్మిన్ = ఈ, నారికేళ – సముద్గకే = కొబ్బరిఆకుల బుట్టలో, తత్ + నిమిత్తమేవ = ఆమెకోసమే, కాలాంతరక్షమా = చాలాకాలం ఉండేదైన,

ప్రియ : తహ కరీఅదు. (తథా క్రియతామ్)

(అనసూయా నిష్క్రాంతా. ప్రియంవదా నాట్యేన సుమనోభాజనం గృహ్ణాతి)

(నేపథ్యే)

గౌతమి! ఆదిశ్యంతాం శార్ఙ్గరవశారద్వతమిశ్రాః శకుంతలా-నయనాయ.

---

కేసరమాలికా = పొగడ పూలదండ, మయా = నా చేత, నిక్షిప్తా = ఉంచబడింది – ఉంచాను అని. తామ్ = దానిని, త్వమ్ = నువ్వు, హస్త సన్నిహితామ్ + కురు = చేత బట్టుకో – తీసుకురమ్మనడం. యావత్ = ఇంతలోకీ, అహమ్ + అపి = నేను కూడా, అస్యాః = శకుంతలకోసమని, గోరోచనామ్ (మృగరోచనామ్) = గోరోచనాన్నీ, తీర్థమృత్తికామ్ = పవిత్రక్షేత్రపు మట్టినీ (పుట్టమన్నులాంటిది), దూర్వాకిసలయాని = దూర్వాంకురాలనూ (లేత గరిక), ఇతి = మొదలైన, మంగళ – సమాలంభనాని = మంగళాలంకారాలను, విరచయామి = సమకూరుస్తాను (సమాలంభనమాలేపే తిలకేఽలంకృతావపి – అని యాదవప్రకాశనిఘంటువు నిచ్చి మంగళాలంకరణాని అన్నాడు రాఘవభట్టు. వీటితో మైపూతను చేసెదను – అనిపించారు కందుకూరి వారు).

**విశేషాలు:** ఏతన్నిమిత్తమేవ కాలహరణక్షమా నిక్షిప్తా మయా కేసరమాలికా – అనే పాఠాంతరం కనిపిస్తోంది. చిరకాలము నుండి ఆమె నిమిత్తమే దాచి యుంచిన – అన్నారు కందుకూరివారు. Some times since I deposited అన్నారు మోనియర్విలియమ్సు. ఏతన్నిమిత్తమేవ = ఈ సాగనంపే సమయం కోసమే దాచి ఉంచాను – అని.

**తహ కరీఅదు:** తథా క్రియతామ్ = అలాగే చేయబడుగాక!

(అనసూయా నిష్క్రాంతా = గోరోచనాదుల కోసం అనసూయ నిష్క్రమిస్తుంది. ప్రియంవదా = ప్రియంవద, సుమనోభాజనమ్ = పొగడపూల దండ ఉన్న బుట్టను, నాట్యేన – గృహ్ణాతి = అభినయంతో చూపుతూ స్వీకరిస్తుంది. చెట్టుకొమ్మనుంచి తీసుకుంటున్నట్టు అభినయంతో ప్రదర్శిస్తుందని).

(నేపథ్యే = తెరలో)

గౌతమి = ఓ గౌతమీ! శకుంతలా – నయనాయ = శకుంతలను తీసుకువెళ్ళడానికి, శార్ఙ్గరవశారద్వత మిశ్రాః = మాన్యులైన శార్ఙ్గరవ శారద్వతులు, ఆదిశ్యంతామ్ = ఆదేశింపబడుదురుగాక! వారిద్దరికీ ఈ పనిని ఆజ్ఞాపించమనడం.

**ప్రియ : (కర్ణం దత్త్వా) అణసూఏ! తువరసు; ఏదే ఖు హత్థిణాఉర గామిణో ఇసీఓ ఆఆరీఅంతి. (అనసూయే! త్వరస్వ; ఏతే ఖలు హస్తినాపురగామిన ఋషయ ఆకార్యంతే)**

**(ప్రవిశ్య సమాలంభనహస్తా)**

**అన : సహి! ఏహి, గచ్ఛంహ. (సఖి! ఏహి గచ్ఛావః)**

**(పరిక్రామతః)**

**ప్రియ : (విలోక్య) ఏసా సుజ్జోదఏ ఏవ్వ సిహామజ్జిదా, ణీవారక్ఖద హత్థాహిం సోత్థివాఅణకాహిం తావసీహిం అహిణందీఅమాణా సఉందళా చిట్ఠఇ. ఉవసప్పంహణం. (ఏషా సూర్యోదయ ఏవ శిఖామార్జితా, నీవారాక్షతహస్తాభిః స్వస్తివాచనికాభిః తాపసీభిరభినంద్యమానా శకుంతలా తిష్ఠతి, ఉపసర్పావ ఏనామ్)**

**(ఇత్యుపసర్పతః)**

**(తతః ప్రవిశతి యథోద్దిష్టవ్యాపారా ఆసనస్థా శకుంతలా)**

---

**తువరసు:** (కర్ణమ్ – దత్త్వా = ఆలకించి), అనసూయా! త్వరస్వ = త్వరపడు! ఏతే – ఖలు = ఇరిగో సుమా! హస్తినాపురగామినః = హస్తినాపురానికి వెళ్ళే, ఋషయః = ఋషులు, ఆకార్యంతే = పిలువబడుతున్నారు. వారిని అప్పుడే పిలుస్తున్నారని (సద్దావీఅంతి = శబ్దాయంతే – అని పాఠాంతరం).

(సమాలంభనహస్తా = గోరోచనాదికం చేతబట్టినదై అనసూయ, ప్రవిశ్య = ప్రవేశించి)

**ఏహి:** సఖి = ప్రియంవదా! ఏహి = రమ్ము, గచ్ఛావః = వెడదాం!!

(పరిక్రామతః = ఇద్దరూ నాలుగడుగులు వేస్తారు)

**ఏసా:** (విలోక్య = ముందుకు చూచి) సూర్యోదయే + ఏవ = ప్రాతఃకాలంలోనే, శిఖామార్జితా = శిరస్స్నానం చేసినదై, శకుంతలా = శకుంతల, నీవార + అక్షత – హస్తాభిః = నివ్వరి బియ్యంతో చేసిన అక్షతలు చేబూనినవారూ, స్వస్తివాచనికాభిః = ఆశీస్సులందిస్తున్నవారూ అయిన, తాపసీభిః = ఋషికాంతలతో (తాపసస్యపత్నీ = తాపసీ), అభినంద్యమానా = అభినందింపబడుతున్నదై, ఏషా = ఇదిగో, తిష్ఠతి = ఇక్కడ కూర్చుని ఉంది. ఏనామ్ = ఈమెను, ఉపసర్పావః = సమీపిద్దాం!!

(ఇతి = అని, ఉపసర్పతః = సమీపిస్తారు)

**శకు : భవదీఓ! వందామి (భగవత్యః! వందే)**

**ఏకా : (శకుంతలాం ప్రతి) జాదే! భత్తుణో బహుమాణసూఅఅం దేఈసద్దం లహేహి. (జాతే! భర్తుః బహుమానసూచకం దేవీశబ్దం లభస్వ!)**

**ద్వితీయా : వచ్చే! వీరప్పసవిణీ హోహి! (వత్సే! వీరప్రసవిణీ భవ!)**

**తృతీయా : వచ్చే! భత్తుణో బహుమదా హోహి! (వత్సే! భర్తుర్బహుమతా భవ!)**

**(ఆశిషో దత్త్వా గౌతమీవర్జం నిష్క్రాంతాః)**

**సఖ్యౌ : (ఉపసృత్య) సహి, సుహమజ్జణం దే జాదం? (సఖి! సుఖమజ్జనం తే జాతమ్?)**

**శకు : సాఅదం మే సహీణం. ఇదో ణిసీదహ. (స్వాగతం మే సఖ్యోః. ఇతో నిషీదతమ్)**

---

(తతః = అంతట, యథోద్దిష్టవ్యాపారా = చెప్పబడినవిధంగా అభినందనలు అందుకొంటున్నదై, ఆసనస్థా = సముచితాసనం మీద కూర్చున్న, శకుంతలా = శకుంతల, ప్రవిశతి = ప్రవేశిస్తుంది.)

**భవదీఓ:** భగవత్యః = మహానుభావలారా! వందే = ఇదే నమస్కరిస్తున్నాను.

**జాదే:** (శకుంతలాం = శకుంతలను, ప్రతి = ఉద్దేశించి) జాతే = పుత్రీ! భర్తుః = పెనిమిటి, బహుమానసూచకమ్ = (నీకిచ్చే) గౌరవాన్ని సూచించే, దేవీశబ్దమ్ = దేవీశబ్దాన్ని, లభస్వ = పొందు! పట్టమహిషినే "దేవి" అంటారు కనుక ఈ ఆశీస్సు.

**వీరప్పసవిణీ:** వత్సే = తనయా! వీరప్రసవిణీ+భవ = వీరమాతవు కమ్ము! వీరుణ్ని ప్రసవించు – అని.

**భత్తుణో:** వత్సే = బిడ్డా! భర్తుః = పెనిమిటికి, బహుమతా = ఆదరణీయవు, భవ = కమ్ము!

(ఆశిషః + దత్త్వా = ఇలా ఆశీస్సులందించి, గౌతమీ వర్జమ్ = గౌతమి మినహా, సర్వాః = మునికాంతలందరూ, నిష్క్రాంతాః = నిష్క్రమిస్తారు).

**సుహమజ్జణం:** (ఉపసృత్య = అనసూయాప్రియంవదలు చేరువకు వచ్చి) సఖి = సఖీ! శకుంతలా! తే = నీకు, సుఖమజ్జనం= హాయిగా శిరస్స్నానం, జాతమ్ = అయ్యిందా?

**సాఅదం:** మే = నా, సఖ్యోః = చెలిమికత్తెలకు, స్వాగతమ్ = స్వాగతం. ఇతః =ఇక్కడ ఇటువైపు, నిషీదతమ్ = కూర్చోండి!

**ఉభే : (మంగళపాత్రాణ్యాదాయ, ఉపవిశ్య) హలా! సజ్జా హోహి. జావ మంగల సమాలంభణం విరఏమ. (హలా! సజ్జా భవ. యావత్ మంగళ సమాలంభణం విరచయావః).**

**శకు : ఇదం పి బహు మంతవ్వం. దుల్లహం దాణిం మే సహీమండణం భవిస్సది త్తి (ఇతి బాష్పం విసృజతి). (ఇదమపి బహు మంతవ్యమ్. దుర్లభమిదానీం మే సఖీమండనం భవిష్యతీతి).**

**ఉభే : సహి, ఉఇఅం ణ దే మంగలకాలే రోఇదుం. (ఇత్యశ్రూణి ప్రమృజ్య నాట్యేన ప్రసాధయతః). (సఖి! ఉచితం న తే మంగళకాలే రోదితుమ్).**

**ప్రియ : ఆహరణోఇదం రూబం అస్సమసులహేహిం పసాహణేహిం విప్పఆరీ అది. (ఆభరణోచితం రూపమాశ్రమసులభైః ప్రసాధనైర్విప్రకార్యతే).**

---

**సజ్జా:** (మంగళపాత్రాణి = మంగళద్రవ్యాలుంచిన పాత్రలను, ఆదాయ = తీసుకొని, ఉపవిశ్య =కూర్చుని) హలా = సఖీ! సజ్జా – భవ = సన్నద్ధురాలవు కమ్ము! యావత్ = ఇక మేమిదే, మంగళసమాలంభణమ్ = మంగళప్రదమైన అలంకరణను, విరచయావః = చేస్తాము.

**ఇదం పి:** ఇదమ్ + అపి = ఇది కూడా, బహు–మంతవ్యమ్ = అధికంగా భావించవలసిందే! ఇదానీమ్ = ఇప్పుడు ఈ, సఖీమండనమ్ = చెలికత్తెలు చేసే అలంకరణ, మే = నాకు, దుర్లభమ్ + భవిష్యతి = (రేపటి నుంచి) దుర్లభమైపోతుంది!! (ఇతి = అని, బాష్పమ్ – విసృజతి = కన్నీరు పెడుతుంది).

**ఉఇఅం:** సఖీ! మంగళకాలే = శుభప్రదమైన ఈ సమయంలో, రోదితుమ్ = కన్నీరుపెట్టడం, తే = నీకు, న + ఉచితమ్ = తగదు. (ఇతి =అని, అశ్రూణి – ప్రమృజ్య = కన్నీరు తుడిచి, నాట్యేన – ప్రసాధయతః = అలంకరించడాన్ని అభినయంతో ప్రదర్శిస్తారు).

**ఆహరణ:** ఆభరణ + ఉచితమ్ = విలువైన ఆభరణాలకు అర్హమైన, రూపమ్ = నీ ఆకృతి, ఆశ్రమసులభైః = ఆశ్రమంలో తేలికగా లభించే, ప్రసాధనైః = గోరోచన తీర్థమృత్తికా దూర్వాంకురాదులైన సమాలంభనలతో, విప్రకార్యతే = వికృతం చేయబడుతోంది. (విప్రకార్యతే – వికృతం క్రియతే – ఇత్యర్థః – రాఘవభట్టః)

(ప్రవిశ్యోపాయనహస్తౌ)

**ఋషికుమారకౌ: ఇదమలంకరణమ్. అలంక్రియతామత్రభవతీ.**

(సర్వా విలోక్య విస్మితాః)

**గౌతమీ : వచ్ఛ! ణారఅ! కుదో ఏదం. (వత్స! నారద! కుత ఏతత్?)**

**ప్రథమః : తాతకాశ్యపప్రభావాత్.**

**గౌతమీ : కిం మాణసీ సిద్ధీ? (కిం మానసీసిద్ధిః?)**

**ద్వితీయః : న ఖలు. శ్రూయతామ్. తత్రభవతా వయమాజ్ఞప్తాః శకుంతలా హేతోర్వనస్పతిభ్యః కుసుమాన్యాహరతేతి. తత ఇదానీమ్ –**

**క్షౌమం కేనచిదిందుపాండు తరుణా మాంగల్యమావిష్కృతమ్**
**నిష్ఠ్యూతశ్చరణోపభోగసులభో లాక్షారసః కేనచిత్**

---

(ఉపాయనహస్తౌ = కానుకలు చేతులలో నింపుకొన్నవారై ఋషికుమారులిద్దరు, ప్రవిశ్య = ప్రవేశించి)

**ఇదమ్:** ఇదమ్ = ఇదిగో, అలంకరణమ్ = భూషణసమూహం. అత్రభవతీ = మాన్యురాలు, అలంక్రియతామ్ = అలంకరింపబడుగాక!

**ణారఅ:** వత్స – నారద = నాయనా, నారదా! ఏతత్ = ఈ అలంకారసమూహం, కుతః = ఎక్కడిది?

**తాత:** తాత – కాశ్యప – ప్రభావాత్ = తండ్రి కణ్వుడి మహిమవల్ల.

**కిం మాణసీ:** మానసీ – సిద్ధిః – కిమ్ = మనశ్శక్తితో (తపశ్శక్తితో) ఒనగూడిన సిద్ధియా? (కిం మానసీసృష్టిః – అని పాఠాంతరం)

**న ఖలు:** న – ఖలు = కాదుసుమా! శ్రూయతామ్ = ఆలకించు. శకుంతలా హేతోః = శకుంతలకోసం, వనస్పతిభ్యః = తరువుల నుంచి, కుసుమాని = పువ్వులు, ఆహరత+ఇతి = తెండి అని, తత్రభవతా = మాన్యుడైన తాతకాశ్యపునిచేత, వయమ్ + ఆజ్ఞప్తాః = మేము ఆజ్ఞాపింపబడ్డాము. మమ్మల్ని ఆజ్ఞాపించాడు – అని. తతః = అంతట, ఇదానీమ్ = ఇదిగో ఇప్పుడు –

**అన్యేభ్యో వనదేవతాకరతలైరాపర్వభాగోత్థితైః**
**దత్తాన్యాభరణాని తత్కిసలయోద్భేదప్రతిద్వంద్విభిః 05**

**ప్రియ : (శకుంతలాం విలోక్య) హలా, ఇమాఏ అబ్భువవత్తీఏ సూఇఆ దే భత్తుణో గేహే అణుహోదవ్వా రాఅలచ్ఛీత్తి. (హలా! అనయా అభ్యుపపత్త్యా సూచితా తే భర్తుర్గేహేఽనుభవితవ్యా రాజలక్ష్మీరితి)**

**(శకుంతలా వ్రీడాం రూపయతి)**

---

**క్షౌమమ్:** కేనచిత్ + తరుణా = ఒకానొక తరువుచేత, ఇందుపాండు = జాబిల్లిలాగా తెల్లనైనదీ (ఇందువత్ పాండు), మాంగల్యమ్ = శుభప్రదమైనదీ (మంగళకర్మణి సాధు – మాంగళ్యమ్) అయిన, క్షౌమమ్ = పట్టుచీరల జత, ఆవిష్కృతమ్ = సృష్టించి ఇవ్వబడింది. కేనచిత్ = మరొక వనస్పతితో, చరణ + ఉపభోగ + సులభః = కాళ్లకు అలంకరించుకోవడానికి సులువైన, లాక్షారసః = పారాణి, నిష్ఠ్యూతః = స్రవించి ఇవ్వబడింది. అన్యేభ్యః = తక్కిన తరువులచేత, తత్ + కిసలయ = వాటి చిగురుల తాలూకు, ఉద్భేద = మొలకలతో, ప్రతిద్వంద్విభిః = పోటీదారులూ, ఆపర్వభాగ + ఉత్థితైః = మణికట్టు దాకా మాత్రమే పైకెత్తబడినవీ అయిన, వనదేవతాకరతలైః = వనదేవతల హస్తతలాలతో, ఆభరణాని = రకరకాల ఆభరణాలు, దత్తాని = అందించబడ్డాయి.

**తాత్పర్యం:** నిండుజాబిల్లిలాగా తెల్లగా ఉన్న ఈ మాంగల్యవస్త్రద్వయాన్ని ఒకానొక తరువు ఆవిష్కరించి అందించింది. (చీర ఒకటీ మేలిముసుగు ఒకటీ. కాస్విదవకుంఠనవతీ – 5 – 13). పాదాలకు పెట్టుకునే పారాణిని మరో చెట్టు స్రవించి ఇచ్చింది. మిగతా ఆభరణాలను మిగతా వనస్పతులు సమర్పించాయి. చిగురాకుల గుత్తికి సాటివచ్చే హస్తతలాలను మణికట్టులదాకా మాత్రమే ఎత్తి వనదేవతలే స్వయంగా సమర్పించినట్టు తరుదేవతలు సమర్పించాయి.

**ఇమాఏ:** (శకుంతలామ్ – విలోక్య = శకుంతలను చూస్తూ) హలా = సఖీ, అనయా = ఈ, అభ్యుపపత్త్యా = అనుగ్రహం చేత, భర్తుః+గేహే = మెట్టింటిలో, రాజలక్ష్మీః = రాజసంపద, అనుభవితవ్యా = నీచే అనుభవింపబడవలసి ఉంది – నువ్వు అనుభవించబోతున్నావు, ఇతి = అని, తే = నీకు, సూచితా = సూచింపబడింది. నువ్వు అనుభవించబోయే రాజసంపద సూచింపబడింది – అని గానీ.

(శకుంతల, వ్రీడామ్ = సిగ్గును, రూపయతి = అభినయంతో చూపిస్తుంది)

**ప్రథమః : గౌతమ! ఏహ్యేహి. అభిషేకావతీర్ణాయ కాశ్యపాయ వనస్పతి సేవాం నివేదయావః**

**ద్వితీయః : తథా (ఇతి నిష్క్రాంతౌ)**

**సఖ్యౌ : అఏ, అణువజుత్తభూసణో అఅం జణో. చిత్తకమ్మపరిఅఏణ అంగేసు దే ఆహరణవిణిఓఅం కరేహ్మ. (అయే, అనుపయుక్త భూషణోఽయం జనః. చిత్రకర్మ పరిచయేనాంగేషు త ఆభరణ వినియోగం కుర్వః)**

**శకు : జాణే వో ణేపుణం. (జానే వాం నైపుణమ్)**

**(ఉభే నాట్యేనాలంకురుతః)**

**(తతః ప్రవిశతి స్నానోత్తీర్ణః కాశ్యపః)**

---

**ఏహ్యేహి:** గౌతమ = మిత్రమా గౌతమా! ఏహి + ఏహి = రమ్ము రమ్ము. అభిషేక + అవతీర్ణాయ = స్నానార్థం (మాలినీ) నదిలోకి దిగిన, కాశ్యపాయ = కణ్వ మహర్షికి, వనస్పతి సేవామ్ = ఈ తరువుల సేవను, నివేదయావః = విన్నవిద్దాం. (అభిషేకోత్తీర్ణాయ – అని పాఠాంతరం).

**తథా:** తథా = అలాగే (ఇతి = అని, నిష్క్రాంతౌ = ఇద్దరూ నిష్క్రమిస్తారు)

**అణువజుత్త:** అయే = ఓ చెలీ! అయమ్ + జనః = ఈ జనం = మేము, అనుపయుక్త – భూషణః = భూషణాలు (ఏనాడూ) ఉపయోగించినవాళ్లం కాము. చిత్రకర్మ – పరిచయేన = చిత్రలేఖనాల (చూసిన) పరిచయంతో, తే = నీ, అంగేషు = ఆయా అవయవాలలో, ఆభరణ వినియోగమ్ = భూషణాల అలంకరణ (వినియోగం), కుర్వః = చేస్తున్నాం.

**జాణే:** వామ్ = మీ ఇద్దరి, నైపుణమ్ = నిపుణత, జానే = ఎరుగుదును! (ఉభే = ఇద్దరూ, నాట్యేన = అభినయంతో, అలంకురుతః = అలంకరిస్తారు)

(తతః = అంతట, స్నాన + ఉత్తీర్ణః = స్నానం ముగించుకొని నది నుంచి లేచినవాడై, కాశ్యపః = కణ్వుడు, ప్రవిశతి = ప్రవేశిస్తాడు)

**యాస్యతి:** అద్య = నేడు, శకుంతలా = శకుంతల, యాస్యతి + ఇతి = వెడుతుంది అని, హృదయమ్ = మనస్సు, ఉత్కంఠయా = ఆవేగంతో (ఆతురతతో), సంస్పృష్టమ్ =

**కాశ్యపః : యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్టముత్కంఠయా**
**కంఠః స్తంభితబాష్పవృత్తికలుషః చింతాజడం దర్శనమ్.**
**వైక్లబ్యం మమ తావదీదృశమహో! స్నేహాదరణ్యౌకసః**
**పీడ్యంతే గృహిణః కథం ను తనయా విశ్లేషదుఃఖైర్నవైః 06**

**(ఇతి పరిక్రామతి)**

---

నిండిపోయింది (కొందలమందె డెందము – కందుకూరి). కంఠః = కంఠస్వరం (స్వరే కంఠః ప్రకీర్త్యతే), స్తంభిత = ఉగ్గబట్టుకోబడిన, బాష్పవృత్తి = దుఃఖం వల్ల – అశ్రువుల ఉద్గమం వల్ల, కలుషః = జీరవోయింది. దుఃఖాన్ని నిలువరించుకోవడం వల్ల గొంతు జీరవోయిందని. దర్శనమ్ = చూపు, చింతా – జడమ్ = బెంగతో జడనువడింది. అహో = ఆశ్చర్యం! అరణ్యౌకసః = వానప్రస్థుడనైన (వనవాసినైన), మమ – తావత్ = నాకే! స్నేహాత్ = (పెంచిన) ప్రీతిభావంవల్ల, వైక్లబ్యమ్ = దుఃఖపారవశ్యం (దుఃఖవిహ్వలత), ఈదృశమ్ = ఇలా ఇంతగా ఉన్నదంటే, గృహిణః = కనిపెంచే గృహస్థులు, నవైః = ఎప్పటికప్పుడు క్రొత్తవైన, తనయా విశ్లేషదుఃఖైః = పుత్రికా విరహరూపమైన దుఃఖాలతో, కథమ్ – పీడ్యంతే – ను = ఎలా ఎంతగా పీడింపబడుతున్నారో గదా! (దీనికి రాఘవభట్టరు వ్యాఖ్య: స్తంభితా యా బాష్పస్య వృత్తిః = ప్రారంభః – స్తంభిత బాష్పవృత్తిః. తయా కలుషః = స్వరభంగవాన్ కంఠః. దర్శనమ్ = తత్తదింద్రియ జన్యం జ్ఞానమ్. చింతయా జడమ్. స్వస్వవిషయాగ్రాహకమ్. కంఠస్తంభిత బాష్పవృత్తి కలుషం చింతాజడం దర్శనమ్ – అని పాఠాంతరం. కంఠంలో స్తంభింపజేయబడిన బాష్పవృత్తి వల్ల కలుషమైన దర్శనం చింతాజడమయ్యింది అని శ్రీనివాసాచార్య వ్యాఖ్య)

**తాత్పర్యం:** శకుంతల ఇవ్వేళ అత్తవారింటికి వెడుతోంది – అంటేనే ఎందుకో మనసంతా ఉత్కంఠతో అదోలా అయిపోతోంది. ఆపుకున్న కన్నీళ్లు గొంతులో సుళ్లు తిరిగి కంఠస్వరం వణుకుతోంది, జీరవోతోంది. అన్నింటినీ వదిలించుకొని అడవిలోకి వచ్చి విరాగినై జీవితం గడుపుతున్న నాకే కేవలం పెంచినప్రేమవల్ల ఇంతటి దుఃఖపారవశ్యం కలుగుతోందంటే ఆశ్చర్యమే! ఆడపిల్లలను కని – పెంచి – పెద్ద చేసి అత్తవారింటికి సాగనంపే తల్లిదండ్రుల పరిస్థితి ఏమిటి? ఎప్పటికప్పుడు కొత్తగా అనిపించే ఈ పుత్రికా విరహదుఃఖాలు వాళ్ళని మరింక ఎంతగా ఏడిపిస్తాయో గదా!

(ఇతి = అని, పరిక్రామతి = ముందుకు నడుస్తాడు)

సఖ్యౌ : హలా, సఉందలే, అవసిదమండనాసి. పరిధేహి సంపదం ఖోమజుఅలం. (హలా! శకుంతలే! అవసితమండనాసి. పరిధత్స్వ సాంప్రతం క్షౌమయుగళమ్)

(శకుంతలోత్థాయ పరిధత్తే)

గౌతమీ : జాదే, ఏసో దే ఆణందపరివాహిణా చక్ఖుణా పరిస్సజంతో విఅ గురూ ఉవట్ఠిదో. ఆఆరం దావ పడివజ్జస్స. (జాతే! ఏష తే ఆనందపరివాహినా చక్షుషా పరిష్వజమాన ఇవ గురురుపస్థితః. ఆచారం తావత్ప్రతిపద్యస్వ).

శకు : (సవ్రీడమ్) తాద, వందామి (తాత! వందే)

కాశ్యపః : వత్సే!
యయాతేరివ శర్మిష్ఠా భర్తుర్బహుమతా భవ
సుతం త్వమపి సమ్రాజం సేవ పూరుమవాప్నుహి 07

---

**అవసిద:** సఖీ! శకుంతలా! అవసితమండనా + అసి = అలంకరణ ముగిసిన దానవు అయ్యావు. అలంకరించడం పూర్తి అయ్యిందని. సాంప్రతమ్ = ఇప్పుడింక, క్షౌమయుగళమ్ = దుకూలద్వయాన్ని (జోడు పట్టుచీరలను), పరిధత్స్వ = ధరించు.

(శకుంతల – ఉత్థాయ = లేచి, పరిధత్తే = ధరిస్తుంది)

**ఏసో దే:** జాతే = పుత్రీ! ఆనంద – పరివాహినా = ఆనందనిర్భరమైన, చక్షుషా = దృష్టితో (ఆనందం ఉప్పొంగుతున్న చూపులతో), పరిష్వజమానః + ఇవ = నిన్ను పొదువుకుంటున్నవాడిలాగా, ఏషః = ఇడిగో, తే– గురుః = నీ తండ్రి కాశ్యపుడు, ఉపస్థితః = విచ్చేశాడు. ఆచారమ్ = వందనాదికమైన సంప్రదాయాన్ని, ప్రతిపద్యస్వ తావత్ = ఆచరించు.

**తాద:** (సవ్రీడమ్ = సిగ్గిల్లుతూ) తాత =తండ్రీ! వందే = ఇదే నమస్కరిస్తున్నాను.

**యయాతే:** వత్సే = తనయా! యయాతేః = యయాతి చక్రవర్తికి, శరిష్ఠా + ఇవ = శర్మిష్ఠలాగా, భర్తుః = పెనిమిటికి, బహుమతా + భవ = గౌరవార్హవు కమ్ము. సా = ఆ శర్మిష్ఠ, పూరుమ్ + ఇవ = పూరుచక్రవర్తిని కన్నట్టుగా, త్వమ్ + అపి = నువ్వుకూడా, సమ్రాజమ్ – సుతమ్ = చక్రవర్తి యైన పుత్రుణ్ని, అవాప్నుహి = పొందు.

**తాత్పర్యం:** యయాతిచేత శర్మిష్ఠ ఎంతగా గౌరవింపబడిందో అంతగా నువ్వా నీ భర్త దగ్గర గౌరవాన్ని పొందు. ఆవిడ – చక్రవర్తియైన పూరుణ్ని కన్నట్టుగా నువ్వా చక్రవర్తి కాదగ్గ పుత్రుణ్ని ప్రసవించు.

**గౌతమీ : భఅవం, వరో క్ఖు ఏసో ణ ఆసిసా. (భగవన్! వరః ఖల్వేషః, నాశీః).**

**కాశ్యపః : వత్సే! ఇతః సద్యోహుతాగ్నీన్ ప్రదక్షిణీకురుష్వ**

**(సర్వే పరిక్రామంతి)**

**కాశ్యపః : (ఋక్ఛందసాశాస్తే)**

**అమీ వేదిం పరితః క్లుప్తధిష్ణ్యాః**
**సమిద్వంతః ప్రాంతసంస్తీర్ణదర్భాః**
**అపఘ్నంతో దురితం హవ్యగంధైః**
**వైతానాస్త్వాం వహ్నయః పావయంతు. 08**

---

**వరో క్ఖు:** భగవన్ = మహాత్మ! ఏషః = ఇది, వరః+ ఖలు = నిజంగా వరం సుమా! న + ఆశీః = కేవలం ఆశీస్సుకాదు. జరిగి తీరుతుందని.

**ఇతః:** వత్సే = తనయా! ఇతః = ఇదిగో ఇటువైపు, సద్యః + హుత + అగ్నీన్ = ఇప్పుడే వేల్చబడిన అగ్నులను, ప్రదక్షిణీకురుష్వ = ప్రదక్షిణం చెయ్యి.

(సర్వే = అందరూ, పరిక్రామంతి = ప్రదక్షిణం చేస్తారు)

**అమీ:** (ఋక్ + ఛందసా = ఋక్ఛందస్సులో కూర్చిన శ్లోకంతో, ఆశాస్తే = దీవిస్తాడు). వేదిమ్ = హోమకుండానికి, పరితః = అన్నివైపులా – అష్టకోణాలలోనూ, క్లుప్త = కల్పింపబడ్డ, ధిష్ణ్యాః = అధిష్ఠానదేవతల స్థానాలు కలవీ (ధిష్ణ్యం స్థానే గృహే భేఽగ్నౌ – ఇత్యమరః. ధిష్ణ్యం స్థానాగ్నిసద్మసు శక్తావృక్షేఽపి – ఇతి మేదినీ), సమిద్వంతః = సమిధలతో నిండినవీ, ప్రాంత = నాలుగు దిక్కులా, సంస్తీర్ణ దర్భాః = పరచబడిన దర్భలు కలవీ, హవ్య – గంధైః = వేల్చబడిన ఆజ్యాదుల పరిమళాలతో, దురితమ్ = పాపాన్ని, అపఘ్నంతః = నశింపజేసేవీ అయిన, అమీ = ఈ, వైతానాః + వహ్నయః = యజ్ఞసంబంధి అగ్నులు, త్వామ్ = నిన్ను, పావయంతు = పవిత్రీకరించుగాక! (పాలయంతు = రక్షించుగాక – అని పాఠాంతరం) (వితానో యజ్ఞే ఉల్లోచే విస్తారే పుంనపుంసకమ్ – మేదినీ).

**తాత్పర్యం:** ఈ యజ్ఞ కుండానికి అష్టకోణాలలోనూ అధిష్ఠానదేవతలు ఆహూతులై ప్రతిష్ఠింపబడ్డారు. కుండం నిండుగా సమిధలు ప్రజ్వరిల్లుతున్నాయి. కుండానికి నాలుగుదిక్కులా దర్భలు పరచబడ్డాయి. హుతమవుతున్న హవ్యాల పరిమళాలు పాపాలను పారద్రోలుతున్నాయి. ఓ శకుంతలా! ఈ యజ్ఞవేదిలోని యాగాగ్నులు నిన్ను

ప్రతిష్ఠస్వేదానీమ్ (సదృష్టిక్షేపమ్) క్వ తే శార్ఙ్గరవశారద్వతమిశ్రాః?

**శిష్యౌ** : (ప్రవిశ్య) భగవన్! ఇమే స్మః

**కాశ్య** : శార్ఙ్గరవ! భగిన్యాస్తే మార్గమాదేశయ.

**శార్ఙ్గ** : ఇత ఇతో భగవతీ.

(సర్వే పరిక్రామంతి)

**కాశ్య** : భోభోః సన్నిహితాస్తపోవనతరవః!
పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మాస్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యా పల్లవమ్
ఆద్యే వః కుసుమప్రసూతిసమయే యస్యా భవత్యుత్సవః
సేయం యాతి శకుంతలా పతిగృహం సర్వైరనుజ్ఞాయతామ్. 09

---

రక్షించుగాక! (పరితః క్లుప్త ధిష్ణ్యాః అనే విశేషణం కందుకూరి వారి అనువాదంలో కనపడదు)

**ప్రతిష్ఠస్వ:** ఇదానీమ్ = ఇక ఇప్పుడు, ప్రతిష్ఠస్వ = బయలుదేరు (సదృష్టి క్షేపమ్ = చూపు మరల్చి – సారించి). తే = ఆ, శార్ఙ్గరవ శారద్వత మిశ్రాః = శార్ఙ్గరవులవారూ శారద్వతులవారూ, క్వ = ఎక్కడ? ఏరి? (ఆర్య – మిశ్ర పదాలు గౌరవవాచకాలు. ఆర్యచారుదత్తుడు – మండనమిశ్రుడు)

**ఇమే:** (ప్రవిశ్య = ప్రవేశించి) భగవన్ = మహాత్మా! ఇమే – స్మః = ఇదిగో మేమిక్కడే ఉన్నాము.

**భగిన్యాః:** శార్ఙ్గరవా! తే = నీ, భగిన్యాః = సోదరికి, మార్గమ్ + ఆదేశయ = దారి ఆదేశించు, (ముందుండి కొనిపొమ్ము – అనడం)

**ఇత:** భగవతీ = మాన్యురాలా! ఇతః + ఇతః = ఇటు, ఇటు!

(సర్వే = అందరూ, పరిక్రామంతి = ముందుకు నడుస్తారు)

**పాతుమ్:** భోభోః = ఓయోయీ! సన్నిహితాః = ఆప్తులారా! తపోవన – తరవః = ఆశ్రమ తరువులారా! (సన్నిహితదేవతాః = వనదేవతలతో అధిష్ఠితులై ఉన్న వనస్పతులారా! – అని పాఠాంతరం). యా = ఏ శకుంతల, యుష్మాసు = మీరు, ప్రథమమ్ = ముందుగా,

(కోకిలరవం సూచయత్వా)

**అనుమతగమనా శకుంతలా తరుభిరియం వనవాసబంధుభిః**
**పరభృతవిరుతం కలం యథా ప్రతివచనీకృతమేభిరీదృశమ్.** **10**

---

జలమ్ = నీరు, అపీతేషు (సత్సు) = గ్రోలనివారు కాగా – ముందుగా మీరు గ్రోలనిదే, పాతుమ్ = తాను గ్రోలడానికి, నవ్యవస్యతి = కోరుకోదో (ప్రథమమ్ – పాతుమ్ = ముందుగా తాను గ్రోలడానికి న వ్యవస్యతి – అని కానీ); యా = ఏ శకుంతల, ప్రియమండనా + అపి = పూలు అలంకరించుకోడాన్ని చాలా ఇచ్ఛగించేదే అయినా, భవతామ్ = మీతో ఉన్న, స్నేహేన = మైత్రిచేత, (భవతామ్) పల్లవమ్ (అపి) = మీ ఒక్క చిగురాకునైనా, న + ఆదత్తే = త్రుంపి స్వీకరించదో (అపి – భవతామ్ – శబ్దాలకు తంత్రోచ్చారణ. ప్రియమండనాపి యా శకుంతలా భవతామ్ పల్లవమ్ స్నేహేన నాదత్తే – అనీ కొందరన్వయించారు); వః = మీ యొక్క, ఆద్యే = తొట్టతొలిదైన, కుసుమ – ప్రసూతి – సమయే = పుష్పోత్పత్తి వేళయందు, యస్యాః = ఏ శకుంతలకు, ఉత్సవః + భవతి = పండుగే అయ్యేదో, సా = ఆ, ఇయమ్ = ఈ, శకుంతలా = శకుంతల, పతిగృహమ్ + యాతి = మెట్టినింటికి (పెనిమిటింటికి) వెడుతోంది, సర్వైః = మీ అందరిచేత, అనుజ్ఞాయతామ్ = అనుమతింపబడుగాక!

**తాత్పర్యం:** వనస్పతులారా! ఇదిగో ఈ శకుంతల ఇవ్వేళ అత్తవారింటికి వెడుతోంది. దయచేసి అందరూ అనుమతించండి. ఈ శకుంతలకు మీరంటే ఎంత ఇష్టమో! నీళ్లు ముందుగా మీకు పోసేది ఆ తరవాతే తాను త్రాగేది. మీకు పొయ్యకుండా తాను ముట్టేది కాదు. పూలు అలంకరించుకోడమంటే శకుంతలకు చాలా ఇష్టం. అయినా ఒక్క చిగురాకునైనా మీనుంచి తుంపేది కాదు. మీతో అంతటి స్నేహం. మీరు జీవితాల్లో మొదటిసారిగా మొగ్గతొడిగిన వేళలన్నీ ఈవిడకు మరిచిపోలేని పర్వదినాలే. అలాంటి మీ నేస్తురాలు పెనిమిటింటికి వెడుతోంది. దీవించి పంపండి!

(కోకిలరవమ్ = కోకిల కలకూజితాన్ని, సూచయిత్వా = నేపథ్యంలో వినిపింపజేసి)

**అనుమత:** వనవాస – బంధుభిః = అడవిలో నివసిస్తున్న బంధువులైన, తరుభిః = వనస్పతులచేత, ఇయమ్ – శకుంతలా = ఈ శకుంతల, అనుమతగమనా = అనుమతింపబడిన గమనం కలది అయ్యింది. ఈమె గమనాన్ని తరువులు అనుమతించాయి అని. యథా = ఎలాగంటే – కలమ్ = అవ్యక్తమధురమైన, ఈదృశమ్ = ఇలాంటి, పరభృత – విరుతమ్ = కోకిల కూజితం, ఏభిః = ఈ తరువులచేత,

(ఆకాశే)

**రమ్యాంతరః కమలినీహరితైః సరోభిః**
**ఛాయాద్రుమై ర్నియమితార్కమయూఖతాపః**
**భూయాత్కుశేశయరజో మృదురేణు రస్యాః**
**శాంతానుకూల పవనశ్చ శివశ్చ పంథాః .** **11**

(సర్వే సవిస్మయమాకర్ణయంతి)

---

ప్రతివచనీకృతమ్ = సమాధానింపబడింది. కోకిల కూతనే సమాధానంగా అందించి అనుమతించాయని (అపరవక్రం వృత్తమితి రాఘవభట్టః).

**తాత్పర్యం:** ఆహా! వనవాసబంధువులైన ఈ తరువులు శకుంతల ప్రయాణాన్ని అనుమతించాయి. నా అభ్యర్థనకు – కోకిల కలకూజితంతో ఇలా సమాధానం చెప్పాయి (వసంతం ప్రవేశించిందని సూచన).

(ఆకాశే = ఆకాశంలో వినిపిస్తుంది)

**రమ్యాంతరః:** అస్యాః + పంథాః = ఈమె ప్రయాణించే మార్గం – కమలినీ = తామరపూదీగెల చేత, హరితైః = పచ్చనైన, సరోభిః = సరస్సులతో, రమ్య + అంతరః = రమణీయమైన మధ్య మధ్య ప్రదేశాలు కలదీ; ఛాయా ద్రుమైః = చిక్కటి నీడనిచ్చే చెట్లతో (కాటుక చెట్లతో), నియమిత = నిరోధింపబడిన, అర్కమయూఖ – తాపః = సూర్యకిరణాల వేడిమి కలదీ; కుశేశయ = పద్మాల, రజః = పుప్పొడిలాంటి, మృదు – రేణుః = మృదువులైన ధూళి రేణువులు కలదీ; శాంత = మెల్లనైన, అనుకూల = అనుకూలమైన, పవనః + చ = వాయువు కలదీ, శివః + చ = శుభప్రదమైనదీ, భూయాత్ = అగుగాక!

**తాత్పర్యం:** ఈమె ప్రయాణించే మార్గంలో – మధ్యమధ్యన తామరపూదీగెలతో పచ్చనైన సరోవరాలు అనేకం ఉండుగాక! సూర్యకిరణాల తాపాన్ని నిరోధిస్తూ చిక్కటి నీడనిచ్చే చెట్లు ఇరువైపులా దట్టంగా ఉండుగాక! పద్మాల పుప్పొడిలాగా మృదువైన ధూళికణాలతో నేల అంతా మెత్తగా ఉండుగాక! అనుకూల పవనాలు మెల్లగా వీచుగాక! ఈమె మార్గం శుభప్రదమగుగాక! (ఎదురుగాలి = ప్రతికూల పవనం దుశ్శకునమనీ, అనుకూలపవనం శుభశకునమనీ శాస్త్రం!!)

(సర్వే = అందరూ, సవిస్మయమ్ = ఆశ్చర్యంతో, ఆకర్ణయంతి = వింటారు)

**గౌతమీ : జాదే ణ్ణాదిజణసిణిద్ధాహిం అణుణ్ణాదగమణాసి తవోవణదేవదాహిం. పణమ భఅవదీణం. (జాతే, జ్ఞాతిజన స్నిగ్ధాభిరనుజ్ఞాతగమనాసి తపోవనదేవతాభిః ప్రణమ భగవతీః)**

**శకు : (సప్రణామం పరిక్రమ్య – జనాంతికమ్) హలా, పిఅంవదే, ణం అజ్జఉత్త దంసణుస్సుఆఏ వి అస్సమపదం పరిచ్చఅంతీఏ దుక్ఖేణ మే చలణా పురదో పవట్టంది. (హలా! ప్రియంవదే! నన్వార్యపుత్ర దర్శనోత్సుకాయా అప్యాశ్రమపదం పరిత్యజంత్యా దుఃఖేన మే చరణౌ పురతః ప్రవర్తేతే)**

**ప్రియ : ణ కేవళం తవోవణ విరహకాదరా సహీ ఏవ్వ. తుఏ ఉవట్ఠిద విఓఅస్స తవోవణస్స వి దావ సమవత్థా దీసఇ.**
**ఉగ్గళిఅ దబ్భకబళా మిఆ పరిచ్చత్తణచ్చణా మోరా**
**ఓసరిఅ పండుపత్తా ముఅంతి అస్సూ విఅ లదాఓ**

---

**జాదే:** జాతే = పుత్రీ! జ్ఞాతిజన = బంధువులలాగా, స్నిగ్ధాభిః = మనపట్ల మైత్రికలవారైన (జ్ఞాతిజనాః ఇవ స్నిగ్ధాభిః – కాటయ), తపోవన – దేవతాభిః = ఆశ్రమ దేవతలచేత, అనుజ్ఞాత – గమనా = అనుజ్ఞబడసిన ప్రయాణం కలదానవు, అసి = అయ్యావు. ఆశ్రమదేవతలు అనుజ్ఞ ఇచ్చారని. భగవతీః = ఆ దేవీమూర్తులను, ప్రణమ = నమస్కరించు!

**హలా:** (సప్రణామమ్ = నమస్కరిస్తూ, పరిక్రమ్య = ముందుకు నడచి – జనాంతికమ్ = జనాంతికంగా) హలా = సఖీ, ప్రియంవదే = ప్రియంవదా! నను = విను! ఆర్యపుత్ర = పెనిమిటిని, దర్శన = దర్శించడంలో, ఉత్సుకాయాః + అపి = ఉత్సుకత కలదాననే అయినా, ఆశ్రమపదమ్ = ఈ తపోవన ప్రదేశాన్ని, పరిత్యజంత్యాః = విడిచిపెడుతున్నదాననైన, మే = నా యొక్క, చరణౌ = అడుగులు, దుఃఖేన = భారంగా (దుఃఖదుఃఖేన = భారాతిభారంగా – అని పాఠాంతరం), పురతః + ప్రవర్తేతే = పడుతున్నాయి. (దుఃఖేన విముఖౌ ప్రవర్తేతే – అని మరొకపాఠం. ముందుకు వెళ్ళడానికి విముఖత చూపుతున్నాయి). ఆర్యపుత్రః = పెనిమిటి. ఇది భర్తను భార్యమాత్రమే – ధర్మపత్ని మాత్రమే – అనవలసిన మాట.

**ణ కేవళం:** తపోవన – విరహ – కాతరా = ఆశ్రమంతో (ఏర్పడే) విరహానికి దిగులు చెందుతున్నది, న– కేవలమ్ + సఖీ + ఏవ = మా ఇష్టసఖి మాత్రమే కాదు. త్వయా =

(న కేవలం తపోవనవిరహకాతరా సఖ్యేవ. త్వయోపస్థిత వియోగస్య తపోవనస్యాపి తావత్సమవస్థా దృశ్యతే.

ఉద్గళితదర్భకబళా మృగ్యః పరిత్యక్తనర్తనా మయూరాః
అపసృతపాండుపత్రా ముంచంత్యశ్రూణీవ లతాః) **12**

**శకు** : (స్మృత్వా) తాద, లతాబహిణిఅం వణజోసిణిం దావ ఆమంతఇస్సం. (తాత! లతాభగినీం వనజ్యోత్స్నాం తావదామంత్రయిష్యే)

**కాశ్య** : అవైమి తే తస్యాం సోదర్యస్నేహమ్. ఇయం తావద్దక్షిణేన.

---

నీతో, ఉపస్థిత = వచ్చిపడ్డ, వియోగస్య = విరహంకలదైన, తపోవనస్య + అపి = ఈ ఆశ్రమానికీ, సమవస్థా + తావత్ = ఇంచుమించు అదే అవస్థగా – సమానావస్థగా దృశ్యతే = స్పష్టపడుతోంది. నువ్వేకాదు ఆశ్రమమూ – అంటే ఆశ్రమంలోని చరాచర ప్రాణికోటి సమస్తమూ నీతో సమానావస్థలోనే ఉంది – అనడం.

**ఉగ్గళిద:** మృగ్యః = ఆడులేడులు (మృగాః అని పాఠాంతరం), ఉద్గళిత = నోటి నుండి జారిపడుతున్న, దర్భ – కబళాః = దర్భకబళాలు కలవి (కబళం = కడి, ముద్ద). మయూరాః = మగనెమళ్లు, పరిత్యక్త – నర్తనాః = విడువబడిన నాట్యాలు కలవి. అపసృత = జారిపడుతున్న, పాండుపత్రాః = పాలిపోయిన పండుటాకులు కలవై, లతాః = పూదీగలు, అశ్రూణి – ముంచంతి + ఇవ = కన్నీటి బిందువులను జాలువారుస్తున్నట్టున్నాయి.

**తాత్పర్యం:** తినడానికి నోటినిండా కరిచిన దర్భకబళాలను మృగీమృగాలు తినడం మానివేసి – తినబుద్ధికాక జారవిడుస్తున్నాయి. నెమళ్లు నర్తనాలు వదిలేశాయి. పూదీగలు పాలిపోయిన పండుటాకులను కన్నీటి బిందువుల్లాగా జారవిడుస్తున్నాయి.

**తాద:** (స్మృత్వా = జ్ఞాపకం చేసుకొని) తాత = తండ్రీ! లతా – భగినీమ్ = నా లతా సోదరిని, వనజ్యోత్స్నామ్ = వనజ్యోత్స్నను, తావత్ + ఆమంత్రయిష్యే = ఒక్కసారి వీడ్కొలిపి వస్తాను!! సెలవడిగివస్తా నని.

**అవైమి:** తే = నీకు, తస్యామ్ = ఆ వనజ్యోత్స్నయందున్న, సోదర్యస్నేహమ్ = సోదరీమైత్రి, అవైమి = ఎరుగుదును. ఇయమ్ = ఇదిగో వనజ్యోత్స్న, దక్షిణేన – తావత్ = ఈ కుడివైపున.

**చూదసంగదావి:** (లతామ్ + ఉపేత్య = ఆ పూదీగెను సమీపించి) వనజ్యోత్స్నా!

**శకు : (లతా ముపేత్య) వణజోసిణి! చూదసంగదావి పచ్చాలింగ మం ఇదో గదాహిం సాహాబాహాహిం, అజ్జప్పహుది దూరవట్టిణీ ఖు దే భవిస్సం. (వనజ్యోత్స్నే! చూతసంగతాపి ప్రత్యాలింగమామితో గతాభిః శాఖా బాహాభిః, అద్యప్రభృతి దూరవర్తినీ ఖలు తే భవిష్యామి!)**

**కాశ్య : సంకల్పితం ప్రథమమేవ మయా త్వదర్థే**
**భర్తారమాత్మసదృశం సుకృతైర్గతా త్వమ్**
**చూతేన సంశ్రితవతీ నవమాలికేయమ్**
**అస్యామహం త్వయి చ సంప్రతి వీతచింతః. 13**

**ఇతః ప్రస్థానం ప్రతిపద్యస్వ**

---

చూతసంగతా + అపి = మామిడిచెట్టును అల్లుకొని ఉన్నదానవే అయినా, ఇతః + గతాభిః = ఇటువైపు సాగిన, శాఖాబాహాభిః = కొమ్మలు అనే బాహువులతో, మామ్ = నన్ను, ప్రత్యాలింగ = కౌగిలించుకో! అద్య ప్రభృతి = ఇక నేటినుంచీ, తే = నీకు, దూరవర్తినీ = బహుదూరంలో ఉన్నదానను, భవిష్యామి – ఖలు = అవుతాను గదా!

**సంకల్పితం:** ప్రథమమ్ + ఏవ = మునుపే, మయా = నా చేత, త్వదర్థే = నీ విషయంలో, సంకల్పితమ్ = సంకల్పింపబడింది. ఆత్మసదృశమ్ = నీకు తగ్గ, భర్తారమ్ = పెనిమిటిని, సుకృతైః = నీ పుణ్యాలతో, త్వమ్ = నీవు గతా = పొందావు (గతా + అసి). ఇయమ్ = ఈ, నవమాలికా = విరజాజి తీవియ (వనజ్యోత్స్న), చూతేన = సహకార తరువుతో, సంశ్రితవతీ = పెనవేసుకోబడింది. సంప్రతి = ఇప్పుడు, అస్యామ్ = ఈ వనజ్యోత్స్న విషయంలోనూ, త్వయి + చ = నీ విషయంలోనూ, అహమ్ = నేను, వీతచింతః = నిశ్చింతుణ్ని (వీత చింతః + అస్మి = చింత తొలగినవాడనయ్యాను.)

**తాత్పర్యం:** మునుపే నీ విషయంలో నేను మనసులో సంకల్పించుకొన్నాను. దానికి తగ్గట్టే నువ్వు నీకు తగిన వరుణ్ని పూర్వపుణ్యాల కొద్దీ పొందావు. అలాగే ఈ నవమాలిక – చూతతరువుతో ఆశ్రితవతి అయ్యింది. మీ ఇద్దరి విషయంలోనూ ఇప్పుడు నాకు చింత తీరింది.

**ఇతః:** ఇతః = ఇక్కడి నుంచి, ప్రస్థానమ్ = ప్రయాణం, ప్రతిపద్యస్వ = ప్రారంభించు. ఇక బయలుదేరు – అనడం.

**శకు : (సఖ్యౌప్రతి) హలా! ఏసా దువేణం వో హత్థేణిక్ఖేవో. (హలా! ఏషా ద్వయోర్వాం హస్తనిక్షేపః)**

**సఖ్యౌ : అఅం జణో కస్స హత్థే సమప్పిదో? (ఇతి బాష్పం వికిరతః) (అయం జనః కస్య హస్తే సమర్పితః?)**

**కాశ్య : అనసూయే! అలం రుదిత్వా. నను భవతీభ్యామేవ స్థిరీకర్తవ్యా శకుంతలా!**

**(సర్వే పరిక్రామంతి)**

**శకు : తాద, ఏసా ఉడజపజ్జంతచారిణీ గబ్భమంథరా మిఅవహూ జదా అణఘప్పసవా హోది తదా మే కంపి పిఅణివేదఇత్తఅం విసజ్జఇస్సహ. (తాత! ఏషా ఉటజపర్యంతచారిణీ గర్భమంథరా మృగవధూర్యదానఘప్రసవా భవతి తదా మహ్యం కమపి ప్రియ నివేదయితృకం విసర్జయిష్యథ).**

---

**ఏసా:** (సఖ్యౌప్రతి = చెలికత్తెలతో) హలా = సఖీ! ఏషా = ఈ వనజ్యోత్స్న, వామ్ + ద్వయోః = మీ ఇద్దరికీ, హస్తనిక్షేపః = హస్తనిక్షేపం. మీ ఇద్దరిచేతులలోనూ పెట్టాననడం. (హస్తే నిక్షేపః – అని పాఠాంతరం.)

**అఅం:** అయమ్ + జనః = ఈ జనం (మేమిద్దరం), కస్య – హస్తే = ఎవనిచేతిలో, సమర్పితః = సమర్పితం? మమ్మల్ని ఎవరికి అప్పగించావు – అనడం. (ఇతి = అని, బాష్పమ్ – వికిరతః = ఇద్దరూ కన్నీరు పెడతారు).

**అనసూయే:** అనసూయే = అనసూయా! రుదిత్వా + అలమ్ = రోదించి ఇక చాలు. దుఃఖించకు అనడం. శకుంతలా = శకుంతల, భవతీభ్యామ్ + ఏవ = మీ ఇద్దరితోనే, స్థిరీకర్తవ్యా – నను = కుదుటబరచబడాలి గదా! శకుంతలను కుదుటబరచాల్సింది పోయి మీరు కంటతడి పెడతారేమిటి – అని

(సర్వే = అందరూ, పరిక్రామంతి = ముందుకు నడుస్తారు)

**ఏసా:** తాత = తండ్రీ! ఉటజపర్యంత చారిణీ = కుటీరం చెంతనే తిరుగాడుతున్నదీ, గర్భమంథరా = గర్భభారంతో మెల్లగా నడుస్తున్నదీ అయిన, ఏషా = ఈ, మృగవధూః = లేడి చూలాలు, యదా = ఎప్పుడు, అనఘప్రసవా – భవతి = సుఖప్రసవ అవుతుందో

**కాశ్య : నేదం విస్మరిష్యామః.**

**శకు : (గతిభంగం రూపయిత్వా) కో ణు క్ఖు ఏసో ణివసణే మే మజ్జఇ. (ఇతి పరావర్తతే). (కో ను ఖల్వేష నివసనే మే సజ్జతే?)**

**కాశ్య : వత్సే!**

**యస్య త్వయా వ్రణవిరోపణమింగుదీనాం**
**తైలం న్యషిచ్యత ముఖే కుశసూచివిద్ధే**
**శ్యామాకముష్టిపరివర్ధితకో జహాతి**
**సోఽయం న పుత్రకృతకః పదవీం మృగస్తే 14**

---

(వ్యసన రహితప్రసవా భవతీత్యర్థః – శ్రీనివాసాచార్యః), తదా = అప్పుడు, మహ్యమ్ = నా కొఱకు, ప్రియనివేదయిత్రృకమ్ = ఆ ప్రియవార్తను నివేదించేవాడుగా, కమ్ + అపి = ఎవనినో ఒకనిని, విసర్జయిష్యథ = పంపించండి. ఎవరితోనో ఒకరితో ఆ ప్రియవార్తను నాకు పంపండి – అని.

**నేదమ్:** ఇదమ్ = ఇది, న + విస్మరిష్యామః = మరిచిపోము.

**కో ణు క్ఖు:** (గతిభంగమ్ = నడకకు ఆటంకం, రూపయిత్వా = అభినయంతో ప్రదర్శించి) కః + ను + ఖలు + ఏషః = ఎవడు సుమా ఈతడు, మే + నివసనే = నా (క్షౌమ) దుకూలాలను, సజ్జతే = లాగుతున్నాడు.

**యస్య:** వత్సే = పుత్రీ! కుశ – సూచి – విద్ధే = సూదుల్లాంటి దర్భాగ్ర భాగాలతో గాయపడ్డ, యస్య = ఏ మృగం యొక్క, ముఖే = మూతి మీద (నోటిలో), వ్రణ – విరోపణమ్ = గాయాన్ని మాన్పేదైన, ఇంగుదీనాం తైలమ్ = గారకాయల గింజల నూనె, త్వయా = నీచేత, న్యషిచ్యత = తగ్గేదాకా ప్రతిదినం పులుమబడిందో, శ్యామాక – ముష్టి = శ్యామాక ధాన్యం పిడికిళ్లతో (చామలు), పరివర్ధితకః = పెంచబడినదీ (అనుకంపాయాం–కః), పుత్ర – కృతకః = (అల్పార్థే కః) బిడ్డడిగా భావింపబడినదీ అయిన, సః + అయమ్ – మృగః = ఆ ఈ లేడికూన, తే– పదవీమ్ = నీ దారిని, న– జహాతి = విడవడం లేదు.

**తాత్పర్యం:** ఇదిగో లేడి కూన. చామలు (కొర్రలు) గుప్పెళ్లతో తినిపించి గారాబంగా కొడుకులాగా పెంచావు గదా! సూదుల్లాంటి దర్భకొనలు గుచ్చుకొని దీని మూతికి గాయమైతే అది తగ్గేదాకా ఇంగుదీ తైలం (గారనూనె) ప్రతిదినం పులిమావు కదా.

**శకు : వచ్చ! కిం సహవాసపరిచ్చాఇణిం మం అణుసరసి? అచిరప్పసూదాఏ జణణీఏ విణా వడ్ఢిదో ఏవ్వ. దాణిం పి మఏ విరహిదం తుమం తాదో చింతఇస్సది. ణివత్తేహి దావ. (ఇతి రుదతీ ప్రస్థితా). (వత్స! కిం సహవాసపరిత్యాగినీం మామనుసరసి? అచిరప్రసూతయా జనన్యా వినా వర్ధిత ఏవ. ఇదానీమపి మయా విరహితం త్వాం తాతశ్చింతయిష్యతి. నివర్తస్వ తావత్).**

**కాశ్య : ఉత్పక్ష్మణోర్నయనయో రుపరుద్ధవృత్తిం**
**బాష్పం కురు స్థిరతయా విహతానుబంధమ్**
**అస్మిన్నలక్షితనతోన్నతభూమి భాగే**
**మార్గే పదాని ఖలు తే విషమీభవంతి. 15**

---

ఇదిగో ఆ లేడికూన. నువ్వు వెళ్ళిపోవడం దీనికి ఇష్టం లేనట్టుంది, నీ దారిని వదలడం లేదు. చీరపట్టుకొని వెనక్కి లాగుతోంది. (ఇంగుదీ = తాపసతరుః – అమరం)

**కిం సహవాస:** వత్స = బిడ్డా, సహవాస – పరిత్యాగినీమ్ = నీతోడి సహవాసాన్నీ – స్నేహాన్నీ విడిచిపెట్టి వెడుతున్నదాననైన, మామ్ = నన్ను, అనుసరసి – కిమ్ = అనుసరిస్తున్నావా? వెంటవస్తున్నావా? అచిరప్రసూతయా – జనన్యా = నిన్ను అప్పుడే ప్రసవించిన తల్లి (చేత), వినా + ఏవ = లేకుండానే, వర్ధితః = పెంచబడ్డావు. ప్రసవించిన వెంటనే నిన్ను విడిచి వెళ్ళిపోయింది నీ తల్లి. తల్లిలేని బిడ్డడిగా ఈ ఆశ్రమంలో పెరిగావు – పెంచబడ్డావు. ఇదానీమ్ + అపి = ఇప్పుడు కూడా అలాగే, మయా – విరహితమ్ – త్వామ్ = (పెంచిన తల్లినైన) నేను లేని నిన్ను గురించి, తాతః = తండ్రి కణ్వుడు, చింతయిష్యతి = ఆలోచిస్తాడు. నా బదులు కాశ్యపుడే తల్లియై నిన్ను చూసుకుంటాడని. నివర్తస్వ – తావత్ = మరింక వెనక్కి మళ్ళు.

**ఉత్పక్ష్మణో:** అస్మిన్ = ఈ, అలక్షిత = సరిగా చూడబడిన, నత + ఉన్నత – భూమి భాగే = దిగుడూ ఎగుడుల నేలకలదైన, మార్గే = ఈ దారిలో, తే = నీ, పదాని = అడుగులు, విషమీ భవంతి + ఖలు = తొట్రుపడుతున్నాయి సుమా! ఉత్ + పక్ష్మణోః = పైకెత్తిన రెప్పలు కల్గిన, నయనయోః = నీ రెండు కన్నులలోని, బాష్పమ్ = కన్నీటిని, ఉపరుద్ధ = నిలువరించబడిన, వృత్తిమ్ = కదలిక కలదానినిగానూ, విహత + అనుబంధమ్ = తొలగింపబడిన పునఃపునరుత్పత్తి సంబంధం కలదానినిగానూ, స్థిరతయా =

**శార్ఙ్గ : భగవన్! ఓదకాంతం స్నిగ్ధో జనోఽనుగంతవ్య ఇతి శ్రూయతే. తదిదం సరస్తీరమ్. అత్ర సందిశ్య నః ప్రతిగంతు మర్హసి.**

**కాశ్య : తేనహీమాం క్షీర వృక్షచ్ఛాయామాశ్రయామః**

**(సర్వే పరిక్రమ్య స్థితాః)**

**కాశ్య : (ఆత్మగతమ్). కిం ను ఖలు తత్రభవతో దుష్యంతస్య యుక్తరూప మస్మాభిః సందేష్టవ్యమ్. (ఇతి చింతయతి).**

---

నిబ్బరంతో – మనో ధైర్యంతో, కురు =చెయ్యి. (విహతో = దూరీకృతోఽనుబంధః = పునఃపునరుత్పత్తిర్యస్య తం కురు – రాఘవభట్టః)

**తాత్పర్యం:** నీ చూపునకు నీ కన్నీరు అడ్డం వస్తోంది. ఈ ఎగుడుదిగుడుల నేలా ఈ దారీ నీకు సరిగా ఆనడం లేదు (అలక్షిత). అందుకని నీ నడకలో అడుగులు తడబడుతున్నాయి. రెప్పలు పైకెత్తిన నీ కన్నులనిండా తిరుగుతున్న కన్నీటి కదలికను మనో ధైర్యంతో నిలువరించుకో (ఉపరుద్ధ వృత్తి)! మళ్ళీ మళ్ళీ పెల్లుబకకుండా చేసుకో (విహతానుబంధమ్)!!

**ఓదకాంతమ్:** భగవన్ = మహాత్మా!! ఆ + ఉదకాంతమ్ = నీటి (నెలవు) దాకా, స్నిగ్ధః + జనః = బంధుజనం, అనుగంతవ్యః = అనుగమింపబడవలసినది, ఇతి =అని, శ్రూయతే = (పెద్దలమాటగా) వినబడుతోంది. బంధువులనూ అయినవాళ్లనూ వీడ్కొలిపేటప్పుడు ఊరు చివర ఉండే చెరువుదాకానో బావి–కాలువల్లాంటి వాటిదాకానో వెంట వెళ్ళి సాగనంపి రావాలంటారు. తత్ = కాబట్టి, ఇదమ్ = ఇదిగో, సరస్తీరమ్ = చెరువుగట్టు. అత్ర = ఇక్కడ, నః = మాకు, సందిశ్య = మీ సందేశం అందించి, ప్రతిగంతుమ్ = వెనక్కి తిరిగివెళ్ళడానికి, అర్హసి = తగుదువు. నీ సందేశమేదో వినిపించి ఇక నీవు కుటీరానికి వెళ్ళవచ్చునని. (ఇక్కడ ఉదకాంతమ్ – ఓదకాంతాత్ – అని పాఠాంతరాలున్నాయి. ఓదకాంతాత్ ప్రియం పాంథ మనువ్రజేత్ = ఇష్టుడైన బాటసారిని ఇంటినుంచి పంపేటప్పుడు నీటి చెలమదాకా వెంటవెళ్ళాలి – అని కాటయవేముని వ్యాఖ్య)

**తేనహి:** తేన – హి = అలాగయితే, ఇమామ్ = ఈ, క్షీరవృక్ష + ఛాయామ్ = పాలచెట్ల నీడను, ఆశ్రయామః = ఆశ్రయిద్దాం! (క్షీరవృక్షః ప్లక్షాదేరుపలక్షకమ్. తేన ఛాయాధిక్యం ధ్వనితమ్ – రాఘవ భట్టః)

(సర్వే = అందరూ, పరిక్రమ్య = అటువైపు వెళ్ళి, స్థితాః = నిలుస్తారు)

**శకు : (జనాంతికమ్) హలా, పేక్ఖ. ణలిణీపత్తాందరిదం వి సహఅరం అపేక్ఖంతీ ఆదురా చక్కవాఈ ఆరడది. దుక్కరం అహం కరేమి త్తి లక్ఖేమి. (హలా! పశ్య; నలినీపత్రాంతరితమపి సహచరమ్ అపశ్యంతీ ఆతురా చక్రవాకీ ఆరౌతి. దుష్కరమహం కరోమీతి తర్కయామి.)**

**అన : సహి, మా ఏవ్వం మంతేహి. (సఖి! మైవం మంత్రయ)**

**ఏసావి పిఏణ విణా గమఅఇ రఅణిం విసాఅదీహఅరం**
**గరువంపి విరహదుక్ఖం ఆసాబంధో సహావేది.**

---

**కిం ను:** (ఆత్మగతమ్ = తనలో) తత్రభవతః = మాన్యుడైన, దుష్యంతస్య = దుష్యంతుడికి, అస్మాభిః = మాచేత, సందేష్టవ్యమ్ = సందేశంగా పంపదగ్గది (ఇవ్వదగినది), యుక్తరూపమ్ = బాగా తగినది (ప్రశస్తం యుక్తమ్ = యుక్తరూపమ్ = అత్యంతయుక్తమితి), కిమ్– ను – ఖలు = ఏమిటి చెప్మా!? (ఇతి = ఏమి సందేశం ఇద్దామా అని, చింతయతి = ఆలోచిస్తుంటాడు)

**హలా పేక్ఖ:** (జనాంతికమ్ = జనాంతికంగా – అంటే – అనసూయతో) హలా = సఖీ! అనసూయా! పశ్య = చూడు. నళినీపత్ర + అంతరితమ్ + అపి = కేవలం తామరాకుతో మాటువడ్డవాడైన, సహచరమ్ = తన ప్రియుణ్ని, అపశ్యంతీ = కానలేనిదై, ఆతురా = ఉత్కంఠితయై, చక్రవాకీ = ఈ జక్కవజవరాలు, ఆరౌతి = ఎంతగానో రోదిస్తోంది. అహమ్ = నేను, దుష్కరమ్ (+ కర్మ) = అసాధ్యమైనపనినే, కరోమి + ఇతి = చేస్తున్నానని, తర్కయామి = భావిస్తాను. భర్తకు దూరంగా ఇంతకాలం ఉండగలిగానంటే దుష్కరమైన పని చేసినట్టే – అనడం. (ఏతావద్దినం భర్త్రా వినా స్థితాస్మీతి భావః – అని రాఘవభట్టు. భర్తృతిరస్కృతయై దుఃఖించబోయే శకుంతల తుల్య సంవిధానంతో సూచిత = అనేన శాపతిరోహితం దుష్యంత మప్రాప్స్యమానాయాః శకుంతలాయాః భావిదుఃఖం తుల్యసంవిధానతయా సూచితమ్ – అని కాటయవేముడు. ప్రియస్య చిరవిశ్లేషేణ మరణే సముచితే సతి స్వయం తద్విపరీతమేవ కరోమీతి భావః – అని శ్రీనివాసాచార్య)

**ఏసావి:** సఖి = చెలీ! శకుంతలా! ఏవమ్ = ఇలా, మా + మంత్రయ = ఆలోచించకు. ఏషా + అపి = ఈ చక్రవాకి సైతం, ప్రియేణ – వినా + అపి = ప్రియుడు చెంతలేకపోయినప్పటికీ, విషాద – దీర్ఘతరామ్ + అపి = విరహబాధవల్ల నిడివిపెరిగినట్టు అనిపించినదైనా,

**(ఏషాపి ప్రియేణ వినా గమయతి రజనీం విషాదదీర్ఘతరామ్**
**గుర్వపి విరహదుఃఖమ్ ఆశాబంధః సాహయతి) 16**

**కాశ్య : శార్ఙ్గరవ! ఇతి త్వయా మద్వచనాత్ స రాజా శకుంతలాం పురస్కృత్య వక్తవ్యః.**

**శార్ఙ్గ : ఆజ్ఞాపయతు భవాన్!**

**కాశ్య : అస్మాన్ సాధు విచింత్య సంయమధనాన్ ఉచ్చైఃకులంచాత్మనః**
**త్వయ్యస్యాః కథమ ప్యబాంధవకృతాం స్నేహప్రవృత్తిం చ తామ్**
**సామాన్యప్రతిపత్తిపూర్వకమియం దారేషు దృశ్యా త్వయా**
**భాగ్యాయత్తమతఃపరం న ఖలు తద్వాచ్యం వధూబంధుభిః 17**

---

రజనీమ్ = రేయిని, గమయతి = గడుపుతుంది. (తెల్లవారి సూర్యుడుదయించి చూపు వచ్చి ప్రియుణ్ని చూడగలుగుతాననే ఆశతో గడుపుతుందని). గురు + అపి = ఎంతో తీవ్రమైనదే అయినా, విరహదుఃఖమ్ = వియోగ శోకాన్ని, ఆశాబంధః = ఆశాపాశం, సాహయతి = సహింపజేస్తుంది. (ఏషాపి వినాపి – ఏవం పంచసు స్థానేష్వపిర్యోజ్యః – రాఘవభట్టః)

**తాత్పర్యం:** చెలీ! ఈ చక్రవాకాంగనసైతం ప్రియుణ్ని ఎడబాసినా, విషాదంతో దీర్ఘతరమనిపించినా రేయి మొత్తాన్ని ఎలాగోలాగా గడుపుతుంది. (అంతేకానీ ప్రాణాలు తీసుకోదని). ఆశాబంధం అలాంటిది. ఎంతటి విరహవేదననైనా తట్టుకునేలా చేస్తుంది!!

**ఇతి త్వయా:** శార్ఙ్గరవా! శకుంతలామ్ + పురస్కృత్య = శకుంతలను పురస్కరించుకొని, సః + రాజా = ఆ రాజు దుష్యంతుడు, మద్వచనాత్ = నా మాటగా, త్వయా = నీచేత, ఇతి – వక్తవ్యః = ఇలా చెప్పబడాలి. నువ్వు వెళ్ళి శకుంతల విషయమై అతడికి నా మాటగా ఇలా చెప్పు – అని. (శకుంతలను ముందుంచుకొని – అని కందుకూరివారు).

**ఆజ్ఞాపయతు:** భవాన్ = నీవు, ఆజ్ఞాపయాతు = ఆజ్ఞాపించు.

**అస్మాన్:** సంయమ – ధనాన్ = (తపస్సే) నిగ్రహమే సంపదగా కలవారమైన, అస్మాన్ = మమ్మల్ని, సాధు – విచింత్య = బాగా ఆలోచించి; ఆత్మనః = నీయొక్క, ఉచ్చైః + కులమ్

**శార్ఙ్గ : గృహీతస్సందేశః.**

**కాశ్య : వత్సే, త్వమిదానీ మనుశాసనీయాసి. వనౌకసోఽపి సంతో లౌకికజ్ఞా వయమ్.**

---

+ చ = మహోన్నత వంశాన్నీ, సాధు – విచింత్య = మరింతగా ఆలోచించి; త్వయి = నీ విషయంలో, కథమ్ + అపి = ఎలాగో ఏ కారణంగానో, అబాంధవకృతామ్ = ఆప్తులతో ఏ ప్రమేయమూ లేకుండానే (స్వతంత్రంగా) చేయబడినదైన, అస్యాః = ఈమె తాలూకు, తామ్ = ఆ, స్నేహ ప్రవృత్తిమ్ + చ = స్నేహమయప్రవర్తననూ (స్నేహ ప్రవాహాన్నీ – ప్రవృత్తిః కథితా వృత్తౌ ప్రవాహోదంతయోరపి – ఇతి విశ్వః), సాధు – విచింత్య = బాగా ఆలోచించి; ఇయమ్ = ఈ శకుంతల, త్వయా = నీచేత, దారేషు = నీ భార్యలలో, సామాన్య – ప్రతిపత్తి పూర్వకమ్ = అందరితోనూ సమానమైన గౌరవపురస్సరంగా, దృశ్యా = చూడబడవలసినది. మిగతావారితో సమానమైన గౌరవం ఈమె పట్ల కూడా చూపించు – అని. అతః + పరమ్ = అంతకుమించినది (అంతకన్నా ఎక్కువ గౌరవాదరాలను నీనుంచి ఈవిడ పొందడమనేది), భాగ్య + ఆయత్తమ్ = అదృష్టానికి (దైవానికి) అధీనమైన విషయం. ఈవిడ చేసుకున్న అదృష్టాన్ని బట్టి ఉంటుందని. తత్ = అది, వధూబంధుభిః = పెళ్ళికూతురి బంధువులచేత, న + వాచ్యమ్ = అనదగ్గదీ అనవలసినదీ కాదు.

**తాత్పర్యం:** దుష్యంతమహారాజా! ఇటువైపు – తపోధనులమైన మమ్మల్ని చూడు. అటువైపు – మహోన్నతమైన నీ వంశం గమనించు. సరే, మా ప్రమేయం లేకుండానే స్నేహప్రవృత్తి ఈ శకుంతలకు నీపట్ల ఎలా ఏర్పడిందో – ఏర్పడింది. ఇదీ దృష్టిలో ఉంచుకో. నీకున్న భార్యలందరితో సరిసమానమైన గౌరవపురస్సరంగా ఈమెను చూసుకో. ఇంతవరకే మేము కోరదగింది. ఇంతకన్నా – అందరికన్నా ఎక్కువ గౌరవాదరాలు నీనుంచి పొందడమనేది ఈవిడ చేసుకొన్న అదృష్టాన్ని బట్టి ఉంటుంది. ఆడపిల్లను ఇచ్చుకున్న వాళ్ళు – అది అనకూడదు, అడగకూడదు!!

**గృహీతం:** సందేశః = మీరిచ్చిన ఈ సందేశం, గృహీతః = స్వీకరించబడింది. మీ సందేశాన్ని అర్థం చేసుకున్నాను, దీన్ని యథాతథంగా రాజుకు అందిస్తాను – అని.

**త్వమిదానీమ్:** వత్సే = పుత్రీ! ఇదానీమ్ = ఇక ఇప్పుడు, త్వమ్ = నువ్వు, అనుశాసనీయా + అసి = ఉపదేశింపబడవలసిన దానవు అయ్యావు.

**శార్జ్గ : న ఖలు ధీమతాం కశ్చిదవిషయో నామ!**

**కాశ్య : సా త్వమితః పతికులం ప్రాప్య –**

**శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తిం సపత్నీజనే**
**భర్తుర్విప్రకృతాపి రోషణతయా మా స్మ ప్రతీపం గమః**
**భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే భాగ్యేష్వనుత్సేకినీ**
**యాంత్యేవం గృహిణీపదం యువతయో వామాః కులస్యాధయః 18**

---

ఇప్పుడింక నీకు ఉపదేశిస్తాను – అని. వనౌకసః + సంతః + అపి = అడవుల్లో ఉండేవాళ్లమే అయినా, వయమ్ = మేము, లౌకికజ్ఞాః = లౌకికవిషయాలు ఎరిగినవాళ్ళమే. (లోకజ్ఞాః = లోకవృత్తాంతం తెలిసినవాళ్ళమే అని పాఠాంతరం. లోకవృత్తం లోక ఇతి వామనః).

**న ఖలు:** ధీమతామ్ = ప్రతిభావంతులకు, అవిషయః + నామ + కశ్చిత్ = తెలియనిదంటూ ఒకటి, న + ఖలు = ఉండదుగదా!

**సాత్వమ్:** సా = ఆ (అంత అమాయకంగా పెరిగినదానవూ, అంత స్వతంత్రంగా నిర్ణయం తీసుకున్నదానవూ), త్వమ్ = నువ్వు, ఇతః = ఈ ఆశ్రమం నుంచి, పతిగృహమ్ = పెనిమిటింటిని (పతికులమ్ = మగని వంశాన్ని), ప్రాప్య = (పొంది) చేరుకున్నదానవై –

**శుశ్రూషస్వ:** గురూన్ = పెద్దలను, శుశ్రూషస్వ = సేవించు. సపత్నీజనే = సవతి జనుల పట్ల, ప్రియసఖీవృత్తిమ్ = నెచ్చెలికారం, కురు = (చెయ్యి) ఆచరించు – ప్రియసఖిలా వ్యవహరించు. విప్రకృతా + అపి = ధిక్కృతవైనా (నికారో విప్రకారః స్యాత్ – అమరం), రోషణతయా = రోషానికి పోయి, భర్తుః = మగడికి, ప్రతీపమ్ = విపరీతంగా – వ్యతిరేకంగా, మా – స్మ – గమః = వెళ్ళకు – ప్రవర్తించకు. పరిజనే = సేవకబృందం విషయంలో, భూయిష్ఠమ్ = మిక్కుటంగా, దక్షిణా + భవ = అనుకూలురాలవు – దయగలదానవు – కమ్ము. భాగ్యేషు = సంపదల విషయంలో (భోగేషు – అని పాఠాంతరం), అనుత్సేకినీ – భవ = మిడిసిపాటు లేనిదానవు కమ్ము. మిడిసిపడకు – గర్వించకు అని. ఏవమ్ = ఈ విధంగా (ప్రవర్తించిన), యువతయః = తరుణులు, గృహిణీపదమ్ = ఇల్లాలు అనే మాటను, యాంతి = పొందుతారు. ఆ మాటకు స్థానానికి అర్హురాండ్రవుతారని. వామాః = ప్రతికూలచారిణులు (– దీనికి

**కథం వా గౌతమీ మన్యతే!?**

**గౌతమీ : ఏత్తిఓ వహూజణస్స ఉవదేసో. జాదే, ఏదం క్ఖు సవ్వం ఓఘారేహి. (ఏతావాన్ వధూజనస్యోపదేశః. జాతే! ఏతత్ ఖలు సర్వమవధారయ).**

**కాశ్య : వత్సే! పరిష్వజస్వ మాం సఖీజనం చ.**

**శకు : తాద, ఇదో ఎవ్వ కిం పిఅంవదామిస్సాఓ సహీఓ ణివత్తిస్సంతి. (తాత! ఇత ఏవ కిం ప్రియంవదామిశ్రాః సఖ్యో నివర్తిష్యంతే?)**

---

భిన్నంగా వక్రంగా వ్యతిరేకంగా వ్యవహరించేవారు), కులస్య = వంశానికి – పుట్టింటికీ మెట్టినింటికీ. ఆధయః = మనోవేదనలు. (ఆధిస్తు వ్యసనే చిత్తదుఃఖేఽధిష్ఠాన బంధయో రితి వైజయంతీ). వామౌ వల్గుప్రతీపౌ వా – అమరం.

**తాత్పర్యం:** పుత్రీ! అత్తమామలూ మొదలైన పెద్దలను సేవించు. సవతుల పట్ల ప్రియసఖిలాగా వ్యవహరించు. మగడు ఒకవేళ ధిక్కరించినా నిన్ను కోపింపజేసినా రోషానికి పోయి ప్రతికూలంగా ప్రవర్తించకు. సేవకజనం విషయంలో చాలా ఉదారంగా ఉండు. సంపదలకు మిసిమింతురాలివి కాకు. ఈవిధంగా నీవంటి తరుణులు "ఇల్లాలు" అనే పదానికి అర్హలవుతారు. దీనికి ప్రతికూలంగా ప్రవర్తించేవారు ఉభయవంశాలకూ సాక్షాత్తూ మనోవేదనలవుతారు.

**కథమ్:** గౌతమీ = గౌతమి, కథమ్ + వా – మన్యతే = ఏమనుకుంటోందో? నీ అభిప్రాయమేమిటి – అని. (వృద్ధతాపసి కాబట్టి అభిప్రాయం అడగడం).

**ఏత్తిఓ:** వధూజనస్య = అత్తవారింటికి వెళ్ళే అమ్మాయిలకు, ఉపదేశః = చెయ్యవలసిన ప్రబోధం, ఏతావాన్ = ఇంతటిదే, ఇట్టిదే, ఇదే! మీరు చేసిన ఉపదేశం సముచితమే అనడం. జాతే = బిడ్డా! ఏతత్ + సర్వమ్ = ఇది ప్రతి అక్షరమూ, అవధారయ + ఖలు = గ్రహించి గుర్తుంచుకోసుమా!

**పరిష్వజస్వ:** వత్సే = తల్లీ! పరిష్వజస్వ = కౌగిలించుకో, మామ్ = నన్నూ, సఖీజనమ్ + చ = ప్రియసఖులనూ.

**ఇదో ఎవ్వ:** తాత =తండ్రీ! ప్రియంవదామిశ్రాః = ప్రియంవదా ప్రముఖలైన, సఖ్యః = చెలిమికత్తెలు, ఇతః + ఏవ = ఇక్కడినుంచే, కిమ్ + నివర్తిష్యంతే = వెనక్కి వెళ్ళిపోతారా? నాతో రారా? అని.

**కాశ్య : వత్సే! ఇమే అపి ప్రదేయే. న యుక్తమనయోస్తత్ర గంతుమ్. త్వయా సహ గౌతమీ యాస్యతి.**

**శకు : (పితరమాశ్లిష్య) కహం దాణిం తాదస్స అంకాదో పరిబ్భట్ఠా మలఅ తడోన్మూలిఆ చందణలదా విఅ దేసంతరే జీవిఅం ధారఇస్సం? (కథమిదానీం తాతస్యాంకాత్ పరిభ్రష్టా మలయ తటోన్మూలితా చందనలతేవ దేశాంతరే జీవితం ధారయిష్యే?)**

**కాశ్య : వత్సే! కిమేవం కాతరాసి?!**

**అభిజనవతో భర్తుః శ్లాఘ్యే స్థితా గృహిణీపదే**
**విభవగురుభిః కృత్యైస్తస్య ప్రతిక్షణమాకులా**
**తనయ మచిరాత్ ప్రాచీవార్కం ప్రసూయ చ పావనం**
**మమ విరహజాం న త్వం వత్సే! శుచం గణయిష్యసి 19**

---

**ఇమేఽపి:** వత్సే = తనయా! ఇమే + అపి = ఈ ఇద్దరున్నూ, ప్రదేయే = భర్తలకు అప్పగింపబడవలసినవారే. తత్ర – గంతుమ్ = అక్కడికి వెళ్ళడం (నీతో హస్తినకు రావడం), అనయోః = ఈ ఇద్దరికీ, న + యుక్తమ్ = తగదు. త్వయా – సహ = నీతోపాటు, గౌతమీ = ఇదిగో మాన్యగౌతమి, యాస్యతి = వెడుతుంది. (వెళ్ళమని ఆమెకు సూచన).

**కహం దాణిం:** (పితరమ్ + ఆశ్లిష్య = తండ్రిని పొదువుకొని) ఇదానీమ్ = ఇప్పుడు, తాతస్య + అంకాత్ = తండ్రి ఒడి నుంచి, పరిభ్రష్టా = జారిపడ్డదాననై, మలయతట + ఉన్మూలితా = మలయాద్రి సానువునుండి (కొండ చరియనుంచి) పెకలింపబడిన, చందనలతా + ఇవ = గంధపు తీగెలాగా (మలయ పర్వతోన్మూలితా, మలయ తరూన్మూలితా – పాఠాంతరాలు), దేశాంతరే = మరొక ప్రదేశంలో, జీవితమ్ + కథమ్ + ధారయిష్యే = జీవితం ఎలా గడపను? (బ్రతకగలనా? – అని)

**కిమేవమ్:** వత్సే = వత్సా! ఏవమ్ = ఇలా, కాతరా+అసి–కిమ్ = బేలవు అవుతున్నావేమి?! అభిజనవతః = ఉత్తమ వంశంలో జన్మించినవాడైన (కులాన్యభిజనాన్వయౌ – అమరం), భర్తుః = మగడికి, శ్లాఘ్యే = నుతింపదగ్గ, గృహిణీపదే = 'ఇల్లాలు' అనే పదవిలో (పట్టమహిషీస్థానే శ్రీనివాసాచార్య), స్థితా = ఉన్నదానవై; విభవ + గురుభిః = వైభవాధిక్యంతో కూడినవైన, తస్య = అతడి, కృత్యైః = (దానధర్మాలూ యజ్ఞయాగాలూ

**(శకుంతలా పితుఃపాదయోః పతతి)**

**కాశ్య : య దిచ్ఛామి తే తదస్తు!**

**శకు : (సఖ్యావుపేత్య) హలా, దువే వి మం సమం ఏవ్వ పరిస్సజహ. (హలా! ద్వే అపి మాం సమమేవ పరిష్వజేథామ్)**

**సఖ్యౌ : (తథా కృత్వా) సహి, జఇ ణామ సో రాఆ పంచహిణ్ణాణమంథరో భవే తదో సే ఇమం అత్తణామహేఅ అంకిదం అంగులీఅఅం దంసేహి. (సఖి! యది నామ స రాజా ప్రత్యభిజ్ఞానమంథరో భవేత్ తతః తస్యేద మాత్మనామధేయాంకితమంగులీయకం దర్శయ)**

---

మొదలైన) కార్యకలాపాలతో, ప్రతిక్షణమ్ = ప్రతి నిముసమూ, ఆకులా = తీరికలేనిదానవై (వ్యగ్రా – అని కాటయ, సంసంభ్రమా – అని రాఘవభట్టు), ప్రాచీ = తూర్పుదిక్కు, అర్కమ్ + ఇవ = సూర్యుణ్ణిలాగా, పావనమ్ = పవిత్రుడైన, తనయమ్ = కొడుకును, అచిరాత్ = త్వరలోనే, ప్రసూయ + చ = కన్నదానవై, వత్సే = పుత్రీ! త్వమ్ = నీవు, మమ – విరహజామ్ = నా ఎడబాటువలని, శుచమ్ = దుఃఖాన్ని, న – గణయిష్యసి = లెక్కచేయవు.

**తాత్పర్యం:** పుత్రీ! శకుంతలా! ఉత్తమ వంశంలో పుట్టిన దుష్యంతుడికి ధర్మపత్ని వవుతున్నావు. అతడు వైభవ సంపన్నతతో చేసే ధర్మకార్యాలవల్ల నీకు క్షణం తీరిక ఉండదు. తూర్పుదిక్కు – సూర్యుణ్ణి ప్రసవించినట్టు – నువ్వూ త్వరలోనే పండంటి మగబిడ్డను కంటావు. నన్ను ఎడబాసిన దుఃఖాన్ని త్వరలోనే మరిచిపోతావు. ధైర్యంగా ఉండు. (అభితః = సమంతతః, జనవతః = స్వజనవతః – అని కూడా రాఘవభట్టు)

(శకుంతల, పితుః+పాదయోః = తండ్రి పాదాలపై, పతతి = పడుతుంది)

**య దిచ్ఛామి:** యత్ + ఇచ్ఛామి = నేను ఏది కోరుతున్నానో, తత్ = అది, తే = నీకు, అస్తు = అగుగాక! పై శ్లోకంలో చెప్పినవన్నీ జరుగుతాయని ఆశీస్సు. (యదిచ్ఛసి తే తదస్తు – పాఠాంతరం).

**దువే వి:** (సఖ్యౌ = చెలికత్తెలను, ఉపేత్య = సమీపించి) హలా = సఖులారా! ద్వే + అపి = ఇద్దరూ, మామ్ = నన్ను, సమమ్ + ఏవ = ఒకేసారి, పరిష్వజేథామ్ = కౌగిలించుకోండి!

**శకు : ఇమిణా సందేహేణ వో ఆకంపిదహ్మి. (అనేన సందేహేన వా మాకంపితాస్మి).**

**సఖ్యౌ : మా భాఆహి. అతిసిణేహో పావసంకీ. (మా భైషీః. అతిస్నేహః పాపశంకీ)**

**శార్ఙ్గ : యుగాంతరమారూఢస్సవితా. త్వరతామత్రభవతీ.**

**శకు : (ఆశ్రమాభిముఖీ స్థిత్వా) తాద, కదా ణు భూఓ తవోవణం పేక్ఖిస్సం!? (తాత! కదా ను భూయస్తపోవనం ప్రేక్షిష్యే?)**

---

**జఇ ణామ:** (తథా + కృత్వా = అలా చేసి) సఖీ! సః + రాజా = ఆ దుష్యంత మహారాజు, ప్రత్యభిజ్ఞాన – మంథరః =(నిన్ను) గుర్తుపట్టడం విషయంలో మందగించినవాడు (ప్రత్యభిజ్ఞానే మంథరః = శిథిలః), యది – నామ – భవేత్ = ఒకవేళ అయితే, తతః = అప్పుడు, ఇదమ్ = ఈ, ఆత్మనామధేయ + అంకితమ్ = అతడి పేరు చెక్కబడినదైన, అంగులీయకమ్ = ఉంగరాన్ని, తస్య = అతడికి, దర్శయ = చూపించు!! (కౌగిలించుకొని చెవిలో చెప్పారు కనుక ఈ మాట జనాంతికమే)

**ఇమిణా:** వామ్ = మీ ఇరువురి, అనేన – సందేహేన = ఈ సందేహంతో, ఆకంపితా + అస్మి = మరీ వణికిపోతున్నాను. మరింతగా భయపడుతున్నానని.

**మా భాఆహి:** మా – భైషీః = భయపడకు. అతిస్నేహః = అత్యంతమైత్రి, పాపశంకీ = కీడు శంకిస్తుంది గదా!

**యుగాంతరమ్:** సవితా = సూర్యుడు (ప్రొద్దు), యుగ + అంతరమ్ = నాలుగు బారల అవధిని, ఆరూఢః = అధిరోహించాడు. నాలుగు బారల పొద్దెక్కింది – అని. అత్రభవతీ = మాన్యురాలు శకుంతల, త్వరతామ్ = త్వరపడుగాక! (యుగాంతరం హస్తచతుష్కావధి. యుగం హస్తచతుష్కే ఽపి ఇతి విశ్వః – రాఘవభట్టు. అగాంతరమధి రూఢః – అని పాఠాంతరం. ఎండ యెక్కుచున్నది – అని కందుకూరి వారు)

**తాద:** (ఆశ్రమ + అభిముఖీ – స్థిత్వా = ఆశ్రమానికి అభిముఖంగా నిలిచి) తాత = తండ్రీ! భూయః = మళ్ళీ, తపోవనమ్ = ఈ ఆశ్రమం, కదా = ఎప్పుడు, ప్రేక్షిష్యే + ను = చూస్తానోకదా!!

కాశ్య : శ్రూయతామ్

భూత్వా చిరాయ చతురంతమహీసపత్నీ
దౌష్యంతి మప్రతిరథం తనయం ప్రసూయ
భర్త్రా తదర్పితకుటుంబభరేణ సార్ధం
శాంతే కరిష్యసి పదం పునరాశ్రమేఽస్మిన్. 20

---

**భూత్వా:** శ్రూయతామ్ = అమ్మా! విను. చిరాయ = చాలాకాలంపాటు నువ్వు, చతురంత – మహీ = నాలుగు దిక్కులే ఎల్లలుగా కలిగిన ఈ భూదేవికి, సపత్నీ – భూత్వా = సవతిగా ఉండి; అప్రతిరథమ్ = ఎదిరించే శత్రువే లేనివాడూ, దౌష్యంతిమ్ = దుష్యంతుడి అపత్యమూ అయిన, తనయమ్ = కొడుకును, ప్రసూయ = ప్రసవించి, తత్ = అతడికి, అర్పిత = అందింపబడిన, కుటుంబ భరేణ = కుటుంబ భారం కలవాడైన, భర్త్రా + సార్ధమ్ = నీ పెనిమిటి దుష్యంతుడితో కలిసి, శాంతే = ప్రశాంతమైన, అస్మిన్ + ఆశ్రమే = ఈ ఆశ్రమంలో, పునః = మళ్ళీ, పదమ్ + కరిష్యసి = అడుగు పెడుదువు గాని.

**తాత్పర్యం:** తల్లీ! నాలుగు దిక్కులే ఎల్లలుగా కలిగిన ఈ భూదేవికి చిరకాలం సవతిగా ఉండు. (దుష్యంతుడికి భూదేవి ఒక భార్య, నువ్వు మరో భార్యవు – అని). దుష్యంతుడికి అప్రతిరథుడైన కొడుకును ప్రసవించు. అటుపైని రాజ్యభారం కుటుంబభారం అంతా దుష్యంతుడు అతడికి అప్పగిస్తాడు. అప్పుడు నీ భర్తతో కలిసి నువ్వు ఈ ప్రశాంతమైన ఆశ్రమంలోకి మళ్ళీ అడుగిడుదువుగాని.

**విశేషాలు:** చత్వారః అంతాః యస్యాస్సా – చతురంతా చ సా మహీ = సమస్త మహీ – కాటయ. విశేషణేన విశేష్యప్రతిపత్తిః. చత్వారః సముద్రాః అంతా యస్యాస్సా – రాఘవభట్టు); అప్రతిరథమ్ అన్నచోట రథ శబ్దేన రథికో లక్ష్యతే. న విద్యతే ప్రతిరథికః = ప్రతివీరః యస్య = అప్రతిరథః = శత్రువీరుడు లేనివాడు – అని శ్రీనివాసాచార్య కాటయవేముల సమన్వయం. రాఘవభట్టు మాత్రం – మాత్రార్థే చాభిముఖ్యే చ ప్రతిదానాదిషు ప్రతి – అనే విశ్వనిఘంటువుని అనుసరించి ప్రతి = సమ్ముఖః. న విద్యతే సమ్ముఖః రథః యస్య = అప్రతిరథః. ప్రతిపక్షాభావాత్. శత్రుపక్షమే లేకపోవడంతో ఇక తనకు ఎదురుపడే రథం లేనివాడు అని సమర్థించాడు. తనయం ప్రసూయకి బదులు నివేశ్య అని కాటయ రాఘవుల పాఠం. నివేశః స్యాద్వివాహే చ వేశనే సదనేఽపిచ – అని భాగురి నిఘంటువు. తనయమ్ – నివేశ్య = వివాహ్యా. పుత్రుడికి

**గౌతమీ : జాదే, పరిహీఅది గమణవేళా. ణివత్తేహి పిదరం. (కాశ్యపం విలోక్య) చిరేణ వి పుణో పుణో ఏసా ఏవ్వం మంతఇస్సాది. ణివత్తదు భవం. (జాతే! పరిహీయతే గమనవేళా, నివర్తయ పితరమ్. చిరేణాపి పునఃపునరేషైవం మంత్రయిష్యతే. నివర్తతాం భవాన్!)**

**కాశ్య : వత్సే! ఉపరుధ్యతే తపోఽనుష్ఠానమ్.**

**శకు : (భూయః పితరమాశ్లిష్య) తవచ్చరణపీడిదం తాదసరీరమ్. తామా అదిమేత్తం మమ కిదే ఉక్కంఠితుమ్. (తపశ్చరణ పీడితం తాతశరీరమ్. తన్మాతిమాత్రం మమ కృతే ఉత్కంఠితుమ్)**

---

పెళ్ళి చేసి కుటుంబభారం అప్పగించి అంటూ కాటయవేముని సమన్వయం. నివేశ్య = స్థాపయిత్వా. అర్థాత్ మహీసపత్న్యాం స్థాపయిత్వా = అభిషేకించి అనే భావంలో సాగింది రాఘవభట్టు వ్యాఖ్య. ఈయన శాంతే = ప్రకరణానుసారాత్ వయసీతి గమ్యతే అన్నాడు. వార్ధక్యం వచ్చాక అని భావం. రాగ ద్వేషాదిరహితే ఆశ్రమపదే అన్నాడు శ్రీనివాసాచార్య. తత్సన్నివేశితధురేణ సహైవ భర్త్రా శాంత్యై కరిష్యసి పదమ్ – అనే పాఠాంతరమూ ఉంది.

**పరిహీఅది:** జాతే = పుత్రీ! గమనవేళా = బయలుదేరవలసిన సమయం, పరిహీయతే = సమీపిస్తోంది. పితరమ్ = తండ్రి కాశ్యపుణ్ని, నివర్తయ = వెనక్కి పంపించు. (కాశ్యపం విలోక్య = కణ్వుడి వైపు తిరిగి), చిరేణ + అపి =ఎంతసేపయినా, ఏషా = ఈ శకుంతల, ఏవమ్ = ఇలా, పునఃపునః = మళ్ళీ మళ్ళీ, మంత్రయిష్యతే = మాట్లాడుతూనే ఉంటుంది. అంపకాలు పెడుతూనే ఉంటుంది. భవాన్ = నువ్వు, నివర్తతామ్ = మళ్ళు!

**ఉపరుధ్యతే:** వత్సే = బిడ్డా! తపః + అనుష్ఠానమ్ = తపస్సు ఆచరణ, ఉపరుధ్యతే = అడ్డగింపబడుతోంది. అనుష్ఠానానికి ఆలస్యమవుతోందని.

**తవచ్చరణ:** (భూయః = మళ్ళీ, పితరమ్ + ఆశ్లిష్య = తండ్రిని పొదువుకొని) తాత శరీరమ్ = తండ్రి తనువు, తపశ్చరణ – పీడితమ్ = తపోఽనుష్ఠానంతో నీరసించింది. తత్ = కాబట్టి, మమ – కృతే = నా కోసమని, అతిమాత్రమ్ = మరింతగా, ఉత్కంఠితుమ్ = ఉద్వేగపరచి, మా = వద్దు. ఉద్వేగపరచను – ఉద్వేగపరచి చాలు అనడం. (ఇక్కడ తుమున్ ప్రత్యయం క్త్వార్థకం 'క్త్వస్తుమత్తూణ తు ఆణాః' ఇతి క్త్వప్రత్యయస్య తుమాదేశః. ఉత్కంఠయా అలమిత్యర్థః – రాఘవభట్టు).

కాశ్య : (సనిఃశ్వాసమ్)

**శమమేష్యతి మమ శోకః**
**కథం ను వత్సే త్వయా రచితపూర్వమ్**
**ఉటజద్వార విరూఢం**
**నీవారబలిం విలోకయతః** **21**

**గచ్ఛ! శివాస్తే పంథానస్సంతు!!**

**(నిష్క్రాంతాః శకుంతలా సహయాయినశ్చ)**

సఖ్యౌ : **(శకుంతలాం విలోక్య) హద్ధీ! హద్ధీ! అంతలిహిదా సఉందళా వణరాఈఏ. (హాధిక్! హాధిక్! అంతర్హితా శకుంతలా వనరాజ్యా!!)**

---

**శమమేష్యతి:** (సనిఃశ్వాసమ్ = నిట్టూర్చి) వత్సే = తనయా! త్వయా = నీచేత, రచిత పూర్వమ్ = మునుపు కట్టబడినదీ, ఉటజద్వార = కుటీరం గుమ్మందగ్గర, విరూఢమ్ = మొలకలెత్తినదీ అయిన, నీవారబలిమ్ = నివ్వరి(కంకుల) ధాన్యపు పూజను, విలోకయతః = నిత్యమూ చూస్తుండే, మమ = నాకు, శోకః = దుఃఖం, కథమ్ – శమమ్ – ఏష్యతి = ఎలా ఉపశమిస్తుంది?! (విరూఢస్తు సంజాతాంకురితేஉన్యవత్ – ఇతి విశ్వః)

**తాత్పర్యం:** తల్లీ! నువ్వు నా కుటీరం గుమ్మం దగ్గర నివ్వరికంకుల గుత్తిని పిట్టలకు బలిగా వ్రేలగట్టావు. ఆ గింజలు చెదిరిపడి చుట్టుపక్కల మొలకలెత్తాయి. నిత్యమూ వాటిని చూస్తుండే నాకు అనుక్షణం నువ్వే గుర్తువస్తుంటే ఇక దుఃఖం ఎలా ఉపశమిస్తుంది?! (నివ్వరి ధాన్య మడరి కలయ మొలచిన మొలకలు గనగ వితతశోకోపశమన మే గతిని గలుగు? – కందుకూరి)

**గచ్ఛ:** గచ్ఛ = వెళ్ళు. తే = నీ, పంథానః = దారులు, శివాః = మంగళ ప్రదాలు, సంతు = అగుగాక!! (నీకు మార్గమున మేలగుగాక – కందుకూరి) (శకుంతలా = శకుంతలయూ, సహయాయినశ్చ = వెంటవెళ్ళేవారూ, నిష్క్రాంతాః = నిష్క్రమిస్తారు)

**హద్ధీ:** (శకుంతలామ్ – విలోక్య = నిర్గమిస్తున్న శకుంతలను చూస్తూ) హాధిక్ – హాధిక్ = అయ్యో! అయ్యో! వనరాజ్యా = వనరాజి చేత = తరుసమూహం చేత, శకుంతల, అంతర్హితా = కనుమరుగయ్యింది. వనవీథిలో కనుచూపు మేర దాటిపోయిందని.

**కాశ్య : (సనిఃశ్వాసమ్) అనసూయే! గతవతీ వాం సహధర్మచారిణీ. నిగృహ్య శోకమనుగచ్ఛతం మాం ప్రస్థితమ్.**

**ఉభౌ : తాద, సఉందలావిరహిదం సుణ్ణం విఅ తవోవణం కహం పవిసావో? (తాత! శకుంతలా విరహితం శూన్యమివ తపోవనం కథం ప్రవిశావః?)**

**కాశ్య : స్నేహ ప్రవృత్తి రేవం దర్శినీ. (సవిమర్శం పరిక్రమ్య). హంత భోః! శకుంతలాం పతికులం విసృజ్య లబ్ధమిదానీం స్వాస్థ్యమ్. కుతః –**

**అర్థో హి కన్యా పరకీయ ఏవ**
**తామద్య సంప్రేష్య పరిగ్రహీతుః**

---

**గతవతీ:** (సనిఃశ్వాసమ్ = నిట్టూరుస్తూ) అనసూయా! వామ్ = మీ, సహధర్మచారిణీ = జతబాయని నెచ్చెలి (స్వభావాలు కలిసిన ప్రియసఖి), గతవతీ = వెళ్ళింది. శోకమ్ + నిగృహ్య = దుఃఖం అదుపుచేసుకొని, ప్రస్థితమ్ = బయలుదేరిన, మామ్ = నన్ను, అనుగచ్ఛతమ్ = అనుసరించండి! మీరూ శోకం దిగమింగుకోండి – అని.

**తాద:** తాత = తండ్రీ! శకుంతలా – విరహితమ్ = శకుంతలలేని, శూన్యమ్ + ఇవ = బోసిపోయినట్లున్న, తపోవనమ్ = ఆశ్రమాన్ని, కథమ్ + ప్రవిశావః = (ఎలా ప్రవేశించేది ఎలా ప్రవేశించగలం) ఎలా ప్రవేశిస్తాం?!

**స్నేహ:** స్నేహ ప్రవృత్తిః = మైత్రీ స్వభావం, ఏవమ్ + దర్శినీ = ఇలానే అనిపిస్తుంది. (సవిమర్శమ్ = సవిచారం, పరిక్రమ్య = ముందుకు నడిచి, సాలోచనగా నాలుగడుగులు వేసి). హంత–భోః = హమ్మయ్య!

శకుంతలామ్ = శకుంతలను, పతికులం విసృజ్య = పెనిమిటి ఇంటికి పంపి, ఇదానీమ్ = ఇప్పుడు, స్వాస్థ్యమ్ లబ్ధమ్ = స్వస్థత లభించింది. కుతః = ఎందుకంటే,

**అర్థోహి:** కన్యా = కన్నియ, పరకీయః + అర్థః + ఏవ – హి = పరాయి సొత్తే కదా! ఎప్పటికయినా ఒక అయ్య చేతిలో పెట్టవలసినదే – అనడం. తామ్ = అలాంటి శకుంతలను, అద్య = ఈపూట, పరిగ్రహీతుః = పరిగ్రహించిన వాని చెంతకు, సంప్రేష్య = పంపించివేసి, మమ = నా, అయమ్ =ఈ, ఆత్మా = అంతరంగం, ప్రత్యర్పితన్యాసః

**జాతో మమాయం విశదః ప్రకామం**
**ప్రత్యర్పితన్యాస ఇవాంతరాత్మా.** **22**

**(ఇతి నిష్క్రాంతాస్సర్వే)**

**–: ఇతి చతుర్థోఽంకః :–**

---

+ ఇవ = న్యాసాన్ని (ఉపనిధి) ప్రత్యర్పణ చేసినదానిలాగా, ప్రకామమ్ = అత్యంతమూ, విశదః + జాతః = తేటపడింది. (కుదుటపడి కలత దేరి విమలమై ప్రసన్నమయ్యింది).

**తాత్పర్యం:** కన్నియ ఏనాటికైనా పరాయి సొత్తే. ఎప్పుడో ఒకప్పుడు ఒక అయ్య చేతిలో పెట్టవలసిందే. ఇవ్వేళ నేను శకుంతలను పెనిమిటి చెంతకు సాగనంపి కుదుటపడ్డాను. న్యాసంగా పెట్టిన సొత్తును ఆ పెట్టినవాడికి తిరిగి ఇచ్చేసినట్టుగా (దాపెట్టిన వస్తువును దాపెట్టినవాడికి తిరిగి అప్పగించినట్టుగా) ఇప్పుడు నా అంతరాత్మ కలతదేరి పూర్తిగా నిర్మలమయ్యింది.

(ఇతి = అని, సర్వే = అందరూ, నిష్క్రాంతాః = నిష్క్రమిస్తారు)

–: ఇది నాల్గవ అంకం :–

# పంచమోఽంకః

(తతః ప్రవిశత్యాసనస్థో రాజా విదూషకశ్చ)

**విదూ : (కణ్ణం దత్త్వా) భో! వఅస్స! సంగీదసాలంతరే అవహాణం దేహి. కళవిసుద్ధాఏ గీదీఏ సరజోఓ సుణీయది. జాణే తత్తహోదీ హంసవదిఆ వణ్ణపరిఅఅం కరే దిత్తి. (భో! వయస్య!! సంగీత శాలాంతరే అవధానం దేహి. కలవిశుద్ధాయాం గీత్యాం స్వరయోగః శ్రూయతే. జానే తత్రభవతీ హంసపదికా వర్ణపరిచయం కరోతీతి)**

**రాజా : తూష్ణీం భవ. యావదాకర్ణయామి.**

**(ఆకాశే గీయతే)**

---

(తతః = అంతట, ఆసనస్థః + రాజా = ధర్మాసనం మీద కూర్చున్న రాజూ, ప్రవిశతి = ప్రవేశిస్తాడు, విదూషకశ్చ – ప్రవిశతి = విదూషకుడూ ప్రవేశిస్తాడు)

**సంగీద:** (కర్ణమ్ + దత్త్వా = చెవి ఒగ్గి ఆలకించి) భో! వయస్య! = ఓయీ మిత్రమా! సంగీతశాలాంతరే = సంగీతశాలవైపు, అవధానమ్ + దేహి = ధ్యాస పెట్టు. కల – విశుద్ధాయామ్ = అవ్యక్తమధురమూ విశుద్ధమూ అయిన, గీత్యామ్ = పాటలో (లయ విశుద్ధాయాః గీతేః – పాఠాంతరం), స్వరయోగః = స్వరసంయోగం, శ్రూయతే = వినపడుతోంది. తత్రభవతీ = మాన్యురాలు, హంసపదికా = హంసపదిక, వర్ణపరిచయమ్ + కరోతి + ఇతి = వర్ణం అనే గీతిభేదాన్ని అభ్యాసం చేస్తోందని, జానే = భావిస్తాను. (కల విశుద్ధాయా గీతేః = విశుద్ధమనే గీతియొక్క స్వరసంయోగం వినిపిస్తోంది. గీతయః పంచ శుద్ధాఖ్యా భిన్నా గౌడా నివేసరా సాధారణీ. విశుద్ధా స్యాదవక్రై ర్లలితైః స్వరైః. గానక్రియోచ్యతే వర్ణః స చతుర్ధా నిరూపితః స్థాప్యారోహ్యావ రోహీ చ సంచారీ – రాఘవభట్టః)

**తూష్ణీమ్:** తూష్ణీమ్ + భవ = గమ్మున ఉండు. యావత్ + ఆకర్ణయామి = నేను ఆలకిస్తాను. (యావదితి వాక్యాలంకారే).

(ఆకాశే = తెరవెనుక ఆకాశంలో, గీయతే = పాడబడుతుంది)

అహిణవమహులోలుపో భవం తహ పరిచుంబిఅ చూఅమంజరిం
కమలవసఇమేత్త ణివ్వుదో మహుఅర విహ్మరిఓ సి ణం కహం?

అభినవమధులోలుపో భవాన్
తథా పరిచుంబ్య చూతమంజరీమ్
కమల వసతిమాత్ర నిర్వృతో
మధుకర! విస్మృతోఽస్యేనాం కథమ్? **01**

రాజా : అహో! రాగపరివాహినీ గీతిః!!

విదూ : కిం దావ గీదీఏ అవగఓ అక్ఖరత్థో? (కిం తావత్ గీత్యా అవగతోఽక్ష రార్థః?)

రాజా : (స్మితం కృత్వా) సకృత్కృతప్రణయోఽయం జనః. తస్యా దేవీం వసుమతీమంతరేణ మదుపాలంభమవగతోఽస్మి. సఖే! మాధవ్య! మద్వచనాదుచ్యతాం హంసపదికా. నిపుణముపాలబ్ధః అస్మీతి.

---

**అహిణవ:** మధుకర =ఓ తుమ్మెదా! అభినవ – మధు – లోలుపః = క్రొత్త మకరందానికి లుబ్ధుడవై, భవాన్ = నీవు, చూతమంజరీమ్ = మామిడిపూగుత్తిని, తథా = అలా (తనివితీరా), పరిచుంబ్య = ముద్దాడి (ఆస్వాదించి), కమల = (ప్రాతదే అయిన) కమలంలో, వసతి మాత్ర = కేవలం నివాసమాత్రంతో, నిర్వృతః = సంతుష్టుడవై, ఏనామ్ = ఈ చూతమంజరిని, విస్మృతః = మరిచినవాడవు, కథమ్ + అసి = ఎలా అయ్యావు? (మధువ్రతే మధుకరః కాముకేఽపి ప్రకీర్తితః)

**తాత్పర్యం:** తుమ్మెదా! కొత్త మధువులు కోరే నువ్వు చూతమంజరిని అప్పుడు అలా తనివితీరా చుంబించావు. ఇప్పుడు – కమలంలో నివాసమాత్రంతో సంతుష్టుడివవుతున్నావు. ఈ చూతమంజరిని ఎలా మరిచిపోయావు?

**అహో:** అహో = ఆహా! గీతిః = ఈ పాట, రాగపరివాహినీ = రాగం వెల్లువ!!

**కిం దావ:** తావత్ = ఇంతకీ, గీత్యాః = పాటతాలూకు, అక్షర + అర్థః = అక్షరాల అర్థం (అంతర్గతభావం), అవగతః + కిమ్ = బోధపడిందా?

**సకృత్:** (స్మితమ్ + కృత్వా = చిరునవ్వు విసిరి) అయమ్ = ఈ, జనః = వ్యక్తి, సకృత్ = ఒకే ఒక్కసారి, కృతప్రణయః = చేయబడిన ప్రణయం కలది. ఈమెతో అప్పుడెప్పుడో

**విదూ : జం భవం ఆణవేది. (ఉత్థాయ) భో వఅస్స! గహీదస్స తాఏ పరకీఏహిం హత్థేహిం సిహండఏ తాడీఅమాణస్స అచ్ఛరాఏ వీదరాఅస్స విఅ ణత్థి దాణిం మే మోక్ఖో. (యద్భవానాజ్ఞాపయతి. భో! వయస్య! గృహీతస్య తయా పరకీయైః హస్తైః శిఖండకే తాడ్యమానస్యాప్సరసా వీతరాగస్యేవ నాస్తీదానీం మే మోక్షః).**

**రాజా : గచ్ఛ! నాగరికవృత్త్యా సంజ్ఞాపయైనామ్.**

---

ఒకసారి మాత్రమే ప్రణయం నెరపాను – పరిచుంబితా – ఆస్వాదించాను అనడం. అటుపైని ఈమెను మరి తాకలేదు. పట్టమహిషి వసుమతితోనే ఉండిపోయి నిర్వృతి చెందుతున్నాను – కమలవసతి మాత్ర నిర్వృతః. హంసపదిక = చూతమంజరి. వసుమతి = కమలం. దుష్యంతుడికి ఇలా అర్థమయ్యింది. దేవీమ్ – వసుమతీమ్ + అంతరేణ = వసుమతీదేవి వంకతో ఇది, తస్యాః = హంసపదిక (యొక్క) చేసిన, మత్ + ఉపాలంభమ్ = నన్ను గూర్చిన నింద అని, అవగతః + అస్మి = అర్థం చేసుకున్నాను. సఖే = మిత్రుడా! మాధవ్యుడా! నిపుణమ్ = నేర్పుగా, ఉపాలబ్ధః + అస్మి = నిందింపబడ్డవాడనయ్యాను, ఇతి = అని, మత్ + వచనాత్ = నా మాటగా, హంసపదికా = హంసపదిక, ఉచ్యతామ్ = చెప్పబడుగాక! "నేర్పుగా నన్ను నిందించావు" అని నేను అన్నానని, నువ్వు వెళ్ళి హంసపదికకు చెప్పిరా – అనడం.

**విశేషాలు:** నిజానికి ఇక్కడ కవి ఉద్దేశించింది: చూతమంజరి = శకుంతల. కమలవసతి = అంతఃపుర నివాసమాత్ర సంతుష్టుడు దుష్యంతుడు. శాపం వల్ల శకుంతలను మరచిన మనసు ఆరాటపడుతూనే ఉంది. అంతఃపురంలో ఉంటున్నాడే తప్ప అంతకన్నా సుఖపడుతున్నది ఏమీ లేదని.

**జం భవం:** యత్ + భవాన్ + ఆజ్ఞాపయతి = తమరు ఆజ్ఞాపించినట్టే! (ఉత్థాయ = కూర్చున్నచోటు నుంచి లేచి) ఓయీ మిత్రమా! తయా = ఆ హంసపదికచే, గృహీతస్య = బంధింపబడ్డవాడనై, పరకీయైః = ఇతర పురుషుల (సేవకుల), హస్తైః = చేతులతో, శిఖండకే = పిలకమీద, తాడ్యమానస్య = తాడింపబడుతున్నవాడనై, అప్సరసా = ఒక అప్సరసచేత బంధింపబడ్డ, వీతరాగస్య + ఇవ = ఒక విరక్తుడికి లాగా, మే = నాకు, ఇదానీమ్ = ఇప్పుడు, మోక్షః + నాస్తి = ముక్తి లేదు. మిత్రమా! నువ్వు చెప్పమన్న ముక్క నేనిప్పుడు వెళ్ళి చెబితే ఆవిడ నన్ను కచ్చితంగా తన్నిస్తుంది. నాకు మోక్షం = విడుదల ఉండదు – అని మాధవ్యుడి భయం.

**విదూ : కా గఈ? (ఇతి నిష్క్రాంతః). (కా గతిః?)**

**రాజా : (ఆత్మగతమ్) కిం ను ఖలు గీతార్థమాకర్ణ్య ఇష్టజనవిరహాదృతేఽపి బలవదుత్కంఠితోఽస్మి? అథవా –**

**రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్**
**పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః**
**తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం**
**భావస్థిరాణి జననాంతరసౌహృదాని. 02**

**(ఇతి పర్యాకులస్తిష్ఠతి)**

**(తతః ప్రవిశతి కంచుకీ)**

---

**నాగరిక:** గచ్ఛ = వెళ్లు. నాగరికవృత్త్యా = నేర్పరితనంతో, ఏనామ్ = ఈమెను, సంజ్ఞాపయ = విన్నవించు. హంసపదికకు నేర్పుగా తెలియపరుచు అని. (నగరాత్ కుత్స్నప్రావీణ్యయోః = నాగరకః, నాగరికః = ప్రవీణః)

**కా గఈ:** కా + గతిః = ఏది దారి! రాజాజ్ఞ. చేయక తప్పదు – అని. (ఇతి = అని, నిష్క్రాంతః = నిష్క్రమిస్తాడు)

**కిం ను:** (ఆత్మగతమ్ = తనలో) కిమ్ – ను – ఖలు = ఇదేమోగానీ, గీతార్థమ్ + ఆకర్ణ్య = ఈ గీతాన్నీ దీని అర్థాన్నీ ఆలకించాక, ఇష్టజన – విరహాత్ – ఋతే + అపి = ప్రియమైన వ్యక్తుల ఎడబాటు ఏదీ లేనివాడనే అయినప్పటికీ, బలవత్ = మిక్కిలిగా (తీవ్రంగా) ఉత్కంఠితః + అస్మి = వ్యాకులితుణ్ని అవుతున్నాను. అథవా = అవునులే –

**రమ్యాణి:** రమ్యాణి = అందమైనవాటిని, వీక్ష్య = చూసీ; మధురాన్ = చెవులకింపైన, శబ్దాన్ = (పదాలనూ పాటలనూ) ధ్వనులను, నిశమ్య + చ = వినీ, సుఖితః + అపి + జంతుః = అప్పటికి హాయిగానే ఉన్న ప్రాణి సైతం, పర్యుత్సుకః + భవతి + యత్ = వ్యాకులితుడవుతున్నాడంటే, తత్ = అది, అబోధపూర్వమ్ = మునుపు ఎరుకపడనిదానిని, నూనమ్ = కచ్చితంగా, చేతసా + స్మరతి = మనసా స్మరిస్తున్నాడన్నమాట. జననాంతర – సౌహృదాని = మునుపటి పుట్టువులలోని చెలికారాలు, భావస్థిరాణి = అంతరంగాలలో శాశ్వతాలు.

**కంచుకీ : అహోను ఖల్వీదృశీమవస్థాం ప్రతిపన్నోఽస్మి!!**

**ఆచార ఇత్యవహితేన మయా గృహీతా**
**యా వేత్రయష్టిరవరోధ గృహేషు రాజ్ఞః**
**కాలే గతే బహుతిథే మమ సైవ జాతా**
**ప్రస్థానవిక్లబగతేరవలంబనార్థా!! 03**

---

**తాత్పర్యం:** నాకు ఏ విరహమూ లేదు. కానీ హంసపదిక పాట విన్నాక మనసెందుకో కలత చెందుతోంది. అందమైన వస్తువులను చూసినప్పుడుగానీ, మధురమైన శబ్దాలను విన్నప్పుడు గానీ ఒక వ్యక్తి ఉత్కంఠితుడవుతున్నాడంటే అతడు మునుపు ఇదమిత్థంగా ఎరుకపడని దానిని దేనినో మనసా స్మరిస్తున్నాడన్నమాట. ఇది నిశ్చయం (నూనమ్). జన్మాంతర సౌహృదాలు వాసనారూపంలో అంతరంగాలలో శాశ్వతాలు!! (మనోహి జన్మాంతర సంగతిజ్ఞమ్. రఘు 7-15)

**విశేషాలు:** జంతుః నూనం భావస్థిరాణి జననాంతర సౌహృదాని అబోధపూర్వం చేతసా స్మరతి ఇత్యుత్ప్రేక్షతే ఇత్యనుసంధేయమ్ – అని సమన్వయించి అనేన రాజ్ఞః శకుంతలాస్నేహః జన్మాంతరవత్ తిరోహిత ఇతి సూచితమ్ – అన్నాడు కాటయవేముడు. ఈ శ్లోకంలోని చివరిపాదాన్ని సమర్థిస్తూ రసాలంకార యోగశాస్త్రాలను ప్రస్తావించి రాఘవభట్టు సుదీర్ఘ చర్చ చేశాడు. జాతిదేశకాల వ్యవహితా నామప్యానంతర్యం స్మృతిసంస్కారయో రేకరూపత్వాత్ – ఇతి సూత్రమ్. మనోహి జన్మాంతర సంగతిజ్ఞమ్ (రఘువంశ 7-15). ఔత్సుక్యలక్షణం (రసార్ణవ) సుధాకరే – "కాలాక్షమత్వమౌత్సుక్యమిష్ట వస్తువియోగతః తద్దర్శన గ్రామ్యవస్తుదిదృక్షాదేశ్చ" ఇతి. క్వచిత్ "భావస్థితాని" ఇతి పాఠః. సోఽపి సాంప్రదాయిక ఏవ. పర్యాకుల ఇతి విరహిత్వాత్. సత్యపి శాపే స్థాయిన్యా రతేరవిచ్ఛిన్నార్థమ్ ఏతాదృగుక్తిః. ఏవమగ్రేఽపి జ్ఞేయమ్ – అన్నాడు.

(ఇతి = అని, పర్యాకులః + తిష్ఠతి = మనసు బాగోనివాడై ధర్మాసనం నుంచి లేచి నిలుచుంటాడు)

(తతః = అంతట, కంచుకీ = కంచుకి, ప్రవిశతి = ప్రవేశిస్తాడు)

**అహోను:** అహో – ను – ఖలు = ఏమి ఆశ్చర్యం! ఏమి ఆశ్చర్యం!! ఈదృశీమ్ = ఇలాంటి, అవస్థామ్ = దశను, ప్రతిపన్నః + అస్మి = పొందాను. (యే నిత్యం

**భోః కామం ధర్మకార్యమనతిపాత్యం దేవస్య. తథాపీదానీమేవ ధర్మాసననాదుత్థితాయ పునరుపరోధకారి కణ్వశిష్యాగమనమస్మై నోత్సహే నివేదితుమ్. అథవావిశ్రమోఽయం లోకతంత్రాధికారః. కుతః–**

---

సత్యసంపన్నాః కామదోషవివర్జితాః జ్ఞానవిజ్ఞానకుశలాః కంచుకీయాస్తు తే స్మృతాః – మాతృగుప్తాచార్యైరుక్తం కంచుకి లక్షణమ్ – రాఘవభట్టః)

**ఆచార:** రాజ్ఞః = రాజుగారి, అవరోధ – గృహేషు = అంతఃపురమందిరాలలో, ఆచారః + ఇతి = (కేవలం) నియమం అని, అవహితేన = (సమర్థుడనూ) సావధానుడనైన, మయా = నాచేత, గృహీతా = స్వీకరింపబడిన, యా – వేత్రయష్టిః = ఏ చేతికర్ర కలదో, సా + ఏవ = అదే, బహుతిథే = బహుత్వపూరకమైన, కాలే – గతే + సతి = కాలం గడవగా, (బహుపూగణసంఘస్య తిథుక్), ప్రస్థాన = గమనారంభంలో – సంచారంలో, విక్లబగతేః = తడబడే నడకకలవాడనైన, మమ = (వయసు మీద పడ్డ) నాకు, అవలంబనార్థా = ఆధారప్రయోజనంగా – చేయూతగా, జాతా = అయ్యింది.

**తాత్పర్యం:** వంశపారంపర్యంగా వచ్చిన ఈ కంచుకి ఉద్యోగంలోకి నేను చేరిన పడుచువయసులో కేవలం ఒక నియమమనీ ఆచారమనీ ఈ చేపాటి కర్రను పట్టుకొన్నాను. ఇది పట్టుకొని అంతఃపురగృహాలలో కావలి తిరుగుతూ బహుకాలం గడిచింది. వయసు మీదపడింది. ఇప్పుడు విధి నిర్వహణగా పహరా తిరుగుతూంటే నడక తడబడుతోంది. లేవాలన్నా కూచోవాలన్నా ఇబ్బందిగా ఉంది. అలనాడు ఆచారంగా చేపట్టిన ఈ కర్ర ఇప్పుడు ఇదే నాకు చేయూత అయ్యింది. (అప్పుడు అలంకారం. ఇప్పుడు అవసరం!!)

**భోః కామం:** భోః = ఓహో! కామం = మిక్కిలి, ధర్మకార్యమ్ = ధర్మకార్యనిర్వహణ అనేది, దేవస్య = ప్రభువుకు, అనతిపాత్యమ్ = అతిక్రమింపరానిది. తథా + అపి = అయినప్పటికీ, ఇదానీమ్ + ఏవ = ఇప్పుడే, ధర్మాసనాత్ = ధర్మాసనం నుంచి, ఉత్థితాయ = లేచినవాడైన, అస్మై = ఈ మహారాజుకు, పునః + ఉపరోధకారి = మళ్ళీ అవరోధం కల్పించే, కణ్వశిష్య + ఆగమనమ్ = కణ్వశిష్యుల రాకను (వచ్చారన్న సమాచారాన్ని), నివేదితుమ్ = విన్నవించడానికి, న + ఉత్సహే = ఉత్సాహపడను – మనసొప్పడం లేదు. అథవా = అయినా, అయమ్ = ఈ, లోకతంత్ర + అధికారః

**భానుః సకృద్యుక్తతురంగ ఏవ**
**రాత్రిందివం గంధవహః ప్రయాతి**
**శేషస్సదైవాహితభూమి భారః**
**షష్ఠాంశవృత్తేరపి ధర్మ ఏషః** **04**

---

= లోకంలో అతిప్రధానమైన అధికారం (తంత్రం ప్రధానే సిద్ధాంతే – అమరం) ప్రజారక్షణాధికారం, అవిశ్రమః = విశ్రాంతి లేనిదే. ప్రధానాధికారి – రాజుకి విశ్రాంతి ఉండదు – అని. కుతః = ఎందువల్లనంటే –

**భానుః:** భానుః = సూర్యుడు, సకృత్ + ఏవ = ఒక్కసారి మాత్రమే, యుక్త – తురంగః = రథానికి పూన్చిన గుర్రాలు కలవాడు. మరి విప్పలేదు కాబట్టి మళ్ళీ పూన్చడం ఉండదు. అందుకని "సకృదేవ" అన్నాడు. పూన్చిననాటినుండి నేటిదాకానూ – ఇకముందూను – పరుగిడుతూనే ఉన్నాడు – అవిశ్రాంతంగా అని. గంధవహః = వాయువు, రాత్రిందివమ్ = రేయీ పగలూ, ప్రయాతి = వీస్తూనే ఉన్నాడు – అవిశ్రాంతంగా. శేషః = ఆదిశేషుడు, సదా + ఏవ = అనుక్షణమూ అవిశ్రాంతంగా, ఆహితభూమిభారః = వహింపబడుతున్న భూభారం కలవాడే– మోస్తూనే ఉన్నాడని. షష్ఠ + అంశవృత్తేః + అపి = ఆరవ పాలు కప్పంతో (స్వీకరించి) ప్రవర్తించేవాడికి అంటే రాజుకి కూడా (షష్ఠాంశేన వర్తనం వృత్తిః యస్య), ఏషః = ఇదే – అవిశ్రాంతంగా భూభారం వహించడమే – పాలించడమే, ధర్మః = ధర్మం.

**తాత్పర్యం:** సూర్యుడు – క్షణం ఆగని గుర్రాలతో అవిశ్రాంతంగా ప్రయాణం సాగిస్తూనే ఉన్నాడు. రేయింబవళ్లు గాలి వీస్తూనే ఉంది. బుజం మార్చకుండా శేషుడు భూమిని మోస్తూనే ఉన్నాడు. రాజుకి కూడా ఇంతే అవిశ్రాంతంగా పరిపాలన సాగించడమే – ధర్మం.

**యావత్:** యావత్ = సరే, నియోగమ్ = నా కర్తవ్యాన్ని (నేను దేనికి నియోగింపబడ్డానో దానిని), అనుతిష్ఠామి = ఆచరిస్తాను. మునులు వచ్చారన్న సంగతి నివేదిస్తానని. (పరిక్రమ్య = ముందుకు నడచి, అవలోక్య – చ =చూసి). ఏషః = ఇడిగో, దేవః = మహారాజు –

**ప్రజాః:** ప్రజాః = ప్రజలను, స్వాః + ప్రజాః + ఇవ = తన బిడ్డలలాగా, తంత్రయిత్వా = (సంరక్షించి)వారి వారి పనులలో నియమించి; అశాంతమనాః = మనశ్శాంతిలేనివాడై; యూథాని = ఘటలను (ఘటా = గజానాం సమూహః), సంచార్య = అడవిలో

**యావన్నియోగమనుతిష్ఠామి (పరిక్రమ్యావలోక్యచ) ఏషదేవః**

**ప్రజాః ప్రజాః స్వా ఇవ తంత్రయిత్వా**
**నిషేవతేఽ శాంతమనా వివిక్తమ్**
**యూథాని సంచార్య రవిప్రతప్తః**
**శీతం దివా స్థానమివ ద్విపేంద్రః** **05**

**(ఉపగమ్య) జయతు, జయతు దేవః. ఏతే ఖలు హిమగిరేరుపత్య కారణ్యావాసినః కాశ్యపసందేశమాదాయ సస్త్రీకాస్తపస్వినః సంప్రాప్తాః. శ్రుత్వా దేవః ప్రమాణమ్.**

---

స్వేచ్ఛగా సంచరింపజేసి, రవిప్రతప్తః = సూర్యుడి వేడిమి గొన్నవాడై (అశాంతమనాః = ఆ కారణంగా మనశ్శాంతి కోల్పోయినవాడై), దివా = మధ్యాహ్నవేళ (పట్టపగలు), శీతమ్ + స్థానమ్ = ఒక శీతల ప్రదేశాన్ని – చల్లటి తావును, ద్విపేంద్రః + ఇవ = (ఆశ్రయించే) గజరాజులాగా, వివిక్తమ్ = ఏకాంతాన్ని (విజన ప్రదేశాన్ని), నిషేవతే = ఆశ్రయిస్తున్నాడు.

**తాత్పర్యం:** ప్రజలను సొంత బిడ్డలలాగా పరిపాలిస్తూ (అలసిపోయి) ఈ మహారాజు ప్రస్తుతం ఏ కారణంగానో మనశ్శాంతి లేనివాడై ఏకాంతాన్ని ఆశ్రయిస్తున్నాడు. ఇది ఎలా ఉన్నదంటే – తన తోడి ఏనుగుల గుంపును అడవిలో స్వేచ్ఛగా తిరగనిచ్చి ఆ గుంపునకు అధిపతియైన గజరాజు ఎండ వేడికి అలసి (తప్తః) మనశ్శాంతి కోల్పోయి మిట్ట మధ్యాహ్నం చల్లని నీడను – శీతల ప్రదేశాన్ని – ఆశ్రయించినట్టు ఉంది.

**విశేషాలు:** నిషేవతే శాంతమనాః అని అవగ్రహం లేని పాఠం కొన్ని ప్రతులలో కన్పిస్తోంది (కాటయ శ్రీనివాస). శాంతమనాః = మనశ్శాంతి కలవాడు. ఇది దుష్యంతుడికి ప్రస్తుత పరిస్థితిలో సరిపోదు. ద్విపేంద్రుడికీ (ఉపమానం) సరిపోదు. అతడూ రవి ప్రతప్తుడు కనుక శాంతమనాః కాలేదు. (కందుకూరివారు శాంతమనాః పాఠమే స్వీకరించి స్వస్థచిత్తుడై – అన్నారు)

**జయతు:** (ఉపగమ్య = రాజును సమీపించి) దేవః = మహారాజు, జయతు జయతు = జయించుగాక! జయము జయము మహారాజా! – అనడం. హిమగిరేః = శీతాద్రికి ఉపత్యకా = సమీపంలోని, అరణ్యావాసినః = అడవిలో నివసించే, తపస్వినః = మునులు, సస్త్రీకాః = స్త్రీలతో కూడినవారు, కాశ్యపసందేశమ్ = కణ్వుడి సందేశాన్ని, ఆదాయ = తెచ్చి, ఏతే = వీరు, సంప్రాప్తాః + ఖలు = విచ్చేశారు సుమా! (ఉపత్యకా

**రాజా : (సాదరమ్) కిం కాశ్యపసందేశహారిణః?**

**కంచుకీ : అథ కిమ్.**

**రాజా : తేన హి మద్వచనాద్విజ్ఞాప్యతాముపాధ్యాయః సోమరాతః. అమూన్ ఆశ్రమవాసినః శ్రౌతేన విధినా సత్కృత్య స్వయమేవ ప్రవేశయితు మర్హతీతి. అహమప్యత్ర తపస్విదర్శనోచితే ప్రదేశే స్థితః ప్రతిపాలయామి.**

**కంచుకీ : యదాజ్ఞాపయతి దేవః (ఇతి నిష్క్రాంతః)**

**రాజా : (ఉత్థాయ) వేత్రవతి, అగ్నిశరణమార్గముపదేశయ.**

---

– అద్రేరాసన్నా భూమిః – అమరం). శ్రుత్వా = ఇది ఆలకించి, దేవః – ప్రమాణమ్ = ప్రభువే ప్రమాణమ్. వారిని ప్రవేశపెట్టాలా? వద్దా? ఆనతి ఇవ్వండి – ఆ నిర్ణయానికి ప్రమాణమ్ మీరే అని. (యత్కర్తవ్యం తజ్జానాసీత్యర్థః).

**కిం కాశ్యప:** (సాదరమ్ = ఆదరంగా) కిమ్ = ఏమీ, కాశ్యప – సందేశ – హారిణః = కాశ్యపుడి (సందేశం తెచ్చినవారా) దూతలా?

**అథ కిమ్:** అథకిమ్ = అవును!

**తేన హి:** తేన – హి = అలా అయితే, ఉపాధ్యాయః + సోమరాతః = ఉపాధ్యాయుడు సోమరాతుడు, మద్వచనాత్ = నా మాటగా, విజ్ఞాప్యతామ్ = విన్నవింపబడుగాక! సోమరాతుడికి ఇలా విన్నవించు – అనడం. అమూన్ = ఈ, ఆశ్రమవాసినః = మునులను, శ్రౌతేన – విధినా = వైదికపద్ధతిలో, సత్కృత్య = సత్కరించి, స్వయమ్ + ఏవ = స్వయంగా తానే, ప్రవేశయితుమ్ = ప్రవేశింపజెయ్యడానికి, అర్హతి + ఇతి = తగును అని. అహమ్ + అపి = నేను కూడా, అత్ర = ఇక్కడ, తపస్విదర్శన + ఉచితే = మునులను దర్శించడానికి సముచితమైన, ప్రదేశే = ప్రదేశంలో, స్థితః = ఉన్నవాడనై, ప్రతిపాలయామి = ఎదురుచూస్తుంటాను (నిరీక్షిస్తాను – అని).

**యదాజ్ఞా:** దేవః = ప్రభువు, యత్ + ఆజ్ఞాపయతి = ఆజ్ఞాపించినట్లే!

(ఇతి = అని, నిష్క్రాంతః = నిష్క్రమిస్తాడు.)

**వేత్రవతి:** (ఉత్థాయ = లేచి) వేత్రవతి = ఓ వేత్రవతీ! అగ్నిశరణ = అగ్నిహోత్రశాలకు, మార్గమ్ + ఉపదేశయ = దారి చూపుము. (వేత్రవతి – అనేది ప్రతీహారి పేరు).

ప్రతీహారీ : ఇదో ఇదో దేవో (ఇత ఇతో దేవః)

రాజా : (పరిక్రామతి. అధికారఖేదం నిరూప్య) సర్వః ప్రార్థితమర్థమధిగమ్య సుఖీ సంపద్యతే జంతుః. రాజ్ఞాం తు చరితార్థతా దుఃఖాంతరైవ, కుతః –

ఔత్సుక్యమాత్రమవసాదయతి ప్రతిష్ఠా
క్లిశ్నాతి లబ్ధపరిపాలనవృత్తి రేనమ్.
నాతిశ్రమాపనయనాయ న చ శ్రమాయ
రాజ్యం స్వహస్తధృతదండమివాతపత్రమ్ **06**

---

**ఇదో ఇదో:** దేవః = ప్రభువు, ఇతః + ఇతః = ఇటు, ఇటు. (సంధి విగ్రహసంబద్ధం నానాకార్యసముత్థితం నివేదయంతి యాః కార్యం ప్రతీహార్యస్తు తాః స్మృతాః – మాతృగుప్తాచార్యైరుక్తమితి రాఘవభట్టః)

**సర్వః:** (పరిక్రామతి = అటువైపు నడుస్తాడు. అధికారఖేదమ్ = అధికారం వలని శ్రమను, నిరూప్య = అభినయంతో ప్రదర్శించి). సర్వః + జంతుః = ప్రతిప్రాణీ, ప్రార్థితమ్ + అర్థమ్ = కోరుకొన్న ప్రయోజనాన్ని, అధిగమ్య = పొంది, సుఖీ – సంపద్యతే = సుఖవంతుడవుతాడు. రాజ్ఞామ్ + తు = రాజులకు మాత్రం, చరితార్థతా = సార్థకత – కృతార్థత, దుఃఖాంతరా + ఏవ = దుఃఖమే అవధిగా కలది. (దుఃఖోత్తరా+ఏవ = దుఃఖమే అధికంగా కలది – అని పాఠాంతరం). మహారాజుగారి జీవితంలో ఖేదానిదే పైచేయి. చివరికి అదే మిగులుతుంది – అని. కుతః = ఎందుకంటే –

**ఔత్సుక్య:** ప్రతిష్ఠా = మహారాజు అనే మహాగౌరవం, ఔత్సుక్య మాత్రమ్ = ఏ వస్తువు పట్లనైనా పొందాలి అనే కోరికను (ఔత్సుక్యం) మాత్రం కోరినంతమాత్రంచేతనే, అవసాదయతి (అవసాయయతి) = పూర్తిగా తీర్చివేస్తుంది – తొలగిస్తుంది. కోరినదల్లా కోరినంతనే కోరినట్టు లభిస్తుంది కనుక ఇక ఔత్సుక్యం (పొందాలనే ఇచ్ఛ) ఉండదు అని. ఇదీ రాజ్యం వల్ల లాభం. కానీ – లబ్ధ = అలా లభించిన దానిని, పరిపాలన = (పోషించడం రక్షించడం) పరిపాలించడం అనే, వృత్తిః = పని (వ్యాపారం. లబ్ధ వస్తువును పరిపాలించడంలో ప్రవర్తించడం), ఏనమ్ = ఈ మహారాజును, క్లిశ్నాతి = క్లేశపెడుతుంది (ఏవమ్ = ఇదిగో ఇలా నేను పడుతున్నానుగా, క్లిశ్నాతి = ఖేదం కలిగిస్తుంది – అని పాఠాంతరం). ఇదీ రాజ్యం వల్ల ఖేదం. అందుకని రాజ్యమ్ = రాజ్యమనేది = రాజ్యాధికారమనేది, స్వహస్తధృత = సొంతచేతితో ధరింపబడిన, దండమ్ = కామ కల్గినదైన, ఆతపత్రమ్ + ఇవ = గొడుగులాగా, అతి

(నేపథ్యే)

**వైతాళికౌ : విజయతాం దేవః**

**ప్రథమః : స్వసుఖనిరభిలాషః ఖిద్యసే లోకహేతోః**
**ప్రతిదినమథవా తే వృత్తిరేవంవిధైవ**
**అనుభవతి హి మూర్ధ్నా పాదపస్తీవ్రముష్ణం**
**శమయతి పరితాపం ఛాయయా సంశ్రితానామ్ 07**

---

–శ్రమాపనయనాయ – న = అత్యంతమూ శ్రమను తొలగించడానికీ కాదు, శ్రమాయ – న – చ = అలాగని శ్రమను కలిగించడానికీ కాదు.

**తాత్పర్యం:** రాజ్యప్రతిష్ఠ అనేది సమస్త వస్తుసంభారాన్ని కోరినంతనే సమకూర్చి పెడుతుంది కాబట్టి దేనికి సంబంధించిన ఔత్సుక్యాన్నయినా ఇట్టే తొలగిస్తుంది, అంతమొందిస్తుంది (అగపడగనీదు చింత రాజ్యప్రతిష్ఠ – కందుకూరి). కానీ అలా లభించిన దానిని పరిపాలించడం రక్షణ పోషణాదులు చూడటం అనే వృత్తిమాత్రం తీవ్రంగా శ్రమపెడుతుంది. ఇదిగో ఇలా (నన్నులాగా) క్లేశపరుస్తుంది. అంచేత – కామ చేత్తో పట్టుకొని మనకు మనం వేసుకొన్న గొడుగులాగా ఈ రాజ్యాధికారమనేది అత్యంతమూ శ్రమను తొలగించదు, అలాగే శ్రమను కలిగించదు. గొడుగు – ఎండావానల నుంచి కాపాడి సుఖం కలిగిస్తుంది. నిజమే కానీ దాన్ని మోసే శ్రమ మాట ఏమిటి? ఆలోచిస్తే – సుఖం కన్నా శ్రమదే పైచెయ్యి అనడం.

(నేపథ్యే = తెరలో)

**విజయతామ్:** దేవః = ప్రభువు, విజయతామ్ = జయించుగాక! మహారాజుకు జయమగుగాక – అని.

**విశేషాలు:** వైతాళికులంటే – తత్తత్ప్రహరకయోగ్యైః రాగైః తత్కాలవాచిభిః శ్లోకైః సరభసమేవ వితాళం గాయన్ వైతాళికో భవతి – అని భావప్రకాశం. సమయానుకూలమైన రాగాలతో పొగడ్తలతో ఆశువుగా శ్లోకాలు పాడి రాజును ఉల్లాసపరిచేవారు. రాగమే ఉంటుంది తప్ప తాళం ఉండదు కాబట్టి వైతాళికులట (వితాళ). వంది – మాగధులన్నమాట. వీళ్లు ఇద్దరు. వీరిలో మొదటివాడు –

**స్వసుఖ:** స్వసుఖ – నిరభిలాషః = సొంత సుఖం పట్ల కోరికలేనివాడవై, లోకహేతోః = కేవలం లోకం కోసం, ప్రతిదినమ్ = నిత్యమూ, ఖిద్యసే = శ్రమపడుతున్నావు. అథవా =

**ద్వితీయః : నియమయసి కుమార్గప్రస్థితానాత్తదండః**
**ప్రశమయసి వివాదం కల్పసే రక్షణాయ**
**అతనుషు విభవేషు జ్ఞాతయస్సంతు నామ**
**త్వయి తు పరిసమాప్తం బంధుకృత్యం ప్రజానామ్. 08**

---

అయినా, తే –వృత్తిః = నీ స్వభావం – నీ ప్రవృత్తి, ఏవమ్ + విధా + ఏవ = ఇటువంటిదేలే. పాదపః = చెట్టు, తీవ్రమ్ + ఉష్ణమ్ = మిక్కుటమైన ఎండవేడిమిని, మూర్ధ్నా = శిరసా, అనుభవతి = అనుభవిస్తుంది, సంశ్రితానామ్ = తనను ఆశ్రయించినవారికి, ఛాయయా = నీడతో, పరితాపమ్ + శమయతి + హి = దుఃఖం ఉపశమింపజేస్తుంది గదా!

**తాత్పర్యం:** మహారాజా! సొంత సుఖాలను వదులుకొని లోకం కోసమని నిత్యమూ నువ్వు ఇలా శ్రమిస్తున్నావు. అవునులే. నీ స్వభావమే ఇంత! చెట్టు చూడు. ఎండవేడిమిని శిరస్సుతో దిగమింగుతుంది, తనను ఆశ్రయించినవారికి మాత్రం నీడనిచ్చి తాపం చల్లారుస్తుంది.

**విశేషాలు:** వేళ్లతో నీళ్లు తాగుతుంది – పాదైః పిబతి – అనేది పాదపానికి ప్రసిద్ధమైన వ్యుత్పత్తి. ఎండలో కాళ్లు కాలుతున్నవాళ్ళను కాపాడటం ఇక్కడ సందర్భం కనుక పాదాన్ చరణాన్ పాతి రక్షతి – ఇతి చ అన్నాడు రాఘవభట్టు.

**నియమయసి:** కుమార్గ – ప్రస్థితాన్ = అపమార్గంలో నడుస్తున్నవాళ్ళను (అధర్మపరులను), ఆత్తదండః = దండనీతి చేపట్టినవాడవై, నియమయసి = నియంత్రిస్తున్నావు – అదుపు చేస్తున్నావు. వివాదమ్ = ప్రజల మధ్య ఏర్పడే పరస్పర కలహాన్ని, ప్రశమయసి = రూపుమాపుతున్నావు. రక్షణాయ = ప్రజల రక్షణ కొరకు, కల్పసే = చాలినవాడవవుతున్నావు – రక్షణకు సమర్థుడవు అని. అతనుషు = మిక్కుటాలైన, విభవేషు (సత్సు) = సంపదలున్నప్పుడు, జ్ఞాతయః = బంధువులు, సంతు – నామ = అండగా ఉండవచ్చుగాక, ప్రజానామ్ = ప్రజలందరికీ, త్వయి = నీవల్లనే, బంధుకృత్యమ్ + తు (అపమార్గ నివర్తన – వివాద పరిష్కరణ – సర్వదా పరిరక్షణ – అనే) బంధుధర్మం మాత్రం, పరిసమాప్తమ్ = పరిపూర్ణమవుతోంది.

**తాత్పర్యం:** అపమార్గంలో పోతున్నవాళ్ళను దండించి సన్మార్గంలో పెడుతున్నావు. వివాదాలను పరిష్కరిస్తున్నావు. అందరికీ రక్షణ కల్పిస్తున్నావు. ఇలా బంధుధర్మాన్ని

**రాజా : ఏతే క్లాంతమనసః పునర్నవీకృతాః స్మః (ఇతి పరిక్రామతి)**

**ప్రతీహారీ : అహిణవసమ్మజ్జణ సస్సిరీఓ సణ్ణిహిదహోమధేణూ అగ్గిసరణాళిందో. ఆరుహదు దేవో. (అభినవసమ్మార్జన సశ్రీకః సన్నిహితహోమధేనుః అగ్నిశరణాళిందః. ఆరోహతు దేవః)**

**రాజా : (ఆరుహ్య పరిజనాంసావలంబీ తిష్ఠతి) వేత్రవతి! కిముద్దిశ్య భగవతా కాశ్యపేన మత్సకాశమృషయః ప్రేషితాః స్యుః?**

**కిం తావద్వ్రతినాముపోఢ తపసాం విఘ్నైస్తపో దూషితమ్**
**ధర్మారణ్యచరేషు కేనచిదుత ప్రాణిష్వసచ్చేష్టితమ్**

---

నిర్వహిస్తున్నావు. సంపదలు పుష్కలంగా ఉన్నవేళ – వారికి బంధువులు ఎంతమంది అయినా ఉంటే ఉండవచ్చుగాక! అన్నివేళల్లోనూ అన్ని పరిస్థితుల్లోనూ ప్రజలందరికీ బంధుసహాయం అనేది మాత్రం నీవల్లనే పరిపూర్ణంగా లభిస్తోంది – బంధుధర్మం సుసంపన్నమవుతోంది.

**ఏతేక్లాంత:** క్లాంతమనసః = అలసిన మనస్సు కలవారమైన, ఏతే = ఈ మేము (నిషేవతే + అశాంతమనాః వివిక్తమ్ – 05), పునః + నవీకృతాః = మళ్ళీ నవీకరింపబడ్డాం. శోకాన్ముక్తః పునర్నవః. పునరుత్తేజితులమయ్యామని. (ఇతి = అని, పరిక్రామతి = ముందుకు నడుస్తాడు)

**అహిణం:** అభినవ = కొత్తగా చేసిన, సమ్మార్జన = అలుకుట మొదలైనవాటితో, సశ్రీకః = శోభా సంపన్నమూ, సన్నిహిత – హోమధేనుః = చేరువలోనే హోమధేనువు కలదీ (హోమాలకు పాలు ఇచ్చే ధేనువు) అయిన, అగ్ని శరణ + అళిందః = అగ్నిహోత్రశాల ముంగిట ఎత్తుగా పర్ణశాల ఇదిగో. దేవః = మహారాజు, ఆరోహతు = అధిరోహించుగాక – ప్రవేశించుగాక అనడం.

**వేత్రవతి:** (ఆరుహ్య = ప్రవేశించి, పరిజన + అంస + అవలంబీ = సేవకుడి బుజం మీద ఆనుకొన్నవాడై, తిష్ఠతి = నిలబడతాడు). వేత్రవతి = ఓసీ వేత్రవతీ! భగవతా – కాశ్యపేన = మహాత్ముడైన కణ్వునిచేత, మత్ + సకాశమ్ = నా దగ్గరకు, ఋషయః = మునులు, కిమ్ + ఉద్దిశ్య = ఏమి ఉద్దేశించి, ప్రేషితాః + స్యుః = పంపబడిఉంటారు? మునులను పంపడంలో కాశ్యపుడి ఆంతర్యం ఏమిటని.

**ఆహోస్విత్ప్రసవో మమాపచరితైః విష్టంభితో వీరుధాం**
**ఇత్యారూఢ బహుప్రతర్క మపరిచ్ఛేదాకులం మే మనః. 9**

**ప్రతీహారీ : సుచరిదనందిణో ఇసీఓ దేవం సభాజఇదుం ఆఅదేత్తి తక్కేమి. (సుచరితనందిన ఋషయః దేవం సభాజయితుమాగతా ఇతి తర్కయామి)**

---

**కింతావత్:** ఉపోఢ – తపసామ్ = స్వీకరింపబడిన తపస్సు కలవారైన, వ్రతినామ్ = ఆశ్రమ మునుల యొక్క (వ్రతం = నియమం – స్వీకరించినవాడు = వ్రతి = ముని), తపః = తపస్సు (వ్రతులైన తపస్వుల తపస్సు – అనిగానీ), విఘ్నైః = ఆటంకాలతో, దూషితమ్ + కిమ్ + తావత్ = కలుషితంగాని అయ్యిందా? ఉత = లేదంటే (ఒకవేళ), ధర్మారణ్య చరేషు = వారున్న ధర్మారణ్యంలో సంచరించే, ప్రాణిషు = ప్రాణుల విషయంలో, కేనచిత్ = ఎవడిచేతనైనా, అసత్ + చేష్టితమ్ + కిమ్ = అపరాధం చెయ్యబడిందా? ఆహోస్విత్ = అదీ కాదంటే, మమ + అపచరితైః = నా అపచారాలతో, వీరుధామ్ = లతలకు, ప్రసవః = పల్లవ పుష్పాదికం, కిమ్ + విష్టంభితః = స్తంభింపజేయబడిందా? (పుష్పంఫలం చ పత్రం చ వృక్షాణాం ప్రసవం విదుః – ఇతి ధరణిః), ఇతి = ఇలాగని, ఆరూఢ – బహుప్రతర్కమ్ = ఉద్భవించిన అనేక తర్కవితర్కాలు కలదై, మే – మనః = నా మనస్సు, అపరిచ్ఛేద = విడుమరలేకపోవడంతో – నిర్ణయం లేకపోవడంతో (= నిర్ణయాభావేన – కాటయ, శ్రీనివాస), ఆకులమ్ = విహ్వలమయ్యింది, కలత చెందింది.

**తాత్పర్యం:** ఈ మునులు ఇలా వచ్చారంటే – వీరి తపస్సులకు ఏమైనా విఘ్నాలూ ఆటంకాలూ ఏర్పడ్డాయేమో! వీరుండే ధర్మారణ్యంలోని ప్రాణులకు ఎవడైనా హాని చేశాడేమో! ఒకవేళ నేనేమన్నా అపచారాలు చేశానేమో! వాటివల్ల వీరి అరణ్యంలోని చెట్టూచేమలకు – పత్రఫలపుష్పాదులు స్తంభించాయేమో! ఇలా రకరకాల సందేహాలు కలుగుతున్నాయి. దేనికీ సమాధానం దొరకక – వీరి రాకకు కారణం ఏమిటో గ్రహించలేక మనసు అపరిచ్ఛిన్నంగా విలవిలలాడుతోంది.

**సుచరిద:** సుచరితనందినః = మంచి నడవడికి ఆనందించినవారై, ఋషయః = మునులు, దేవమ్ = ప్రభువును, సభాజయితుమ్ = సత్కరించడానికి, ఆగతాః = వచ్చారు, ఇతి = అని, తర్కయామి = భావిస్తున్నాను.

**(తతః ప్రవిశంతి గౌతమీ సహితాః శకుంతలాం పురస్కృత్యమునయః పురశ్చైషాం కంచుకీ పురోహితశ్చ)**

**కంచుకీ : ఇత ఇతో భవంతః**

**శార్ఙ్గ : శారద్వత!**

**మహాభాగః కామం నరపతి రభిన్నస్థితిరహో**
**న కశ్చిద్వర్ణానామపథమపకృష్టోఽపి భజతే**
**తథాపీదం శశ్వత్పరిచిత వివిక్తేన మనసా**
**జనాకీర్ణం మన్యే హుతవహపరీతం గృహమివ. 10**

---

(తతః = అంతట, గౌతమీ సహితాః = గౌతమితో కలిసినవారై, శకుంతలామ్ = శకుంతలను, పురస్కృత్య = ముందిడుకొన్నవారై, మునయః = ఋషులు శార్ఙ్గరవ శారద్వతులు, ప్రవిశంతి = ప్రవేశిస్తారు. ఏషామ్ = వీరికి, పురః = ముందు, కంచుకీ = కంచుకి, పురోహితశ్చ = పురోహితుడు సోమరాతుడూ, ప్రవిశంతి = ప్రవేశిస్తారు)

**ఇత ఇతో:** భవంతః = మీరు (అందరూ), ఇతః ఇతః = ఇటు, ఇటు!!

**మహాభాగః:** శారద్వతా! మహాభాగః = మహాభాగ్యశాలి, నరపతిః = ఈ మహారాజు దుష్యంతుడు, అహో = ఆశ్చర్యం, కామమ్ = అత్యంతమూ, అభిన్నస్థితిః = విడువని మర్యాద కలవాడు. మర్యాదను తప్పనివాడు. బాగా పాటించేవాడు – అని. (న– భిన్నా – స్థితిః – యేన సః. మర్యాదా ధారణా స్థితిః – ఇత్యమరః). వర్ణానామ్ = చతుర్వర్ణాలలోనూ, అపకృష్టః + అపి = తక్కువవాడు సైతం – ఎంత హీనుడైనా, అపథమ్ = అపమార్గాన్ని, న – భజతే = అనుసరించడం లేదు. దారితప్పడం లేదు – అని. తథాపి = అయినప్పటికీ, శశ్వత్ = నిరంతరమూ, పరిచిత = అలవాటుపడిన, వివిక్తేన = ఏకాంతం కలదైన, మనసా = నా మనస్సుతో – మనస్సు కారణంగా, జనాకీర్ణమ్ = జనాలతో నిండిన, ఇదమ్ = ఈ ప్రదేశం – ఈ స్థానం, హుతవహపరీతమ్ = అగ్ని చుట్టుముట్టిన, గృహమ్ + ఇవ = ఇల్లులాగా, మన్యే = భావిస్తున్నాను – అనిపిస్తోంది.

**తాత్పర్యం:** శారద్వతా! ఈ మహాభాగుడు రాజు చాలా మర్యాదస్థుడు, మర్యాద తప్పనివాడు. ఎందుచేతనంటే – అంతటా నగరంలో వర్ణాశ్రమ వ్యవస్థ సజావుగా నడుస్తోంది. ఏ వర్ణంలోనూ నిరుపేదసైతం అపమార్గం తొక్కడం లేదు. ఎంత

**శారద్వతః :** **జానే భవాన్పురప్రవేశాదిత్థం భూతః సంవృత్తః. అహమపి –**

**అభ్యక్తమివ స్నాతః శుచిరశుచిమివ ప్రబుద్ధ ఇవ సుప్తమ్**
**బద్ధమివ స్వైరగతిః జనమిహ సుఖసంగినమవైమి. 11**

**శకుంతలా:** (నిమిత్తం సూచయిత్వా) అమ్మహే, కిం మే వామేదరం ణఅణం విస్ఫురది? (అహో! కిం మే వామేతరం నయనం విస్ఫురతి?)

---

ఆశ్చర్యం! అయినప్పటికీ, ఉరుకులూ పరుగులూ పెడుతున్న జనాలతో నిండిన ఈ ప్రదేశం – చిరకాలంగా ఏకాంతానికి అలవాటుపడిపోయిన కారణంగానో ఏమో – నా మనస్సుకు ఇదొక నిప్పు అంటుకున్న ఇల్లులాగా భాసిస్తోంది.

**జానే:** జానే = ఎరుగుదును. (స్థానే = యుక్తమే – పాఠాంతరం). భవాన్ = నీవు, పురప్రవేశాత్ = రాజధాని నగరంలో ప్రవేశించినప్పటినుంచీ, ఇత్థంభూతః + సంవృత్తః = ఇలాగే ఉన్నావు! అహమ్ + అపి = నేను కూడా –

**అభ్యక్తమ్:** స్నాతః = స్నానం చేసినవాడు, అభ్యక్తమ్ + ఇవ = నూనె పులుముకొన్నవాడిని చూసినట్టూ; శుచిః = శుచిగా ఉన్నవాడు, అశుచిమ్ + ఇవ = అపరిశుద్ధుణి చూసినట్టూ; ప్రబుద్ధః = మెలకువగా ఉన్నవాడు, సుప్తమ్ + ఇవ = నిద్రిస్తున్నవాడిని చూసినట్టూ; స్వైరః = స్వేచ్ఛగా ఉన్నవాడు, బద్ధమ్ + ఇవ = బంధితుణ్ని చూసినట్టూ, సుఖసంగినమ్ = లౌకిక సుఖాలలో మునిగిపోయిన, ఇహ – జనమ్ = ఇక్కడి ఈ జనాన్ని, అవైమి = భావిస్తున్నాను.

**తాత్పర్యం:** లౌకిక సుఖాలలో తగుల్కొన్న ఇక్కడి ఈ జనాన్ని చూస్తే – తలంటు పోసుకున్నవాడు నూనె రాసుకుని కూర్చున్నవాడిని చూసినట్టూ, శుచిగా ఉన్నవాడు అశుచిని – పాపిని చూసినట్టూ; మేల్కొన్నవాడు (జ్ఞాని) నిద్రపోతున్నవాడిని (అజ్ఞానిని) చూసినట్టూ; స్వేచ్ఛా జీవి (సంసార) బద్ధుణ్ని చూసినట్టూ అనిపిస్తోంది నాకు.

**అమ్మహే:** (నిమిత్తమ్ = అపశకునాన్ని, సూచయిత్వా = అభినయంతో ప్రదర్శించి) అహో = అహో! కిమ్ = ఏమీ, మే = నా, వామ + ఇతరమ్ = కుడివైపుదైన, నయనమ్ = కన్ను, విస్ఫురతి = అదురుతోంది?! (వామం = ఎడమ, వామేతరం = కుడి, అమ్మహే నిర్వేదే).

**గౌతమీ : జాదే, పడిహదం అమంగళం. సుహాఇం దే భత్తుకులదేవదాఓ విదరందు. (ఇతి పరిక్రామతి). (జాతే! ప్రతిహతమమంగళమ్. సుఖాని తే భర్తృకులదేవతా వితరంతు).**

**పురోహితః: (రాజానం నిర్దిశ్య) భోభోస్తపస్వినః! అసావత్రభవాన్ వర్ణాశ్రమాణాం రక్షితా ప్రాగేవ ముక్తాసనో వః ప్రతిపాలయతి. పశ్యతైనమ్.**

**శార్ఙ్గ : భో మహాబ్రాహ్మణ! కామమేత దభినందనీయమ్, తథాపి వయమత్ర మధ్యస్థాః. కుతః –**

**భవంతి నమ్రాస్తరవః ఫలాగమైః**
**నవాంబుభి ర్దూరవిలంబినో ఘనాః**
**అనుద్ధతాః సత్పురుషాః సమృద్ధిభిః**
**స్వభావ ఏవైష పరోపకారిణామ్ 12**

---

**పడిహదం:** జాతే = పుత్రీ! అమంగళమ్ = అశుభం, ప్రతిహతమ్ = అంతరించుగాక! తే = నీకు, శుభాని = శుభాలను (సుఖాని – పాఠాంతరం), భర్తృ – కులదేవతాః = మగని ఇలువేల్పులు, వితరంతు = కురిపింతురుగాక! (ఇతి = అని, పరిక్రామతి = ముందుకు నడుస్తుంది)

**భోస్తపస్వినః:** (రాజానమ్ + నిర్దిశ్య = రాజును చూపిస్తూ) భోభోః = ఓయోయీ! తపస్వినః = మునులారా! అసౌ = ఇడిగో, అత్రభవాన్ = మాన్యుడు, వర్ణాశ్రమాణామ్ = వర్ణాశ్రమధర్మాలకు, రక్షితా = సంరక్షకుడు, ప్రాక్ + ఏవ = ముందుగానే, ముక్త + ఆసనః = ఆసనం నుంచి లేచినవాడై, వః = మిమ్ము, ప్రతిపాలయతి = నిరీక్షిస్తున్నాడు. మీ రాక కోసం ఎదురు చూస్తున్నాడు – అని. ఏనమ్ = ఇతడిని, పశ్యత = దర్శించండి!! (ఇతడి వినయాన్ని గమనించండి – అనడం).

**భో మహా:** భో = ఓయీ! మహాబ్రాహ్మణ = బ్రాహ్మణోత్తమా! ఏతత్ = ఇది, కామమ్ = మిక్కిలి (ఎంతయినా), అభినందనీయమ్ = ప్రశంసింపదగినదే. తథాపి = అయినా, అత్ర = లేవడాలు ఎదురు రావడాలు మొదలైన వినయాభివ్యక్తి విషయంలో, వయమ్ = మేము, మధ్యస్థాః = (పక్షపాతరహితాః) నిస్పృహులం – ఆసక్తి లేనివాళ్ళం. కుతః = ఎందుకంటే –

**భవంతి:** తరవః = వృక్షాలు, ఫల + ఆగమైః = కాయల విచ్చేయడాలతో (ఉద్గమైః = పుట్టుకు రావడాలతో – పాఠాంతరం), నమ్రాః = నేలకు వంగినవి, భవంతి

ప్రతీహారీ : దేవ, పసణ్ణముహవణ్ణా దీసంది. జాణామి విసద్ధకజ్జా ఇసీఓ. (దేవ! ప్రసన్నముఖవర్ణా దృశ్యంతే. జానామి విస్రబ్ధకార్యా ఋషయః)

రాజా : (శకుంతలాం దృష్ట్వా) అథాత్రభవతీ –

కా స్విదవకుంఠనవతీ నాతిపరిస్ఫుట శరీరలావణ్యా
మధ్యే తపోధనానాం కిసలయమివ పాండుపత్రాణామ్? **13**

---

= అవుతున్నాయి. ఘనాః = మేఘాలు, నవ + అంబుభిః = కొత్తగా నింపుకొన్న జలాలతో, దూర – విలంబినః = బాగా క్రిందికి వేలాడేవి, (Hanging far below – మోనియర్విలియమ్సు), భవంతి = అవుతున్నాయి. (అత్యర్థమ్ అవనతాః అని శ్రీనివాసాచార్య, అతిశయవర్షుకాః అని రాఘవభట్టు. మేఘములు నవోదకముల మిగుల వంగు – కందుకూరి.) సత్పురుషాః = సజ్జనులు, సమృద్ధిభిః = ఐశ్వర్యాలతో, అనుద్ధతాః = మిడిసిపడనివారు, భవంతి = అవుతున్నారు. పరోపకారిణామ్ = ఇతరులకు సహాయపడేవారికి, ఏషః = ఈ వినమ్రత, స్వభావః + ఏవ = సహజ లక్షణమే.

**తాత్పర్యం:** ఫలాల సమృద్ధితో తరువులు నేలకు వంగుతాయి. జలాల సమృద్ధితో మేఘాలు కిందికి వ్రేలుతాయి. సజ్జనులు సమృద్ధులవల్ల విర్రవీగరు. వినమ్రులే అవుతారు. ఇది పరోపకారుల స్వభావం. అందుకని – మీ రాజుగారి వినయవిధేయతలు చూసి మేము విస్తుపోము అనడం. (దూర = far away, for above, for below – మోనియర్విలియమ్సు).

**పసణ్ణ:** దేవ = ప్రభూ! ప్రసన్న – ముఖవర్ణాః = ప్రసన్నమైన ముఖకాంతి కలవారుగా, దృశ్యంతే = కనబడుతున్నారు. వీళ్ళ ముఖాల రంగు చూస్తోంటే కోపంగా లేరు, ప్రసన్నంగానే ఉన్నారనిపిస్తోంది – అని. ఋషయః = ఈ మునులు, విస్రబ్ధకార్యాః + ఇతి = ప్రశాంతమైన పని మీద వచ్చినవారుగానే, జానామి = భావిస్తున్నాను. (విస్రబ్ధస్తు ఉద్భటే వ్యర్థే శాంతవిశ్వస్తయోరపి – ఇతి విశ్వః)

**కాస్విత్:** (శకుంతలాం దృష్ట్వా = శకుంతలను చూసి) అథ = మరి, అత్రభవతీ = మాన్యురాలు – కాస్విత్ = ఎవరు చెప్మా? (ఎవ్వరితో?!) అవకుంఠనవతీ = మేలిముసుగుతో ఉన్నదీ, న + అతిపరిస్ఫుట – శరీరలావణ్యా = అంతగా పరిస్ఫుటం కాని శరీర సౌందర్యం కలదీ, పాండుపత్రాణామ్ + మధ్యే = పండుటాకుల నడుమ,

**ప్రతీహారీ : దేవ, (కుతూహల గబ్భోపహిదో ణ మే తక్కో పసరది) ణం దంసణీఆ ఉణసే ఆకిదీ లక్ఖీఅది. (దేవ, కుతూహల గర్భోపహితో న మే తర్కః ప్రసరతి. నను దర్శనీయా పునరస్యా ఆకృతిర్లక్ష్యతే)**

**రాజా : భవతు, అనిర్వర్ణనీయం పరకళత్రమ్.**

---

కిసలయమ్ + ఇవ = చిగురాకులాగా, తపోధనానామ్ + మధ్యే = ఈ ఋషుల నడుమ, అత్రభవతీ = ఈ మాన్యురాలు, కాస్విత్ = ఎవ్వరితో?! (స్విదితి ప్రశ్నే వితర్కే చ)

**తాత్పర్యం:** ఇంతకీ ఈ మాన్యురాలు ఎవరో?! మేలిముసుగు వేసుకుంది. శరీర సౌందర్యం (తారళ్యం) ఏమంత స్ఫుటంగా కనిపించడం లేదు. కానీ, ఈ తపోధనుల మధ్య ఈవిడ – పండుటాకుల నడుమ చిగురాకు లాగా ఉంది. ఎవరో కదా ఈవిడ?!

**విశేషాలు:** నాతిపరిస్ఫుట శరీరలావణ్యా = అంతగా పరిస్ఫుటం కాని శరీరమూ లావణ్యమూ కలది అని రాఘవభట్టు. నిలువెత్తు మేలి ముసుగువల్ల – కనిపించీ కనిపించనట్టు ఉన్నదని. అత్రభవతీ = శీలవతీ – ఆసన్న ప్రసవతయా = గర్భిణి కాబట్టి శరీరలావణ్యమత్యర్థం న దృశ్యత ఇతి భావః అని శ్రీనివాసాచార్యుల అతివివరణ! ముక్తాఫలేషు ఛాయాయాస్తరళత్వమివాంతరా ప్రతిభాతి యదంగేషు లావణ్యం తదిహోచ్యతే – ఇతి సుధాకరే.

**కుతూహల:** దేవ = ప్రభూ! కుతూహల = కుతూహలం, గర్భ = మధ్యలో, ఉపహితః = కలిగినదై, మే – తర్కః = నా ఆలోచన, న– ప్రసరతి = ముందుకు సాగడం లేదు. కుతూహలం పట్టలేక ఈమె ఎవరు? ఏమిటి? ఇలాంటివాటివైపు సాగడం లేదు నా ఆలోచన – అని. పునః = కానీ, అస్యాః + ఆకృతిః = ఈమె రూపం, దర్శనీయా = చూడచక్కనిదిగా, లక్ష్యతే – నను = కనిపిస్తోంది సుమా!

**విశేషాలు:** ఇక్కడ కుతూహల గర్భ... అనే మొదటి వాక్యం చాలా ప్రతులలో లేదుట. రాఘవభట్టు – రేవా ప్రసాదద్వివేదీ అన్నారు. అవును, లేకపోవడమే ఔచిత్యం. కుతూహలము గలదై నా యూహ తిన్నగా సాగకున్నది – అన్నారు కందుకూరి వారు. నా ఆలోచన కుతూహల గర్భంగా భాసిస్తోంది (ప్రసీదతి) అనే పాఠం కొంతమేలు. నాకూ నీలాగే తెలుసుకోవాలనే కుతూహలం కలుగుతోంది – అని. కొన్నింట కుతూహల గర్భోపహతః అనీ కుతూహల గర్భో మే తర్కః ప్రసీదతి – అనీ పాఠాంతరాలు కన్పిస్తున్నాయి.

**శకు : (హస్తమురసి కృత్వా - ఆత్మగతమ్) హిఅఅ, కిం ఏవ్వం వేవసి అజ్జఉత్తస్స భావం అణవధారిఅ? ధీరం దావ హోహి. (హృదయ! కిమేవం వేపసే ఆర్యపుత్రస్య భావమనవధార్య? ధీరం తావద్భవ.)**

**పురోహితః: (పురో గత్వా) ఏతే విధివదర్చితాస్తపస్వినః. కశ్చిదేషామ్ ఉపాధ్యాయ సందేశః. తం దేవః శ్రోతుమర్హతి.**

---

**భవతు:** భవతు = వద్దు!! పరకళత్రమ్ = పరుని ఇల్లాలు, అనిర్వర్ణనీయమ్ = చూడరానిది. పరపురుషుడు పరకళత్రాన్ని చూడకూడదు – అని. (అస్తు – భవతు – పూర్యతే – ఇతి నిషేధే. నిర్వర్ణనం తు నిధ్యానం దర్శనాలోకనేక్షణమ్ – అమరం)

**హిఅఅ:** (హస్తమ్ = చెయ్యి, ఉరసి – కృత్వా = గుండెలపై పెట్టుకొని, ఆత్మగతమ్ = తనలో) హృదయ = డెందమా! ఆర్యపుత్రస్య = మగని, భావమ్ = అభిప్రాయం, అనవధార్య = వినకుండానే, ఏవమ్ = ఇలా, వేపసే – కిమ్ = వణుకుతున్నావేమి! ధీరమ్ + తావత్ – భవ = నిబ్బరంగా ఉండు. ధైర్యంగా ఉండు – అనడం.

**విశేషాలు:** ఆర్యపుత్రస్య భావం "అవధార్య" ధీరం తావద్భవ – అని రాఘవభట్టు. ఆర్యపుత్రస్య భావబంధ మవధార్య ధీరం తావద్భవ – అనీ, భావాణుబంధం సుమరిఅ ధీరత్తణం దావ అవలంబసు – అనీ పాఠాంతరాలు. ఇక్కడ శకుంతలను చూశాక రాజుకూ వేత్రవతికీ మధ్య సాగిన సంభాషణ – వారిద్దరికే పరిమితమా – అంటే జనాంతికమా? లేక శకుంతలాదులందరూ విన్నారా? అనేది అస్పష్టం. అప్పటికింకా వారంతా రాజును సమీపించలేదు. దూరంగా గుమ్మం దగ్గరే ఉన్నారు. కాబట్టి వారి మాటలు 'భోభోస్తపస్వినః' దగ్గరనుంచి 'స్వభావ ఏవైష పరోపకారిణామ్' అన్నంతవరకూ– వేత్రవతీ దుష్యంతులకు వినిపించలేదనుకోవాలి. అలాగే వీరి మాటలూ వారికి వినిపించలేదనుకోవాలి. దీన్నిబట్టి ఈ వాక్యం స్వరూపాన్నీ పాఠాన్నీ మనం నిర్ధారించుకోవాలి. వేత్రవతీ దుష్యంతుల సంభాషణ జనాంతికమే అని నా అభిప్రాయం. అలా కాదని భావించిన శ్రీనివాసాచార్య "పరకళత్రమితి సామాన్యేనోక్తత్వాత్ మా వేపస్వేతి యావత్ – అని వివరణ ఇచ్చారు. హృదయమా! ఏమి యిట్లు వడఁకుచున్నావు! భర్తగారి భావము తెలిసికొన నించుక ధైర్యము వహింపుము – అన్నారు కందుకూరి. గడసరి!!

**ఏతే:** (పురః + గత్వా = ముందుకు వెళ్ళి) ఏతే = ఇరిగో, విధివత్ + అర్చితాః = సంప్రదాయం ప్రకారం (అతిథి మర్యాదలతో) అర్చితులైన, తపస్వినః = ఋషులు!

రాజా : అవహితోఽస్మి.

శిష్యౌ : (హస్తానుద్యమ్య) స్వస్తి భవతే!

రాజా : అభివాదయే – వః

శిష్యే : ఇష్టేన యుజ్యస్వ!!

రాజా : అపి నిర్విఘ్నతపసో మునయః?

శిష్యౌ : కుతో ధర్మక్రియావిఘ్నః సతాం రక్షితరి త్వయి
తమస్తపతి ఘర్మాంశౌ కథమావిర్భవిష్యతి? **14**

---

ఏషామ్ = వీరికి, ఉపాధ్యాయ సందేశః = వీరి గురువు ఇచ్చి పంపిన సందేశం, కశ్చిత్ (అస్తి) = ఏదో ఒకటి ఉంది. తమ్ = దానిని, దేవః = ప్రభువు, శ్రోతుమ్ + అర్హతి = వినదగును!! నీవు ఆలకింతువు గాక – అని.

**అవహిత:** అవహితః + అస్మి = సావధానుడనై ఉన్నాను.

**స్వస్తి:** (హస్తాన్ + ఉద్యమ్య = ఇద్దరూ చేతులు పైకెత్తి) భవతే = నీకు, స్వస్తి = శుభమగుగాక!

**అభివాదయే:** వః = మిమ్ము, అభివాదయే = ఇదే నమస్కరిస్తున్నాను!

**ఇష్టేన:** ఇష్టేన = అభీష్టంతో, యుజ్యస్వ = కలుసుకో! = అభీష్టం సిద్ధించుగాక – అని.

**అపి నిర్విఘ్న:** మునయః = మీరూ మీ మునులూ, అపి – నిర్విఘ్నతపసః = నిరాటంకంగా సాగుతున్న తపస్సులు కలవారేనా? మీ తపస్సులు ఏ విఘ్నాలూ లేకుండా నడుస్తున్నాయా? – అనడం.

**కుతోధర్మ:** సతామ్ = సజ్జనులకు, త్వయి = నీవు, రక్షితరి = రక్షకుడవై ఉండగా (సతిసప్తమి), ధర్మక్రియా – విఘ్నః = తపస్సులూ యజ్ఞాలూ లాంటి ధార్మికకార్యాలకు ఆటంకమనేది, కుతః = ఎక్కడిది? ఘర్మాం శౌ = వేడివెలుగు, తపతి = ప్రకాశిస్తుండగా, తమః = చీకటి, కథమ్ + ఆవిర్భవిష్యతి = ఎలా ఆవిర్భవిస్తుంది?

**తాత్పర్యం:** రాజా! నువ్వు రక్షకుడివై ఉండగా సజ్జనుల ధర్మకార్యాలకు ఆటంకాలు అసలెలా ఏర్పడతాయి. సూర్యుడు వెలుగుతూంటే చీకటి ఎలా పొడచూపుతుంది?!

**రాజా : అర్థవాన్ ఖలు మే రాజశబ్దః. అథ భగవాన్ లోకానుగ్రహాయ కుశలీ కాశ్యపః?**

**శిష్యౌ : స్వాధీనకుశలాః సిద్ధిమంతః! స భవంత మనామయప్రశ్నపూర్వక మిదమాహ –**

**రాజా : కిమాజ్ఞాపయతి భగవాన్?**

**శార్ఙ్గ : యన్మిథస్సమయాదిమాం మదీయాం దుహితరం భవానుపాయంస్త తన్మయా ప్రీతిమతా యువయోరనుజ్ఞాతమ్. కుతః –**

---

**అర్థవాన్:** మే = నా, రాజ శబ్దః = రాజు అనే పదం, అర్థవాన్ + ఖలు = సార్థకమయ్యింది గదా! అథ = మరి, భగవాన్ + కాశ్యపః = మహాత్ముడు కణ్వుడు, లోక + అనుగ్రహాయ = లోకాన్ని కరుణించడం కోసం, కుశలీ = కుశలమేనా? (బ్రాహ్మణం కుశలం పృచ్ఛేత్ క్షత్రబంధుమనామయం వైశ్యం క్షేమం సమాగమ్య శూద్రమారోగ్యమేవ చ – భృగు సంహిత)

**స్వాధీన:** సిద్ధిమంతః = తమస్సిద్ధి కలవారు, స్వాధీన – కుశలాః = స్వాధీన కుశలురు. తపస్వులకు వారి ఆరోగ్యం వారి అధీనంలో ఉంటుందని. సః = ఆ తపస్వి, భవంతమ్ = నిన్నుద్దేశించి, అనామయ ప్రశ్నపూర్వకమ్ = కుశల ప్రశ్నలు మున్నుగా, ఇదమ్ + ఆహ = ఇది పలికాడు –

**కిమాజ్ఞాపయతి:** భగవాన్ = మహాత్ముడు, కిమ్ + ఆజ్ఞాపయతి = ఏమి ఆనతిచ్చారు?

**యన్మిథః:** మిథః + సమయాత్ = పరస్పరం చేసుకొన్న ఒప్పందం కలదైన గాంధర్వ విధానంవల్ల, భవాన్ = నీవు, ఇమామ్ = ఈ, మదీయామ్ = నా, దుహితరమ్ = పుత్రికను, ఉపాయంస్త + ఇతి – యత్ = వివాహమాడావు అనేది ఏది కలదో, యువయోః = మీ ఇరువురి, తత్ = ఆ పని (అది), ప్రీతిమతా = సంతోషించినవాడనైన, మయా = నాచేత, అనుజ్ఞాతమ్ = అనుమతింపబడింది. నాకు తెలీకుండా మీరు ఇద్దరూ చేసుకున్న గాంధర్వ వివాహాన్ని నేను సంతోషంగా ఆమోదించాను – అనడం. కుతః ఎందుకంటే –

**త్వమర్హతామ్:** త్వమ్ = నీవు, అర్హతామ్ = పూజ్యులలో, ప్రాగ్రసరః = అగ్రగామివి అని (ముందుండేవాడు – అగ్రగణ్యుడు), స్మృతః = (లోకుల చేత) తలపోయబడినవాడవు,

త్వమర్హతాం ప్రాగ్రసరః స్మృతోఽసి నః
శకుంతలా మూర్తిమతీ చ సత్క్రియా
సమానయంస్తుల్యగుణం వధూవరం
చిరస్య వాచ్యం న గతః ప్రజాపతిః 15

తదిదానీమాపన్నసత్త్వా ప్రతిగృహ్యతాం సహధర్మచరణాయేతి.

గౌతమీ : అజ్జ, కింపి వత్తుకామహ్మి. ణమే వఅణావసరో అత్థి. కహంత్తి –

ణావేక్ఖిఓ గురుఅణో ఇమాఇ ణ హు పుచ్ఛిదో అ బంధుఅణో
ఏక్కక్కమే వ్వ చరిఏ భణామి కిం ఏక్కమేక్కస్స. 16

---

అసి = అయ్యున్నావు. నః = మా, శకుంతలా + చ = ఈ శకుంతల కూడా, మూర్తిమతీ = రూపుగొన్న, సత్క్రియా = సత్కార్యం – సౌశీల్యం ఇత్యాదులు. (మూర్తిమతీవ – సత్క్రియా = రూపుదాల్చిన సత్క్రియ వంటిది – అని పాఠాంతరం). తుల్యగుణమ్ = సమానగుణాలు కల్గిన, వధూవరమ్ = వధూవరద్వయాన్ని, సమానయన్ = కలుపుతున్నవాడై, ప్రజాపతిః = సృష్టికర్త, చిరస్య = చిరకాలానికి, వాచ్యమ్ = (సమానగుణ వధూవరులను కలపడు అనే) అపవాదును, న–గతః = పొందనివాడయ్యాడు.

**తాత్పర్యం:** యోగ్యులలో అగ్రగణ్యుడవు నువ్వు. రూపుదాల్చిన సౌశీల్యం మా శకుంతల. ఇలా సమానగుణాలు కలిగిన వధూవరులను మిమ్మల్ని ఇద్దిరినీ జతగూర్చి ఆ బ్రహ్మదేవుడు ఇంతకాలానికి మాటపడనివాడు అయ్యాడు. అందుకని నేను ఆమోదించాను.

**తదిదానీమ్:** తత్ = అందుచేత, ఇదానీమ్ = ఇప్పుడు, ఆపన్నసత్త్వా = గర్భవతియైన ఈమె, సహధర్మ చరణాయ = నీతోపాటు గృహస్థ ధర్మాన్ని ఆచరించడం కోసం, ప్రతిగృహ్యతామ్ = స్వీకరింపబడుగాక! సహధర్మచారిణిగా స్వీకరించు, ఇతి = అని, భవంతమ్ + ఆహ = నిన్నుద్దేశించి పలికాడు.

**అజ్జ కింపి:** ఆర్య = సజ్జనుడా! కిమపి – వక్తుకామా + అస్మి = ఏదో కొంత నేనూ చెప్పాలనుకుంటున్నాను. కానీ – మే = నాకు, వచన + అవసరః = మాట్లాడవలసిన అవసరమే, న = లేదు. నేనేమీ చెప్పలేకపోతున్నానని. కథమ్ + ఇతి = ఎలాగంటే –

**ణావేక్ఖిఓ:** అనయా = ఈమెచేత, గురుజనః = పెద్దలు కణ్వుడు, న + అపేక్షితః = సంప్రదింపబడలేదు. (జనః కాబట్టి అపేక్షితః అని ఏకవచనం). వారినెవ్వరినీ

**(ఆర్య! కిమపి వక్తుకామాస్మి. నమే వచనావసరోఽస్తి. కథమితి –**

**నాపేక్షితో గురుజనోఽనయా న ఖలు పృష్టశ్చ బంధుజనః**
**పరస్పరస్మిన్నేవ చరితే భణామి కిమేకైకస్య. )**

**శకు : (ఆత్మగతమ్) కింఞు క్ఖు అజ్జఉత్తో భణాది? (కిం ను ఖల్వార్యపుత్రో భణతి?)**

**రాజా : కిమిద ముపన్యస్తమ్?**

**శకు : (ఆత్మగతమ్)పావఓ క్ఖు వఅణోవణ్ణాసో. (పావకః ఖలు వచనోపన్యాసః)**

---

పరిగణించలేదు – అనడం. బంధుజనః = పోనీ అంటే ఆప్తవర్గమైన (అస్మదాదులం), న – పృష్టః + ఖలు = సంప్రదించబడలేదు. మా అనుమతీ అభిప్రాయమూ తీసుకోలేదు – అని. (తుఇ పుచ్ఛిదో ణ బంధుఅణో = త్వయాపి న పృచ్ఛితో బంధుజనః = నువ్వైనా బంధుజనులను అడగలేదు. మా అనుమతి అడగకపోవడం నీవైపునుంచి దోషమని – పాఠాంతరం). పరస్పరస్మిన్ + ఏవ = కేవలం (మీరిద్దరే) అన్యోన్యంగా, చరితే = ఆచరించిన ఈ విషయంలో, ఏకైకస్య = ఒక్కొక్కరికీ, కిమ్ + భణామి = ఏమి చెప్పను!? (ఏకైకస్మిన్ – పాఠాంతరం)

**తాత్పర్యం:** తండ్రిని ఈవిడ లెక్కచెయ్యలేదు. బంధుగణాన్నీ పరిగణించలేదు. పోనీ నువ్వైనా మమ్మల్ని ఎవ్వరినీ సంప్రదించలేదు. మీరిద్దరూ పరస్పరం చేసేసుకున్న పని – వివాహం – ఇది. మరి మీలో ఎవరికని ఏమని మేము చెప్పేది? మీ అంతటివారు మీరు!!

**కింఞు:** (ఆత్మగతమ్ = తనలో) ఆర్యపుత్రః = పెనిమిటి, కిమ్ + ను – ఖలు – భణతి = ఏమి అంటాడో గదా!

**కిమిదమ్:** కిమ్ + ఇదమ్ = ఏమిది, ఉపన్యస్తమ్ = మీరన్నది? (ఇవి ఏటి మాటలు? – కందుకూరి)

**పావఓ:** (ఆత్మగతమ్ = తనలో) వచన + ఉపన్యాసః = పలికిన ఈ మాట, పావకః + ఖలు = అగ్ని సుమా! (సావలేపోఽస్య వచనోపక్షేపః – అని పాఠాంతరం. ఇతడి మాట తీరు, సావలేపః = అహంకార పూరితం!!)

**శార్ఙ్గ : కథమ్“కిమిదం నామ”? భవంత ఏవ సుతరాం లోకవృత్తాంతనిష్ణాతాః.**

**సతీమపి జ్ఞాతికులైక సంశ్రయాం**
**జనోఽన్యథా భర్తృమతీం విశంకతే**
**అతస్సమీపే పరిణేతురిష్యతే**
**ప్రియాప్రియా వా ప్రమదా స్వబంధుభిః. 17**

**రాజా : కిం చాత్రభవతీ మయా పరిణీతపూర్వా?!**

**శకు : (సవిషాదమ్ ఆత్మగతమ్) హిఅఅ, సంపదం దే ఆసంకా ఆసీ. (హృదయ! సాంప్రతం త ఆశంకాసీత్).**

---

**కథమ్:** “కిమిదమ్ – నామ” = ఏమిటి మీరన్నది అంటే, కథమ్ = ఎలా? “కిమిదముపన్యస్తమ్” అని నువ్వే అడిగితే ఎలా? – అని. భవంతః + ఏవ = తమరే, సుతరామ్ = బాగా, లోకవృత్తాంత – నిష్ణాతాః = లోకరీతి ఎరిగినవారు. (లోకతంత్ర నిష్ణాతాః – అని పాఠాంతరం. నిష్ణాతః కుశలేఽపిచ – ఇతి అజయనిఘంటుః)

**సతీమపి:** సతీమ్ + అపి = పతివ్రత అయినప్పటికీ, జ్ఞాతికుల + ఏక – సంశ్రయామ్ = కన్నవారి ఇంటినే ఆశ్రయించి ఉండిపోయిన దానిని; భర్తృమతీమ్ = మగనాలిని, జనః = జనం, అన్యథా = మరోలా, విశంకతే = శంకిస్తుంది. అతః = అందుచేత, ప్రమదా = భర్తృమతి, ప్రియా – వా = మగడికి ఇష్టురాలో, అప్రియా – వా = అనిష్టురాలో, పరిణేతుః + సమీపే = మగడి దగ్గరే ఉండటం, స్వబంధుభిః = తన కన్నవారిచేత, ఇష్యతే = వాంఛింపబడుతుంది.

**తాత్పర్యం:** వివాహితకు తన కన్నవారింట పెద్దకాలమునికి తద్ద తగదు! ఎంతటి పతివ్రతనైనా లోకులు మరోలా శంకిస్తారు. అందుకని – మగడికి ఆమె ఇష్టురాలో అనిష్టురాలో ఏమైనా గానీ వివాహిత తన మగడి చెంతనే ఉండాలని ఆమెవైపు బంధువులంతా కోరుకుంటారు.

**కించ:** కించ = పైగా, అత్రభవతీ = ఈ మాన్యురాలు, మయా = నా చేత, పరిణీతపూర్వా = మునుపే వివాహితురాలా? నేను మునుపే ఈమెను పరిణయమాడానా – అని విస్తుపోవడం.

**హిఅఅ:** (సవిషాదమ్ = విషాదంగా, ఆత్మగతమ్ = తనలో) హృదయ = డెందమా! తే = నీ, ఆశంకా = “కింను ఖల్వార్యపుత్రో భణతి” అనే భయం, సాంప్రతమ్ = యుక్తమే,

**శార్ఙ్గ : కిం కృతకార్యద్వేషో ధర్మం ప్రతి విముఖతా కృతావజ్ఞా?**

**రాజా : కుతోఽయమసత్కల్పనా ప్రశ్నః!?**

**శార్ఙ్గ : మూర్ఛంత్యమీ వికారాః ప్రాయేణైశ్వర్యమత్తేషు. 18**

**రాజా : విశేషేణాధిక్షిప్తోఽస్మి**

**గౌతమీ : జాదే, ముహుత్తఅం మా లజ్జ. అవణఇస్సం దావ దే ఓఉంఠణం. తదో తుమం భట్టా అహిజాణిస్సది. (ఇతి తథోక్తం కరోతి). (జాతే! ముహూర్తం మా లజ్జస్వ. అపనేష్యామి తావత్తేఽవగుంఠనమ్. తతస్త్వాం భర్తా అభిజ్ఞాస్యతి).**

---

ఆసీత్ = అయ్యింది. (సాంప్రతం యుక్తం తే ఆతంక ఆసీత్ – అని పాఠాంతరం. నీ భయం ఇప్పుడు నిజమే అయ్యింది – అని. యుక్తే ద్వే సాంప్రతం స్థానే – ఇత్యమరః).

**కింకృత:** కిమ్ = ఏమీ, కృతకార్య = చేసుకొన్న గాంధర్వవివాహమనే కార్యం పట్ల, ద్వేషః = ఏవగింపా? ధర్మమ్ + ప్రతి = (గృహస్థ) ధర్మం పట్ల, విముఖతా + కిమ్ = వైముఖ్యమా? అవజ్ఞా – కృతా – కిమ్ = మమ్మల్ని అవమానించడమా? (మాకు అవమానం చెయ్యడమా? – అని)

**కుతోఽయమ్:** కుతః + అయమ్ + ప్రశ్నః = ఎక్కడిదీ ప్రశ్న? అసత్ – కల్పనా – ప్రశ్నః లేనిదానిని కల్పించి అడుగుతున్న ప్రశ్న – కుతః = ఎక్కడిది? (న విద్యతేయత్ – తత్ అసత్).

**మూర్ఛంతి:** ప్రాయేణ = తరచుగా, ఐశ్వర్య – మత్తేషు = సంపదలతో ఉద్ధతులైన మీవంటివారియందు, అమీ – వికారాః = ఈ వికారాలు – కృతకార్య ద్వేషాదులైన దోషాలు, మూర్ఛంతి = వర్ధిల్లుతుంటాయి. (మూర్ఛా మోహసముచ్ఛ్రాయయోః). ఇది పూర్వోత్తరార్ధాలుగా విభక్తమైన శ్లోకం.

**విశేషేణ:** విశేషేణ = చాలా తీవ్రంగా, అధిక్షిప్తః + అస్మి = ధిక్కృతుణ్ణి అయ్యాను. చాలా తీవ్రంగా నిందించావు అనడం.

**ముహుత్తఅం:** జాతే = బిడ్డా! ముహూర్తమ్ = క్షణకాలం (కాసేపు), మా– లజ్జస్వ = సిగ్గుపడకు. తే = నీ, అవకుంఠనమ్ = మేల్ముసుగు, అపనేష్యామి – తావత్ = తొలగిస్తాను. తతః = అప్పుడు, భర్తా = నీ ఆర్యపుత్రుడు, త్వామ్ = నిన్ను, అభిజ్ఞాస్యతి = గుర్తుపడతాడు. (ఇతి = అని, తథా+ఉక్తమ్+కరోతి = అలానే చేస్తుంది).

**రాజా : (శకుంతలాం నిర్వర్ణ్య – ఆత్మగతమ్)**

**ఇదముపనతమేవం రూపమక్లిష్టకాంతి**
**ప్రథమ పరిగృహీతం స్యాన్నవేతి వ్యవస్యన్**
**భ్రమర ఇవ విభాతే కుందమంతస్తుషారమ్**
**న చ ఖలు పరిభోక్తుం నైవ శక్నోమి హాతుమ్ 19**

**(ఇతి విచారయన్ స్థితః)**

**ప్రతీహారీ : అహో! ధమ్మావేక్ఖిఆ భట్టిణో!! ఈదిసం ణామ సుహోవణతం రూపం దేక్ఖిఅ కో అణ్ణో విఆరేది? (అహో! ధర్మాపేక్షితా భర్తుః. ఈదృశం నామ సుఖోపనతం రూపం దృష్ట్వా కోఽన్యో విచారయతి?)**

---

**ఇదముపనతమ్:** (శకుంతలామ్ = శకుంతలను, నిర్వర్ణ్య = చూసి, ఆత్మగతమ్ = తనలో) ఏవమ్ = ఇలా, ఉపనతమ్ = తటస్థపడిన, ఇదమ్ = ఈ, అక్లిష్ట కాంతి = మొక్కవోని తేజస్సు గల – అనవద్య సౌందర్యం కల్గిన, రూపమ్ = ఆకృతి, ప్రథమ – పరిగృహీతమ్ = మునుపు పరిగ్రహింపబడినది, స్యాత్ + వా = అవునా, న – వా = కాదా, ఇతి = అని, వ్యవస్యన్ = ఆలోచిస్తున్నవాడనై (అవ్యవస్యన్ = నిశ్చయించుకోలేనివాడనై – పాఠాంతరం), విభాతే = ప్రాతఃకాలంలో, అంతః + తుషారమ్ = మంచు నిండిన, కుందమ్ = మొల్లపువ్వును (కొండమల్లెను), భ్రమరః + ఇవ = తుమ్మెదలాగా, పరిభోక్తుమ్ = ఆస్వాదించడానికి, న + శక్నోమి = చాలకున్నాను, హాతుమ్ + చ = పరిత్యజించడానికీ, న + శక్నోమి + ఏవ + ఖలు = చాలకున్నాను కదా!

**తాత్పర్యం:** ఇలా తనంతతాను తటస్థపడిన ఈ సుందరరూపాన్ని నేను మునుపు పరిణయమాడానా? లేదా? అనే ఆలోచన ఎంతకీ తెగడం లేదు. ఒక నిశ్చయానికి రాలేకపోతున్నాను. ఈమెను పరిగ్రహించడమా? పరిత్యజించడమా? ప్రాతఃకాలంలో మంచునిండిన కుందకుసుమాన్ని ఆస్వాదించలేక విడిచిపెట్టలేక అవస్థపడుతున్న తుమ్మెదలాగా ఉంది నా పరిస్థితి!!

(ఇతి = ఇలా, విచారయన్ = ఆలోచిస్తూ, స్థితః = ఉంటాడు)

**ధమ్మావేక్ఖిఆ:** అహో = ఓహో! భర్తుః = ప్రభువుగారి, ధర్మ + అపేక్షితా = ధర్మనిష్ఠ!! సుఖ + ఉపనతమ్ = అప్రయత్నంగా – సులువుగా – వచ్చిచేరిన, ఈదృశమ్ + నామ = ఇంతటిదైన, రూపమ్ = సౌందర్యాన్ని – సుందరరూపాన్ని, దృష్ట్వా = చూసి, కః + అన్యః = మరొకడెవడు, విచారయతి = ఇలా ఆలోచిస్తూ కూచుంటాడు?

**శార్ఙ్గ : భో రాజన్! కిమితి జోషమాస్యతే?**

**రాజా : భోస్తపోధనాః! చింతయన్నపి న ఖలు స్వీకరణమత్రభవత్యాః స్మరామి. తత్కథమిమామ్ అభివ్యక్త సత్త్వలక్షణాం ప్రత్యాత్మానం క్షేత్రిణమాశంకమానః ప్రతిపత్స్యే?**

**శకు : (ఆత్మగతమ్) హద్ధీ! హద్ధీ! అజ్జస్స పరిణఏ ఏవ్వ సందేహో, కుదో దాణిం మే దూరాహిరోహిణీ ఆసా? (హాధిక్! హాధిక్! ఆర్యస్య పరిణయే ఏవ సందేహః. కుత ఇదానీం మే దూరాధిరోహిణీ ఆశా?)**

---

**కిమితి:** భో రాజన్ = ఓయీ రాజా! కిమ్ + ఇతి = ఏమిది, జోషమ్ + ఆస్యతే = ఊరక ఉండిపోయావ్? (జోషం తూష్ణీం భావే నూనమిత్యవ్యయేషు – హలాయుధః). కిమిదమ్ – పాఠాంతరం.

**చింతయన్:** భోః + తపోధనాః = ఓయీ మునులారా! చింతయన్ + అపి = ఎంతగా ఆలోచించినా (ఆలోచిస్తున్న వాడనైనప్పటికీ), అత్రభవత్యాః = ఈ మాన్యురాలి, స్వీకరణమ్ = స్వీకరణాన్ని, న + స్మరామి – ఖలు = స్మరించలేకపోతున్నాను సుమా! ఈమెను స్వీకరించిన విషయం గుర్తురావడం లేదు – అని. ఎంత ప్రయత్నించినా స్మరణకే రావడం లేదు – అని. తత్ = అందుచేత, ఇమామ్ = ఈ, అభివ్యక్త సత్త్వలక్షణామ్ + ప్రతి = గర్భిణీ లక్షణాలు స్పష్టంగా కనిపిస్తున్న ఈమె విషయంలో, క్షేత్రిణమ్ = గర్భకర్తగా (కళత్రవంతుడిగా. క్షేత్రం పత్నీ – శరీరయోః – అమరం), ఆశంకమానః = నన్ను నేను భావించుకుంటున్నవాడనై, కథమ్ + ప్రతిపత్స్యే = (ఎలా చేపట్టను?) ఎలా అంగీకరించను? (క్షేత్రియమివ మన్యమానః = పరకాంతాసక్తుడిగా భావించుకొంటూ – అని పాఠాంతరం. క్షేత్రియం క్షేత్రజతృణే పరదారరతేఽపి చ – ఇతి విశ్వః. క్షేత్రీ = బీజనిషేక్తా)

**హద్ధీ:** (ఆత్మగతమ్ = తనలో) హాధిక్ – హాధిక్ = అయ్యో! అయ్యో!! ఆర్యస్య = ఆ మాన్యుడికి, పరిణయే + ఏవ = వివాహవిషయంలోనే, సందేహః = సంశయమాయె! ఇదానీమ్ = ఇంక ఇప్పుడు, దూర + అధిరోహిణీ = చాలా దూరం ఎగబ్రాకుతున్న, మే + ఆశా = నా ఆశ, కుతః (జాయతే) = ఎలా సంభవం?! చతురంతమహీసపత్నిని అవుతాను పట్టమహిషిని అవుతాను చక్రవర్తిని కంటాను – ఇలా చాలా దూరం వెళ్ళిన నా ఆశ – ఇంకెక్కడ?! మొదటికే మోసం వస్తే – అని.

**శార్‌ఙ్గ : మా తావత్.**

**కృతాభిమర్శామనుమన్యమానః**
**సుతాం త్వయా నామ మునిర్విమాన్యః**
**ముష్టం ప్రతిగ్రాహయతా స్వమర్థం**
**పాత్రీకృతో దస్యురివాసి యేన. 20**

**శారద్వ : శార్‌ఙ్గరవ! విరమ త్వమిదానీమ్. శకుంతలే! వక్తవ్యమ్ ఉక్తమస్మాభిః. సోఽయమత్రభవానేవ మాహ. దీయతామస్మై ప్రత్యయ ప్రతివచనమ్.**

---

**కృతాభి:** మహారాజా! మా – తావత్ = అలా వద్దులే. ముష్టమ్ = దొంగిలింపబడిన, స్వమ్ + అర్థమ్ = తన సొత్తును, ప్రతిగ్రాహయతా = ప్రతిగ్రహింపజేస్తున్నవాడైన, యేన (మునినా) = ఏ ఋషిచేత, దస్యుః + ఇవ = చోరుడిలాగా, పాత్రీకృతః + అసి = దానస్వీకారానికి పాత్రుడుగా – అర్హుడుగా – చేయబడ్డావో; త్వయా = నీచేత, కృత + అభిమర్శామ్ = చేయబడ్డ బలవంతపు కలయిక కలదైన, సుతామ్ = పుత్రికను, అనుమన్యమానః = ఆమోదించినవాడైన, మునిః + నామ = ఆ మునీశ్వరుడే, విమాన్యః = అవమానింపబడవలసినవాడు – తిరస్కార్యుడు.

**తాత్పర్యం:** నిన్ను కాదులే అనవలసింది. దొంగిలించిన తన సొత్తును దొంగవైన నీకే సమర్పిస్తూ నిన్ను దానయోగ్యుడిగా చేసిన ఆ మునీశ్వరుణ్ని అనాలి. నువ్వు బలాత్కారం చేసిన – కూతుర్ని ఆమోదించిన ఆ మహర్షిని నిందించాలి. మా – తావత్ – త్వామ్ = నిన్ను కానే కాదు.

**విరమ:** శార్ ఙ్గరవా! త్వమ్ = నీవు, ఇదానీమ్ = ఇప్పుడు, విరమ = విరమించు – ఆగు. శకుంతలా! వక్తవ్యమ్ = చెప్పవలసినది, అస్మాభిః = మా చేత, ఉక్తమ్ = చెప్పబడింది. మేము చెప్పవలసినది చెప్పాం! సః + అయమ్ + అత్రభవాన్ = ఈ మహానుభావుడు, ఏవమ్ + ఆహ = ఇలా అన్నాడు. అస్మై = ఇతడికి, ప్రత్యయ – ప్రతివచనమ్ = నమ్మకం కలిగించే సమాధానం, దీయతామ్ = ఇయ్యి (ఇవ్వబడుగాక! ప్రత్యయ జనకం ప్రతివచనమితి మధ్యమ పదలోపి సమాసః – రాఘవభట్టు).

**ఇమం:** (ఆత్మగతమ్ = తనలో) తాదృశే అనురాగే = అటువంటిదైన అనురాగం, ఇదమ్ + అవస్థాంతరమ్ + గతే = (గుర్తుచేయవలసినదై) ఇటువంటి దుర్దశను పొందాక, కిమ్ + వా – స్మారితేన = గుర్తుచేసే ప్రయోజనం ఏమిటి? మే = నా, ఆత్మా = హృదయమే,

**శకు : (ఆత్మగతమ్) ఇమం అవత్థంతరం గదే తారిసే అణురాఏ కిం వా సుమరావిదేణ. అత్తా దాణిం మే సోఅణీఓ త్తి వవసిదం ఏదం. (ప్రకాశమ్) అజ్జఉత్త (ఇత్యర్ధోక్తే) సంసఇదే దాణిం ణ ఏసో సముదాఆరో. పోరవ, ణ జుత్తం ణామ దే తహ పురా అస్సమపదే సహావుత్తాణహిఅఅం ఇమం జణం సమఅపువ్వం పతారిఅ ఈదిసేహిం అక్కరేహిం పచ్చాచక్ఖిదుం. (ఇదమవస్థాంతరం గతే తాదృశే అనురాగే కిం వా స్మారితేన? ఆత్మేదానీం మే శోచనీయ ఇతి వ్యవసిత మేతత్. ఆర్యపుత్ర! సంశయిత ఇదానీం నైష సముదాచారః. పౌరవ! న యుక్తం నామ తే తథా పురాశ్రమపదే స్వభావోత్తానహృదయ మిమం జనం సమయపూర్వం ప్రతార్యేదృశైరక్షరైః ప్రత్యాఖ్యాతుమ్)**

**రాజా : (కర్ణౌ పిధాయ) శాంతం పాపమ్!**

---

ఇదానీమ్ = ఇప్పుడు, శోచనీయః + ఇతి = శోచనీయం అని, ఏతత్ – వ్యవసితమ్ = ఇది ఇలా పరిణమించింది – ఇది నిశ్చితం. నా హృదయాన్ని తలుచుకొని నేను విలపించవలసినదే – అని. ఇక నన్ను గురించి నేను దుఃఖపడవలసినదే – కందుకూరి. (ప్రకాశమ్ = ప్రకాశంగా) ఆర్యపుత్ర = ఆర్యపుత్ర అనబోయి (అర్ధోక్తే = సగం అని ఆపి. భర్తనే అలా పిలవాలి కాబట్టి), సంశయితః = వివాహవిషయంలో సంశయిస్తున్నాడు, ఇదానీమ్ = ఈ సమయంలో, ఏషః = ఆర్యపుత్ర అని సంబోధించడమనేది, న– సముదాచారః = సబబు కాదు – అని తనకు తాను ఆత్మగతంగా సర్దిచెప్పుకొని అప్పుడు ప్రకాశంగా – పౌరవ = పురువంశోద్భవా! తథా = అలా, పురా = అప్పుడు, ఆశ్రమపదే = మా ఆశ్రమసీమలో, స్వభావ + ఉత్తాన – హృదయమ్ = సహజంగానే బేల హృదయం గల, ఇమమ్ – జనమ్ = ఈ నన్ను – అన్నెం పున్నెం ఎరగని నన్ను, సమయపూర్వమ్ = ప్రతిజ్ఞాపూర్వకంగా – సంకేత పూర్వకంగా (సమయాః శపథాచార కాలసిద్ధాంతసంవిదః – అని అమరం చెప్పిన అన్ని అర్థాలలోనూ), ప్రతార్య = వంచించి, ఈదృశైః + అక్షరైః = ఇప్పుడిలాంటి మాటలతో, ప్రత్యాఖ్యాతుమ్ = తిరస్కరించడం, తే = నీకు, న–యుక్తమ్ – నామ = సమంజసం కాదు సుమా!

**శాంతమ్:** (కర్ణౌ + పిధాయ = చెవులు మూసికొని) శాంతమ్ – పాపమ్ = పాపము శమించుగాక!

**వ్యపదేశమావిలయితుం కిమీహసే జనమిమంచ పాతయితుమ్**
**కూలంకషేవ సింధుః ప్రసన్నమంభస్తట తరుం చ. 21**

**శకు : హోదు. జఇ పరమత్థతో పరపరిగ్గహ సంకిణా తుఏ ఏవ్వం వత్తుం పఉత్తం తా అహిణ్ణాణేన ఇమిణా తుహ ఆసంకం అవణఇస్సం. (భవతు. యది పరమార్థతః పరపరిగ్రహశంకినా త్వయైవం వక్తుం ప్రవృత్తం తదభిజ్ఞానేనానేన తవాశంక మపనేష్యామి).**

**రాజా : ఉదారః కల్పః.**

---

**వ్యపదేశమ్:** కూలంకషా – సింధుః = ఒడ్డులు ఒరుసుకొంటూ ప్రవహించే నది, ప్రసన్నమ్ + అంభః = స్వచ్ఛమైన నీటినీ, తట – తరుమ్ + చ = గట్టుమీది చెట్టునూ, ఇవ = వలె; వ్యపదేశమ్ = మా వంశప్రతిష్ఠను, ఆవిలయితుమ్ = కలుషితం చెయ్యడానికీ, ఇమమ్ = ఈ, జనమ్ = నన్ను (ఈ మనిషిని), పాతయితుమ్ + చ = పతితుణ్ని చెయ్యడానికీ, ఈహసే – కిమ్ = వాంఛిస్తున్నావా?

**తాత్పర్యం:** వరదనది – నీటిని కలుషితం చేస్తుంది. ఒడ్డున ఉన్న చెట్టును కూలుస్తుంది. అలాగ నువ్విప్పుడు మా వంశప్రతిష్ఠను కలుషితం చెయ్యడానికీ, నన్ను పతితుణ్ని (ధర్మ భ్రష్టుణ్ని) చెయ్యడానికీ ప్రయత్నిస్తున్నావా?

**హోదు:** భవతు = కాదు. పరమార్థతః = వాస్తవానికి, పరపరిగ్రహశంకినా = పరకాంతను పరిగ్రహించడమవుతుందేమో అని శంకిస్తున్నవాడవే అయిన, త్వయా = నీచేత, ఏవమ్ – వక్తుమ్ = ఇలా మాట్లాడటానికి, యది – ప్రవృత్తమ్= ప్రారంభింప బడినట్టయితే – నిజంగా పాపశంకతోనే నువ్వు నన్ను తిరస్కరిస్తున్నట్టయితే, తత్ = (అలనాడు నువ్వు ఇచ్చిన) ఆ, అనేన = ఈ, అభిజ్ఞానేన = ఆనవాలుతో – గుర్తింపు చిహ్నంతో, తవ + ఆశంకమ్ = నీ ఆశంకను, అపనేష్యామి = తొలగిస్తాను.

**ఉదారః:** ఉదారః + కల్పః = ఇది ఉత్తమ న్యాయం – ఉత్తమ పక్షం. (కల్పః స్యాత్ ప్రత్యయే న్యాయే – ఇతి విశ్వః)

**హద్ధీ:** (ముద్రాస్థానమ్ = ఉంగరం వ్రేలును, పరామృశ్య = తడిమి) హాధిక్ = అయ్యో! మే + అంగులిః = నా వ్రేలు, అంగులీయకశూన్యా = అంగులీయకరహితం – నా వేలుకు

**శకు : (ముద్రాస్థానం పరామృశ్య) హద్ధీ! అంగులీఅఅసుణ్ణా మే అంగులీ. (ఇతి సవిషాదం గౌతమీమవేక్షతే). (హాధిక్! అంగులీయకశూన్యా మే అంగుళిః!!)**

**గౌతమీ : ణూణం దే సక్కావదారబ్భంతరే సచీతిత్థసలిలం వందమాణాఏ పబ్భట్ఠం అంగులీఅఅం. (నూనం తే శక్రావతారాభ్యంతరే శచీతీర్థ సలిలం వందమానాయాః ప్రభ్రష్టమంగులీయకమ్)**

**రాజా : (సస్మితమ్) ఇదం తత్ప్రత్యుత్పన్నమతి స్త్రైణమితి యదుచ్యతే.**

**శకు : ఏత్థ దావ విహిణా దంసిదం పహుత్తణం. అవరం దే కహిస్సం. (అత్ర తావద్విధినా దర్శితం ప్రభుత్వమ్. అపరం తే కథయిష్యామి)**

**రాజా : శ్రోతవ్యమిదానీం సంవృత్తమ్**

---

ఉంగరం లేదు – అని. (ఇతి = అని, సవిషాదమ్ = దుఃఖంతో, గౌతమీమ్ + అవేక్షతే = గౌతమివైపు చూస్తుంది).

**ణూణం:** శక్రావతార + అభ్యంతరే = గంగానదిలోని శక్రావతారఘట్టంలో, శచీతీర్థ – సలిలమ్ = శచీతీర్థోదకాలను, వందమానాయాః = నమస్కరిస్తున్నదానవైన (దోసిలితో నీటిని విడిచేటప్పుడు), తే = నీయొక్క, అంగులీయకమ్ = ఉంగరం, నూనమ్ + ప్రభ్రష్టమ్ = తప్పక జారిపోయి ఉంటుంది. ఆ రేవులో అర్ఘ్యం ఇస్తున్నప్పుడు కచ్చితంగా జారిపోయిందనడం.

**ఇదమ్:** (సస్మితమ్ = చిరునవ్వుతో) స్త్రైణమ్ = స్త్రీ సమూహం, ప్రత్యుత్పన్నమతి = సమయస్ఫూర్తి కలది, ఇతి = అని, యత్ + ఉచ్యతే = ఏది చెప్పబడుతోందో, తత్ = అది, ఇదమ్ = ఇదే! (తాత్కాలికీ తు ప్రతిభా ప్రత్యుత్పన్నమతిః స్మృతా).

**ఏత్థ దావ:** అత్ర – తావత్ = ఈవిషయంలో, విధినా = దైవం చేత, ప్రభుత్వమ్ = ప్రాభవం, దర్శితమ్ = ప్రదర్శింపబడింది. విధి తన ప్రభావం చూపించింది – అనడం. అపరమ్ = మరొకటి, తే = నీకు, కథయిష్యామి = (ఆనవాలుగా) చెబుతాను.

**శ్రోతవ్యమ్:** శ్రోతవ్యమ్ = వినవలసినది, ఇదానీమ్ = ఇప్పుడు, సంవృత్తమ్ = ఏర్పడింది. చూడవలసింది అయ్యింది, ఇప్పుడింక వినవలసింది వచ్చింది – అని వెటకారం.

**శకు : ణం ఏకస్సిం దిఅహే ణోమాలిఆమండవే ణలినీపత్తభాఅణగదం ఉఅఅం తుహ హత్థే సంణిహిదం ఆసి. (నన్వేకస్మిన్ దివసే నవమాలికామండపే నళినీపత్రభాజనగతముదకం తవ హస్తే సన్నిహితమాసీత్)**

**రాజా : శృణుమస్తావత్**

**శకు : తక్కణం సో మే పుత్తకిదఓ దీహాపంగోణామ మిఅపోదఓ ఉవట్ఠిఓ. తుఏ అఅం దావ పఢమం పిఅఉ త్తి అణుఅంపిణా ఉవచ్ఛందిదో ఉఅఏణ. ణ ఉణ దే అపరిచయాదో హత్థబ్భాసం ఉవగదో. పచ్ఛా తస్సిం ఏవ్వ మఏ గహిదే సలిలే ణేణ కిదో పణఓ. తదా తుమం ఇత్థం పహసిదోసి. సవ్వో సగంధేసు విస్ససిది. దువేవి ఏత్థ ఆరణ్ణఆ త్తి. (తత్ క్షణే స మే పుత్రకృతకో దీర్ఘాపాంగోనామ మృగపోతక ఉపస్థితః. త్వయాయం తావత్ప్రథమం పిబత్వితి అనుకంపినోపచ్ఛందిత ఉదకేన. న పునస్తేఽపరిచయాత్ హస్తాభ్యాశ ముపగతః. పశ్చాత్తస్మిన్నేవ మయా గృహీతే సలిలే అనేన కృతః ప్రణయః. తదా త్వమిత్థం ప్రహసితోఽసి. సర్వః సగంధేషు విశ్వసితి. ద్వావప్యత్రారణ్యకావితి).**

---

**ణం ఏకస్సిం:** నను = విను. ఏకస్మిన్ – దివసే = ఒకనాడు, నవమాలికామండపే = విరజాజిపూదీగెల (మండపంలో) పొదరింటిలో, నళినీపత్ర – భాజన – గతమ్ = తామరాకు దొన్నెలో పట్టిన, ఉదకమ్ = నీరు, తవ – హస్తే = నీచేతిలో, సత్ + నిహితమ్ + ఆసీత్ = ఉంచబడింది. ఆ దొన్నెను నీ చేతికిచ్చాను – అని.

**శృణుమః:** శృణుమః + తావత్ = వింటున్నాం లే!!

**తక్కణం:** తత్ + క్షణే = ఆ సమయంలో, మే = నాకు, పుత్రకృతకః = కొడుకు లాంటివాడు – కొడుకులా నేను పెంచిన, దీర్ఘాపాంగః + నామ = దీర్ఘాపాంగం అనే పేరు కల్గినవాడు, మృగపోతకః = ఒక లేడిపిల్లడు, ఉపస్థితః = మన చెంతకు వచ్చాడు. అయమ్ = వీడు, (తావత్ – వాక్యాలంకారం), ప్రథమమ్ – పిబతు = ముందుగా త్రాగుగాక, ఇతి = అని, అనుకంపినా = కనికరించినవాడవైన, త్వయా = నీచేత, ఉదకేన + ఉపచ్ఛందితః = నీరు ఆసజూపి ఆహ్వానింపబడినాడు. దొన్నెలో నీరు చూపి త్రాగడానికి రా! రా! అని పిలిచావనడం. పునః = కానీ, అపరిచయాత్ = పరిచయం లేకపోవడం వల్ల, తే = నీ, హస్త + అభ్యాశమ్ = చేతి చెంతకు, న + ఉపగతః = దీర్ఘాపాంగుడు రాలేదు. పశ్చాత్

**రాజా : ఏవమాదిభిః ఆత్మకార్యనిర్వర్తినీనామ్ అనృతమయవాఙ్మధుభిః ఆకృష్యంతే విషయిణః**

**గౌతమీ : మహాభాఅ, ణ అరుహసి ఏవ్వం మంతిదుం. తబోవణసంవడ్డితో అణభిణ్ణో అఅం జణో కఇదవస్స. (మహాభాగ! నార్హస్యేవం మంత్రయితుమ్. తపోవనసంవర్ధితోఽనభిజ్ఞోఽయం జనః కైతవస్య)**

**రాజా : తాపసవృద్ధే!**

**స్త్రీణామశిక్షిత పటుత్వమమానుషీషు**
**సందృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః**

---

= తరువాత, మయా = నాచేత, గృహీతే (సతి) = స్వీకరింపబడగానే, తస్మిన్ + ఏవ – సలిలే = అదే నీటి విషయంలో, అనేన = దీర్ఘాపాంగుడి చేత, ప్రణయః + కృతః = అభిలషింపబడింది. అదే దొన్నెను నేను పట్టుకొని – రమ్మనగానే నా లేడిపిల్లడు వచ్చి ఆ నీరు త్రాగాడు – అని. తదా = అప్పుడు, త్వమ్ = నువ్వు, ఇత్థమ్ = ఇలా, ప్రహసితః + అసి = వేళాకోళమాడావు. సర్వః = ఎవడుగానీ (ప్రతివాడూ), సగంధేషు = సజాతివారియందే (సజాతీయులనే), విశ్వసతి = నమ్మకం ఉంచుతాడు (నమ్ముతాడు). అత్ర = ప్రస్తుతం, ద్వౌ + అపి = మీరిద్దరూ కూడా, ఆరణ్యకౌ + ఇతి = ఆటవికులు గదా – అని. మీ ఇద్దరిదీ అరణ్యంలో నివసించే జాతి గదా – అని మేలమాడావు. (సగంధేషు = స్వవర్గేషు – స్వయూథ్యేషు – వ్యాఖ్యాతలు).

**ఏవమాదిభిః:** ఆత్మకార్య – నిర్వర్తినీనామ్ = తమ పనిని చక్కబెట్టుకునే నెరజాణల, ఏవమ్ + ఆదిభిః = ఇట్లాంటివైన, అనృతమయ + వాక్ + మధుభిః = అసత్యవాక్కులు అనే మధువులతో, విషయిణః = విషయ సుఖలోలురు – కాముకులు, ఆకృష్యంతే = ఆకర్షింపబడుతుంటారు!!

**మహాభాఅ:** మహాభాగ = మహానుభావా! ఏవమ్ + మంత్రయితుమ్ = ఇలా అనడానికి, న + అర్హసి = తగవు. నువ్వు ఇలా అనెయ్యడం తగదు – అని. తపోవన – సంవర్ధితః = ఆశ్రమంలో (పుట్టి) పెరిగిన, అయమ్ – జనః = ఈ మానిసి, కైతవస్య = వంచనకు, అనభిజ్ఞః = తెలియనిది. వంచించడం ఎరగనిది – అని.

**స్త్రీణామ్:** తాపసవృద్ధే = ఓ వృద్ధతాపసీ! స్త్రీణామ్ = ఆడువారికి, అశిక్షిత – పటుత్వమ్ = ఎవరూ నేర్పకుండానే (పుట్టుకతోనే) వచ్చిన నెరజాణతనం, అమానుషీషు =

**ప్రాగంతరిక్షగమనాత్ స్వమపత్యజాతమ్**
**అన్యైర్ద్విజైః పరభృతాః ఖలు పోషయంతి.** **22**

**శకు : (సరోషమ్) అణజ్జ, అత్తణో హిఅఆణుమాణేణ పేక్ఖసి. కో దాణిం అణ్ణో ధమ్మకంచుఅప్పవేసిణో తిణచ్ఛణ్ణ కూవోవమస్స తవ అణుకిదం పఢివదిస్సది. (అనార్య! ఆత్మనో హృదయానుమానేన పశ్యసి. క ఇదానీమన్యో ధర్మకంచుకప్రవేశిన స్తృణచ్ఛన్నకూపోపమస్య తవానుకృతిం ప్రతిపత్స్యతే?)**

---

మానవేతరస్త్రీలలో సైతం, సందృశ్యతే = స్పష్టంగా కనపడుతోంది. యాః = ఎవరైతే, ప్రతిబోధవత్యః = శిక్షిత పాటవంకలవారో (నేర్పబడిన జ్ఞానం కలవారో), తాః = వారిని గురించి (అధ్యాహార్యం), కిముత = ఇక చెప్పేదేముంది? పరభృతాః = కోకిలలు (వాటి పేరే పర–భృతాలు), స్వమ్ + అపత్యజాతమ్ = తమ పిల్లల గుంపును – అందరినీ, అంతరిక్ష – గమనాత్ + ప్రాక్ = అవి ఎగరడానికి ముందుదాకా, అన్యైః + ద్విజైః = మరోజాతి పక్షులతో (కాకులతో), పోషయంతి + ఖలు = పోషింపజేస్తున్నాయి గదా!

**తాత్పర్యం:** ఆడవాళ్లు సహజంగానే నెరజాణలు. ఇది మానవేతర జాతులలో కూడా స్పష్టంగా కనబడుతోంది. వాళ్ళు మరి చదువుకున్నవాళ్ళు కూడా అయితే ఇక చెప్పేదేముంది! కోకిలాంగనలు చూడండి – తమ బిడ్డల్ని వాటికి రెక్కలు వచ్చేదాకా మరోజాతి పక్షులతో – అదే – కాకులతో పోషింపజేస్తున్నాయి. కనేది కోకిలలు, సాకేది కాకులు!!

**అణజ్జ:** (సరోషమ్ = తీవ్రకోపంతో) అనార్య = (దుష్టుడా) అసజ్జనుడా! ఆత్మనః = నీదైన, హృదయ + అనుమానేన = మానసికమైన అనుమానంతో, పశ్యసి = చూస్తున్నావు. నీ బుద్ధి అలాంటిది కాబట్టి, అందరూ నీకు అలాగే కనిపిస్తున్నారు అని. ధర్మ – కంచుక – ప్రవేశినః = ధర్మం అనే ముసుగులో దూరినవాడవూ, తృణ + ఛన్న – కూప + ఉపమస్య = గడ్డి కప్పిన నుయ్యిలాంటివాడవూ అయిన, తవ + అనుకృతిమ్ = నీ పోలికను, ఇదానీమ్ = ఇప్పుడు, అన్యః + కః + ప్రతిపత్స్యతే = మరొకడెవడు పొందగలడు? ఇదానీమ్ = ప్రస్తుతానికి, నీకు సాటి మరెవ్వడూ లేడు – అని.

**సందిగ్ధ:** (ఆత్మగతమ్ = తనలో). అస్యాః + కోపః = ఈమె కోపం, మామ్ = నన్ను, సందిగ్ధ బుద్ధిమ్ + కుర్వన్ = తప్పుచేస్తున్నానేమో అనే సందేహంతో కూడిన

**రాజా : (ఆత్మగతమ్) సందిగ్ధబుద్ధిం మాం కుర్వన్నకైతవ ఇవాస్యాః కోపో లక్ష్యతే. తథా హ్యనయా –**

**మయ్యేవ విస్మరణదారుణ చిత్తవృత్తౌ**
**వృత్తం రహః ప్రణయమప్రతిపద్యమానే**
**భేదాత్ భ్రువోః కుటిలయోరతిలోహితాక్ష్యా**
**భగ్నం శరాసనమివాతిరుషా స్మరస్య 23**

**(ప్రకాశమ్) భద్రే! ప్రథితం దుష్యంతస్య చరితమ్. తథాపీదం న లక్ష్యతే**

---

బుద్ధికలవాడినిగా చేస్తూ – నన్నే సందేహంలో పడవేస్తూ, అకైతవః + ఇవః = కపటమైనది కాదు అన్నట్టుగా, లక్ష్యతే = కనిపిస్తోంది. ఈమె కోపం – నాటకం కాదు, నిజమైనదే అనిపిస్తోంది – అని. తథాహి = అవును. అనయా = ఈమెచేత –

**మయ్యేవ:** విస్మరణ = మరపు అనే – లేదా – మరపుచేత, దారుణ = క్రూరమైన, చిత్తవృత్తౌ = మనః ప్రవృత్తికలవాడనూ, వృత్తమ్ = జరిగినదైన, రహః ప్రణయమ్ = రహస్యప్రేమను, అప్రతిపద్యమానే = గుర్తుతెచ్చుకోలేకపోతున్నవాడనూ అయిన, మయి + ఏవ = నా మీదనే; అతిలోహితాక్ష్యా = కట్టెర్రబడ్డ కన్నులు కలదైన ఈమె చేత, కుటిలయోః = వక్రాలైన, భ్రువోః = కన్బొమల, భేదాత్ = విరుపుతో, అతిరుషా = తీవ్రకోపం చేత, స్మరస్య = మన్మథుడి, శరాసనమ్ = విల్లు, భగ్నమ్ + ఇవ = విరిగినట్టు చూడబడింది – విరిచినట్టనిపిస్తోంది.

**తాత్పర్యం:** మరపు అనే దారుణ చిత్తవృత్తి కలవాడనై రహస్యంగా జరిగిన ప్రణయవృత్తాంతాన్ని గుర్తుతెచ్చుకోలేక పోతున్నానేమో. నావైపు – తీవ్రంగా ఎర్రబడ్డ కన్నులతో ఈమె చూసింది. కుటిలాలైన కనుబొమలను విరిచింది. అతికోపంతో మన్మథుడి విల్లే విరిగిందనిపించింది.

**భద్రే:** (ప్రకాశమ్ = ప్రకాశంగా), భద్రే = కల్యాణీ! (ప్రసన్నముఖీ!) దుష్యంతస్య = దుష్యంతుడి, చరితమ్ = నడవడి, ప్రథితమ్ = సుప్రసిద్ధం. తథాపి = అయినా, ఇదమ్ = నువ్వు అంటున్న ఈ విషయం (పరిణయరూపచరితమ్), న – లక్ష్యతే (– లక్షయే) = కాన రాకున్నది – తెలియలేకపోతున్నాను. (ఈ రెండవ వాక్యం చాలా ప్రతులలో లేదు)

**సుట్ఠుదావ:** ముఖమధోః = ముఖంలో తేనె (మాటలలో తేనె), హృదయస్థిత విషస్య = హృదయంలో విషమూ కలిగినవాడైన, అస్య = ఇతడికి, యా + అహమ్ = ఏ నేను,

**శకు : సుట్ఠుదావ అత్త సచ్ఛందచారిణీ కిదహ్మి యా అహం ఇమస్స పురువంసప్పచ్చఏణ ముహమహుణో హిఅఅట్ఠిఅ విసస్స హత్థబ్భాసం ఉవగదా. (ఇతి పటాంతేన ముఖమావృత్య రోదితి). (సుష్ఠు తావదత్ర స్వచ్ఛందచారిణీ కృతాస్మి యాహమస్య పురువంశప్రత్యయేన ముఖమధోః హృదయస్థిత విషస్య హస్తాభ్యాశముపగతా).**

**శార్ఙ్గ : ఇత్థ మాత్మకృత మప్రతిహతం చాపలం దహతి**
**అతః పరీక్ష్య కర్తవ్యం విశేషాత్సంగతం రహః**
**అజ్ఞాతహృదయేష్వేవం వైరీభవతి సౌహృదమ్. 24**

---

పురువంశ – ప్రత్యయేన = పురువంశం మీది విశ్వాసంతో, హస్తాభ్యాశమ్ + ఉపగతా = చేతికి చేరువ అయ్యానో (చేతికి చిక్కానో), సా+అహమ్ = ఆ నేను, అత్ర = ఇక్కడ, సుష్ఠు = పూర్తిగా, స్వచ్ఛందచారిణీ = స్వైరిణిని, కృతా+అస్మి = కావింపబడ్డాను. (మంచిది. నన్నొక స్వైరిణిని చేశావు – అన్నది రసోచితమైన వాక్యోపక్రమం).

(ఇతి = అని, పటాంతేన = కొంగుతో, ముఖమ్ + ఆవృత్య = ముఖం కప్పుకొని, రోదితి = విలపిస్తుంది)

**ఇత్థమ్:** ఆత్మకృతమ్ = స్వయంకృతమైన, చాపలం = అనాలోచితమైన పని – చాపల్యం, ఇత్థమ్ = ఇలా, అప్రతిహతమ్ – దహతి = తిరుగులేనిదై దహించివేస్తుంది. (కొన్ని ప్రతులలో – ప్రతిహతమ్ + దహతి = అవరుద్ధమై దహిస్తుంది – అని పాఠాంతరం)

**అతః:** అతః = అందుచేత, పరీక్ష్య = బాగా పరీక్షించి – ఆలోచించి, కర్తవ్యమ్ = చెయ్యాలి, విశేషాత్ = మరీ ముఖ్యంగా, రహః + సంగతమ్ = రహస్యమైన కలయిక – రహస్యమైత్రి. అజ్ఞాత – హృదయేషు = అంతుచిక్కని అంతరంగం కలవారి విషయంలో, సౌహృదమ్ = మైత్రి, ఏవమ్ = ఇలా, వైరీభవతి = (శత్రువవుతుంది) బెడిసికొడుతుంది.

**తాత్పర్యం:** అందుకనే స్నేహాలు చాలా ఆలోచించుకుని చెయ్యాలి. ముందే పరీక్షించుకోవాలి. మరీ ముఖ్యంగా ఇలాంటి రహస్య స్నేహాలూ – కలయికలూను. లేకపోతే మనసు అంతుబట్టనివారి విషయంలో స్నేహాలు ఇలాగే బెడిసికొడతాయి.

**రాజా : అయి భోః! కి మత్రభవతీప్రత్యయాదేవ అస్మాన్ సంయుతదోషాక్షరైః క్షిణుథ?**

**శార్ఙ్గ : (సాసూయమ్) శ్రుతం భవద్భి రధరోత్తరమ్?**

**ఆజన్మనః శాఠ్యమశిక్షితో య**
**స్తస్యాప్రమాణం వచనం జనస్య**
**పరాతిసంధానమధీయతే యైః**
**విద్యేతి తే సంతు కిలాప్తవాచః. 25**

**రాజా : భోస్సత్యవాదిన్! అభ్యుపగతం తావదస్మాభిరేవమ్. కిం పున రిమా మతిసంధాయ లభ్యతే?**

---

**అయి భోః:** అయి భోః = ఏమండీ!! అత్రభవతీ – ప్రత్యయాత్ + ఏవ = కేవలం ఈ మాన్యురాలిమీది నమ్మకంతో, అస్మాన్ = మమ్మల్ని, సంయుతదోష + అక్షరైః = దోషుల్ని చేసే మాటలతో – నిందావాక్యాలతో, కిమ్ + క్షిణుథ = హింసిస్తారేమి?

**శ్రుతమ్:** (సాసూయమ్ = అసూయతో) భవద్భిః = తమచేత, అధరోత్తరమ్ = ఈ నీచపు మాట, శ్రుతమ్ = ఆలకింపబడినదా? ఈ పనికి మాలినమాట ఎప్పుడన్నా తమరు విన్నారా? – అని దెప్పడం. (అధరం = హీనం చ తదుత్తరం చ = అధరోత్తరమ్. అధరో దంతవసనేఽనూర్ధ్వే హీనేఽధరోఽన్యవత్ – ఇతి విశ్వః – రాఘవభట్టు)

**ఆజన్మనః:** యః = ఎవడు, ఆజన్మనః = పుట్టినది మొదలుగా, శాఠ్యమ్ = వంచన, అశిక్షితః = నేర్వడో, తస్య – జనస్య = ఆ జీవుడి, వచనమ్ = మాట, అప్రమాణమ్ = నమ్మదగ్గది కాదు. యైః = ఎవరిచేత, పర + అతిసంధానమ్ = పరులను వంచించడం, విద్యా + ఇతి = అదొక నీతి అని, అధీయతే = నేర్వబడుతోందో – అభ్యసింపబడుతోందో, తే–కిల = వాళ్లేమో, ఆప్తవాచః + సంతు = సత్యవచనులు అవుతున్నారు!!

**తాత్పర్యం:** పుట్టింది మొదలు ఏనాడూ వంచన అనేదే ఎరగనివాడి మాట అప్రమాణమవుతోంది. పరులను – వంచించడం ఒక విద్యగా అభ్యసించినవాళ్లేమో సత్యభాషణలు – అవుతున్నారు!! (కిల శబ్దస్తు వార్తాయాం సంభావ్యానునయార్థయోః – ఇతి విశ్వః. వ్యలీక మతిసంధానం వంచనం చ ప్రతారణమ్ – ఇత్యమరః)

**భోస్సత్య:** భోః + సత్యవాదిన్ = ఓయీ సత్యవాదీ! అస్మాభిః = మాచేత, ఏవమ్ = నీవన్నట్టుగా, అభ్యుపగతమ్ + తావత్ = అంగీకరింపబడుగాక! సరే – మేము

**శార్ఙ్గ : వినిపాతః!**

**రాజా : వినిపాతః పౌరవైః ప్రార్థ్యత ఇతి న శ్రద్ధేయమ్.**

**శారద్వతః : శార్ఙ్గరవ! కిముత్తరోత్తరేణ. అనుష్ఠితో గురోస్సందేశః. ప్రతినివర్తామహే వయమ్. (రాజానం ప్రతి) రాజన్!**

**తదేషా భవతః కాంతా త్యజవైనాం గృహాణ వా**
**ఉపపన్నా హి దారేషు ప్రభుతా సర్వతోముఖీ ! 26**

**గౌతమి! గచ్ఛాగ్రతః.**

**(ఇతి ప్రస్థితాః)**

---

వంచకులమే, ఒప్పుకుందాం. పునః = కానీ, ఇమామ్ = ఈమెను, అతిసంధాయ = వంచించి, కిమ్ + లభ్యతే = ఏమి పొందబడుతుంది? ఈమెను వంచించినందువల్ల మాకు ఒరిగేది ఏమిటి? – అని.

**వినిపాతః:** వినిపాతః = మహాపాపం! (మహాపతనం!!)

**పౌరవైః:** వినిపాతః = మహాపాపమనేది, పౌరవైః = పురువంశజులచేత, ప్రార్థ్యతే + ఇతి = కోరబడుతోంది అనేది, న– శ్రద్ధేయమ్ = (అంగీకరించను) నమ్మదగినది కాదు. మేము మహాపాపం కోరుకోము – అనడం.

**కిముత్తర:** శార్ ఙ్గరవా! కిమ్ + ఉత్తరోత్తరేణ = మునుముందటి సంగతితో మనకేమి? (కిమ్ + అధరోత్తరేణ = ఈ పనికిమాలిన మాటలతో నేమి పని? – పాఠాంతరం) గురోః+సందేశః = గురువుగారి ఆజ్ఞ (నియోగః = ఆజ్ఞ – అని పాఠాంతరం), అనుష్ఠితః = అనుష్ఠింపబడింది. వారు చెయ్యమన్నది చేశాము – అని. వయమ్ = మనం, ప్రతినివర్తామహే = తిరిగి వెళ్ళిపోదాం! (రాజానమ్ + ప్రతి = రాజునుద్దేశించి) –

**తదేషా:** రాజన్ = మహారాజా! తత్ = అందుచేత, ఏషా = ఈమె, భవతః + కాంతా = నీ ఇల్లాలు. ఏనామ్ = ఈమెను, త్యజ – వా = విడిచిపెడతావో? గృహాణ – వా = స్వీకరిస్తావో? దారేషు = ఇల్లాలి విషయంలో, సర్వతోముఖీ – ప్రభుతా = అన్నివిధాల అధికారమూ, ఉపపన్నా – హి = భర్తకు ఉన్నదే కదా!!

**తాత్పర్యం:** ఇంతకూ ఈమె నీ ఇల్లాలు. ఈమెను విడిచిపెడతావో, పరిగ్రహిస్తావో నీ ఇష్టం. ఇల్లాలి విషయంలో అన్ని అధికారాలూ మగడివే కదా! (దారశబ్దం పుంలింగం

**శకు : కహం ఇమిణా కిదవేణ విప్పలద్ధహ్మి. తుంహే వి మం పరిచ్చహ?**

**(ఇత్యనుప్రతిష్ఠతే) (కథమనేన కితవేన విప్రలబ్ధాస్మి, యూయమపి మాం పరిత్యజథ?)**

**గౌతమీ : (స్థిత్వా) వచ్ఛ సంగరవ, అణుగచ్ఛది ఇఅం క్ఖు ణో కరుణ పరిదేవిణీ సఉందలా. పచ్చాదేసపరుసే భత్తుణి కిం వా మే పుత్తిఆ కరేదు?! (వత్స! శార్ఙ్గరవ! అనుగచ్ఛతీయం ఖలు నః కరుణపరిదేవినీ శకుంతలా. ప్రత్యాదేశపరుషే భర్తరి కిం వా మే పుత్రికా కరోతు?!)**

**శార్ఙ్గ : (సరోషం నివృత్య) కిం పురోభాగే! స్వాతంత్ర్యమవలంబసే?**

**(శకుంతలా భీతా వేపతే)**

---

– నిత్యబహువచనం) గౌతమి = ఓ గౌతమీ, అగ్రతః + గచ్ఛ = నువ్వు ముందు నడు!! (రాజన్! కిముత్తరోత్తరేణ నుంచి ఇక్కడిదాకా శార్ఙ్గరవుడి భాషణంగా కొన్ని ప్రతులలోని పాఠం).

(ఇతి = అని, ప్రస్థితాః = బయలుదేరుతారు)

**కహం:** కథమ్ = ఎట్టా!? అనేన = ఈ, కితవేన = ధూర్తుడిచేత, విప్రలబ్ధా + అస్మి = వంచితురాలినయ్యాను, యూయమ్ + అపి = మీరుకూడా, మామ్ = నన్ను, పరిత్యజథ = విడిచిపెట్టేస్తారా? (ఇతి = అని, అనుప్రతిష్ఠతే = వెంటబయలుదేరుతుంది)

**వచ్ఛ:** (స్థిత్వా = ఆగి), వత్స శార్ఙ్గరవ! = నాయనా శార్ఙ్గరవా! కరుణ పరిదేవినీ = దీనంగా (బ్రతిమాలు తున్నదై) విలపిస్తున్నదై, ఇయమ్ = ఇదిగో, శకుంతలా = శకుంతల, నః = మనలను, అనుగచ్ఛతి – ఖలు = అనుసరిస్తోంది గదా! ప్రత్యాదేశ – పరుషే = తిరస్కరించిన కఠినాత్ముడైన, భర్తరి = మగని విషయంలో, మే – పుత్రికా = ఈ నా బిడ్డ, కిమ్ – వా – కరోతు = ఏమి చేస్తుంది!? (ప్రత్యాదేశో నిరాకృతిః).

**కిం పురోభాగే:** (సరోషమ్ = తీవ్రకోపంతో, నివృత్య = వెనుదిరిగి) పురోభాగే = దోషదర్శినీ! (దోషైకదృక్ – పురోభాగః – ఇత్యమరః. ప్రత్యాదేశ కఠినుడు – అని రాజులోనే దోషం చూస్తున్నావు, శకుంతల చేసిన తప్పును నువ్వు చూడవేమి? – అని శార్ఙ్గరవుడి కోపం కావచ్చు. అందుకే అంటున్నాడు –) స్వాతంత్ర్యమ్ + అవలంబసే

**శార్ఙ్గ : శకుంతలే!**

**యది యథా వదతి క్షితిపస్తథా**
**త్వమసి కిం పితురుత్కులయా త్వయా**
**అథ తు వేత్సి శుచి వ్రతమాత్మనః**
**పతికులే తవ దాస్యమపి క్షమమ్. 27**

**తిష్ఠ! సాధయామో వయమ్**

**రాజా : భోస్తపస్విన్! కిమత్రభవతీం విప్రలభసే?**

---

– కిమ్ = (నువ్వూ) స్వతంత్రిస్తున్నావా ఏమి? (భీతా = భయపడి, శకుంతల, వేపతే = వణికిపోయింది)

**యది యథా:** శకుంతలే = ఓ శకుంతలా! క్షితిపః = మహారాజు, యథా – వదతి = ఎలా అంటున్నాడో (నేను పెళ్ళాడలేదు – అని), త్వమ్ = నువ్వు, తథా + అసి – యది = అలాంటిదానివే అయినట్టయితే, ఉత్ + కులయా = కులధర్మాన్ని అతిక్రమించినదానవైన (ఉత్పథయా = దారితప్పినదానవైన), త్వయా = నీచేత, పితుః + కిమ్ = తండ్రికి ఏమి పని? ఏమి ప్రయోజనం?? అథ + అలాకాక, ఆత్మనః + వ్రతమ్ = నీ చరితను (నువ్వు చేసినది), శుచి = పావనమైనదిగా (నేను తప్పు చేయలేదు – అని) యది – వేత్సి = భావిస్తున్నదానవైతే, పతికులే = నీ మగని ఇంటిలో (ప్రతిగృహే – పాఠాంతరం), తవ = నీకు, దాస్యమ్ + అపి = దాస్యం చెయ్యడమైనా, క్షమమ్ = అర్హమే – సమీచీనమే.

**తాత్పర్యం:** శకుంతలా! రాజు అంటున్నదే నిజమైతే – దారి తప్పిన నీవల్ల తండ్రికి పనిలేదు. అలాకాక, నువ్వు అంటున్నదే నిజమై శుచిశీలవే – ఇతడికి ఇల్లాలివే – అయితే నీ మగని ఇంటిలో దాస్యమైనా నీకు తగినదే (ఎప్పటికో అప్పటికి మనసు మారి నిన్ను భార్యగా అంగీకరిస్తాడని). ఎలా చూసినా నువ్వు మావెంట ఆశ్రమానికి తిరిగి రాదగ్గదానవు కావు – అనడం.

**తిష్ఠ:** తిష్ఠ = నువ్వు ఆగు. వయమ్ – సాధయామః = మేము వెడుతున్నాం!!

**కుముదాని:** భోః + తపస్విన్ = ఓయీ ఋషీ! అత్రభవతీమ్ = ఈ మాన్యురాలిని, కిమ్ + విప్రలభసే = దూషింతువేల? శశాంకః = చంద్రుడు, కుముదాని + ఏవ = కలువలనే, బోధయతి = తాకి వికసింపజేస్తాడు. సవితా = సూర్యుడు, పంకజాని + ఏవ = పద్మాలనే,

**కుముదాన్యేవ శశాంకః సవితా బోధయతి పంకజాన్యేవ**
**వశినాం హి పరపరిగ్రహసంశ్లేష పరాఙ్ముఖీ వృత్తిః 28**

శార్ఙ్గ : **యదా తు పూర్వవృత్త మన్యసంగాద్విస్మృతో భవాంస్తదా కథ మధర్మభీరుః?**

రాజా : **భవంతమే వాత్ర గురులాఘవం పృచ్ఛామి.**

**మూఢః స్యామహమేషా వా వదేన్మిథ్యేతి సంశయే**
**దారత్యాగీ భవామ్యాహో పరస్త్రీస్పర్శ పాంశులః? 29**

---

బోధయతి = కరాలతో స్పృశించి వికసింపజేస్తాడు. వశినామ్ = నిగ్రహసంపన్నుల, వృత్తిః = ప్రవర్తన, పర–పరిగ్రహ = పరుల భార్యలను (పరిగ్రహః పరిజనే పత్న్యామ్ – విశ్వః), సంశ్లేష = కలవడంలో, పరాఙ్ముఖీ + హి = విముఖం సుమా!

**తాత్పర్యం:** చంద్రుడు కలువలనే, సూర్యుడు పద్మాలనే స్పృశిస్తారు, వికసింపజేస్తారు. (ఒకే కొలనులో ఉన్నా చంద్రుడు పద్మాలను తాకడు, సూర్యుడు కలువలను తాకడు). నిగ్రహసంపన్నుల ప్రవృత్తి ఇలాంటిది. పరదారలను తాకడానికి ఇష్టపడరు.

**యదా తు:** అన్యసంగాత్ = (అన్యస్య అన్యాయాః సంగః) మరేదో సంఘటిల్లడం వల్ల (శాపం) – అన్యకాంతా సాంగత్యంవల్ల (వసుమతి – రాజ్యలక్ష్మి), భవాన్ = నీవు, పూర్వవృత్తమ్ = మునుపు జరిగినదానిని (గాంధర్వవివాహాన్ని), యదా – తు – విస్మృతః = మరచినవాడవైతే, తదా = అప్పుడు, కథమ్ = ఎలా, అధర్మభీరుః (అసి) = అధర్మాచరణకు జంకినవాడవుతావు? ఏదో కారణం వల్ల ఈమెను మరిచిపోయి తిరస్కరించినంతమాత్రాన నువ్వు ధర్మశీలుడవూ – అధర్మభీతుడవూ కాలేవనడం.

**భవంతమ్:** అత్ర = ఈ విషయంలో, గురు – లాఘవమ్ = ఒప్పు – తప్పులను, భవంతమ్ + ఏవ = నిన్నే (తమరినే), పృచ్ఛామి = అడుగుతున్నాను.

**మూఢః:** అహం = నేను, మూఢః = (చేసినది మరిచిపోయిన) మూర్ఖుడను, స్యామ్ = అవుతున్నానా? వా = లేదా, ఏషా = ఈమె, మిథ్యా = అసత్యం, వదేత్ = చెబుతున్నదా? ఇతి = అనే, సంశయే = సంశయంలో, దారత్యాగీ = ఇల్లాలిని విడిచినవాడను, భవామి = అవుతున్నానా? ఆహో = లేదా, పరస్త్రీ = పరకాంతను, స్పర్శ = తాకడంతో, పాంశులః = పాపిష్ఠుడను, భవామి = అవుదునో?!

**పురోహితః: (విచార్య) యది తావదేవం క్రియతామ్.**

**రాజా : అనుశాస్తు మాం భవాన్.**

**పురో : అత్రభవతీ తావదాప్రసవాదస్మద్గృహే తిష్ఠతు. కుత ఇదముచ్యతే ఇతిచేత్ – త్వం సాధుభిరుద్దిష్టః ప్రథమమేవ చక్రవర్తినం పుత్రం జనయిష్యసీతి. స చేన్మునిదౌహిత్రస్తల్లక్షణోపపన్నో భవిష్యతి, అభినంద్య శుద్ధాంతమేనాం ప్రవేశయిష్యసి. విపర్యయే తు పితురస్యాస్స మీపనయనమవస్థితమేవ.**

**రాజా : యథా గురుభ్యో రోచతే.**

---

**తాత్పర్యం:** చేసినది మరిచిపోయిన మూర్ఖుడనవుతున్నానా? లేదా ఈమెయే అసత్యం పలుకుతోందా? ఈ సంశయం తేలడం లేదు. ఇల్లాలిని విడిచిపెట్టుకొంటున్నానా? పరస్త్రీని స్పృశించి పాపాత్ముణ్ని కానా?!

**యది తావత్:** (విచార్య = బాగా ఆలోచించి) యది –తావత్ = అలాగయితే, ఏవమ్ + క్రియతామ్ = ఇలా చెయ్యండి. (చేయబడుగాక!)

**అనుశాస్తు:** భవాన్ = తమరు, మామ్ = నన్ను, అనుశాస్తు = ఆజ్ఞాపించండి!

**అత్రభవతీ:** అత్రభవతీ = ఈ మాన్యురాలు, ఆప్రసవాత్ తావత్ = ప్రసవందాకా, అస్మద్గృహే = మా ఇంటిలో, తిష్ఠతు = ఉండుగాక! ఇదమ్ = ఈ మాట, కుతః + ఉచ్యతే + ఇతిచేత్ = ఎందుకు చెబుతున్నానంటే – త్వమ్ = రాజా! నీవు, ప్రథమమ్ + ఏవ = ముమ్మొదటగానే, చక్రవర్తినమ్ = చక్రవర్తి లక్షణాలతో ఉన్నవాడిని, జనయిష్యసి + ఇతి = జనింపజేస్తావు అని, సాధుభిః = సాధువుల చేత (జ్యోతిశ్శాస్త్రవేత్తల చేత), ఉద్దిష్టః = చెప్పబడ్డావు – జ్యోతిష్కులు చెప్పారు – అని. సః = పుట్టబోయే, మునిదౌహిత్రః = కణ్వుడి మనుమడు (దౌహిత్రః = కూతురి కొడుకు), తత్ + లక్షణ + ఉపపన్నః + భవిష్యతి+ చేత్ = ఆ లక్షణాలతో ఉన్నవాడయితే, అభినంద్య = అభినందించి, ఏనామ్ = ఈమెను, శుద్ధాంతమ్ = మీ అంతఃపురం, ప్రవేశయిష్యసి = ప్రవేశింపజేద్దువుగాని. భార్యగా స్వీకరిద్దువుగాని – అనడం. విపర్యయే + తు = దీనికి భిన్నంగా జరిగితే (అమ్మాయి పుట్టినా, చక్రవర్తి లక్షణాలు లేనివాడు పుట్టినా), అస్యాః + పితుః = ఈమె తండ్రిగారి, సమీప = చెంతకు, నయనమ్ = కొంపోవడం, అవస్థితమ్ + ఏవ = ఉండనే ఉంది.

**యథా:** యథా = ఎలా, గురుభ్యః = గురువుగారికి, రోచతే = నచ్చితే, తథా = అలాగే. మీ ఇష్టప్రకారమే కానివ్వండి – అని.

**పురో : వత్సే! అనుగచ్ఛ మామ్.**

**శకు : భఅవది, వసుహే, దేహి మే వివరం. (భగవతి వసుధే! దేహి మే వివరమ్)**

**(ఇతి రుదతీ ప్రస్థితా. సహపురోధసా తపస్విభిశ్చ శకుంతలా నిష్క్రాంతా. రాజా శాపవ్యవహిత స్మృతిః శకుంతలాగతమేవ చింతయన్ తిష్ఠతి)**

**(నేపథ్యే)**

**ఆశ్చర్యమ్! ఆశ్చర్యమ్!**

**రాజా : (ఆకర్ణ్య) కిం ను ఖలు స్యాత్?**

**(ప్రవిశ్య)**

**పురోహిత : (సవిస్మయమ్) దేవ! అద్భుతం ఖలు సంవృత్తమ్**

---

**వత్సే:** వత్సే = పుత్రీ! మామ్ + అనుగచ్ఛ = నన్ను అనుసరించి రమ్ము!

**భఅవది:** భగవతి = మహాత్మురాలా! వసుధే = భూదేవీ! మే = నాకు, వివరమ్ + దేహి = నీలోకి ప్రవేశిస్తాను దారి ఇమ్ము – ప్రవేశరంధ్రం ఇయ్యి. (ఇతి = అని, రుదతీ = విలపిస్తూ, ప్రస్థితా = బయలుదేరింది. సహపురోధసా = పురోహితుడితోనూ, తపస్విభిశ్చ = గౌతమీ శార్ఙ్గరవ శారద్వతులతోనూ, శకుంతల, నిష్క్రాంతా = నిష్క్రమిస్తుంది. శాపవ్యవహితస్మృతిః = శాపంవల్ల గతి తప్పిన మతికలవాడైన, రాజా = దుష్యంతుడు, శకుంతలాగతమేవ = శకుంతలను గురించే, చింతయన్ = ఆలోచిస్తూ, తిష్ఠతి = ఉంటాడు).

(నేపథ్యే = తెరలో)

ఆశ్చర్యమ్! ఆశ్చర్యమ్!!

**కిం ను:** (ఆకర్ణ్య = విని) కిమ్ + ను + ఖలు + స్యాత్ = ఏమైయుంటుంది?

(ప్రవిశ్య = పురోహితుడు ప్రవేశించి)

**దేవ:** (సవిస్మయమ్ = ఆశ్చర్యంగా) దేవ = ప్రభూ! అద్భుతమ్ + ఖలు – సంవృత్తమ్ = ఒక అద్భుతం జరిగింది తెలుసా!!

**కిమివ:** కిమ్ + ఇవ = ఏమది?

**సానిందంతీ:** దేవ = రాజా! కణ్వశిష్యేషు = కణ్వుడి శిష్యులు ఆ ముగ్గురూ,

**రాజా : కిమివ?**

**పురో : దేవ, పరావృత్తేషు కణ్వశిష్యేషు –**

**సా నిందంతీ స్వాని భాగ్యాని బాలా**
**బాహూత్ క్షేపం క్రందితుం చ ప్రవృత్తా**

**రాజా : కించ....?**

**పురో : స్త్రీసంస్థానం చాప్సరస్తీర్థమారాత్**
**ఉత్ క్షిప్యైనాం జ్యోతిరేకం జగామ ॥ 30**

**(సర్వే విస్మయం రూపయంతి)**

**రాజా : భగవన్, ప్రాగపి సోఽస్మాభిరర్థః ప్రత్యాదిష్ట ఏవ. కిం వృథా తర్కేణాన్విష్యతే. విశ్రామ్యతు భవాన్.**

---

పరావృత్తేషు = వెళ్ళిపోగా – సా + బాలా = ఆ బాల శకుంతల, స్వాని – భాగ్యాని = తన అదృష్టాలను, నిందంతీ = తిట్టుకుంటున్నదై, బాహు + ఉత్ + క్షేపమ్ = చేతులెత్తి, క్రందితుమ్ = దుఃఖించడం, ప్రవృత్తా + చ = మొదలుపెట్టింది కూడా.

**కించ:** కిమ్ + చ = ఇంకా....?

**స్త్రీ సంస్థానమ్:** స్త్రీ సంస్థానమ్ = స్త్రీ రూపం కలిగిన, ఏకమ్ – జ్యోతిః = ఒకే ఒక్క తేజస్సు, ఏనామ్ = ఈమెను, ఉత్ క్షిప్య = ఎత్తుకొని, ఆరాత్ = దూరంగా, అప్సరస్తీర్థమ్ = శచీతీర్థంవైపు, జగామ = వెళ్ళిపోయింది. (సంస్థానమాకృతౌ మృత్యౌ సన్నివేశే చతుష్పథే – మేదినీ.)

(సర్వే = అందరూ, విస్మయమ్ = ఆశ్చర్యాన్ని, రూపయంతి = అభినయంతో ప్రదర్శిస్తారు)

**భగవన్:** భగవన్ = మహాత్మా! సః + అర్థః = ఆ విషయం (శకుంతలా విషయం), అస్మాభిః = మాచేత, ప్రాక్ + అపి = ఇంతకు మునుపే, ప్రత్యాదిష్టః + ఏవ = విడిచిపెట్టబడినదే. మేము ఆ విషయం ఎప్పుడో వదిలేశాం – అనడం. వృథా – తర్కేణ = వ్యర్థమైన ఆలోచనతో, కిమ్ – భవద్భిః – అన్విష్యతే = తడుముతారేల? భవాన్ = మీరు, విశ్రామ్యతు = విశ్రమింతురుగాక! (అంటే నిష్క్రమించండి – అని).

**పురో : (విలోక్య) విజయస్వ! (ఇతి నిష్క్రాంతః)**

**రాజా : వేత్రవతి! పర్యాకులోఽస్మి. శయనభూమిమార్గమాదేశయ!**

**ప్రతీహారీ : ఇదో ఇదో దేవో. (ఇత ఇతో దేవః) (ఇతి ప్రస్థితా)**

**రాజా : కామం ప్రత్యాదిష్టాం స్మరామి న పరిగ్రహం మునేస్తనయామ్**
**బలవత్తు దూయమానం ప్రత్యాయయతీవ మే హృదయమ్. 31**

**(ఇతి నిష్క్రాంతా స్సర్వే)**

**–: ఇతి పంచమోఽంకః :–**

---

**విజయస్వ:** (విలోక్య = ఒకసారి రాజువైపు చూసి) విజయస్వ = జయింతువుగా! – జయమగుగాక అని ఆశీర్వదించడం. (ఇతి = అని, నిష్క్రాంతః = పురోహితుడు నిష్క్రమిస్తాడు).

**వేత్రవతి:** వేత్రవతీ! పర్యాకులః + అస్మి = చాలా కలత చెందినవాడను అయ్యాను. మానసికంగా అలసి పోయాను – అని. శయన భూమి – మార్గమ్ = శయనాగారానికి దారి, ఆదేశయ = చూపించు.

**ఇదోఇదో:** దేవః = ప్రభువు, ఇతః – ఇతః = ఇటు ఇటు.

(ఇతి = అని, ప్రస్థితా = వేత్రవతి ముందు నడుస్తుంది)

**కామమ్:** కామమ్ = అత్యంతమూ, ప్రత్యాదిష్టామ్ = నాచే తిరస్కృతురాలైన, మునేః + తనయామ్ = కణ్వమహర్షిపుత్రికను, పరిగ్రహమ్ = పత్నినిగా, న + స్మరామి = గుర్తుచేసుకోలేకపోతున్నాను. తు = కానీ, బలవత్ = అధికంగా, దూయమానమ్ = కలత చెందుతున్నదై, మే = నా, హృదయమ్ = మనస్సు, ప్రత్యాయయతి + ఇవ = విశ్వసింప జేస్తున్నట్టుంది!!

**తాత్పర్యం:** మునితనయను తిరస్కరించాను. ఆమెను భార్యగా స్వీకరించిన విషయమేదీ నాకు గుర్తులేదు. కానీ ఆమెను తిరస్కరించినందుకు ఇంత అధికంగా కలత చెందుతున్న నా హృదయం విశ్వసింపజేస్తున్నట్టుంది!! (నా కలత చూస్తే నాకే అది నిజమేమో – అనిపిస్తోందని).

(ఇతి = అని, సర్వే = అందరూ, నిష్క్రాంతాః = నిష్క్రమిస్తారు)

–: ఇది అయిదవ అంకం : –

# షష్ఠోఽంకః

**(తతః ప్రవిశంతి నాగరికః శ్యాలః, పశ్చాద్బద్ధం పురుషమాదాయ రక్షిణౌ చ)**

**రక్షిణౌ : (తాడయిత్వా) అలే కుంభీలకా కహేహి కహిం తుఏ ఏశే మణిబంధ ణుక్కిణ్ణ ణామహేఏ లాఅకీఏ అంగులీఅఏ శమాశాదిఏ?**

**(అరే! కుంభీరక! కథయ కుత్ర త్వయైతన్మణిబంధనోత్కీర్ణనామధేయం రాజకీయమంగులీయకం సమాసాదితమ్?)**

**పురుషః : (భీతినాటితకేన) పశీదంతు భావమిశ్శే. హగే ణ ఈదిశకమ్మకాలీ. (ప్రసీదంతు భావమిశ్రాః. అహం నేదృశకర్మకారీ).**

**ప్రథమః : కిం సోహణే బహ్మణేత్తి కలిఅ రజా పడిగ్గహే దిణ్ణో. (కిం శోభనో బ్రాహ్మణ ఇతి కలయిత్వా రాజ్ఞా ప్రతిగ్రహో దత్తః?)**

---

(తతః = అంతట, నాగరికః = నగర రక్షకుడు – లేదా – కోష్ఠపాలకుడైన, శ్యాలః = శ్యాలుడూ; (నాగరికశ్యాలః = నగరపాలకుడి బావమరది – అని శ్రీనివాసాచార్య పాఠాంతరం) పశ్చాత్ + బద్ధం = చేతులు వెనక్కి కట్టబడిన, పురుషమ్ + ఆదాయ = పురుషుణ్ని వెంటబెట్టుకొని, రక్షిణౌ + చ = ఇద్దరు రక్షకభటులూ, ప్రవిశంతి = ప్రవేశిస్తారు)

**అలే:** (తాడయిత్వా = రెండు తగిలించి) అరే – కుంభీరక = ఓరీ చోరుడా! (కుంభీరకో గండపదస్తస్కరశ్చ మలిమ్లుచః – ఇతి నామమాలా) కథయ = చెప్పరా! మణిబంధన + ఉత్కీర్ణ = బంగారంలో చెక్కబడిన, నామధేయమ్ = పేరుకలదీ, రాజకీయమ్ = రాజుగారిదీ అయిన, ఏతత్ + అంగులీయకమ్ = ఈ ఉంగరం, త్వయా = నీచేత, కుత్ర – సమాసాదితమ్ = ఎక్కడ సంపాదింపబడింది? ఎక్కడ కాజేశావో చెప్పరా – అనడం. (మణేః బంధనమ్– మణిః బధ్యతేఽస్మిన్ = మణులు పొదగబడేది = బంగారం – రత్నముం దాపునపుడు రాజుగారి పేరు చెక్కిన ఈ ఉంగరము అని కందుకూరి!!)

**పశీదంతు:** (భీతినాటితకేన = భయాన్ని అభినయిస్తూ) భావమిశ్రాః = అయ్యలారా! (అత్యంత మాన్యులారా!) ప్రసీదంతు = దయ జూతురుగాక! అహమ్ = నేను, ఈదృశకర్మకారీ – న = ఇలాంటి పనులు చేసేవాణ్ని కాను. దొంగతనాలు చేసేవాణ్ని కాదు, దయ జూడండి – అనడం.

**పురుషః : సుణుధ దాణిం. హగే శక్కావదాలబ్భందరాలవాశీ ధీవలే. (శృణుతేదానీమ్. అహం శక్రావతారాభ్యంతరవాసీ ధీవరః)**

**ద్వితీయః : పాడచ్చలా, కిం అహ్మేహిం జాదీ పుచ్ఛిదా? (పాటచ్చర! కిమ్ అస్మాభిః జాతిః పృష్టా?)**

**శ్యాల : సూఅఅ, కహేదు శవ్వం అణుక్కమేణ. మాణం అంతరా పడిబంధహ. (సూచక! కథయతు సర్వమనుక్రమేణ. మైనమ్ అంతరే ప్రతిబంధయ)**

**ఉభౌ : జం ఆవుత్తే ఆణవేది – కహేహి. (యదావుత్త ఆజ్ఞాపయతి – కథయ)**

**పురుష : అహకే జాలుగ్గాలాదీహిం మచ్ఛబంధణోవా ఏహిం కుడుంబ భలనం కలేమి. (అహం జాలోద్గాలాదిభిః మత్స్యబంధనోపాయైః కుటుంబభరణం కరోమి)**

---

**కిం సోహణే:** శోభనః = శుభప్రదుడైన, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, ఇతి = అని, కలయిత్వా = గౌరవించి, రాజ్ఞా = రాజుచేత, ప్రతిగ్రహః = దానంగా, దత్తః కిమ్ = నీ కివ్వబడిందా?!

**సుణుధ:** ఇదానీమ్ = ఇప్పుడు, శృణుత = ఆలకించండి. అహమ్ = నేను, శక్రావతారాభ్యంతరవాసీ = శక్రావతారం అనే తీర్థంలో నివసించే, ధీవరః = బెస్తవాణ్ని.

**పాడచ్చలా:** పాటచ్చర = ఓరీ చోరా! కిమ్ = ఏమిరా, అస్మాభిః = మాచేత, జాతిః = నీ జాతి, పృష్టా = అడుగబడిందా? (దస్యుః పాటచ్చరః స్తేనః – ఇతి హైమః)

**సూఅఅ:** సూచకా! (రక్షకభటుడి పేరు) సర్వమ్ = అంతా, అనుక్రమేణ = ఒక వరుసలో, కథయతు = వీడు చెప్పుగాక! అంతరే = మధ్యలో, ఏనమ్ = వీడిని, మా – ప్రతిబంధయ = అడ్డగించకు. వీణ్ని చెప్పనీ, మధ్యలో అడ్డుతగలకు – అనడం.

**జం ఆవుత్తే:** ఆవుత్తః = బావగారు (తమరు), యత్ + ఆజ్ఞాపయతి = ఆజ్ఞాపించినట్టే. కథయ = ఒక వరసలో చెప్పరా?! (భగినీపతిరావుత్తః – ఇత్యమరః)

**అహకే:** అహమ్ = నేను, జాల + ఉద్గాలాదిభిః = వలలూ గేలాలూ (బడిశము) మొదలైన, మత్స్యబంధన + ఉపాయైః = చేపలు పట్టే సాధనాలతో, కుటుంబభరణమ్ + కరోమి = కుటుంబం పోషించుకుంటున్నాను.

**శ్యాల : (విహస్య) విసుద్ధో దాణిం ఆజీవో! (విశుద్ధ ఇదానీమాజీవః)**

**పురుష : భస్టకే! మా ఎవ్వం భణ (భర్తః మైవం భణ)**

**శహజే కిల జే విణిందిఏ ణహు దే కమ్మ వివజ్జణీఅఏ**
**పశుమాలణకమ్మదాలుణే అణుకంపామిదుజ్జేవ్వ శోత్తిఏ**
**(సహజం కిల యద్వినిందితం నహి తత్కర్మ వివర్జనీయమ్**
**పశుమారణకర్మదారుణోఽనుకంపామృదురేవ శ్రోత్రియః) 01**

---

**విసుద్ధో:** (విహస్య = పెద్దగా నవ్వి) ఇదానీమ్ = ఇప్పటికి నీ, ఆజీవః = జీవనవృత్తి, విశుద్ధః = చాలా పవిత్రమ్!!

**శహజే:** భర్తః = అయ్యా! ఏవమ్ – మా – భణ = ఇలా పరిహాసాలు పలకకండి! సహజమ్ = వంశపారంపర్యంగా – పుట్టుకతో వచ్చిన, యత్ + కర్మ = ఏ జీవనవృత్తి కలదో, తత్ + కర్మ = అది, వినిందితమ్ + కిల = నింద్యమో నీచమో అయినా సరే, వివర్జనీయమ్ + న + హి = విడిచి వేయవలసినది కాదు సుమా! శ్రోత్రియః = వైదికుడు, పశుమారణకర్మ = (యజ్ఞాలలో) పశువును (విశసనం చెయ్యడం) చంపడం అనే పనితో, దారుణః + అపి = క్రూరుడే అయినప్పటికీ, అనుకంపా = దయతో, మృదుః + ఏవ = మృదువైనవాడే.

**తాత్పర్యం:** పుట్టుకతో వచ్చిన పని – అది నింద్యమే అయినా విడిచిపెట్టవలసింది కాదు. యజ్ఞంలో పశువును చంపవలసివచ్చినా శ్రోత్రియుడు తాత్కాలికంగా కఠినుడే తప్ప, సహజంగా దయాగుణుడే! మృదుస్వభావుడే!

**విశేషాలు:** అనుకంపా = దయా, తయా మృదురేవ శ్రోత్రియః దారుణం పశుమారణం కర్మ వివర్జయతి యథా తథా మమ సహజం వివర్జనీయం న భవతీతి వైధర్మ్య దృష్టాంతః. "ఏవ" ఇవార్థే. తదోపమా. యథా శ్రోత్రియశ్ఛాందసో వైదికం దారుణం పశుమారణ కర్మాపి యజ్ఞాదౌ వివర్జయతి. క్రతుషు హింసాయా విహితత్వాత్ సహజమ్. వినిందితమితి బౌద్ధాదిభిః – అని రాఘవభట్టు వ్యాఖ్య. "క్ష్మాసురుఁడు పశుమారణకర్మచేత దారుణుండైన మృదవెయౌ దయను బూని – అని కందుకూరి వారి ఆంధ్రీకరణ. ఈ శ్లోకానికి శ్రోత్రియః అన్నచోట వైదికః అని తప్ప మరింకెక్కడా పాఠాంతరం కనిపించడం లేదు.

**శ్యాల : తదో తదో? (తతస్తతః)**

**పురుష : ఏకశ్శిం దిఅశే ఖండశో లోహిఅమచ్ఛే మఏ కప్పిదేజావ. తశ్శ ఉదలబ్భందలే ఏదం లదణభాశులం అంగులీఅఅం దేక్ఖిఅ పచ్చా అహకే శే విక్కఆఅ దంశఅంతే గహిదే భావమిశ్శేహిం. మాలేహ వా ముంచేహ వా. అఅం శే ఆఅమవుత్తంతే. (ఏకస్మిన్ దివసే ఖండశో రోహితమత్స్యో మయా కల్పితో యావత్ – తస్య ఉదరాభ్యంతర ఇదం రత్నభాసురమంగులీయం దృష్ట్వా పశ్చాదహం తస్య విక్రయాయ దర్శయన్ గృహీతో భావమిశ్రైః. మారయత వా ముంచయత వా. అయమస్యాగమవృత్తాంతః)**

**శ్యాల : జాణుఅ. విస్సగంధీ గోహాదీ మచ్ఛబంధో ఏవ్వ ణిస్సంసఅం. అంగులీఅఅ దంసణం శే విమరిసిదవ్వం. రాఅఉలం ఏవ్వ గచ్ఛామో. (జానుక! విస్రగంధీ గోధాదీ మత్స్యబంధ ఏవ నిస్సంశయమ్. అంగులీయక దర్శనమస్య విమర్శయితవ్యమ్ రాజకులమేవ గచ్ఛామః).**

---

**తదోతదో:** తతః + తతః = అటుపై నటుపైని...?

**ఏకశ్శిం:** ఏకస్మిన్ – దివసే = ఒకనాడు, రోహితమత్స్యః = రోహితజాతి చేప – లేదా – ఎర్రచేప, మయా = నాచేత, ఖండశః + కల్పితః + యావత్ = ముక్కలుగా కోసివేయ బడ్డదో (కల్పనం కర్తనం క్లుప్తౌ – విశ్వః), తావత్ = అంతలో, తస్య + ఉదరాభ్యంతరే = దాని పొట్టలో, ఇదమ్ =ఈ, రత్న భాసురమ్ = రత్నాలతో వెలిగిపోతున్న, అంగులీయమ్ = ఉంగరం, దృష్ట్వా = చూసి, పశ్చాత్ = అటుపైని, అహమ్ = నేను, తస్య + విక్రయాయ = దాన్ని అమ్మడం కోసం, దర్శయన్ = చూపిస్తున్నవాడనై, భావమిశ్రైః = అయ్యగార్ల చేత (తమచేత), గృహీతః = పట్టుపడ్డాను – బంధితుణ్ని అయ్యాను. మారయత – వా = చంపేస్తారో, ముంచయత – వా = విడిచేస్తారో – మీ ఇష్టం. అయమ్ = ఇదీ, అస్య = ఈ ఉంగరం తాలూకు, ఆగమవృత్తాంతః = ప్రాప్తికథ. ఉంగరం నాకు దొరికిన తెరగు – ఇది.

**విస్సగంధీ:** జానుకా! (ఇది రెండవ రక్షకభటుడి పేరు) విస్రగంధీ = గబ్బుకంపు కొడుతున్నాడు (విస్రం స్యాదామగంధియత్ – అమరం), గోధాదీ = గోధలను (ఒక రకం జలచరాలు. గోధా తల – నిహాకయోః – మేదినీ) తినేవాడూ, అయమ్ = వీడు,

**రక్షిణౌ : తహ. గచ్ఛ అలే గండభేదఅ! (తథా. గచ్ఛ అరే గండభేదక!)**

**(సర్వే పరిక్రామంతి)**

**శ్యాల : సూఅఅ, ఇమం గోపురదుఆరే అప్పమత్తా పడిబాలహ జావ ఇమం అంగులీఅఅం జహాగమణం భట్టిణో ణివేదిఅ తదో సాసణం పడిచ్ఛిఅ ణిక్కమామి. (సూచక, ఇమం గోపురద్వారే అప్రమత్తౌ ప్రతిపాలయతం యావదిదమంగులీయకం యథాగమనం భర్తుర్నివేద్య తతః శాసనం ప్రతీక్ష్య నిష్క్రమామి).**

**రక్షిణౌ : పవిశదు ఆవుత్తో శామిపశాదస్స. (ప్రవిశత్వావుత్తః స్వామిప్రసాదాయ).**

**(ఇతి నిష్క్రాంతః శ్యాలః)**

---

మత్స్యబంధః + ఏవ = చేపలు పట్టేవాడే – జాలరియే, నిస్సంశయమ్ = సందేహం లేదు. అస్య = వీడికి, అంగుళీయకదర్శనమ్ = ఉంగరం దొరికిన తెరగే, విమర్శయితవ్యమ్ = విచారించవలసిన విషయం. రాజకులమ్ + ఏవ – గచ్ఛామః = రాజగృహానికే వెడదాం. (విస్రగంధీ ఘోరాకృతిర్మత్స్యబంధ ఏవ నిస్సంశయమ్ – అని పాఠాంతరం. కంపుకొడుతున్నాడు. ఆకారమూ ఘోరంగా ఉంది. కనుక జాలరివాడే – అని. గోధాదీ = గోధాశనః – అని రాఘవభట్టు పాఠమూ సమన్వయమూను. గోధాః అత్తి = గోధాదీ = గోధాశనః)

**తహ:** తథా = అలాగే. అరే = ఓరీ, గండభేదక = దొంగా! గచ్ఛ = నడు!! (సర్వే = అందరూ, పరిక్రామంతి = ముందుకు నడుస్తారు)

**ఇమం:** సూచకా! ఇమమ్ = వీడిని, గోపురద్వారే = పురద్వారం దగ్గర (పురద్వారం తు గోపురమ్ – అమరం), అప్రమత్తౌ = జాగరూకులై, ప్రతిపాలయతమ్ = కాపలా కాయండి. యావత్ = ఇంతలో, ఇదమ్ = ఈ, అంగుళీయకమ్ = ఉంగరం, యథా + ఆగమనమ్ = మనకు ఎలా చేరిందో (మన చేతికి ఎలా వచ్చిందో), భర్తుః + నివేద్య = రాజుకు విన్నవించి, తతః = అటుపైని, శాసనమ్ = రాజాజ్ఞను, ప్రతీక్ష్య = స్వీకరించి (గృహీత్వా), నిష్క్రమామి = తిరిగి వస్తాను. అందాకా మీరిక్కడే వీడిని కాపలా కాయండి – అని.

**పవిశదు:** ఆవుత్తః = బావగారు (తమరు), స్వామి – ప్రసాదాయ = రాజు అనుగ్రహం కోసం, ప్రవిశతు = కోటలోకి ప్రవేశించుగాక! తమరు లోపలికి వెళ్ళండి – అని.

**ప్రథమ : జాణుఅ. చిలా అది క్ఖు ఆవుత్తే?! (జానుక! చిరాయతే ఖలు ఆవుత్తః?!**

**ద్వితీయ : ణం అవశలోపశాప్పణీఆ ఆఆణో. (నను అవసరోపసర్పణీయాః రాజానః!!)**

**ప్రథమ : జాణుఅ. ఫుల్లంతి మే హత్థా ఇమశ్శ బహశ్శ శుమణా పిణద్ధుం. (ఇతి పురుషం నిర్దిశతి). (జానుక! ప్రస్ఫురతో మమ హస్తౌ అస్య వధార్థం సుమనసః పినద్ధుమ్).**

**పురుష : ణ అలుహది భావే అకాలణమాలణం భావిదుం. (నార్హతి భావః అకారణమారణం భావయితుమ్).**

---

(ఇతి = అని, శ్యాలః = శ్యాలుడు, నిష్క్రాంతః = నిష్క్రమిస్తాడు)

**చిలా అది:** జానుకా! ఆవుత్తః = బావ శ్యాలుడు, చిరాయతే – ఖలు = జాగుచేస్తున్నాడు కదూ!

**ణం అవశల:** రాజానః = మహారాజులు, అవసర + ఉపసర్పణీయాః + నను = అనుమతించిన సమయంలోనే సమీపించదగ్గవారు గదా! ప్రవేశానుమతి పొందడానికి వేచి ఉండాలి – అనడం.

**ఫుల్లంతి:** జానుకా! అస్య = ఈ జాలరి దొంగ, వధార్థమ్ = వధకోసమూ – ఇతడిని వధించడానికీ, సుమనసః = పూలు, పినద్ధుమ్ = వీడి మెడలో కట్టడానికీ, మమ + హస్తౌ = నా చేతులు, ప్రస్ఫురతః = సలుపుతున్నాయి – ఉవ్విళ్ళూరుతున్నాయి. (మెడలో పూలదండలు వేసి వధ్యశిలకు తీసుకువెళ్ళడమూ, ఉరితీశాక ఒంటినిండా పూలు జల్లడమూ – ఆచారమట!) (ఇతి = అని, పురుషమ్ = జాలరిని, నిర్దిశతి = నిర్దేశిస్తాడు – అతడివైపు చేతులూ చూపులూ నిగుడిస్తాడు).

**ణ అలుహది:** అకారణమారణమ్ = అకారణంగా మరణం, భావయితుమ్ = ప్రాప్తింపజెయ్యడానికి, భావః = మాన్యుడు, న + అర్హతి = తగడు. అకారణంగా చంపే ఆలోచన నీకు తగదు – అనడం.

**ఏశే అహ్మాణం:** (విలోక్య = సూచకుడు ప్రక్కతెరలోకి చూపు సారించి) ఏషః = ఇడిగో నః = మన, స్వామీ = అధికారి శ్యాలుడు, పత్రహస్తః = పత్రం చేతిలో పట్టుకొన్నవాడై, రాజశాసనమ్ + ప్రతీక్ష్య = రాజాజ్ఞను పొంది, ఇతో ముఖః + దృశ్యతే = ఇటే ముఖం

**ద్వితీయ : (విలోక్య) ఏశే అహ్మాణం శామీ పత్తహత్థే లాఅశాశణం పడిచ్ఛిఅ ఇదోముహే దేక్ఖీఅది. గిర్ధబలీ భవిశ్శశి శుణో ముహం వాదేక్ఖిశ్శశి. (ఏష నో స్వామీ పత్రహస్తః రాజశాసనం ప్రతీక్ష్య ఇతోముఖో దృశ్యతే. గృధ్రబలిర్భవిష్యసి, శునో ముఖం వా ద్రక్ష్యసి).**

**(ప్రవిశ్య)**

**శ్యాల : సూఅఅ, ముంచేదు ఏసో జాలోఅజీవీ. ఉవవణ్ణో క్ఖు అంగులీఅఅస్స ఆఅమో. (సూచక! ముచ్యతామేష జాలోపజీవీ. ఉపపన్నః ఖలు అంగులీయస్యాగమః)**

**సూచక : జహ ఆవుత్తే భణాది. (యథావుత్తో భణతి)**

**ద్వితీయ : ఏశే జమశదణం పవిశిఅ పడిణివుత్తే. (ఇతి పురుషం పరిముక్తబంధనం కరోతి). (ఏష యమసదనం ప్రవిశ్య ప్రతినివృత్తః!!)**

---

పెట్టి కనబడుతున్నాడు. చోరుడా! గృధ్ర – బలిః = గ్రద్దలకు ఆహారం, భవిష్యసి = అవుతావు! లేదా – శునః + ముఖమ్ – వా = కుక్కల ముఖమైనా, ద్రక్ష్యసి = చూస్తావు!!

(ప్రవిశ్య = శ్యాలుడు ప్రవేశించి)

**ముంచేదు:** సూచకా! ఏషః = ఈ, జాలోపజీవీ = జాలరివాడు, ముచ్యతామ్ = విడువబడుగాక! అంగులీయస్య + ఆగమః = ఉంగరం వచ్చిన తెరగు, ఉపపన్నః + ఖలు = సమంజసమైనదేసుమా!

**జహ:** ఆవుత్తః = బావగారు, యథా – భణతి = ఎలాగంటే అలాగే!!

**ఏశే:** ఏషః = ఈ జాలరి, యమసదనమ్ + ప్రవిశ్య = యమలోకం చొచ్చి, ప్రతినివృత్తః = తిరిగివచ్చాడు! (ఇతి = అని, పురుషమ్ = జాలరిని, పరిముక్తబంధనమ్ + కరోతి = బంధవిముక్తుణ్ని చేస్తాడు)

**అహ కీలిశే:** (శ్యాలమ్ + ప్రణమ్య = శ్యాలుడికి నమస్కరించి) భర్తః = అయ్యా! అథ = ఇక, మే + ఆజీవః = నా బ్రతుకు తెరువు, కీదృశః = ఎట్లు?

**ఏసో భట్టిణా:** ఏషః = ఇదిగో, భర్త్రా = ప్రభువుచేత, అంగులీయక – మూల్య = ఉంగరం వెలకు, సమ్మితః = సమానమైన, ప్రసాదః + అపి = బహుమతి కూడా (అనుగ్రహం

**పురుష : (శ్యాలం ప్రణమ్య) భట్టా! అహ కీలిశే మే ఆజీవే. (భర్తః! అథ కీదృశో మే ఆజీవః?)**

**శ్యాల : ఏసో భట్టిణా అంగులీఅఅ ముల్లసమ్మిదో పసాదో వి దావిదో (ఇతి పురుషాయ స్వం ప్రయచ్ఛతి). (ఏష భర్త్రాంగులీయకమూల్య సమ్మితః ప్రసాదోఽపి దాపితః)**

**పురుష : (సప్రణామం ప్రతిగృహ్యా) భట్టా, అణుగ్గహీదహ్మి. (భర్తః! అనుగృహీతోఽస్మి).**

**సూచక : ఏశేణామ అణుగ్గహే జే శూలాదో అవదాలిఅ హత్థికంధే పడిట్టావిదే. (ఏష నామానుగ్రహః! యచ్ఛూలాదవతార్య హస్తిస్కంధే ప్రతిష్ఠాపితః).**

**జానుక : ఆవుత్త, పలిదోశం కహేహి. తేణ అంగలీఅఏణ. భట్టిణా శమ్మదేణ హోదవ్వం. (ఆవుత్త! పరితోషం కథయ. తేన అంగులీయకేన భర్త్రా సమ్మతేన భవితవ్యమ్).**

---

సైతం), దాపితః = నీకు దానం చెయ్యబడింది. నీకు బహూకరించాడు – అనడం. (ఇతి = అని, పురుషాయ = జాలరికి, స్వమ్ = ధనం, ప్రయచ్ఛతి = ఇస్తాడు)

**అణుగ్గహీదహ్మి:** (సప్రణామమ్ = నమస్కరిస్తూ, ప్రతిగృహ్యా = స్వీకరించి) భర్తః = అయ్యా! అనుగృహీతః + అస్మి = అనుగ్రహింపబడితిని! (భర్త్రా = రాజు చేత – అనుగృహీతోఽస్మి – అని పాఠాంతరం)

**ఏశేణామ:** అనుగ్రహః = అనుగ్రహమంటే, ఏషః + నామ = ఇదే సుమా! యత్ = ఎందుకంటే – శూలాత్ + అవతార్య = కొరతవేసే శూలం నుంచి దించబడి, హస్తిస్కంధే = ఏనుగు మూపుమీద, ప్రతిష్ఠాపితః = కూర్చుండజేయబడ్డాడు. శూలం నుంచి దించి ఏనుగు ఎక్కించాడు, రాజు – అనుగ్రహమంటే (నా సామిరంగా!) ఇదే!!

**పలిదోశం:** ఆవుత్త = బావా! పరితోషమ్ = ఆనందం, కథయ = చెప్పు! తేన + అంగులీయకేన = ఆ ఉంగరంతో, భర్త్రా – సమ్మతేన – భవితవ్యమ్ = రాజుగారు సంబరపడి ఉండాలి!

**ణ తస్సిం:** తస్మిన్ = ఆ ఉంగరంలోని, మహార్ఘమ్ = చాలా విలువైన, రత్నమ్ = రత్నం, భర్తుః = మహారాజుకు, బహుమతమ్ = సమ్మతం – ఆనందప్రదం, ఇతి = అని,

**శ్యాల : ణ తస్సిం మహారుహం రదణం భట్టిణో బహుమదంతి తక్కేమి. తస్స దంసణేన భట్టిణో అభిమదో జణో సుమరావిదో. ముహుత్తఅం పకిదిగంభీరో వి పజ్జుస్సుఅ ణఅణో ఆసి. (న తస్మిన్ మహార్హం రత్నం భర్తుర్బహుమతమితి తర్కయామి. తస్య దర్శనేన భర్తుః అభిమతో జనః స్మారితః. ముహూర్తం ప్రకృతిగంభీరోఽపి పర్యుత్సుకనయనః ఆసీత్).**

**సూచకం : శేవిదం నామావుత్తేన!! (సేవితం నామ ఆవుత్తేన!!)**

**జానుకః : ణం భణాహి, ఇమశ్శకఏ మచ్ఛిఆభత్తుణోత్తి. (ఇతి పురుషమసూయయా పశ్యతి) (నను భణ, అస్య కృతే మాత్స్యిక భర్తురితి)**

**పురుషః : భట్టాలక, ఇదో అద్ధం తుహ్మాణం శుమణోముల్లం హోదు. (భట్టారక! ఇతోఽర్ధం యుష్మాకం సుమనోమూల్యం భవతు)**

**జానుకః : ఏత్తకే జుజ్జం. (ఏతావద్యుజ్యతే)**

---

న– తర్కయామి = భావించను – అనుకోను. తస్య – దర్శనేన = దాన్ని చూడటంతో, భర్తుః = మహారాజుకు, అభిమతః + జనః = ఇష్టమైన వ్యక్తి, స్మారితః = స్మరింపబడెను – గుర్తుకువచ్చె. ప్రకృతి గంభీరః + అపి = సహజంగా అత్యంత గంభీరుడే అయినా, ముహూర్తమ్ = క్షణం సేపు, పర్యుత్సుకనయనః = దుఃఖితనేత్రుడు, ఆసీత్ = అయ్యాడు. కంటతడిపెట్టాడు – అని.

**శేవిదం:** ఆవుత్తేన = బావగారిచేత (నీచేత), సేవితమ్ + నామ = బాగా సేవచేయబడినదన్నమాట. (తోషితో నామావుత్తేన = నీచేత రాజు సంతోషితుడయ్యాడన్నమాట – అని పాఠాంతరం) పారితోషికం ఏమిచ్చాడని ఆరా తియ్యడం.

**ణం భణాహి:** అస్య = ఈ, మాత్స్యిక భర్తుః + కృతే = జాలరిదాని మగనివల్ల, ఇతి = అని, నను–భణ = పలుకుసుమా! (ఇతి = అని, పురుషమ్ = జాలరిని, అసూయయా – పశ్యతి = అసూయతో చూస్తాడు)

**భట్టాలక:** భట్టారక = అయ్యా! ఇతః = ఇందులో, అర్ధమ్ = సగం సొమ్ము, యుష్మాకమ్ = మీకు, సుమనః + మూల్యం = పువ్వుల వెల, భవతు = అగుగాక!

**ఏత్తకే:** ఏతావత్ = ఇది, యుజ్యతే = బాగుంది!

**శ్యాల : ధీవల. మహత్తరో తుమం పిఅవఅస్సఓ దాణింమే సంవుత్తో. కాదంబరీ సక్ఖిఅం అహ్మాణం పఢమసోహిదం ఇచ్ఛీఅది. తా సోండిఆపణం ఏవ్వ గచ్ఛామో. (ధీవర! మహత్తరస్త్వం ప్రియవయస్యక ఇదానీం మే సంవృత్తః. కాదంబరీ సాక్షిక మస్మాకం ప్రథమసౌహృదమిష్యతే. తచ్ఛౌండికాపణమేవ గచ్ఛామః)**

**(ఇతి నిష్క్రాంతాః సర్వే)**

**ప్రవేశకః**

**(తతః ప్రవిశత్యాకాశయానేన సానుమతీనామాప్సరాః)**

**సానుమతీ: ణివ్వట్టిదం మఏ పజ్జాఅణివ్వత్తణిజ్జం అచ్ఛరాతిత్థ సణ్ణిజ్జం జావ సాహుజణస్స అభిసేఅకాలోత్తి. సంపదం ఇమస్స రాఏసిణో ఉదంతం పచ్చక్ఖీకరిస్సం. మేణఆసంబంధేణ సరీరభూదా మే సఉందలా. తాఏ అ దుహిదుణిమిత్తం ఆదిట్ఠపువ్వహ్మి. (సమంతాత్ అవలోక్య) కిం ఖు క్ఖ**

---

**ధీవల:** ధీవర = జాలరీ! మహత్తరః = గొప్పవాడవు, త్వమ్ = నువ్వు, ఇదానీమ్ = ఇప్పుడు, మే = నాకు, ప్రియవయస్యకః = ప్రియమిత్రుడవు, సంవృత్తః = అయ్యావు. అస్మాకమ్ = మన, ప్రథమ – సౌహృదమ్ = తొలిసారి చెలిమి, కాదంబరీ సాక్షికమ్ + ఇష్యతే = కల్లు సాక్షిగా జరుగుగాక! తత్ = అందుచేత, శౌండికా + ఆపణమ్ + ఏవ = కల్లు అంగడికే, గచ్ఛామః = వెడదాం! (శుండాపి జలహస్తిన్యాం మదిరా కరిహస్తయోః – ఇతి విశ్వః)

(ఇతి = అని, సర్వే = అందరూ, నిష్క్రాంతాః = నిష్క్రమిస్తారు)

యన్నీచైః కేవలం పాత్రైః భావిభూతార్థసూచనమ్
అంకయోరుభయోర్మధ్యే స విజ్ఞేయః ప్రవేశకః

**ఇది ప్రవేశకం**

(తతః = అంతట, సానుమతీ – నామ + అప్సరాః = సానుమతి అనే అప్సరస, ఆకాశయానేన = ఆకాశగమనంతో, ప్రవిశతి = ప్రవేశిస్తుంది.)

**ణివ్వట్టిదం:** సాధుజనస్య = సజ్జనుల, అభిషేకకాలః + యావత్ = స్నానవేళ ముగిసేవరకూ, అప్సరస్తీర్థ – సాన్నిధ్యమ్ = (గంగానదిలోని) అప్సరస్తీర్థం చెంత ఉండటమనే, పర్యాయ – నిర్వర్తనీయమ్ = వంతులవారీ (ప్రతిదినమూ మా అప్సరసల

**ఉదుచ్ఛవే వి ణిరుచ్ఛబారంభం విఅ రాఅఉలం దీసఇ. అత్థి మే విహవో పణిధాణేన సవ్వం పరిణ్ణాదుం. కిందు సహీఏ ఆదరో మఏ మాణఇదవ్వో. హోదు. ఇమాణం ఏవ్వ ఉజ్జాణ పాలిఆణం తిరస్థరిణీపడిచ్ఛణ్ణా పస్సవత్తిణీ భవిఅ ఉవలహిస్సం.**

**(ఇతి నాట్యేనావతీర్య స్థితా)**

**(నిర్వర్తితం మయా పర్యాయనిర్వర్తనీయ మప్సరస్తీర్థ సాంనిధ్యం యావత్సాధుజనస్య అభిషేకకాల ఇతి. సాంప్రతమస్య రాజర్షేరుదంతం ప్రత్యక్షీకరిష్యామి. మేనకాసంబంధేన శరీరభూతా మే శకుంతలా. తయా చ దుహితృనిమిత్తమాదిష్టపూర్వాస్మి. కిం ను ఖలు ఋతూత్సవేఽపి నిరుత్సవారంభమివ రాజకులం దృశ్యతే. అస్తి మే విభవః ప్రణిధానేన సర్వం పరిజ్ఞాతుమ్. కిం తు సఖ్యా ఆదరో మయా మానయితవ్యః భవతు. అనయోరేవోద్యానపాలికయోస్తిరస్కరిణీ ప్రతిచ్ఛన్నా పార్శ్వవర్తినీ భూత్వోపలప్స్యే).**

---

చేత) నిర్వర్తింపబడవలసిన నియమం, మయా = (ఈనాడు నా వంతు గనుక) నా చేత, నిర్వర్తితమ్ = నిర్వహింపబడింది. నగరవాసులు అప్సరస్తీర్థంలో స్నానాలు చేసి వెళ్ళే సమయం ముగిసింది. అంటే ప్రాతః కాలం ముగిసి, సంగవకాలం మొదలయ్యింది – అని. సాంప్రతమ్ = ఇప్పుడు (విధి నిర్వహణ అయ్యింది కాబట్టి), రాజర్షేః = దుష్యంతుడి, ఉదంతమ్ = ప్రవృత్తిని – ఏమి చేస్తున్నాడు అనే విషయాన్ని, (వార్తా ప్రవృత్తిః వృత్తాంత ఉదంతః స్యాత్ – అమరం), ప్రత్యక్షీకరిష్యామి = ప్రత్యక్షంగా తెలుసుకుంటాను. మేనకా – సంబంధేన = మేనకతో ఉన్న బంధుత్వం వల్ల, శకుంతలా = శకుంతల, మే = నాకు, శరీరభూతా = శరీరంతో సమానురాలయ్యింది. అంతగా ఆత్మీయురాలయ్యింది – అని. తయా + చ = ఆ మేనక చేత కూడా, దుహితృనిమిత్తమ్ = కూతురుకోసమని, ఆదిష్టపూర్వా + అస్మి = ఇంతకు మునుపే ఆదేశింపబడ్డదానను సైతం అయ్యాను. కూతురు కోసమని మేనక కొన్నినాళ్ళ క్రితమే నన్ను ఆదేశించింది – దుష్యంతుడి విషయం చూసి రమ్మనీ, శకుంతలను విడిచిపెట్టాక ఇప్పుడెలా ఉన్నాడో – తెలుసుకో అనీ. అందుకని ఇప్పుడు ఆ పని నిర్వహిస్తాననడం. (సమంతాత్ + అవలోక్య = అన్నివైపులకూ తేరిపారజూచి) కిమ్ – ను – ఖలు = ఏమిది?! ఋతు + ఉత్సవే + అపి = వసంతోత్సవం (ప్రకృతిలో అంతటా) ప్రారంభమైనా, రాజకులమ్ = రాజుగారి కోట, నిరుత్సవారంభమ్ + ఇవ = అసలు ఉత్సవప్రారంభమే లేనట్టుగా, దృశ్యతే =

**(తతః ప్రవిశతి చూతాంకురమవలోకయంతీ చేటీ, అపరా చ పృష్ఠతస్తస్యాః)**

ప్రథమా : **ఆతమ్మహఅపండుర జీవిద సత్తం వసంతమాసస్స**
**దిట్ఠో సి చూదకోరఅ ఉదుమంగల తుమం పసాఏమి**

**(ఆతామ్రహరితపాండుర! జీవిత! సత్యం వసంతమాసస్య**
**దృష్టోఽసి చూతకోరక! ఋతుమంగళ! త్వాం ప్రసాదయామి) 02**

---

కనబడుతోంది. ఎక్కడా వసంతోత్సవం జాడలు కనబడటం లేదే – అని. ప్రణిధానేన = ఏకాగ్రచిత్తంతో – ధ్యానంతో, సర్వమ్ + పరిజ్ఞాతుమ్ = అంతా తెలుసుకోడానికి, మే = నాకు, విభవః + అస్తి = శక్తి ఉంది. (ప్రణిధి రవధానేఽపి – రామాశ్రమి). కింతు = కానీ, సఖ్యాః + ఆదరః = నా చెలిమి కత్తె మేనకయొక్క ఆదరం (ఆదేశః – అని పాఠాంతరం), మానయితవ్యః = నాచేత మన్నింపబడాలి, ఆమె మాటను నేను మన్నించాలి – అనుసరించాలి అనడం. భవతు = అగుగాక! తిరస్కరిణీ – ప్రతిచ్ఛన్నా = తిరస్కరిణీ విద్యతో దాగినదాననై (కనపడని దాననై), అనయోః = ఈ, ఉద్యానపాలికయోః = ఉద్యానవనపాలికలను, పార్శ్వవర్తినీ భూత్వా = చెంతనున్నదాననై, ఉపలప్స్యే = విషయం గ్రహిస్తాను. (ఇతి = అని, నాట్యేన = ఆకాశం నుంచి దిగే అభినయ చారీ భేదంతో, అవతీర్య = దిగి, స్థితా = నిలుస్తుంది)

(తతః = అంతట, చూతాంకురమ్ = మామిడి మొగ్గను, అవలోకయంతీ + చేటీ = చూస్తున్న ఒక చేటిక, ప్రవిశతి = ప్రవేశిస్తుంది. తస్యాః + పృష్ఠతః = ఆమె వెనుక, అపరా + చ = మరొక చేటికకూడా, ప్రవిశతి = ప్రవేశిస్తుంది).

**ఆతమ్మ:** ఆతామ్ర – హరిత – పాండుర = ఎఱ్ఱగానూ పచ్చగానూ తెల్లగానూ ఉన్నదానా! వసంతమాసస్య = చైత్రమాసానికి, సత్యమ్ = నిజంగానే, జీవిత = ప్రాణమా! (వసంతమాసయోః = చైత్రవైశాఖాలకు – అని పాఠాంతరం), ఋతుమంగళ = వసంత ఋతువుకు మంగళస్వరూపమా! దృష్టః + అసి = కనిపించావు – దర్శనమిచ్చావు! త్వామ్ = నిన్ను, ప్రసాదయామి = వేడుకొంటున్నాను – దోయిలిస్తున్నాను.

**తాత్పర్యం:** ఓసీ! మామిడిమొగ్గా! ఏడాది తరవాత కనిపించావు. ఎఱ్ఱగా పచ్చగా తెల్లగా ఎంత అందంగా ఉన్నావో! నిజంగా ఈ వసంతఋతువుకి నువ్వే ప్రాణం, నువ్వే మంగళస్వరూపం!! నీకిదే నమస్కరిస్తున్నాను. స్వాగతం పలుకుతున్నాను!!

**ద్వితీయా : పరహుదిఏ, కిం ఏఆఇణీ మంతేసి. (పరభృతికే, కిమేకాకినీ మంత్రయసే?)**

**ప్రథమా : మహుఅరిఏ, చూదకలిఅం దేక్ఖిఅ ఉమ్మత్తియా పరహుదిఆ హోది. (మధుకరికే! చూతకళికాం దృష్ట్వా ఉన్మత్తా పరభృతికా భవతి).**

**ద్వితీయా : (సహర్షం త్వరయోపగమ్య) కహం, ఉవట్ఠిదో మహుమాసో? (కథమ్! ఉపస్థితో మధుమాసః?!).**

**ప్రథమా : మహుఅరిఏ, తవ దాణిం కాలో ఏసో మదవిబ్భమగీదాణం. (మధుకరికే! తవేదానీం కాల ఏష మదవిభ్రమగీతానామ్).**

**ద్వితీయా : సహి, అవలంబ మం జావ అగ్గపాదట్ఠిఆ భవిఅ చూదకలిఅం గేణ్హిఅ కామదేవచ్చణం కహేమి. (సఖి! అవలంబస్వ మాం యావదగ్రపాదస్థితా భూత్వా చూతకలికాం గృహీత్వా కామదేవార్చనం కరోమి).**

---

**పరహుదిఏ:** పరభృతికే = ఓసీ పరభృతికా! ఏకాకినీ = ఒంటరిగా నిలిచి, కిమ్ + మంత్రయసే = ఏమిటీ ఆలోచిస్తున్నావు?

**మహుఅరిఏ:** మధుకరికే = ఓసీ మధుకరికా! చూతకళికామ్ – దృష్ట్వా = మామిడి మొగ్గను చూసి, పరభృతికా = పరభృతిక (ఆ పేరు గల్గిన నేను అనీ – చిన్నారి కోయిల అనీ), ఉన్మత్తా + భవతి = ఉన్మత్తురాలు అవుతుంది గదా! మైమరచిపోదా?! – అనడం.

(సహర్షమ్ = సంబరపడుతూ, త్వరయా = వేగంగా, ఉపగమ్య = సమీపించి)

**కహం:** కథమ్ = ఎట్టా!! మధుమాసః = చైత్రమాసం – వసంత ఋతువు, ఉపస్థితః = వచ్చేసిందా?!

**తవ దాణిం:** మధుకరికే = ఓసీ మధుకరికా! (ఇది ఆమె పేరు. ఆడు తుమ్మెద అని మరో అర్థం) మద విభ్రమగీతానామ్ = మద విలాసంతో కూడిన పాటలకు (ఝుంకారాలకు), తవ = నీకు, ఇదానీమ్ = ఇప్పుడు, ఏషః + కాలః = ఇదే సమయం!! శృంగార గీతాలకూ ఝుంకారాలకూ ఈ ఋతువే – వికసించిన మామిడిపూతతో – అనుకూలమని.

**అవలంబ:** సఖి = పరభృతికా! మామ్ = నన్ను, అవలంబస్వ = కాసింత పట్టుకో! అగ్రపాదస్థితా – భూత్వా = కాళ్ల మునువేళ్ల మీద నిలిచి (పాదాల కొసల మీద నిలిచి), చూతకళికామ్ + గృహీత్వా = మామిడి మొగ్గల గుత్తిని తుంపుకొని, కామదేవార్చనమ్ +

ప్రథమా : జఇ మమ వి క్ఖు అద్ధం అచ్చణఫలస్స. (యది మమాపి ఖల్వర్ధమర్చన ఫలస్య)

ద్వితీయా : అకహిదే వి ఏదం సంపజ్జఇ జదో ఏక్కం ఏవ్వ ణో జీవిదం దుధాట్ఠిదం సరీరం. (సఖీమవలంబ్య స్థితా చూతాంకురం గృహ్ణాతి) అఏ, అప్పడిబుద్ధో వి చూదప్పసవో ఏత్థ బంధణభంగసురభీ హోది. (ఇతి కపోతహస్తకం కృత్వా)

తుమం సి మఏ చూదంకుర దిణ్ణో కామస్స గహీదధణుఅస్స
పహిఅ జణజువ ఇలక్ఖో పంచాబ్భహిఓ సరో హోది

---

కరోమి = మన్మథపూజ చేస్తాను. యావత్ = పువ్వును తుంపుకొనే దాకా పట్టుకో! (కాళ్ల మునువేళ్లమీద నిలిచి అందుకొని కోస్తోంది కనుక తూలి పోకుండా పట్టుకోమనడం).

**జఇ మమ:** అర్చనఫలస్య = మన్మథపూజ తాలూకు ఫలంలో, అర్ధమ్ = సగం, యది – మమ + అపి – ఖలు = నాకు కూడా ఉంటుంది కదూ!?

**అకహిదే:** అకథితే + అపి = చెప్పకుండానే, ఏతత్ = ఇది, సంపద్యతే = దక్కుతుంది. సగం ఫలం నీకు దక్కి తీరుతుంది, ఎవరూ చెప్పనవసరం లేదని. యతః = ఎందుకంటే – నౌ = మనకు, ఏకమ్ + ఏవ – జీవితమ్ = ప్రాణం ఒకటే, శరీరమ్ = శరీరం మాత్రం, ద్విధా – స్థితమ్ = విడివిడిగా (రెండుగా) ఉంది. మనకు శరీరాలు వేరుగానీ ప్రాణం ఒకటే కదా – అనడం. (సఖీమ్ + అవలంబ్య స్థితా = చెలికత్తె ఆసరాగా నిలిచి, చూతాంకురం = మామిడి చిగురును, గృహ్ణాతి = తీసుకుంటుంది). అయే = ఆహా! అప్రతిబుద్ధః + అపి = ఇంకా పూర్తిగా వికసించకపోయినా, అత్ర = ఇక్కడ, చూతప్రసవః = ఈ మామిడి పసిరి, బంధన – భంగ – సురభిః + భవతి = తొడిమనుంచి తుంపగానే గుబాళిస్తోంది!! (సంధానే చ తథా వృంతే మాయాయాం బంధనం స్మృతమ్ – ఇతి రుద్రః)

(ఇతి = అని, కపోతహస్తకమ్ + కృత్వా = 'కపోతహస్తం' అనే ముద్ర పట్టి. ఉభాభ్యామపి హస్తాభ్యామన్యోన్యం పార్శ్వసంగ్రహాత్ హస్తః కపోతకో నామ కర్మ చాస్య నిబోధత – భరతుడు. దోసిలి వెనక్కి తిప్పి ఆశీర్వదిస్తున్న ముద్ర. కపోతోஃసౌ కరో యత్ర శ్లిష్టమూలాగ్రపార్శ్వకః ప్రణామే గురుసంభాషే – సంగీతరత్నాకరమ్).

**తుమం సి:** చూతాంకుర = ఓ చూతప్రసవమా! (మామిడి చిగురా!) త్వమ్ = నీవు, గృహీత ధనుషే = ఎప్పుడూ ధనుస్సు ఎక్కుపెట్టే ఉంచుకొనేవాడూ, పథికజన – యువతి

**(ఇతి చూతాంకురం క్షిపతి)**

**(అకథితేఽప్యేతత్సంపద్యతే యత ఏకమేవ నౌ జీవితం ద్విధాస్థితం శరీరమ్. అయే, అప్రతిబుద్ధోఽపి చూతప్రసవోఽత్ర బంధనభంగ సురభిర్భవతి.**

**త్వమసి మయా చూతాంకుర! దత్తః కామాయ గృహీతధనుషే**
**పథికజన యువతిలక్ష్యః పంచాభ్యధికః శరో భవ) 03**

**(ప్రవిశ్యాపటీక్షేపేణ కుపితః)**

---

– లక్ష్యః = బాటసారుల ఇల్లాండ్రే గురిగా కలవాడూ (వాళ్ళనే గురిపెట్టినవాడూ) అయిన, కామాయ = మన్మథుడికి, మయా = నాచేత, దత్తః + అసి = ఇదిగో సమర్పింపబడ్డావు – పూజలో భాగంగా సమర్పించాను – అనడం. త్వమ్ = నీవు, పంచ + అభ్యధికః = మన్మథుడి బాణాలు అయిదింటిలో శ్రేష్ఠమైన, శరః + భవ = బాణానివి అగుము!! పంచశరుడికి ఆరవబాణంగా నిన్ను సమర్పిస్తున్నాను – అనిన్నీ. మామిడి చిగురు ఒక బాణం – మామిడి పువ్వు మరో బాణం!!

(ఇతి = అని, చూతాంకురం = మామిడి చిగురును, క్షిపతి = విసురుతుంది)

**తాత్పర్యం:** ఓసి చూతాంకురమా! నిరంతరం ధనుర్ధారిగా ఉండి విరహిణులను గురిపెట్టే పంచశరుడికి ఇక నుంచి నువ్వు గురితప్పని ఉత్తమ బాణంగా అగుదువుగాక!

**విశేషాలు:** పంచాభ్యధికః అనే సమాసానికి – మన్మథుడి కున్న అయిదు బాణాలలోను శ్రేష్ఠమైన దానివి అగుము – పంచానాం బాణానాం మధ్యే అభ్యధికః = శ్రేష్ఠః శరః భవ – అని కాటయవేముని సమన్వయం. పంచసు అభ్యధికః శ్రేష్ఠః. సమానానాముత్తమ శ్లోకోఽస్తు – ఇతి న్యాయేన – అని శ్రీనివాసాచార్య. పంచభ్యశ్శరేభ్యః అభ్యధికః– వ్యతిరిక్తః – అని కూడా వీరే సమన్వయించారు. అరవింద మశోకం చ శిరీషం చూతముత్పలమ్ పంచైతాని ప్రకీర్త్యంతే పంచబాణస్య సాయకాః – ఇతి త్రిపురాసురసింధౌ అన్నాడు కాటయ. అరవిందమశోకం చ చూతం చ నవమల్లికా నీలోత్పలం చేతి పంచైతే పంచబాణస్య సాయకాః – అని మరో పాఠం. పంచశరునకు నాఱవ బాణమగుము – అని కందుకూరివారు.

(అపటీ – క్షేపేణ = విసురుగా తెర తోసుకొని, ప్రవిశ్య = ప్రవేశించి, కుపితః = కోపంతో, కంచుకి....)

**కంచుకీ : మా తావత్. అనాత్మజ్ఞే! దేవేన ప్రతిషిద్ధే వసంతోత్సవే త్వమామ్రకలికాభంగం కిమారభసే?**

**ఉభే : (భీతే) పసీదదు అజ్జో. అగ్గహీదత్థాఓ వఅం. (ప్రసీదత్వార్యః అగృహీతార్థే ఆవామ్)**

**కంచుకీ : న కిల శ్రుతం యువాభ్యామ్? యద్వాసంతికైస్తరుభిరపి దేవస్య శాసనం ప్రమాణీకృతం తదాశ్రయిభిః పత్రిభిశ్చ. తథాహి –**

**చూతానాం చిరనిర్గతాపి కలికా బధ్నాతి న స్వం రజః**
**సన్నద్ధం యదపి స్థితం కురవకం తత్కోరకావస్థయా**
**కంఠేషు స్ఖలితం గతేఽపి శిశిరే పుంస్కోకిలానాం రుతమ్**
**శంకే సంహరతి స్మరోఽపి చకితస్తూణార్ధకృష్టం శరమ్. 04**

---

**మా– తావత్:** మా – తావత్ = వద్దు సుమా! అనాత్మజ్ఞే = ఒళ్లు తెలియనిదానా! (ఆత్మజ్ఞానం లేనిదానా మూర్ఖురాలా – అని). దేవేన = మహారాజుచేత, వసంతోత్సవే = వసంతోత్సవం, ప్రతిషిద్ధే (సతి) = నిషేధింపబడగా, త్వమ్ = నువ్వు, ఆమ్రకలికా – భంగమ్ = మామిడి మొగ్గను త్రుంపడం, కిమ్ + ఆరభసే = ఎందుకు మొదలుపెట్టావు?

**పసీదదు:** (భీతే = ఇద్దరూ వణికిపోతూ) ఆర్యః = అయ్యగారు, ప్రసీదతు = కనికరించుగాక! ఆవామ్ = మేమిద్దరమూ, అగృహీత + అర్థే = విషయం తెలియనివాళ్ళం!! నిషేధించిన సంగతి మాకు తెలియదు – అనడం.

**న కిల:** యువాభ్యామ్ = మీ ఇద్దరిచేత, న + శ్రుతమ్ + కిల = ఆలకింపబడలేదా? రాజాజ్ఞను మనుషులైయుండీ మీరు వినలేదా? – అనడం. వాసంతికైః = వసంతర్తువులో శోభించేవైన, తరుభిః = చెట్లతోనూ, తత్ + ఆశ్రయిభిః = వాటిని ఆశ్రయించుకొని ఉండే, పత్రిభిః + చ = పక్షులతోనూ, యత్ + దేవస్య – శాసనమ్ = ప్రభువుగారి ఆజ్ఞ (శాసనం నృపదత్తోర్వ్యాం శాస్త్రాజ్ఞాలేఖ శాస్తిషు – ఇతి హైమః), ప్రమాణీకృతమ్ = శిరసావహింపబడింది. తత్ = ఇది, యువాభ్యామ్ న శ్రుతం కిల?! తథాహి = అదిగో చూడండి –

**చూతానామ్:** చూతానామ్ + కళికా = మామిడి మొగ్గ, చిరనిర్గతా + అపి = ఏడాదికి పొడసూపినదే అయినా, స్వమ్ + రజః = తన పుప్పొడిని (తన అహంకారాన్ని), న – బధ్నాతి = బయటికి కనపడనీయడం లేదు. కురవకమ్ + అపి = ఎర్రగోరింట కూడా,

**ఉభే : ణత్థి సందేహో మహాప్పహాఓ రాఏసీ. (నాస్తి సందేహో మహాప్రభావో రాజర్షిః)**

**ప్రథమా : అజ్జ కతి దిఅహాఇం గఆణి అహ్మాణం మిత్తావసుణా రట్టిఏణ భట్టిణో పాఅమూలం వేసిదాణం? ఇత్థం అణో పమదవణస్స పాలణకమ్మసమప్పిదం. తా ఆఅంతుఅదాఏ అస్సుదపువ్వో అహ్మేహిం ఏసో వుత్తాంతో. (ఆర్య! కతి దివసాని గతా న్యావయోర్మిత్రావసునా రాష్ట్రియేణ భర్తుః పాదమూలాత్ ప్రేషితయోః? ఇత్థం చ నౌ ప్రమదవనస్య పాలనకర్మ సమర్పితమ్. తదాగంతుకతయా అశ్రుతపూర్వ ఆవాభ్యామేష వృత్తాంతః)**

---

సన్నద్ధమ్ + యత్ = తొడిమనుంచి వెలువడి వికసించడానికి సర్వసన్నద్ధంగా ఉండీ కూడా, తత్ + కోరకావస్థయా = అదే మొగ్గ అవస్థతో, స్థితమ్ = ఉండిపోయింది. శిశిరే = శిశిరర్తువు, గతే + అపి = గడిచిపోయినా – వసంతం వచ్చినా, పుంస్కోకిలానామ్ = గండుకోయిలల, రుతమ్ = కూత, కంఠేషు = వాటి గొంతుకల్లోనే, స్ఖలితమ్ = గురగురలాడుతోంది. స్మరః + అపి = మన్మథుడు సైతం, తూణ + అర్ధకృష్టమ్ = అమ్ములపొదినుంచి సగం – పైకి లాగిన, శరమ్ = బాణాన్ని, చకితః = నివ్వెరపోయినవాడై, సంహరతి = ఉపసంహరించుకొంటున్నాడు – మళ్ళీ పొదిలోకే వదిలేస్తున్నాడు అని, శంకే = భావిస్తున్నాను.

**తాత్పర్యం:** మామిడి మొగ్గలు విచ్చుకోవడం లేదు – పుప్పొడి వెదజల్లడం లేదు. ఎర్రగోరింట మొగ్గ తొడిగీ అదే అవస్థలో అలాగే ఉండిపోయింది. శిశిరం వెళ్ళి వసంతం వచ్చినా గండుకోయిల గొంతు సవరించడం లేదు. మన్మథుడు సైతం – అమ్ములపొది నుంచి సగం ఇవతలికి లాగిన బాణాన్ని చకితుడై అంబులపొదిలోకే వదిలేస్తున్నాడు. తరువులూ పక్షులూ ఇలా వసంతాన్ని ఆవిష్కరించకుండా ప్రభువు ఆజ్ఞను శిరసా వహిస్తున్నాయి.

**ణత్థి:** న + అస్తి – సందేహః = సందేహం ఏమీ లేదు. రాజర్షిః = రాజర్షి దుష్యంతుడు, మహాప్రభావః = మహామహిమాన్వితుడు!!

**అజ్జ కతి:** ఆర్య = మాన్యుడా! రాష్ట్రియేణ = రాజుగారి బావమరదియైన, మిత్రావసునా = మిత్రావసువుచేత, భర్తుః + పాదమూలాత్ = రాజుగారి పాదసన్నిధినుంచి,

**కంచుకీ : భవతు. న పునరేవం ప్రవర్తి తవ్యమ్.**

**ఉభే : అజ్జ, కోదూహళం ణో. జహ ఇమిణా జణేణ సోదవ్వం కహేదు అఅం కింణిమిత్తం భట్టిణా వసంతుస్సవో పడిసిద్ధో? (ఆర్య! కౌతూహలం నౌ. యద్యనేన జనేన శ్రోతవ్యం కథయత్వయం కింనిమిత్తం భర్త్రా వసంతోత్సవః ప్రతిషిద్ధః?)**

**సానుమతీ: ఉస్సవప్పిఆ క్ఖు మణుస్సా. గురుణా కారణేణ హోదవ్వం. (ఉత్సవ ప్రియాః ఖలు మనుష్యాః. గురుణా కారణేన భవితవ్యమ్).**

**కంచుకీ : బహులీభూతమేతత్కిం న కథ్యతే. కిమత్రభవత్యోః కర్ణపథం నాయాతం శకుంతలా ప్రత్యాదేశకౌలీనమ్?**

---

ప్రేషితయోః = పంపివేయబడ్డవారమై, ఆవయోః = మా ఇద్దరికీ, కతి – దివసాని – గతాని = ఎన్నినాళ్లు గడిచాయి! ఇత్థమ్ + చ = ఇదిగో ఇలా, ప్రమదవనస్య = ఈ ఉద్యానవనానికి, పాలనకర్మ = సంరక్షణ పని, నౌ = మా ఇద్దరికీ, సమర్పితమ్ = అప్పగించబడింది. చాలా నాళ్ల క్రితం మిత్రావసువు మమ్మల్ని రాజసన్నిధి నుంచి తొలగించి ఈ ఉద్యానవనానికి కావలిగా పంపించాడు – అని. తత్ + ఆగంతుకతయా = అలా వచ్చి ఉండి పోవడంతో, ఏషః = ఈ వృత్తాంతః = రాజశాసనం కథ, ఆవాభ్యామ్ = మా ఇద్దరిచేత, అశ్రుతపూర్వః = మునుపు విన్నదికాదు. ఇప్పుడే మీనోట వింటున్నామని. తెలియకపోవడంతో మామిడిమొగ్గ తుంపామని.

**భవతు:** భవతు = సరే! పునః = మళ్ళీ, ఏవమ్ = ఇలా, న – ప్రవర్తితవ్యమ్ = చెయ్యకండి!

**కోదూహలం:** ఆర్య = మాన్యుడా! నౌ = మాకు, కౌతూహలమ్ = కుతూహలంగా ఉంది. అనేన – జనేన = ఈ మాచేత, శ్రోతవ్యమ్ + యది = ఆలకింపదగ్గదే అయితే, కథయతు = చెప్పండి, కిమ్ + నిమిత్తమ్ = ఎందుకని, భర్త్రా = రాజుచేత, వసంతోత్సవః = వసంతోత్సవం, ప్రతిషిద్ధః = నిషేధింపబడింది?

**ఉస్సవప్పిఆ:** మనుష్యాః = మానవులు, ఉత్సవప్రియాః + ఖలు = ఉత్సవప్రియులు గదా! (సంబురాలంటే సంబరపడతారు గదా!) ఐనా నిషేధించాడంటే – గురుణా – కారణేన = ఏదో పెద్దకారణంతోనే, భవితవ్యమ్ = జరిగి ఉంటుంది. (ఈ దినుసు కారకం తెలుగుకి లొంగదు). ఏదో పెద్ద కారణమే ఉండి ఉంటుంది – అని.

**ఉభే : సుదం రట్టిఅ ముహాదో జావ అంగులీఅఅదంసణం. (శ్రుతం రాష్ట్రియముఖా ద్యావదంగులీయక దర్శనమ్.)**

**కంచుకీ : తేన హ్యల్పం కథయితవ్యమ్. యదైవ ఖలు స్వాంగులీయకదర్శనాత్ అనుస్మృతం దేవేన సత్యమూఢపూర్వా మే తత్రభవతీ రహసి శకుంతలా మోహాత్ ప్రత్యాదిష్టేతి, తదాప్రభృత్యేవ పశ్చాత్తాప ముపగతో దేవః. తథాహి –**

---

**బహులీ:** బహులీభూతమ్ = బహుళప్రచారం పొందినదే – అందరికీ తెలిసినదే, ఏతత్ = ఈ విషయం, కిమ్ + న – కథ్యతే = ఎందుకు (మీకు) చెప్పకూడదు?! శకుంతలా – ప్రత్యాదేశ = శకుంతలను నిరాకరించడం అనే, కౌలీనమ్ = (రాజుకు వచ్చిన) లోకాపవాదం (స్యాత్ కౌలీనం లోకవాదే – అమరం), అత్రభవత్యోః = మాన్యురాండ్రయిన మీకు, కర్ణపథమ్ – న + ఆయాతమ్ + కిమ్ = చెవి సోకలేదా? ఈ అపవాదు మీరు వినలేదా?

**సుదం:** అంగులీయక దర్శనమ్ + యావత్ = రాజుగారు ఉంగరం చూడటం వరకూ, రాష్ట్రియముఖాత్ = మిత్రావసువు నోటినుంచి, శ్రుతమ్ = ఆలకింపబడింది. కథ అంతవరకూ విన్నామనడం.

**తేన హి:** తేన = అందుచేత – అంతవరకూ మీరు విన్నారు కనుక, కథయితవ్యమ్ = ఇక చెప్పవలసినది, అల్పమ్ + హి = తక్కువే సుమా! స్వ + అంగులీయక దర్శనాత్ = తన ఉంగరం చూడటం వల్ల, "తత్రభవతీ = మాన్యురాలు, శకుంతలా = శకుంతల, రహసి = రహస్యంగా, మే = నాకు, సత్యమ్ = నిజంగానే, ఊఢపూర్వా = మునుపే పెళ్ళాడబడినది, మోహాత్ = మతి విభ్రమం వల్ల, ప్రత్యాదిష్టా = తిరస్కరింపబడినది", ఇతి = అని, యదా + ఏవ + ఖలు = ఎప్పుడయితే, దేవేన = రాజు గారిచేత, అనుస్మృతమ్ = గుర్తుచేసుకోబడిందో, తదా + ప్రభృతి + ఏవ = ఆ క్షణం నుంచే, దేవః = మహారాజు, పశ్చాత్తాపమ్ + ఉపగతః = పశ్చాత్తాపం పొందినవాడయ్యాడు. తథాహి = ఎలాగంటే–

**రమ్యమ్:** రమ్యమ్ = అందమైన – ఆహ్లాదకరమైన ఏ వస్తువునైనా సరే (స్రక్ చందన చంద్రపాదాదికమ్), ద్వేష్టి = అసహ్యించుకొంటున్నాడు. పురా = మునుపు, యథా =

**రమ్యం ద్వేష్టి యథా పురా ప్రకృతిభిర్న ప్రత్యహం సేవ్యతే**
**శయ్యాప్రాంతవివర్తనైః విగమయత్యున్నిద్ర ఏవ క్షపాః**
**దాక్షిణ్యేన దదాతి వాచముచితా మంతఃపురేభ్యో యదా**
**గోత్రేషు స్ఖలితస్తదా భవతి చ వ్రీడావిలక్షశ్చిరమ్** **05**

**సానుమతీ: పిఅం మే (ప్రియం మే)**

**కంచుకీ : అస్మాత్ప్రభవతో వైమనస్యాదుత్సవః ప్రత్యాఖ్యాతః.**

**ఉభే : జుజ్జఇ. (యుజ్యతే)**

**(నేపథ్యే)**

**ఏదు ఏదు భవం (ఏతు ఏతు భవాన్)**

---

ఎట్లో, (తథా = అట్లా), ప్రకృతిభిః = మంత్రుల చేత, ప్రత్యహమ్ = ప్రతిదినమూ, న – సేవ్యతే = సేవలు అందుకోవడం లేదు. ఉన్నిద్రః = నిద్రపట్టనివాడై, శయ్యాప్రాంత –వివర్తనైః + ఏవ = పడకమీద దొర్లడాలతోనే, క్షపాః = రాత్రులు, విగమయతి = వెళ్ళబుచ్చుతున్నాడు. అంతఃపురేభ్యః = అంతఃపురకాంతలకు, దాక్షిణ్యేన = బతిమాలుకోగా బతిమాలుకోగా దయతో, ఉచితామ్ + వాచమ్ = అత్యవసరమైన మాటను, దదాతి = ముక్త సరిగా ఇస్తున్నాడు. యదా = అలా ముక్తసరిగా మాట్లాడేటప్పుడు, గోత్రేషు = ఆ కాంతల పేరులవిషయంలో, స్ఖలితః = తడబడ్డవాడై (ఒకరిని మరొకరి పేరుతోనో శకుంతల పేరుతోనో పిలిచి) తదా = అప్పటికప్పుడు, చిరమ్ = చాలాసేపు, వ్రీడా – విలక్షః = సిగ్గుతో నివ్వెరపోయినవాడు, భవతి = అవుతున్నాడు. (విలక్షో విస్మయాన్వితః – అమరం)

**పిఅం మే:** మే = నాకు, ప్రియమ్ = ప్రియం కలిగించే విషయమిది!

**అస్మాత్:** అస్మాత్ = ఈ కారణంగా, ప్రభవతః + వైమనస్యాత్ = ప్రభువుగారి విమనస్కత వల్ల, ఉత్సవః = వసంతోత్సవం, ప్రత్యాఖ్యాతః = నిషేధింపబడింది. (ప్రభవతః = సమర్థాత్ అధికాదిత్యర్థః – రాఘవ భట్టు. ప్రభవతః = ప్రభోః – కాటయ)

**జుజ్జఇ:** యుజ్యతే = యుక్తమే!

(నేపథ్యే = తెరలో)

**ఏదు:** భవాన్ = నీవు, ఏతు ఏతు = ఇటు రమ్మిటురమ్ము!!

**కంచుకీ : (కర్ణం దత్వా) అయే, ఇత ఏవాభివర్తతే దేవః. స్వకర్మానుష్ఠీయతామ్.**

**ఉభే : తహ. (తథా)**

**(ఇతి నిష్క్రాంతే)**

**(తతః ప్రవిశతి పశ్చాత్తాపసదృశవేషో రాజా విదూషకః ప్రతీహారీ చ)**

**కంచుకీ : (రాజానమవలోక్య) అహో! సర్వాస్వవస్థాసు రమణీయత్వమ్ ఆకృతివిశేషాణామ్. ఏవముత్సుకోఽపి ప్రియదర్శనో దేవః. తథాహి –**

**ప్రత్యాదిష్ట విశేషమండన విధిర్వామప్రకోష్ఠార్పితం**
**బిభ్రత్కాంచనమేకమేవ వలయం శ్వాసోపరక్తాధరః**
**చింతాజాగరణ ప్రతాంతనయనస్తేజోగుణాదాత్మనః**
**సంస్కారోల్లిఖితో మహామణిరివ క్షీణోఽపి నాలక్ష్యతే. 06**

---

**అయే:** (కర్ణం దత్వా = ఆలకించి) అయే = అహో! దేవః = మహారాజు, ఇతః + ఏవ = ఇటువైపే, అభివర్తతే = వస్తున్నాడు! స్వకర్మ + అనుష్ఠీయతామ్ = ఎవరి పనివారు చేయండి!! మీ పనికి మీరు వెళ్ళండి – అని.

**తహ:** తథా = అలాగే!

(ఇతి = అని, నిష్క్రాంతే = పరభృతికా మధుకరికలు నిష్క్రమిస్తారు)

(తతః = అంతట, పశ్చాత్తాప – సదృశవేషః = పశ్చాత్తాపపడుతున్న వ్యక్తికి తగిన వేషంతో, రాజా = దుష్యంతుడు, ప్రవిశతి = ప్రవేశిస్తాడు. విదూషకః = విదూషకుడు, ప్రవిశతి = ప్రవేశిస్తాడు. పతీహారీ – చ – ప్రవిశతి = ప్రతీహారి కూడా ప్రవేశిస్తుంది)

**సర్వాసు:** (రాజానమ్ + అవలోక్య = రాజును చూసి) ఆకృతి – విశేషాణామ్ = కొన్ని విశిష్టరూపాలకు, సర్వాసు + అవస్థాసు = అన్ని అవస్థలలోనూ, రమణీయత్వమ్ = సుందరత్వమే. అహో = ఆశ్చర్యం!! (కొందరి సౌందర్యం ఏ అవస్థలోనూ చెడదని). దేవః = మహారాజు, ఏవమ్ = ఇలా, ఉత్సుకః + అపి = చింతాకులుడైనా, ప్రియదర్శనః = అందంగానే కనిపిస్తున్నాడు. తథాహి = అంతేకదా!

**ప్రత్యాదిష్ట:** ప్రత్యాదిష్ట = తిరస్కరింపబడిన, విశేష – మండనవిధిః = విశేషమైన అలంకరణ కలవాడూ – ప్రత్యేకాలంకరణను తిరస్కరించినవాడు అని; వామ –

**సానుమతీ:** **(రాజానం దృష్ట్వా) ఠాణే క్ఖు పచ్చాదేసవిమాణితా వి ఇమస్స కిదే సఉందలా కిలమ్మదిత్తి. (స్థానే ఖలు ప్రత్యాదేశవిమానితాపి అస్య కృతే శకుంతలా క్లామ్యతీతి)**

**రాజా : (ధ్యానమందం పరిక్రమ్య)**

**ప్రథమం సారంగాక్ష్యా ప్రియయా ప్రతిబోధ్యమానమపి సుప్తమ్**
**అనుశయ దుఃఖాయేదం హతహృదయం సంప్రతి విబుద్ధమ్ 07**

---

ప్రకోష్ఠ + అర్పితమ్ = ఎడమ మణికట్టు మీద నిల్పబడిన, ఏకమ్ + ఏవ = ఒకే ఒక్క, కాంచనమ్ + వలయమ్ = బంగారు కంకణం, బిభ్రత్ = ధరిస్తున్నవాడు – ఎడమచేతికి ఒకేఒక్క బంగారు కంకణం వేసుకొన్నాడు –అని (బిభ్రత్ – అభ్యస్తత్వాత్ న – నుమ్); శ్వాస = వేడినిట్టూర్పులతో, ఉపరక్తః = ఎర్రబడ్డ, అధరః = పెదవి కలవాడూ; చింతా = చింతవల్లనైన, జాగరణ = నిద్రలేమితో, ప్రతాంత = బాగా అలసిపోయిన, నయనః = నేత్రాలు గలవాడూ; సంస్కార+ ఉల్లిఖితః = శుభ్రపరచడం కోసం తరిణిపట్టబడినదైన, మహామణిః+ ఇవ = రత్నంలాగా, క్షీణః + అపి = కృశించినవాడే అయినా, ఆత్మనః = తనదైన, తేజోగుణాత్ = తేజస్సు అనే గుణంవల్ల, న + ఆలక్ష్యతే = క్షీణించినట్టు కనపడటం లేదు. తరిణిబట్టిన మహామణి ఆకృతిలో కృశించినా కాంతివైభవంలో కృశించదు – మరింత అతిశయిస్తుంది. రాజుగారి విరహకృశత అలా ఉంది – అనడం.

**తాత్పర్యం:** అలంకరణను నిషేధించాడు. ఎడమచేతికి ఒకేఒక్క బంగారు కంకణం మాత్రం ఉంచుకున్నాడు. అదీ మణికట్టు దాకా జారి, అక్కడ నిలిచింది. నిట్టూర్పులతో పెదవి కందిపోతోంది. విరహంతో నిద్రపట్టక కన్నులు అలిసిపోయాయి. మొత్తం మీద – చెక్కిన మణిలాగా రూపంలో కాసింత కృశించినా స్వీయతేజస్సు వల్ల – అసలు కృశించినట్టే కనబడటం లేదు. (ఆత్మనః తేజో గుణాత్ దీప్తి లక్షణాత్ క్షీణోஉపి కృశోஉపి క్షీణత్వేన నాలక్ష్యతే. క ఇవ? సంస్కారార్థముద్ఘృష్టో మహామణిరివ – అని రాఘవభట్టు.)

**ఠాణే:** (రాజానమ్ + దృష్ట్వా = రాజును చూసి) ప్రత్యాదేశ = నిరాకరణతో, విమానితా + అపి = అవమానింపబడినదే అయినా, అస్య – కృతే = ఇతని కోసం, శకుంతలా = శకుంతల, క్లామ్యతి + ఇతి = కృశిస్తోందంటే, స్థానే + ఖలు = యుక్తమే కదా!

**సానుమతీ: ణం ఈదిసాణి తవస్సిణీఏ భాఅహేఆణి. (నన్వీదృశాని తపస్విన్యా భాగధేయాని)**

**విదూషక : (అపవార్య) లంఘిదో ఏసో భూఓ వి సఉందళావాహిణా. ణ ఆణే కహం చికిచ్ఛిదవ్వో భవిస్సదిత్తి. (లంఘిత ఏష భూయోఽపి శకుంతలావ్యాధినా. న జానే కథం చికిత్సితవ్యో భవిష్యతీతి!)**

**కంచుకీ : (ఉపగమ్య) జయతు, జయతు దేవః. మహారాజ! ప్రత్యవేక్షితాః ప్రమదవనభూమయః. యథాకామమధ్యాస్తాం వినోదస్థానాని మహారాజః.**

---

**ప్రథమమ్:** (ధ్యాన మందమ్ = శకుంతలా ధ్యానంతో మెల్లగా, పరిక్రమ్య = నడిచి) ప్రియయా = ప్రియురాలైన, సారంగాక్ష్యా = లేడి కన్నుల వంటి కన్నులు గల శకుంతలచేత, ప్రతిబోధ్యమానమ్ + అపి = మేల్కొల్పబడినదైనా, ప్రథమమ్ = మునుపు, సుప్తమ్ = నిద్రపోయిన, ఇదమ్ – హత – హృదయమ్ = ఈ పాడు మనసు, అనుశయ – దుఃఖాయ = పశ్చాత్తాప దుఃఖం కోసమే, సంప్రతి = ఇప్పుడు, విబుద్ధమ్ = మేల్కొంది!!

**తాత్పర్యం:** అప్పుడు శకుంతల ఎంతగా చెప్పినా వినక, నిద్ర మత్తు వదలని ఈ నా పాడు మనసు ఇప్పుడు మేల్కొంది. నన్ను పశ్చాత్తాపదుఃఖంలో ముంచడం కోసమే మేల్కొంది!! (సారం మనోహరం గచ్ఛత ఇతి సారంగే అక్షిణీ యస్యాస్సా – సాహిత్యటీక)

**ణం ఈదిసాణి:** తపస్విన్యాః = దయనీయురాలైన శకుంతల, భాగధేయాని = అదృష్టాలూ, ఈదృశాని + నను = ఇలాంటివే సుమా! (తపస్వీ చానుకంపార్హః – అమరం).

**లంఘిదో:** (అపవార్య = జనాంతికంగా) ఏషః = ఈ నా మిత్రుడు, భూయః + అపి = మళ్ళీ, శకుంతలా వ్యాధినా = శకుంతల అనే వ్యాధితో, లంఘితః = గ్రస్తుడయ్యాడు! కథమ్ = ఎలా, చికిత్సితవ్యః + భవిష్యతి + ఇతి = నయంచెయ్యబడ్డవాడవుతాడో, న – జానే = ఎరుగను!!

**జయతు:** (ఉపగమ్య = సమీపించి) జయతు – జయతు – దేవః = జయము జయము మహారాజ! = ప్రభూ! ప్రమదవనభూమయః = ప్రమదవనమూ పరిసరప్రదేశాలూ,

**రాజా : వేత్రవతి! మద్వచనాదమాత్యమార్యపిశునం బ్రూహి. చిరప్రబోధనాన్న సంభావితమస్మాభిరద్య ధర్మాసనమధ్యాసితుమ్. యత్ప్రత్యవేక్షితం పౌరకార్యమార్యేణ తత్పత్రమారోప్య దీయతామితి.**

**ప్రతీహారీ : జం దేవో ఆణవేది. (యద్దేవ ఆజ్ఞాపయతి)**

**(ఇతి నిష్క్రాంతా)**

**రాజా : వాతాయన! త్వమపి స్వం నియోగమశూన్యం కురు.**

---

ప్రత్యవేక్షితాః = నాచే పూర్తిగా పరిశీలింపబడ్డాయి. మహారాజః = మహారాజు, యథాకామమ్ = స్వేచ్ఛగా, వినోదస్థానాని = ఆయా వినోదింపదగ్గ ప్రదేశాలను, అధ్యాస్తామ్ = అధివసించుగాక! నీ ఏకాంత విహారానికి అనుకూల పరిచాను – అనడం. (ప్రమదవనం = రాజుగారు రాణులతో విహరించే ఉద్యానవనం. అంతఃపురానికి చేరువలో ఉంటుంది. విజ్ఞేయం ప్రమదవనం నృపస్తు యస్మిన్ శుద్ధాంతైస్సహ రమతే పురోపకంఠమ్ – ఇతి హలాయుధః)

**మద్వచనాత్:** వేత్రవతీ! (ప్రతీహారి పేరు) మద్వచనాత్ = నా మాటగా, అమాత్యమ్ – ఆర్యపిశునమ్ = అమాత్యుడైన ఆర్యపిశునుడికి, బ్రూహి = చెప్పు. చిరప్రబోధనాత్ = రాత్రి చాలాసేపు మెలకువగా ఉండటం వల్ల, అస్మాభిః = మాచేత, అద్య = ఈనాడు, ధర్మాసనమ్ = ధర్మాసనాన్ని, అధ్యాసితుమ్ = అధిరోహించి కూర్చోడానికి, న – సంభావితమ్ = ఇచ్ఛగింపబడటం లేదు. ఈనాడు ధర్మాసనం అధిష్ఠించను – అని. ఆర్యేణ = ఆర్యుడైన ఆర్యపిశునుడిచేత, యత్ = ఏ, పౌరకార్యమ్ = పౌరుల కుపయోగించేపని, ప్రత్యపేక్షితమ్ = అపేక్షింపబడుతుందో, తత్ = అది, పత్రమ్ + ఆరోప్య = పత్రం మీద లిఖించి, దీయతామ్ = నాకు ఈబడుగాక – ఇతి = అని అమాత్యమ్ ఆర్యపిశునం బ్రూహి.

**జం దేవో:** యత్ + దేవః + ఆజ్ఞాపయతి = ప్రభువు ఆజ్ఞాపించినట్టే. (ఇతి = అని, నిష్క్రాంతా = ప్రతీహారి నిష్క్రమిస్తుంది)

**వాతాయన:** వాతాయనా! (కంచుకి పేరు), త్వమ్ + అపి = నీవు కూడా, స్వమ్ + నియోగమ్ = నీ పనిని, అశూన్యమ్ + కురు = సక్రమంగా నిర్వహించు. నీ పని మీద నువ్వు వెళ్ళు – అని. (చూ: రెండవ అంకం ఏడవ శ్లోకం తరువాత)

**కంచుకీ : యదాజ్ఞాపయతి దేవః. (ఇతి నిష్క్రాంతః)**

**విదూషక : కిదం భవదా ణిమ్మచ్ఛిఅం. సంపదం సిసిరాతవచ్ఛే అరమణీఏ ఇమస్సిం పమదవణుద్దేసే అత్తాణం రమఇస్ససి. (కృతం భవతా నిర్మక్షికమ్. సాంప్రతం శిశిరాతపచ్ఛేదరమణీయేఽస్మిన్ ప్రమదవనోద్దేశే ఆత్మానం రమయిష్యసి)**

**రాజా : (నిఃశ్వస్య) వయస్య! రంధ్రోపనిపాతినోఽనర్థా ఇతి యదుచ్యతే తదవ్యభిచారి వచః. కుతః –**

**మునిసుతా ప్రణయస్మృతిరోధినా**
**మమ చ ముక్తమిదం తమసా మనః**
**మనసిజేన సఖే ప్రహరిష్యతా**
**ధనుషి చూతశరశ్చ నివేశితః. 08**

---

**యదాజ్ఞాపయతి:** దేవః = ప్రభువు, యత్ + ఆజ్ఞాపయతి = ఆజ్ఞాపించినట్టే! (ఇతి = అని, నిష్క్రాంతః = నిష్క్రమించాడు)

**కిదం భవదా:** భవతా = నీచేత, నిర్మక్షికమ్ + కృతమ్ = ఇక్కడ ఈగ కూడా లేకుండా చేయబడింది. అందరినీ పంపివేశావు – అనడం. సాంప్రతం = ఇప్పుడు, శిశిర – ఆతప + ఛేద = చల్లదనమూ వేడిమీ లేకుండా – సమశీతోష్ణంగా, రమణీయే = చాలా సుందరంగా ఉన్న, అస్మిన్ = ఈ, ప్రమదవనోద్దేశే = ప్రమదవనసీమలో, ఆత్మానమ్ = నిన్ను నీవు, రమయిష్యసి = వినోదింపజేసికొందువుగాక!

**రంధ్రోప:** (నిఃశ్వస్య = నిట్టూర్చి) వయస్య = మిత్రమా! రంధ్ర + ఉపనిపాతినః = సందు దొరికితే చాలు వచ్చిపడతాయి, అనర్థాః = కీడులు, ఇతి = అని, యత్ + ఉచ్యతే వచః + తత్ = (పెద్దలు) చెప్పేమాట, అవ్యభిచారి = విపర్యయం లేనిది – తప్పనిది – జరిగే తీరుతుంది – అనడం. (ఛిద్రేష్వనర్థా బహులీభవంతి). కుతః = ఎందుకంటే –

**మునిసుతా:** మునిసుతా + ప్రణయ = శకుంతలానురాగం తాలూకు, స్మృతి = స్మరణను, రోధినా = అడ్డగించినదైన, తమసా = మోహం నుంచి (చేత), ఇదమ్ = ఈ, మమ = నా, మనః = మనస్సు, ముక్తమ్ + చ = విడువబడిందీ ఇప్పుడే. మతిమరుపు తొలగి శకుంతలా ప్రణయం స్మృతికి వచ్చి వియోగవ్యథ మొదలయ్యిందీ ఇప్పుడే! సఖే = మిత్రమా! ప్రహరిష్యతా = బాణాలతో కొడుతున్న, మనసిజేన = మన్మథుడితో, ధనుషి

**విదూషక : చిట్ఠ దావ. ఇమిణా దండకట్ఠేణ కందప్పవాహిం ణాసేస్సం. (ఇతి దండకాష్ఠముద్యమ్య చూతాంకురం పాతయితుమిచ్ఛతి).**

**(తిష్ఠ తావత్. అనేన దండకాష్ఠేన కందర్పవ్యాధిం నాశయిష్యామి).**

**రాజా : (సస్మితమ్) భవతు. దృష్టం బ్రహ్మవర్చసమ్. సఖే! క్వోపవిష్టః ప్రియాయాః కించిదనుకారిణీషు లతాసు దృష్టిం విలోభయామి?**

**విదూషక : ణం ఆసణ్ణ పరిఆరిఆ చదురిఆ భవదా సందిట్ఠా. మాహవీ మండవే ఇమం వేలం అదివాహిస్సం. తహిం మే చిత్తఫలఅగదం సహత్థలిహిదం తత్తహోదీఏ సఉందలాఏ పడికిదిం ఆణేహిత్తి.**

---

= ధనుస్సు నందు, చూత శరః = మామిడి పూములికి, నివేశితః + చ = తొడగబడిందీ ఇప్పుడే! విరహబాధ మొదలైనప్పుడే వసంతమూ వచ్చిపడింది, మన్మథుడికి అదనంగా బాణమూ దొరికింది. సందు దొరికినప్పుడే వచ్చిపడతాయి కీడులు – అంటే ఇదే కదూ! మిత్రమా!!

**చిట్ఠ దావ:** తిష్ఠ – తావత్ = ఉండు, చెబుతాను! అనేన = ఈ, దండకాష్ఠేన = చేతికర్రతో, కందర్పవ్యాధిమ్ = మన్మథుడి రోగం, నాశయిష్యామి = ధ్వంసం చేస్తాను – వాడి రోగం కుదురుస్తాను – అనడం. కందర్పరూపో వ్యాధిః యస్మాత్. మన్మథరూపమైన వ్యాధిని కలిగించే చూతాంకురాన్ని రాలుస్తాను. (ఇతి = అని, దండకాష్ఠమ్ + ఉద్యమ్య = చేతికర్రను ఎత్తి, చూతాంకురమ్ = మామిడి చివురును, పాతయితుమ్ + ఇచ్ఛతి = పడగొట్టడానికి ప్రయత్నిస్తాడు)

**భవతు:** (సస్మితమ్ = చిరునవ్వుతో) భవతు = అలాగే! బ్రహ్మవర్చసమ్ = నీ బ్రహ్మతేజస్సు, దృష్టమ్ = చూశానులే! సఖే = మిత్రమా! క్వ + ఉపవిష్టః = ఎక్కడ కూర్చున్నవాడనై, ప్రియాయాః = నా ప్రియురాలిని, కించిత్ + అనుకారిణీషు = ఏ కాసింతగానో అనుకరించే, లతాసు = తీవియలమీద, దృష్టిమ్ = నా చూపును, విలోభయామి = సమ్మోహపరచను? నా ప్రియురాలిని కాసింతగానైనా సరిపోలే లతలను చూస్తూ నా చూపుల్ని ఆనందింపజేసుకోవాలి అనుకొంటున్నాను. దీనికి తగిన చోటు ఏది? ఎక్కడ కూర్చోను? – అని అడగడం.

**ణం ఆసణ్ణ:** మాధవీమండపే = మాధవీమండపంలో, ఇమామ్ + వేళామ్ = ఈ సమయాన్ని, అతివాహయిష్యే = గడుపుతాను. మే – చిత్రఫలకగతామ్ = నా

(నన్వాసన్న పరిచారికా చతురికా భవతా సందిష్టా – మాధవీమండప ఇమాం వేళామతివాహయిష్యే. తత్ర మే చిత్రఫలకగతాం స్వహస్త లిఖితాం తత్రభవత్యాః శకుంతలాయాః ప్రతికృతిమానయేతి).

రాజా : ఈదృశం హృదయవినోదన స్థానమ్? తత్తమేవ మార్గమాదేశయ.

విదూషక : ఇదో ఇదో భవం. (ఇత ఇతో భవాన్)

(ఉభౌ పరిక్రామతః. సానుమత్యనుగచ్ఛతి)

విదూషక : ఏసో మణిసిలాపట్టఅ సణాహో మాహవీమండవో ఉవహార రమణిజ్జదాఏ ణిస్సంసఅం సాఅదేణ విఅ ణో పడిచ్ఛది. తా పవిసిఅ ణిసీదతు భవం. (ఏష మణిశిలాపట్టకసనాథో మాధవీమండపః ఉపహార రమణీయతయా నిస్సంశయం స్వాగతేనేవ నౌ ప్రతీచ్ఛతి. తత్ప్రవిశ్య నిషీదతు భవాన్).

---

చిత్రఫలకంలో, స్వహస్తలిఖితామ్ = నా చేతులతో లిఖింపబడినదైన, తత్రభవత్యాః = మాన్యురాలైన, శకుంతలాయాః = శకుంతలయొక్క, ప్రతికృతిమ్ = బొమ్మను, తత్ర = అక్కడికి, ఆనయ = తీసుకురా, ఇతి = అని, ఆసన్నపరిచారికా = నీకు సన్నిధిలో ఉండే పరిచారిక, చతురికా = చతురిక, భవతా = నీచేత, సందిష్టా + నను = ఆజ్ఞాపింపబడింది గదా! చతురికకు ఈపని పురమాయించి ప్రమదవనంలోకి వచ్చావుగదా! ఎక్కడ కూర్చోను అని అడుగుతావేమిటి? మాధవీమండపానికే పద – అనడం.

**ఈదృశమ్:** హృదయ – వినోదన – స్థానమ్ = మనస్సుకు ఊరట కలిగించే చోటు, ఈదృశమ్ = ఇలాంటిదేనా? తత్ = అయితే, తమ్ + ఏవ – మార్గమ్ = ఆ దారినే, ఆదేశయ = చూపించు! (హృదయ వినోదస్థానం ఇలాంటిదే. అందుకని ఆ దారినే చూపించు – అని ప్రశ్నార్థకం లేని పాఠాంతరం)

**ఇదో ఇదో:** భవాన్ = తమరు, ఇతః + ఇతః = ఇటు – ఇటు!!

(ఉభౌ = ఇద్దరూ, పరిక్రామతః = నడుస్తారు. సానుమతి, అనుగచ్ఛతి = వెంటవెడుతుంది)

**ఏసో:** ఏషః = ఇదిగో, మణిశిలా – పట్టక – సనాథః = మణిశిలావేదికతో కూడినదై, మాధవీమండపః = వాసంతీమండపం, ఉపహార – రమణీయతయా = పూల

**(ఉభౌ ప్రవేశం కృత్వోపవిష్టౌ)**

**సానుమతీ: లదాసంస్సిదా దేక్ఖిస్సం దావ సహీఏ పడికిదిం. తదోసే భత్తుణో బహుముహం అణురాఅం ణివేదఇస్సం. (ఇతి తథాకృత్వా స్థితా) (లతాసంశ్రితా ద్రక్ష్యామి తావత్సఖ్యాః ప్రతికృతిమ్. తతోఽస్యాః భర్తుర్బహుముఖమనురాగం నివేదయిష్యామి)**

**రాజా : సఖే! సర్వమిదానీం స్మరామి శకుంతలాయాః ప్రథమవృత్తాంతమ్. కథితవానస్మి భవతే చ. స భవాన్ ప్రత్యాదేశవేళాయాం మత్సమీపగతో నాసీత్. పూర్వమపి న త్వయా కదాచిత్ సంకీర్తితం తత్రభవత్యా నామ. క్వచిదహమివ విస్మృతవానసి త్వమ్?!**

---

కానుకల సొగసుతో, నిస్సంశయమ్ = నిస్సందేహంగా, స్వాగతేన = స్వాగతంతో, నౌ = మనిద్దరినీ, ప్రతీచ్ఛతి + ఇవ = నిరీక్షిస్తున్నట్టుంది. స్వాగతం పలుకుతున్నట్టుగా (స్వాగతేన + ఇవ) ప్రతీక్షిస్తోంది – అని కానీ. తత్ = అందుకని, ప్రవిశ్య = లోపలికి ప్రవేశించి, భవాన్ = నీవు, నిషీదతు = కూర్చుందువుగాక!

(ఉభౌ = ఇద్దరూ, ప్రవేశమ్ + కృత్వా = ప్రవేశించి, ఉపవిష్టౌ = కూర్చుంటారు)

**లదాసంస్సిదా:** లతాసంశ్రితా = ఈ పూల తీగను ఆనుకొని, సఖ్యాః = నా చెలి శకుంతల, ప్రతికృతిమ్ = చిత్తరువును, ద్రక్ష్యామి – తావత్ = చూతునుగాక! తతః = అటుపైని, అస్యాః + భర్తుః = ఆమె మగని, బహుముఖమ్ + అనురాగమ్ = పలుతెరంగులైన అర్మిలిని, నివేదయిష్యామి = శకుంతలకు విన్నవిస్తాను. (తతోఽస్యై...... నివేదయిష్యామి అని పాఠాంతరం).

(ఇతి = అని, తథా + కృత్వా = అలా ఒక లతను ఆనుకొని, స్థితా = నిలుస్తుంది)

**సఖే సర్వమ్:** సఖే = మిత్రమా! శకుంతలాయాః = శకుంతల యొక్క, ప్రథమ వృత్తాంతామ్ + సర్వమ్ = తొలి కలయిక కథ అంతా, ఇదానీమ్ = ఇప్పుడు, స్మరామి = గుర్తుచేసుకోగలుగుతున్నాను. భవతే + చ = నీకు కూడా, కథితవాన్ + అస్మి = చెప్పినవాడినయ్యాను – చెప్పాను అనడం. సః + భవాన్ = ఆ కథ అంతా తెలిసిన నువ్వు, ప్రత్యాదేశవేళాయామ్ = నేను శకుంతలను నిరాకరిస్తున్నవేళలో, మత్ – సమీపగతః + న + ఆసీత్ = నా చెంత లేకపోతివి. పూర్వమ్ + అపి = అంతకుముందైనా, త్వయా =

**విదూషక :** **ణ విసుమరామి. కింతు సవ్వం కహిఅ అవసాణే పుణ తుఏ పరిహాస విఅప్పఓ ఏసో ణ భూదత్థో త్తి ఆచక్ఖిదం. మఏ వి మిప్పిండబుద్ధిణా తహ ఏవ్వ గహీదం. అహవా భవిదవ్వదా క్ఖు బలవదీ! (న విస్మరామి. కింతు సర్వం కథయిత్వా అవసానే పునస్త్వయా పరిహాసవిజల్ప ఏష న భూతార్థ ఇత్యాఖ్యాతమ్. మయాపి మృత్పిండబుద్ధినా తథైవ గృహీతమ్. అథవా భవితవ్యతా ఖలు బలవతీ!)**

**సానుమతీ:** **ఏవ్వం ఏదం (ఏవమే వైతత్!)**

**రాజా :** **(ధ్యాత్వా) సఖే! త్రాయస్వ మామ్!!**

---

నీచేత, తత్రభవత్యాః + నామ = ఆ మాన్యురాలి పేరు, కదాచిత్ = ఒకప్పుడు కూడా, న– సంకీర్తితమ్ = ప్రస్తావించబడలేదు. నిరాకరణకు ముందు కూడా ఆమె ఊసు ఏనాడూ ఎత్తవైతివి. క్వచిత్ = ఒకవేళ, త్వమ్ = నువ్వూ, అహమ్ + ఇవ = నాలాగా, విస్మృతవాన్ + అసి = మరిచిపోయావో!?

**ణ విసుమరామి:** న + విస్మరామి = మరిచిపోలేదు. కింతు = కానీ, సర్వమ్ + కథయిత్వా = (అలనాడు కణ్వాశ్రమంలో నువ్వు) అంతా చెప్పి, అవసానే – పునః = చివరలోనేమో, ఏషః = ఇది, పరిహాసవిజల్పః = నవ్వులాటలమాట, భూతార్థః + న = నిజం కాదు. (భూతం... ప్రాప్తే వృత్తే సమే సత్యే... మేదినీ), ఇతి = అని, త్వయా = నీచేతనే, ఆఖ్యాతమ్ = చెప్పబడింది. "పరిహాసవిజల్పితం సఖే పరమార్థేన న గృహ్యతాం వచః (2–18)" అన్నావుగదా! మృత్పిండబుద్ధినా + అపి = అసలే మట్టి బుర్రగాడినైన, మయా = నాచేత, తథా + ఏవ = నువ్వుఅన్నట్టుగానే, గృహీతమ్ = స్వీకరింపబడింది – నిజంకాదు అనే అనుకొన్నాను. అథవా = ఇంతకీ, భవితవ్యతా = అలా జరగాల్సి ఉండటమనేది, బలవతీ = తప్పింపరానిది, ఖలు = కదా!!

**ఏవ్వం:** ఏతత్ = ఇది, ఏవమ్ + ఏవ = ఇలానే జరగాల్సి ఉంది – జరిగింది అనడం.

**త్రాయస్వ:** (ధ్యాత్వా = అప్పటి సన్నివేశాన్ని ధ్యానిస్తూ) సఖే = మిత్రమా! మామ్ = నన్ను, త్రాయస్వ = రక్షించు!!

**కిం ఏదం:** భోః = ఓయీ! కిమ్ + ఏతత్ = ఏమిది?! ఈదృశమ్ = ఇలాంటిది (కంట తడిపెట్టడం), త్వయి = నీకు, అనుపపన్నమ్ + ఖలు = తగదు సుమా!

**విదూషక : భో కిం ఏదం? అణువపణ్ణం క్ఖు ఈదిసం తుఇ. కదా వి సప్పురిసా సోఅవత్తవ్వా ణ హోంతి. ణం పవాదే వి ణిక్కంపా గిరీఓ. (భోః కిమేతత్? అనుపపన్నం ఖల్వీదృశం త్వయి. కదాపి సత్పురుషాః శోకవక్తవ్యా న భవంతి. నను ప్రవాతేఽపి నిష్కంపా గిరయః!)**

**రాజా : వయస్య! నిరాకరణ విక్లబాయాః ప్రియాయాః సమవస్థామనుస్మృత్య బలవదశరణోఽస్మి. సాహి –**

**ఇతః ప్రత్యాదేశాత్ స్వజనమనుగంతుం వ్యవసితా**
**ముహుస్తిష్ఠేత్యుచ్చైర్వదతి గురుశిష్యే గురుసమే**
**పునర్దృష్టిం బాష్పప్రసరకలుషా మర్పితవతీ**
**మయి క్రూరే యత్తత్ సవిషమివ శల్యం దహతి మామ్. 09**

---

సత్పురుషాః = సజ్జనులు, కదా + అపి = ఏనాడూ, శోక వక్తవ్యాః = దుఃఖంలో ఓదార్పబడవలసినవారు, న + భవంతి = కానేకారు. దుఃఖించరు, కాబట్టి వక్తవ్యులు = ఓదార్పబడవలసినవారు కారు – అని (శోకే జాతే అన్యేన వక్తవ్యా న భవంతీత్యర్థః – రాఘవభట్టు. శోకపాత్రాత్మానః – కాటయ). ప్రవాతే + అపి = పెనుగాలి వీచినా (ప్రవాతే సత్యపి), గిరయః = పర్వతాలు, నిష్కంపాః + నను = చలించవు గదా!

**నిరాకరణ:** వయస్య = నేస్తమా! నిరాకరణ = నా తిరస్కారంతో, విక్లబాయాః = విహ్వాలించిపోయిన, ప్రియాయాః = నా ప్రియురాలి, సమవస్థామ్ = అప్పటి స్థితిని, అనుస్మృత్య = తలుచుకొని, బలవత్ + అశరణః + అస్మి = మరీ నిస్సహాయుణ్ని (– అనాథుణ్ని – దిక్కులేనివాడిని) అవుతున్నాను. (మిక్కిలి దిక్కుమాలినవాడనగుచుంటిని – కందుకూరి. బలవత్ = దృఢమ్, అశరణః + అస్మి = జీవితధారణే ఉపాయరహితో భవామి – సాహిత్యటీక). సా + హి = ఆ శకుంతల –

**ఇతః:** ఇతః = ఇటువైపు నుంచి, ప్రత్యాదేశాత్ = నిరాకరణవల్ల, స్వజనమ్ = తన వారిని (గౌతమీ ప్రభృతులను), అనుగంతుమ్ = అనుసరించి వెళ్ళడానికి, వ్యవసితా = ఉద్యుక్తురాలు కాగా; తతః = అటువైపునుంచి, ముహుః = మరల, తిష్ఠ + ఇతి = 'ఆగు' అని, ఉచ్చైః = బిగ్గరగా, గురుసమే = కణ్వసమానుడైన, గురుశిష్యే = తన తండ్రిగారి శిష్యుడు, వదతి (సతి) = అరుస్తుండగా; పునః = ఆ మధ్యలో (అంతరే – రాఘవభట్టు), క్రూరే = కఠినుడినైన, మయి = నావైపు, బాష్ప ప్రసర = కన్నీటిధారతో,

**సానుమతీ: అమ్మహే! ఈదిసీ స్వకజ్జపరదా. ఇమస్స సందావేణ అహం రమామి. (అహో! ఈదృశీ స్వకార్యపరతా. అస్య సంతాపేనాహం రమే)**

**విదూషక : భో అత్థి మే తక్కో. కేణ వి తత్తహోదీ ఆఆసచారిణా ణీదేత్తి. (భోః! అస్తి మే తర్కః. కేనాపి తత్రభవతీ ఆకాశచారిణా నీతేతి)**

**రాజా : కః పతిదేవతామన్యః పరామర్ష్టుముత్సహేత? మేనకా కిల సఖ్యాస్తే జన్మప్రతిష్ఠేతి శ్రుతవానస్మి. తత్సహచారిణీభిః సఖీ తే హృతేతి మే హృదయమాశంకతే.**

---

కలుషామ్ = కలతవడ్డ, యత్ + దృష్టిమ్ = ఏ చూపును, అర్పితవతీ = అర్పించిందో, తత్ = ఆ చూపు, సవిషమ్ + శల్యమ్ + ఇవ = విషపు ములికిలాగా, మామ్ = నన్ను, దహతి = దహించివేస్తోంది. (శల్యం శక్తే శరే వంశకంబికాయాం చ తోమరే – ఇతి విశ్వః)

**తాత్పర్యం:** మిత్రమా! ఇటువైపునుంచి నేను పొమ్మన్నాను. తన వాళ్ళతో వెళ్ళిపోవడానికి సిద్ధపడింది. అటువైపునుంచి కణ్వశిష్యుడు పెద్దగొంతువేసుకొని 'ఆగు' అన్నాడు. అప్పుడు – ఉండలేక వెళ్ళలేక, కన్నీరు నిండిన కన్నులతో ఆమె క్రూరుడినైన నావైపు చూసింది. ఆ చూపు – విషం పులిమిన బాణం ములికిలాగా నన్ను దహించివేస్తోంది.

**అమ్మహే:** అహో = ఆశ్చర్యం! స్వకార్యపరతా = స్వార్థప్రవృత్తి అనేది, ఈదృశీ = ఇలాగే ఉంటుంది! అస్య – సంతాపేన = ఇతడి దుఃఖంతో, అహమ్ – రమే = నేను సంబరపడుతున్నాను!! (ఇతడు ఎంత దుఃఖిస్తే అంత త్వరగా శకుంతలను పరిగ్రహిస్తాడని సంబరమట!!)

**అత్థిమే:** భోః = ఓయీ! మే = నాకు, తర్కః = ఒక ఆలోచన, అస్తి = ఉంది. తత్రభవతీ = మాన్యురాలు, కేన + అపి + ఆకాశచారిణా = ఎవడో ఒక ఖేచరుడితో, నీతా + ఇతి = కొనిపోబడింది – అని నా ఊహ (తర్కః).

**కః పతి:** పతిదేవతామ్ = పతివ్రతను (పతిః దేవతా యస్యాస్సా), పరామర్ష్టుమ్ = స్పృశించడానికి, కః + ఉత్సహేత = ఎవడు ముచ్చట పడతాడు? తే – సఖ్యాః = నీ ఈ స్నేహితురాలికి శకుంతలకు, మేనకా – కిల = మేనక కదూ, జన్మప్రతిష్ఠా + ఇతి = జన్మస్థానమని (తల్లి), శ్రుతవాన్ + అస్మి = విన్నాను! (ప్రతిష్ఠా స్థానమాత్రకే – ఇతి విశ్వః). విన్నాను సుమా అనడం. తత్ + సహచారిణీభిః = ఆ మేనక చెలికత్తెలతో, తే –

**సానుమతీ : సమ్మోహో క్ఖు విహ్మణి అజ్జో ణ పడివోదో. (సమ్మోహః ఖలు విస్మయనీయో న ప్రతిబోధః!!)**

**విదూషక : జహ ఏవ్వం అత్థి క్ఖు సమాఅమో కాలేణ తత్తహోదీఏ. (యద్యేవమ్ అస్తి ఖలు సమాగమః కాలేన తత్రభవత్యా)**

**రాజా : కథమివ?**

**విదూషక : ణక్ఖు మాదాపిదరా భతువిఓఅ దుక్ఖిఅం దుహిదరం దేక్ఖిదుం పారేంతి. (న ఖలు మాతాపితరౌ భర్తృవియోగ దుఃఖితాం దుహితరం ద్రష్టుం పారయతః).**

**రాజా : వయస్య!**

**స్వప్నో ను మాయా ను మతిభ్రమో ను**
**క్లిష్టం ను తావత్ఫలమేవ పుణ్యమ్**

---

సఖీ = నీ స్నేహితురాలు, హృతా + ఇతి = కొనిపోబడింది అని, మే = నా, హృదయమ్ = మనస్సు, ఆశంకతే = ఊహిస్తోంది.

**సమ్మోహో:** సమ్మోహః = మరిచిపోవడం, విస్మయనీయః = ఆశ్చర్యపడదగ్గది, ప్రతిబోధః + న + ఖలు = గుర్తుజేసుకోవడం కాదు సుమా! దుష్యంతుడి లాంటి వాడు మరిచిపోవడం వింత కానీ, గుర్తు చేసుకోవడం వింతకాదు – అని.

**జహఏవ్వం:** ఏవమ్ + యది = అలాగే అయితే, తత్రభవత్యా = మాన్యశకుంతలతో, సమాగమః = కలయిక, కాలేన = కొద్దికాలంలోనే, అస్తి + ఖలు = జరుగుతుంది సుమా!

**కథమివ:** కథమ్ + ఇవ = ఎలా?

**ణక్ఖు:** భర్తృవియోగ దుఃఖితామ్ = మగని ఎడబాటుతో దుఃఖిస్తున్న, దుహితరమ్ = కూతురిని, ద్రష్టుమ్ = చూస్తూ కూర్చుండటానికి, మాతాపితరౌ = తల్లిదండ్రులు (కన్నవారు), న + పారయతః + ఖలు = శక్తులు కాలేరు గదా! అందుకని త్వరలోనే తెచ్చి నీ కప్పగిస్తారని.

**స్వప్నో ను:** వయస్య = చెలికాడా! స్వప్నః + ను = కలయో! మాయా+ను = మాయయో! మతిభ్రమః+ను = మానసిక భ్రాంతియో! తావత్ + ఫలమ్ = ఆపాటి ఫలమే కల్గిన, క్లిష్టమ్ = స్వల్పమైన (క్లుప్తమ్ = ముగిసిన పాఠాంతరం), పుణ్యమ్ + ను = పుణ్యమో!

**అసన్నివృత్త్యై తదతీతమేతే**
**మనోరథా నామ తటప్రపాతాః** **10**

**విదూషక : మా ఏవ్వం. ఇం అంగులీఅఅం ఏవ్వ ణిదంసణం అవస్సంభావీ అచింతణిజ్జో సమాఅమో హోదిత్తి. (మైవమ్. నన్వంగులీయకమేవ నిదర్శనమవశ్యంభావీ అచింతనీయః సమాగమో భవతీతి)**

**రాజా : (అంగులీయకం విలోక్య) అయే, ఇదం తావదసులభస్థాన భ్రంశి శోచనీయమ్**

**తవ సుచరితమంగులీయ నూనం**
**ప్రతను మమేవ విభావ్యతే ఫలేన**

---

తత్ = అది (శకుంతలా దర్శన రూపమైన ఆ స్వప్నం, ఆ మాయ, ఆ భ్రమ, ఆ పుణ్యఫలమ్), అసన్నివృత్త్యై = మరలిరావడం లేనిదై (మరలి రాకపోవడం కోసమే), అతీతమ్ = వెళ్ళిపోయింది – గడిచి పోయింది. ఏతే = (నీవంటున్న) ఇలాంటి, మనోరథాః = ఆకాంక్షలు, తటప్రపాతాః + నామ = ఒడ్డు విరిగి పడటాలే సుమా! మనోరథానా మతటాః ప్రవాహాః – అని కాటయ – శ్రీనివాసాచార్యల పాఠం. ఏతే = ఇలాంటి, మనోరథానామ్ = కోరికల, ప్రవాహాః = స్రోతస్సులు, అతటాః = గట్లులేనివే. (నిరర్గళా భవంతీత్యర్థః) అడ్డూ ఆపూ లేనివే.

**తాత్పర్యం:** శకుంతలాదర్శనాదికం – అదొక కల, అదొక మాయ, అదొక భ్రమ, అదొక స్వల్పపుణ్యఫలం. గడిచిపోయింది. మరి తిరిగిరాదు. మన కాంక్షలూ ఆకాంక్షలూ అదుపూ ఆపూ లేని ఒడ్డు విరిగిన ప్రవాహాలు!!

**మా ఏవ్వం:** మా + ఏవమ్ = అలా కాదు. అవశ్యంభావీ = తప్పనిసరిగా జరిగేదీ, అచింతనీయః = ఊహకందనిదీ అయిన, సమాగమః = కలయిక, భవతి – ఇతి = జరుగుతుంది అనడానికి, అంగులీయకమ్ + ఏవ = ఈ నీ ఉంగరమే, నిదర్శనమ్ + నను = సాక్షిగదా! రాసిపెట్టి ఉంటే ఏదైనా జరుగుతుంది. ఈ ఉంగరం దొరకలా? – అనడం.

**ఇదమ్:** (అంగులీయకమ్ = ఉంగరాన్ని, విలోక్య = చూసి). అయే = అయ్యో! ఇదమ్ = ఇది, అసులభ – స్థాన = తేలికగా దొరకని స్థానం నుంచి, భ్రంశి = జారిపడినదై, శోచనీయమ్ + తావత్ = దయనీయమైనది.

అరుణనఖ మనోహరాసు తస్యాః
చ్యుతమసి లబ్ధపదం యదంగులీషు 11

సానుమతీ : జఇ అణ్ణహత్థగదం భవే సచ్చం ఏవ్వ సోఅణిజ్జం భవే.
(యద్యన్యహస్త గతం భవేత్సత్యమేవ శోచనీయం భవేత్)

విదూషక : భో, ఇఅం ణామముద్దా కేణ ఉగ్ఘాదేణ తత్తహోదీఏ హత్థాబ్భాసం పావిదా? (భోః! ఇయం నామముద్రా కేనోద్ఘాతేన తత్రభవత్యాః హస్తాభ్యాశం ప్రాపితా?)

---

**తవసుచరితమ్:** అంగులీయ = ఓ ఉంగరమా! తవ = నీ, సుచరితమ్ = పుణ్యం, నూనమ్ = నిశ్చయంగా, మమ + ఇవ = నా పుణ్యం లాగానే, ప్రతను = స్వల్పమని, ఫలేన = (దక్కిన) ఫలంతో, విభావ్యతే = తెలుస్తోంది. యత్ = ఎందువల్లనంటే – అరుణ – నఖ = ఎర్రని గోళ్లతో, మనోహరాసు = సుందరాలైన, తస్యాః = ఆ శకుంతల యొక్క, అంగులీషు = వేళ్లనడుమ, లబ్ధపదమ్ + (సత్) = స్థానం పొందినదానవై, చ్యుతమ్ + అసి = జారిపోయినదానవయ్యావు.

**తాత్పర్యం:** ఎర్రని గోళ్లతో మనోహరాలైన నా ప్రియురాలి చేతి వేళ్లనడుమ స్థానం పొందినట్టే పొంది – పోగొట్టుకొన్నావు. ఓ ఉంగరమా! నాలాగానే నీ పుణ్యం కూడా స్వల్పమేనని ఈ ఫలితాన్ని బట్టే తెలుస్తోంది.

**జఇ అణ్ణ:** అన్యహస్తగతమ్ = ఇతరుల చేతికి చిక్కినది, భవేత్ + యది = అయ్యున్నట్టయితే, సత్యమేవ శోచనీయమ్ + భవేత్ = ఈ ఉంగరం పరిస్థితి మరీ శోచనీయ మయ్యుండేది! అదృష్టవశాత్తు – జరగవలసిందే జరిగింది – అని.

**భో ఇఅం:** భోః = ఓయీ మిత్రమా! ఇయమ్ = ఈ, నామముద్రా = నీ పేరుతో ఉన్న రాజముద్రిక, కేన + ఉద్ఘాతేన = ఏ ఎత్తుగడతో – ఏ ఉపక్రమంతో, తత్రభవత్యాః = మాన్యురాలి, హస్తాభ్యాశమ్ = చేతిచేరువకు, ప్రాపితా = పొందింపబడినది? ఏ ఎత్తుగడతో ఆమెకు ఇచ్చావు? అనడం. (ఉద్ఘాతః కథ్యతే ధీరైః స్ఖలితే సముపక్రమే – ఇతి ధరణిః)

**మమవి:** మమ + అపి = నాకు కూడా, కౌతూహలేన = కుతూహలంతో, ఏషః = ఈ ప్రశ్న, ఆకారితః = ఆహూతమే. నేనుకూడా ఈ ప్రశ్నను కుతూహలంతో స్వాగతిస్తున్నాను –అని (ఆకారితః = ఆహూతః = ప్రేరితః).

**సానుమతీ : మమవి కోదూహలేణ ఆఆరిదో ఏసో. (మమాపి కౌతూహలేన ఆకారిత ఏషః)**

**రాజా : (శ్రూయతామ్) స్వనగరాయ ప్రస్థితం మాం ప్రియా సబాష్పమాహ – కియచ్చిరేణార్యపుత్రః ప్రతిపత్తిం దాస్యతీతి.**

**విదూషక : తదో తదో (తతస్తతః)**

**రాజా : పశ్చాదిమాం ముద్రాం తదంగులౌ నివేశయతా మయా ప్రత్యభిహితా –**

**ఏకైకమత్ర దివసే దివసే మదీయం**
**నామాక్షరం గణయ గచ్ఛతి యావదంతమ్**

---

**స్వనగరాయ:** (శ్రూయతామ్ = ఆలకించు) స్వనగరాయ = (ఆశ్రమం నుంచి) రాజధానికి, ప్రస్థితమ్ = బయలుదేరిన, మామ్ = నన్ను, ప్రియా = నా ప్రేయసి శకుంతల, సబాష్పమ్ = కన్నీరుపెట్టుకున్నదై, ఆహ = ఇలా అడిగింది – ఆర్యపుత్రః = ఆర్యపుత్రుడు, కియత్ + చిరేణ = ఎంత తొందరలో, ప్రతిపత్తిమ్ = ప్రాప్తిని (వార్తను), దాస్యతి + ఇతి = అనుగ్రహిస్తాడు – అని. ఎప్పటిలోగా తమ సాన్నిధ్యం కల్పిస్తారు – అనడం. (ప్రతిపత్తిః ప్రవృత్తౌ స్యాత్ – ఇతి ధరణిః. వార్తామితి యావత్ –రాఘవభట్టు)

**తదోతదో:** తతః + తతః = అటుపై నటుపైని –

**పశ్చాత్:** పశ్చాత్ = వెంటనే, ఇమామ్ + ముద్రామ్ = ఈ రాజముద్రను, తత్ + అంగులౌ = ఆమె వేలికి (వేలియందు), నివేశయతా = ఉంచుతున్నవాడనైన, మయా = నాచేత, ప్రత్యభిహితా = ఆమె ఇలా బదులు పలుకబడినది – ఆమెకు ఇలా సమాధానం చెప్పాను.

**ఏకైకమ్:** ప్రియే = ప్రియురాలా! అత్ర = ఈ ఉంగరం మీద, దివసే – దివసే – ఏక + ఏకమ్ = ఒక్కొక్క దివసానికి ఒక్కొక్కటిగా, మదీయమ్ = నా, నామాక్షరమ్ = పేరులోని అక్షరం, గణయ = లెక్కించు. యావత్ = ఎంతలో – ఎన్నాళ్లలో, అంతమ్ + గచ్ఛతి = అక్షరగణన ముగుస్తుందో, తావత్ = అంతలో, మత్ + అవరోధగృహ – ప్రవేశమ్ = నా అంతఃపురంలోకి ప్రవేశం, నేతా = కల్పించే (ప్రాపయితా = పొందించే), జనః = (జనం) వ్యక్తి, తవ – సమీపమ్ = నీ సన్నిధికి, ఉపైష్యతి = వస్తాడు, ఇతి = అని మయా సా ప్రత్యభిహితా! (త్రిచతురైః దినైరితి భావః).

**తావత్ప్రియే మదవరోధ గృహప్రవేశం**
**నేతా జనస్తవ సమీపము పైష్యతీతి** **12**

**తచ్చ దారుణాత్మనా మయా మోహాన్నానుష్ఠితమ్.**

**సానుమతీ : రమణీఓ క్ఖు అవహీ విహిణా విసంవాదిదో. (రమణీయః ఖల్వవధిర్విధినా విసంవాదితః)**

**విదూషక : కహం ధీవలకప్పిఅస్స లోహిఅమచ్ఛస్స ఉదలబ్భంతలే ఆసి? (కథం ధీవరకల్పితస్య రోహితమత్స్యస్య ఉదరాభ్యంతరే ఆసీత్?)**

**రాజా : శచీతీర్థం వందమానాయాః సఖ్యాస్తే హస్తాద్గంగాస్రోతసి పరిభ్రష్టమ్.**

**విదూషక : జుజ్జఇ. (యుజ్యతే)**

---

**తాత్పర్యం:** ప్రియా! ఇదిగో ఈ ఉంగరం మీద నా పేరిటి అక్షరాలు ఉన్నాయి. (దుష్యంతః అనిగానీ శ్రీదుష్యంతః అనిగానీ). దివసానికి ఒక్కటిగా ఈ అక్షరాలను లెక్కించు. పరిగణన ముగిసేలోగా నిన్ను నా అంతఃపురానికి చేర్చే వ్యక్తి నీ సన్నిధికి వస్తాడు – అని ఆమెకు చెప్పాను.

**తచ్చ:** తత్ + చ = అది కూడా, దారుణాత్మనా = కఠినాత్ముడినైన, మయా = నాచేత, మోహాత్ = బుద్ధినాశం వల్ల, న + అనుష్ఠితమ్ = ఆచరింపబడలేదు. దుర్మార్గుణ్ని – అదీ చేశాను కాను అనడం!

**రమణీఓ:** రమణీయః = అందమైన, అవధిః = గడువు, విధినా = బ్రహ్మదేవునిచేత, విసంవాదితః + ఖలు = తలకిందులు చేయబడినదిగదా! వ్యత్యస్తం చేశాడు దేవుడు – అని.

**కహం:** ధీవర – కల్పితస్య = జాలరిచే తరగబడిన (ఖండితస్య – అని పాఠాంతరం), రోహిత మత్స్యస్య = ఎఱ్ఱచేప యొక్క, ఉదరాభ్యంతరే = పొట్టలో, కథమ్ + ఆసీత్ = ఎలా చేరింది? (ఎలా ఉంది?)

**శచీతీర్థమ్:** శచీతీర్థమ్ = శచీతీర్థాన్ని (రాజధానికి చేరువలో ఉన్న గంగానది రేవు), వందమానాయాః = నమస్కరిస్తున్న, తే + సఖ్యాః = నీ మిత్రురాలి, హస్తాత్ = చేతినుంచి, గంగా స్రోతసి = గంగానదిలోకి, పరిభ్రష్టమ్ = జారిపడింది.

**జుజ్జఇ:** యుజ్యతే = సమంజసమే.

**సానుమతీ: అదో ఏవ్వ తవస్సిణీఏ సఉందలాఏ అధమ్మభీలుణో ఇమస్స రాఏసిణో పరిణఏ సందేహో ఆసి. అహవా ఈదిసో అణురాఓ అహిణ్ణాణం అవేక్ఖది? కహం విఅ ఏదం? (అత ఏవ తపస్విన్యాః శకుంతలాయా అధర్మభీరోరస్య రాజర్షేః పరిణయే సందేహః ఆసీత్. అథవా ఈదృశోఽనురాగోఽభిజ్ఞాన మపేక్షతే? కథమివైతత్?)**

**రాజా : ఉపాలప్స్యే తావదిదమంగులీయకమ్.**

**విదూషక : (ఆత్మగతమ్) గహీదో ణేణ పంథా ఉమ్మత్తఆణం. (గృహీతోఽనేన పంథా ఉన్మత్తానామ్)**

**రాజా : కథం ను తం బంధురకోమలాంగుళిం**
**కరం విహాయాసి నిమగ్నమంభసి**

---

**అదో ఏవ్వ:** అతః + ఏవ = ఇందుకోసమేనన్నమాట, తపస్విన్యాః = అమాయికురాలైన, శకుంతలాయాః = శకుంతలయొక్క, పరిణయే = వివాహ విషయంలో, అధర్మభీరోః = అధర్మమంటే జంకే, అస్య = ఈ, రాజర్షేః = రాజర్షి ఈ దుష్యంతుడికి, సందేహః + ఆసీత్ = సందేహం కలిగింది!! (తానసలు ఉంగరం ఇవ్వకపోయినా, శకుంతల పోగొట్టుకోకుండా చూపించినా దుష్యంతుడికి ఈ సందేహం కలిగేది కాదు – అని సానుమతి భావం!! శాపవృత్తాంతం ఈవిడకీ తెలీదుగదా!) అథవా = లేకపోతే, ఈదృశః + అనురాగః = ఇలాంటి గాఢమైన అనురాగం, అభిజ్ఞానమ్ + అపేక్షతే = ఆనవాలును కోరుతుందా?, కథమివ + ఏతత్ = ఇది ఎలా సంభవం?!

**ఉపాలప్స్యే:** ఇదమ్ = ఈ, అంగులీయకమ్ = ఉంగరాన్ని, ఉపాలప్స్యే + తావత్ = నిందింతునుగాక! ఇదే ఇంత తంటా తెచ్చిపెట్టింది – అని.

**గహీదో:** (ఆత్మగతమ్ = తనలో) అనేన = ఈతనిచేత, ఉన్మత్తానామ్ + పంథా = పిచ్చివాళ్ళ పద్ధతి, గృహీతః = స్వీకరింపబడింది. పిచ్చివాళ్ళదారి పట్టాడు – అని.

**కథం ను:** బంధుర = సుందరమైన (బంధురం సుందరే రమ్యే = ఇతి విశ్వః), కోమల = మృదువైన, అంగుళిమ్ = వేళ్లుకలదైన, తమ్ = ఆ, కరమ్ = చేతిని, విహాయ = విడిచి, అంభసి = నీటిలో, నిమగ్నమ్ = మునిగినదానవు, కథమ్ + ను + అసి = అసలెలా అయ్యావు?! అథవా = అంతేలే, అచేతనమ్ = (నీలాంటి) జడపదార్థం, గుణమ్ = సౌందర్యాదికమైన గుణాన్ని, న + లక్షయేత్ + నామ = గుర్తించజాలదు గదా! మయా + ఏవ = గుర్తించగలిగిన నాచేతనే మరి, ప్రియా = నా ప్రేయసురాలు శకుంతల, కస్మాత్ + అవధీరితా = ఎందువల్ల తిరస్కృతురాలైనట్టు?!

**అథవా –**

**అచేతనం నామ గుణం న లక్షయే**
**న్మయైవ కస్మాదవధీరితా ప్రియా** **13**

**విదూషక : (ఆత్మగతమ్) కహం, బుభుక్ఖాఏ ఖాదిదవ్వో హ్మి. (కథం బుభుక్షయా ఖాదితవ్యోఽస్మి)**

**రాజా : అకారణ పరిత్యాగానుశయతప్తహృదయ స్తావదనుకంప్యతా మయం జనః పునర్దర్శనేన.**

**(ప్రవిశ్యాపటీక్షేపేణ చిత్రఫలకహస్తా)**

**చతురికా : ఇఅం చిత్తగదా భట్టిణీ. (ఇతి చిత్రఫలకం దర్శయతి) (ఇయం చిత్రగతా భట్టినీ)**

---

**తాత్పర్యం:** ఓసీ ఉంగరమా! అంత అందమైన ఆ మాన్యురాలి చేతిని అసలు ఎలా విడిచి పెట్టావు? ఎలా నీట మునిగావు? అవునులే. నువ్వు జడపదార్థానివి. కాబట్టి వదల గలిగావనుకుందాం!. మరి నేను? ఎందుకని నా ప్రియతమను తిరస్కరించినట్టు?! (అచేతనానామగుణం న లక్షయే; అచేతనం నామ గుణం న లక్షయే – అని పాఠాంతరాలు).

**కహం:** (ఆత్మగతమ్ = తనలో) కథమ్ = ఎట్టా! బుభుక్షయా = ఆకలిచే, ఖాదితవ్యః + అస్మి = తినివేయబడుచున్నాను. ఆకలి దహించివేస్తోంది – అనడం.

**అకారణ:** అకారణ = నిష్కారణంగా, పరిత్యాగ = విడిచిపెట్టి, అనుశయ = పశ్చాత్తాపంతో, తప్త = కాగిపోతున్న, హృదయః = మనస్సు గల, అయమ్ + జనః = ఈ వ్యక్తి (నేను), పునర్దర్శనేన = మళ్ళీ దర్శనం అనుగ్రహించడంతో, అనుకంప్యతామ్ + తావత్ = కనికరింపబడుగాక! పునర్దర్శనం కటాక్షించమనడం. (అథానుశయో దీర్ఘద్వేషానుతాపయోః – అమరం. అపటీ కాండపటీకా ప్రతిసీరా జవనికా తిరస్కరిణీ – హలాయుధః)

(అపటీక్షేపేణ = వెనుక తెరను తోసుకుంటూ, ప్రవిశ్య = ప్రవేశించి చిత్రఫలకహస్తా = చిత్రఫలకం చేబూని, చతురిక)

**ఇఅం:** ఇయమ్ = ఇదిగో, చిత్రగతా = బొమ్మలో, భట్టినీ = రాజపత్ని.

(ఇతి = అని, చిత్రఫలకమ్ = చిత్రఫలకం, దర్శయతి = చూపిస్తుంది).

**విదూషక :** **సాహు వఅస్స, మహురావత్థాణ దంసణిజ్జో భావానుప్పవేసో. క్ఖలది విఅమే దిట్టీ ణిణ్ణుణ్ణ ప్పదేసేసు. (సాధు వయస్య! మధురావస్థాన దర్శనీయో భావానుప్రవేశః. స్ఖలతీవ మే దృష్టిః నిమ్నోన్నత ప్రదేశేషు)**

**సానుమతీ:** **అమ్మో! ఏసా రాఏసిణో ణిఉణదా. జాణే సహీ అగ్గదో మే వట్టిదిత్తి. (అహో! ఏషా రాజర్షేర్నిపుణతా! జానే సఖ్యగ్రతో మే వర్తత ఇతి)**

**రాజా** : **యద్యత్సాధు న చిత్రే స్యాత్క్రియతే తత్తదన్యథా**
**తథాపి తస్యా లావణ్యం రేఖయా కించిదన్వితమ్.** **14**

**సానుమతీ:** **సరిసం ఏదం పచ్చాదావగురుణో సిణేహస్స అనవలేవస్స అ. (సదృశ మే తత్పశ్చాత్తాపగురోః స్నేహస్యానవలేపస్య చ)**

---

**సాహు:** వయస్య = నేస్తమా! సాధు = లెస్స! లెస్స! మధుర = సుందరమైన, అవస్థాన = ఆకృతితో, దర్శనీయః = చూడచక్కనిదైన, భావ + అనుప్రవేశః = భావావిర్భావం!! (సుందరాకారతయా భావస్య ఆవిర్భావో రమ్యతరః –ఇతి) నిమ్న + ఉన్నత ప్రదేశేషు = పల్లమూ ఎత్తులలో, మే = నా, దృష్టిః = చూపు, స్ఖలతి + ఇవ = పడుతూ లేస్తున్నట్టుంది. ఎత్తుపల్లాలు చిత్రంలో ఉన్నా నిజంగా ఉన్నట్టే అనిపిస్తున్నాయని – ఆశ్చర్యం.

**అమ్మో:** అహో = ఆశ్చర్యమాశ్చర్యం! ఏషా = ఇదిగదా! రాజర్షేః = ఈ దుష్యంతుడి, నిపుణతా = చిత్రలేఖన కౌశలం!! సఖీ = నా చెలిమికత్తె శకుంతల, మే + అగ్రతః = నా ఎట్టయెదుట, వర్తతే + ఇతి = నిలిచింది అని, జానే = భావిస్తున్నాను!

**యద్యత్:** యద్యత్ = ఏది ఏది, న + సాధు + స్యాత్ = అందంగా ఉండదో, తత్ + తత్ = అది అది, చిత్రే = బొమ్మలో, అన్యథా + క్రియతే = అందంగా చెయ్యబడుతుంది. తథా + అపి = అయినప్పటికీ, తస్యాః + లావణ్యమ్ = ఆ శకుంతల సౌందర్యం, రేఖయా = నా గీసిన చిత్రరేఖతో, కించిత్ + అన్వితమ్ = కొంచెంగానే ప్రతిఫలించింది.

**తాత్పర్యం:** మిత్రమా! సాధారణంగా – వాస్తవంలో అందంగా లేనిది బొమ్మలోకి వచ్చేసరికి అందంగా కనబడుతుంది. చిత్రకారుడు అలా అందంగా మలుస్తాడు. కానీ ఇక్కడ – శకుంతలా సౌందర్యం నా చిత్రలేఖలోకి చాలా స్వల్పంగానే ప్రవేశించింది. ఆమె అందంలో అరవయ్యో వంతునైనా నేను చిత్రించలేకపోయాను – అనడం!

**సరిసం:** పశ్చాత్తాప + గురోః = పశ్చాత్తాపం అధికంగా కలవాడైన, అస్య = ఈతడి, స్నేహస్య = శకుంతలపట్ల ప్రేమకూ, అనవలేపస్య + చ = (చిత్రకారుడిననే) గర్వరాహిత్యానికీ, ఏతత్ = ఇతడన్న ఈ మాట, సదృశమ్ = అన్నివిధాలా తగినది.

**విదూషక : భో, దాణిం తిణ్ణిఓ తత్తహోదీఓ దీసంతి. సవ్వాఓ అదంసణీఆఓ. కదమా ఇత్థ తత్తహోదీ సఉందలా? (భోః ఇదానీం త్రిస్రస్తత్రభవత్యో దృశ్యంతే. సర్వాశ్చ దర్శనీయాః. కతమాత్ర తత్రభవతీ శకుంతలా?)**

**సానుమతీ: అణభిణ్ణో క్ఖు ఈదిసస్స రూపస్స మోహదిట్ఠీ అఅం జణో. (అనభిజ్ఞః ఖల్వీదృశస్య రూపస్య మోహదృష్టిరయం జనః)**

**రాజా : త్వం తావత్కతమాం తర్కయసి?**

**విదూషక : తక్కేమి జా ఏసా సిఢిలకేసబంధణువ్వంతకుసుమేణ కేసంతేణ ఉబ్భిణ్ణస్సేఅ బిందుణా వఅణేణ విసేసదో ఓసేరిఆహిం బాహాహిం అవసేఅసిణిద్ధతరుణ పల్లవస్స చూఅ పాఅవస్స పాసే ఇసిపరిస్సంతా విఅ ఆలిహిదా సా సఉందలా. ఇదరాఓ సహోఓత్తి. (తర్కయామి యైషా శిథిలకేశబంధనోద్వాంతకుసుమేన కేశాంతేనోద్భిన్న స్వేదబిందునా వదనేన విశేషతోऽపసృతాభ్యాం బాహుభ్యా మవసేక స్నిగ్ధతరుణ పల్లవస్య చూతపాదపస్య పార్శ్వ ఈషత్పరిశ్రాంతేవాలిఖితా సా శకుంతలా. ఇతరే సఖ్యావితి)**

---

**భో దాణిం:** భోః = ఓయీ! ఇదానీమ్ = ఇప్పుడీ చిత్రఫలకంలో, తత్రభవత్యః = మాన్యురాండ్రు, త్రిస్రః = ముఫ్ఫురు, దృశ్యంతే = కనిపిస్తున్నారు. సర్వాః + చ = అందరూ, దర్శనీయాః = చూడచక్కనివారే. అత్ర = వీరిలో, అత్రభవతీ = మాన్యురాలు, శకుంతలా = శకుంతల, కతమా = ఎవ్వరితె?

**అణభిణ్ణో:** మోహదృష్టిః = మొద్దుచూపులవాడైన, అయమ్ + జనః = ఈ వ్యక్తి, ఈదృశస్య = ఇలాంటి (సుందరాతిసుందరమైన), రూపస్య = రూపాన్ని గుర్తు పట్టడానికి, అనభిజ్ఞః + ఖలు = నేరనివాడుగదా!

**త్వం తావత్:** త్వమ్ + తావత్ = నువ్వయితే, కతమామ్ = ఎవరితెను, తర్కయసి = శకుంతల అనుకొంటున్నావు?

**తక్కేమి:** శిథిల + కేశబంధన = సడలిన క్రొమ్ముడి నుంచి, ఉద్వాంత + కుసుమేన = జారిన పువ్వుతోనూ, కేశాంతేన = ముంగురులతో, ఉద్భిన్న = హత్తుకున్న, స్వేదబిందునా = చెమట బిందువులు కలదైన, వదనేన = ముఖంతోనూ; విశేషతః = విశేషించి, అపసృతాభ్యామ్ = సాచినవైన, బాహుభ్యామ్ = బాహువులతోనూ; అవసేక

**రాజా : నిపుణో భవాన్. అస్త్యత్ర మే తావత్ భావచిహ్నమ్.**

**స్విన్నాంగుళివినివేశో రేఖాప్రాంతేషు దృశ్యతే మలినః**
**అశ్రు చ కపోలపతితం దృశ్యమిదం వర్తికోచ్ఛ్వాసాత్ 15**

**చతురికే! అర్ధలిఖితమేతద్వినోదస్థానమ్. గచ్ఛ! వర్తికాం తావదానయ!**

**చతురికా : అజ్జ, మాధవ్వ! అవలంబ చిత్తఫలఅం జావ ఆఅచ్ఛామి (ఆర్య! మాధవ్య! అవలంబస్వ చిత్రఫలకం యావదాగచ్ఛామి)**

---

= నీటి తడుపుతో, స్నిగ్ధ = నిగనిగలాడుతున్న, తరుణ – పల్లవస్య = లేత చిగురాకులు గల, చూతపాదపస్య = మామిడిచెట్టుకు, పార్శ్వే = చెంగట, ఈషత్ + పరిశ్రాంత + ఇవ = కాసింత అలసినదానివలె, యా + ఏషా + ఆలిఖితా = ఎవరితె చిత్రింపబడినదో, సా = ఆమె, శకుంతలా = శకుంతల అని, తర్కయామి = భావిస్తున్నాను. ఇతరే = తక్కిన ఇద్దరూ, సఖ్యౌ + ఇతి = ఆమె నేస్తురాండ్రనీ నా ఊహ.

**స్విన్నాంగుళి:** భవాన్ = నువ్వు, నిపుణః = జాణవే! అత్ర = ఈ బొమ్మలో, మే = నా, భావచిహ్నమ్ = సాత్త్వికభావపుటానవాలూ, తావత్ + అస్తి = ఉంది సుమా! (భావేన సాత్త్వికభావేన కృతం చిహ్నమ్ = భావచిహ్నమితి – మధ్యమపదలోపి సమాసః అని రాఘవభట్టు). స్విన్న = చెమటగొన్న, అంగుళి = చేతివేళ్లు, వినివేశః = తాకడంవల్లనైన, మలినః = మాపు, రేఖా – ప్రాంతేషు = బొమ్మలోని గీతల పజ్జ, దృశ్యతే = అదిగో కనిపిస్తోంది. కపోల పతితమ్ = బొమ్మలోని శకుంతల బుగ్గపై పడిన, అశ్రు + చ = నా కన్నీటి బిందువుసైతం, వర్తికా + ఉచ్ఛ్వాసాత్ = అక్కడి రంగు ఉబకడం వల్ల, ఇదమ్ + దృశ్యమ్ = ఇదిగో కనబడుతోంది. (పటలేపే పక్షి భేదే తూలికాయాం చ వర్తికా – ఇత్యజయః)

**తాత్పర్యం:** బొమ్మ వేస్తున్నప్పుడు చెమటపట్టిన నావేళ్ళు తాకి తాకి, రేఖలపజ్జ మాలిన్యం ఏర్పడింది – గమనించావా? నా కన్నీటి బిందువు శకుంతల బుగ్గమీద జారిపడింది. అదిగో అక్కడ రంగు (పటలేపం) ఉబికింది – కనిపిస్తోందా?

**అర్ధలిఖితమ్:** చతురికే = చతురికా! ఏతత్ = ఈ, వినోదస్థానమ్ = నేను వినోదించిన ప్రదేశం – నా వినోదానికి తావలమైన ఈ చిత్రమ్, అర్ధలిఖితమ్ = సగమే చిత్రింపబడింది. గచ్ఛ = వెళ్ళు. వర్తికామ్ = కుంచికను – పటలేపాన్నీ, తావత్ + ఆనయ = తీసుకురా!

**రాజా : అహమే వైతదవలంబే. (ఇతి యథోక్తం కరోతి). (నిష్కాంతా చేటీ)**

**రాజా : అహం హి –**

**సాక్షాత్ప్రియాముపగతామపహాయ పూర్వం**
**చిత్రార్పితాం పునరిమాం బహుమన్యమానః**
**స్రోతోవహాం పథి నికామజలా మతీత్య**
**జాతస్సఖే ప్రణయవాన్ మృగతృష్ణికాయామ్. 16**

---

**అవలంబ:** ఆర్య! మాధవ్యా! యావత్ + ఆగచ్ఛామి = నేను తిరిగివచ్చేదాకా, చిత్రఫలకమ్ = ఈ చిత్రఫలకాన్ని, అవలంబస్వ = పట్టుకో!

**అహమేవ:** అహమ్ + ఏవ = నేనే, ఏతత్ = దీనిని, అవలంబే = పట్టుకుంటా. (ఇతి = అని, యథోక్తమ్ + కరోతి = చెప్పినట్టే చేస్తాడు)

(చేటీ = చతురిక, నిష్క్రాంతా = నిష్క్రమిస్తుంది)

**సాక్షాత్:** అహమ్ + హి = నేనేమో! – పూర్వమ్ = మునుపు, సాక్షాత్ = ప్రత్యక్షంగా, ఉపగతామ్ = సమీపించిన, ప్రియామ్ = అనురాగవతిని, అపహాయ = తిరస్కరించి (లెక్కచెయ్యకుండా), పునః = ఇప్పుడేమో, చిత్ర + అర్పితామ్ = బొమ్మలో ఉన్నదైన, ఇమామ్ = ఈ శకుంతలను, బహుమన్యమానః = తెగ మెచ్చుకొంటున్నవాడనై – ప్రాధేయపడుతున్నవాడనై, సఖే = మిత్రమా! మాధవ్యా! పథి = దారిలో, నికామ – జలామ్ = మిక్కిలిగా నీటితో నిండిన, స్రోతో వహామ్ = నదిని, అతీత్య = దాటివచ్చేసి, మృగతృష్ణికాయామ్ = ఎండమావియందు, ప్రణయవాన్ = కోరికగొన్నవాడను, జాతః = అయ్యాను. (సాక్షాత్ – ప్రత్యక్షతుల్యయోః – అమరం).

**తాత్పర్యం:** ప్రియసఖుడా! మునుపు – నా ప్రేయసి శకుంతల తనంత తానుగా వచ్చి ప్రాధేయపడితే లెక్కచెయ్యలేదు. ఇప్పుడేమో ఈ బొమ్మను పట్టుకువేలాడుతున్నాను. ఎంత వెర్రివాణ్ని! దారిలో తారసపడ్డ జీవనదిని దాటివచ్చేశాను. ఇప్పుడు దాహంతో ఎండమావి వెంటపడుతున్నాను.

**ఏసో:** (ఆత్మగతమ్ = తనలో) ఏషః + అత్రభవాన్ = ఈ మహానుభావుడు, నదీమ్ + అతిక్రమ్య = నదిని దాటి, మృగతృష్ణికాయామ్ + సంక్రాంతః = ఎండమావి వెంటపడ్డాడు, అవును, ఎలా మళ్ళించడం అని. (ప్రకాశమ్ = ప్రకాశంగా) భోః =

**విదూషక : (ఆత్మగతమ్) ఏసో అత్తభవం ణదిం అదిక్కమిఅ మిఅతిహ్ణికాయాం సంకంతో. (ప్రకాశమ్) భో, అవరం కిం ఏత్థ విహిదవ్వం. (ఏషోఽత్రభవాన్ నదీమతిక్రమ్య మృగతృష్ణికాయాం సంక్రాంతః. భోః! అపరం కిమత్ర లిఖితవ్యమ్?)**

**సానుమతీ: జో జో పదేసో సహీఏ అహిరూవో తం తం ఆవిహిదుకామో భవే. (యో యః ప్రదేశః సఖ్యా మేఽభిరూపస్తం తమాలిఖితుకామః భవేత్)**

**రాజా : శ్రూయతామ్ –**

**కార్యా సైకతలీనహంసమిథునా స్రోతోవహా మాలినీ**
**పాదాస్తామభితో నిషణ్ణహరిణా గౌరీగురోః పావనాః**
**శాఖాలంబితవల్కలస్య చ తరోర్నిర్మాతుమిచ్ఛామ్యధః**
**శృంగే కృష్ణమృగస్య వామనయనం కండూయమానాం మృగీమ్. 17**

---

ఓయీ మిత్రమా! అత్ర = ఈ బొమ్మలో, అపరమ్ + కిమ్ – లిఖితవ్యమ్ = మరింకేమి చిత్రించాలి?

**జో జో:** యః + యః + ప్రదేశః = ఏయే ప్రదేశం, మే – సఖ్యాః = నా చెలి శకుంతలకు, అభిరూపః = ఇష్టమో – రుచించేదో, తమ్ + తమ్ = దానినల్లా, ఆలిఖితుకామః + భవేత్ = లిఖించగోరుతున్నవాడు కావచ్చు!!

**కార్యా:** శ్రూయతామ్ = మిత్రమా! విను! సైకత = ఇసుకు తిన్నెమీద, లీన = పరవశించిన, హంసమిథునా = రాయంచల జంటలు కలదైన, మాలినీ = మాలిని అనే పేరు గల, స్రోతోవహా = నదీప్రవాహం, కార్యా = లిఖించాలి. తామ్ + అభితః = దానికి చేరువలోనే, నిషణ్ణహరిణాః = విశ్రాంతి గొంటున్న లేడులతో కూడినవీ, పావనాః = పరమపవిత్రమైనవీ అయిన, గౌరీగురోః = (పార్వతి తండ్రియైన) హిమవంతుడి, పాదాః = ప్రత్యంత పర్వతాలు, కార్యాః = చిత్రించాలి. శాఖా + ఆలంబిత = కొమ్మలకు వేలాడగట్టబడిన, వల్కలస్య = నారచీరలు కలదైన, తరోః + చెట్టుయొక్క, అధః = క్రింద, కృష్ణమృగస్య = కృష్ణమృగముయొక్క (నల్ల మగ లేడి), శృంగే = కొమ్ము నందు, వామనయనమ్ = ఎడమకన్నును, కండూయమానామ్ = మెల్లగా గోకుకొంటున్న, మృగీమ్ = ఆడు లేడిని కూడా, నిర్మాతుమ్ + ఇచ్ఛామి = (వీలవుతుందో లేదో గానీ) చిత్రించాలనుకొంటున్నాను.

**విదూషక : (ఆత్మగతమ్) జహ అహం దేక్ఖామి పూరిదవ్వంణేన చిత్తఫలఅం లంబకుచ్చాణం తావసాణం కదంబేహిం. (యథాహం పశ్యామి పూరితవ్యమనేన చిత్రఫలకం లంబకూర్చానాం తాపసానాం కదంబైః)**

**రాజా : వయస్య, అన్యచ్చ శకుంతలాయాః ప్రసాధనమభిప్రేతమస్మాభిః.**

**విదూషక : కిం విఅ? (కిమివ?)**

**సానుమతీ: వణవాసస్స సోఉమారస్స అవిణఅస్స అ జం సరిసం భవిస్సది. (వనవాసస్య సౌకుమార్యస్యావినయస్య చ యత్సదృశం భవిష్యతి).**

---

**తాత్పర్యం:** మాలినీ నదిని లిఖించాలి. దాని ఇసుకతిన్నెమీద పారవశ్యం అనుభవిస్తున్న రాయంచల జంటలను చిత్రించాలి. ఆ నదికి చేరువలోనే హిమాలయం పాదాలను – పావనమైన ప్రత్యంతపర్వతాలను – చిత్రించాలి. అలాగే ఇదిగో ఇక్కడ ఒక పెద్ద చెట్టు వెయ్యాలి. దాని కొమ్మలకు నారచీరలు వేలాడు తుండాలి. దాని నీడలో – నల్ల మగ ఇర్రి కొమ్ముకు తన ఎడమకన్నును మెల్లగా రాస్తున్న పెంటిఇర్రిని కూడా చిత్రించాలనుకొంటున్నాను.

**జహ అహం:** (ఆత్మగతమ్ = తనలో) యథా + అహమ్ + పశ్యామి = నేను చూస్తున్నప్రకారమైతే (నేను అనుకొంటున్న ప్రకారమే అయితే), లంబకూర్చానామ్ = పొడవైన గడ్డాలు కలవారైన, తాపసానామ్ + కదంబైః = ఋషుల బృందాలతో, చిత్రఫలకమ్ = ఈ బొమ్మ, అనేన + పూరితవ్యమ్ = ఇతనిచేత నింపబడాలి. గడ్డాల సాములతో నింపెయ్యాలి – అనడం.

**అన్యచ్చ:** వయస్య = సఖుడా! శకుంతలాయాః + ప్రసాధనమ్ = శకుంతల తాలూకు అలంకరణం (ఆభరణం), అన్యత్ + చ = మరొకటి కూడా, అస్మాభిః = మాచేత, అభిప్రేతమ్ = లిఖింపగోరబడుచున్నది. నేను లిఖించాలి అనుకొంటున్నది మరొకటి కూడా ఉంది – అది శకుంతల అలంకరణ.

**కిం విఅ:** కిమ్ + ఇవ = ఏమిటది?

**వణవాసస్స:** వనవాసస్య = ఆశ్రమనివాసానికీ, సౌకుమార్యస్య = ఆమె మార్దవానికీ, అవినయస్య + చ = స్వేచ్ఛా ప్రవృత్తికీ – లెక్కచేయనితనానికీ, యత్ + సదృశమ్ = ఏది సదృశమో, తత్ + భవిష్యతి = (బహుశ) అదే అయ్యుంటుంది! అలాంటిదేదో ఒక ఆభరణం చిత్రిస్తాడు కాబోలు – అని. (అవినయస్య – కొన్ని ప్రతులలో లేదు).

**రాజా : కృతం న కర్ణార్పితబంధనం సఖే**
**శిరీష మాగండవిలంబికేసరమ్**
**న వా శరచ్చంద్రమరీచికోమలం**
**మృణాల సూత్రం రచితం స్తనాంతరే. 18**

**విదూషక : భో, కిం ణు తత్తహోదీ రత్తకువలఅ పల్లవసోహిణా అగ్గహత్థేణ ముహం ఓవారిఅ చఇదచఇదా విఅ ఠిఆ. (సావధానం నిరూప్య దృష్ట్వా) ఆ, ఏసో దాసీఏ పుత్తో కుసుమరసపాడచ్చరో తత్తహోదీఏ వఅణం అహిలంఘేది మహుఅరో. (భోః! కిం ను తత్రభవతీ రక్తకువలయ పల్లవశోభినా అగ్రహస్తేన ముఖమపవార్య చకిత చకితేవ స్థితా? ఆః! ఏష దాస్యాః పుత్రః కుసుమరస పాటచ్చరో తత్రభవత్యాః వదనమభిలంఘతి మధుకరః).**

---

**కృతమ్:** సఖే = చెలికాడా! ఆగండ విలంబి – కేసరమ్ = చెక్కిలి కడదాకా వేలాడే కేసరాలు (కింజల్కాలు) కలదీ, కర్ణ + అర్పిత బంధనమ్ = చెవిలో పెట్టుకోబడిన తొడిమి (బంధనమ్) కలదీ అయిన, శిరీషమ్ = దిరిసెన పువ్వు, న – కృతమ్ = ఇంకా చిత్రింపబడలేదు. వా = అలాగే, శరత్ + చంద్ర = శరత్కాలపు చంద్రుడి, మరీచి = ఒక కిరణం లాంటి, కోమలమ్ = మృదువైన, మృణాల సూత్రమ్ = తామరతూడులోని దారం, స్తనాంతరే = కుచాల నడుమ, న + రచితమ్ = ఇంకా చిత్రింపబడలేదు.

**తాత్పర్యం:** శకుంతల – చెవిలో పెట్టుకున్న శిరీష పుష్పం చిత్రించాలి. దాని కేసరాలు ఆమె చెక్కిలి దాకా వేలాడుతుంటాయి. ఆమె కుచమధ్యభాగంలో ఒక సన్నని తామరతూడు దారం చిత్రించాలి. అది శరదృతువులోని వెన్నెల కిరణంలా ఉండాలి.

**కిం ణు:** భోః = ఓయీ! కిమ్ + ను = ఏమిది? తత్రభవతీ = మాన్యురాలు శకుంతల, రక్తకువలయ = చెంగలువ, పల్లవ = చిగురాకులాగా, శోభినా = ప్రకాశించే, అగ్రహస్తేన = అరచేతితో, ముఖమ్ + అపవార్య = ముఖం కప్పుకొని (మాటు పరచుకొని), చకిత చకితా + ఇవ = బాగా విస్తుపోయినదానిలాగా, స్థితా =ఉంది? ఏమిది? (రక్తౌ కువలయ పల్లవౌ – తద్వత్ శోభినా. ఎర్రని కలువలాగా చిగురాకులాగా శోభించే). (సావధానమ్ + నిరూప్య – దృష్ట్వా = బాగా పరకాయించి చూసి) ఆః = అరే! ఏషః = ఈ, దాస్యాః –పుత్రః = దుష్టుడు (తొత్తు – కొడుకు), కుసుమ రస – పాటచ్చరః =

**రాజా : నను వార్యతామేష ధృష్టః**

**విదూషక : భవం ఏవ్వ అవిణీదాణం సాసిదా ఇమస్స వారణఏ పహవిస్సది. (భవానేవ అవినీతానాం శాసితాస్య వారణే ప్రభవిష్యతి)**

**రాజా : యుజ్యతే. అయిభోః కుసుమలతా ప్రియాతిథే! కిమత్ర పరిపతన ఖేద మనుభవసి?**

**ఏషా కుసుమనిషణ్ణా తృషితాపి సతీ భవంతమనురక్తా**
**ప్రతిపాలయతి మధుకరీ న ఖలు మధు వినా త్వయా పిబతి. 19**

---

పూదేనెల దొంగ, మధుకరః = తుమ్మెదగాడు, తత్రభవత్యాః = మాన్యురాలి, వదనమ్ = ముఖాన్ని, అభిలంఘతి = ఆక్రమించజూస్తున్నాడు!?

**నను:** ధృష్టః = ఇంత బాహాటంగా తప్పుచేస్తున్నవాడు, ఏషః = ఈ మధుకరుడు, వార్యతామ్ + నను = వారింపబడుగాక! తుమ్మెదను వారించు – అని.

**భవం ఏవ్వ:** అవినీతానామ్ = నీతిమాలినవాళ్లకు, శాసితా = శిక్షవిధించే వ్యక్తి, భవాన్ + ఏవ = నీవే, అస్య + వారణే = ఇతడిని వారించడంలో, ప్రభవిష్యతి = సమర్థుడవు, రాజువు కాబట్టి నువ్వే వారించు అని.

**యుజ్యతే:** యుజ్యతే = సబబే! అయి – భోః = ఓయోయీ! కుసుమలతా = పూలతీగలకు, ప్రియ+ అతిథే = హితుడవైన అతిథీ! అత్ర = ఇక్కడ, పరిపతన – ఖేదమ్ = వాలడమనే శ్రమను, కిమ్ + అనుభవసి = పొందుతావెందుకు? ఇక్కడ వాలడం నీకు వృథా శ్రమయే తప్ప ఆనందదాయకం కాదు – అనడం.

**ఏషా:** ఏషా = ఇదిగో, కుసుమ – నిషణ్ణా = పువ్వు మీద వాలి కూర్చున్నదై, తృషితా + అపి = తాను దప్పిక గొన్నదైనప్పటికీ, సతీ = నీ ఇల్లాలు, అనురక్తా = నీపట్ల చాలా అనురాగం కలదైన, మధుకరీ = నీ ఆడుతుమ్మెద (భ్రమరాంగన), త్వయా + వినా = నువ్వు తోడులేకుండా, మధు = మకరందం, న + పిబతి = గ్రోలడం లేదు. భవంతమ్ + ప్రతిపాలయతి = నిన్ను నిరీక్షిస్తోంది.

**తాత్పర్యం:** ఓయీ మగతుమ్మెదా! ఇదిగో చూడు నీ పెంటితుమ్మెద ఇక్కడ ఈ పువ్వు మీద వాలింది. అలా కూర్చుందే తప్ప, తాను ఎంత దప్పికతో ఉన్నా మధువు గ్రోలడం

**సానుమతీ : అజ్జ, అభిజాదం క్ఖు ఏసో వారిదో. (అద్యాభిజాతం ఖల్వేష వారితః)**

**విదూషక : పడిసిద్ధా వి వామా ఏసా జాదీ (ప్రతిషిద్ధాపి వామైషా జాతిః).**

**రాజా : ఏవం భోః, న మే శాసనే తిష్ఠసి. శ్రూయతాం తర్హి సంప్రతి.**

**అక్లిష్టబాలతరుపల్లవలోభనీయం**
**పీతం మయా సదయమేవ రతోత్సవేషు**
**బింబాధరం స్పృశసి చేద్భ్రమర! ప్రియాయా**
**స్త్వాం కారయామి కమలోదరబంధనస్థమ్. 20**

---

లేదు. నువ్వుతోడు లేకుండా తానొక్కతే మకరందం పుచ్చుకోడానికి ఇచ్ఛగించడం లేదు. నీకోసం, నీ రాకకోసం ఎదురుచూస్తోంది. అక్కడికి వెళ్ళు, ఆనందించు, ఆనందం కల్గించు – అని.

**అజ్జ:** అద్య = హమ్మయ్య! ఇప్పుడూ, అభిజాతమ్ = న్యాయ్యంగా, ఏషః = ఈ గండుతుమ్మెద, వారితః + ఖలు= వారింపబడ్డాడు కదా!. (అభిజాతః స్మృతౌ న్యాయ్యే – ఇతి విశ్వః)

**పడిసిద్ధా:** ప్రతిషిద్ధా + అపి = ఎంత వారింపబడినా, ఏషా + జాతిః = ఈ తుమ్మెదజాతి, వామా = పెంకిదే! వెళ్ళినట్టే వెళుతుంది, మళ్ళీ వచ్చివాలుతుంది – అనడం. (వామాః + కులస్య + ఆధయః = పెంకి ఘటాలు వంశానికి చీడలు 4–17).

**ఏవం భోః:** ఏవమ్ + భోః = అలాగటయ్యా తుమ్మెదా! మే + శాసనే = నా ఆజ్ఞలో, న + తిష్ఠసి = మెలగవా? ధిక్కరిస్తావా? తర్హి = అలా అయితే, సంప్రతి = ఇప్పుడు, శ్రూయతామ్ = (గట్టిగా చెబుతున్నాను) విను –

**అక్లిష్ట:** భ్రమర = ఓయీ గండుతుమ్మెదా! అక్లిష్ట = నలగనిదీ, బాల = అప్పుడే ప్రభవించినదీ అయిన, తరుపల్లవ = చిగురాకులాగా, లోభనీయమ్ = ఆశగొలిపేదీ, రతోత్సవేషు = కలయికల సంబరాలలో, సదయమ్ + ఏవ = దయజూపుతూనే, మయా = నాచేత, పీతమ్ = క్రోలబడినదీ (నిర్దయగా మొరటుగా చుంబించలేదు – ఎంత ఆవేశమున్నా అని) అయిన, ప్రియాయాః = నా ప్రియురాలి, బింబాధరమ్ = దొండపండు లాంటి క్రిందిపెదవిని, స్పృశసి + చేత్ = తాకితివో, త్వామ్ = నిన్ను, కమల + ఉదర – బంధనస్థమ్ = పద్మకోశంలో బందీగా, కారయామి = చేయించేస్తాను.

**విదూషక : ఏవ్వం తిక్షణ దండస్స కిం ణ భాఇస్సది. (ప్రహస్య – ఆత్మగతమ్) ఏదో దావ ఉమ్మత్తో. అహం పి ఏదస్స సంగేణ ఈదిసవణ్ణో విఅ సంవుత్తో. (ప్రకాశమ్) భో, చిత్తం ఖు ఏదం. (ఏవం తీక్ష్ణ దండస్య కిం న భేష్యతి? ఏష తావదున్మత్తః. అహమపి ఏతస్య సంగేనేదృశవర్ణ ఇవ సంవృత్తః. భోః చిత్రం ఖల్వేతత్)**

**రాజా : కథం చిత్రమ్?**

**సానుమతీ: అహం పి దాణిం అవగదత్థా, కిం ఉణ జహాలిహిదాణుభావీ ఏసో. (అహమపీదానీమవగతార్థా, కింపున ర్యథాలిఖితానుభావ్యేషః?)**

---

**తాత్పర్యం:** వాడనీ నలగనీ కొత్త చిగురాకులాగా ఆశ గొలిపే నా ప్రియురాలి కెంపుటధరాన్ని అంతటి రతి సంగమోత్సాహంలోనూ నేను దయతోనే చుంబించాను. నిర్దయగా గాటుపరచలేదు. బింబఫల సదృశమైన ఆ అధరాన్ని (బింబ సదృశః అధరః – మధ్యమపదలోపి) ఓరీ తుమ్మెదా! నువ్వు గనక స్పృశించావో నీకు మూడిందే! పద్మకోశంలో నిన్ను బందీ చేయించేస్తాను!!

**ఏవ్వం:** ఏవమ్ = ఇలా, తీక్ష్ణదండస్య = తీవ్రంగా దండించే ఈ రాజుకు, కిమ్ + న + భేష్యతి = ఏది భయపడదు?! (ప్రహస్య = నవ్వి, ఆత్మగతమ్ = తనలో) ఏషః + తావత్ = ఇతడేమో, ఉన్మత్తః = పిచ్చివాడయ్యాడు. అహమ్ + అపి = నేను కూడా, ఏతస్య + సంగేన = ఇతడి సాహచర్యంతో, ఈదృశవర్ణః + ఇవ = అలాంటి వాడిలాగానే, సంవృత్తః = అయ్యాను. (ప్రకాశమ్ = ప్రకాశంగా) భోః = ఓయీ! ఏతత్ = ఇది, చిత్రమ్ + ఖలు = బొమ్మకదా!

**కథమ్:** కథమ్ = ఎట్టూ! చిత్రమ్ = ఇది బొమ్మా?!

**అహం పి:** అహమ్ + అపి = నేను కూడా, ఇదానీమ్ = ఇప్పుడు, అవగత + అర్థా = బొమ్మ అనే వాస్తవం గ్రహించాను. యథాలిఖిత + అనుభావీ = బొమ్మగా లిఖితమై ఉన్నదానిని వాస్తవంగా అనుభవించే, ఏషః = ఇతడు, కిమ్ + పునః = చెప్పేదేముంది? ఇతడు భ్రమపడటంలో వింతలేదు – అని. (అనవగతార్థా – అని పాఠాంతరం)

**వయస్య:** వయస్య = మిత్రుడా! ఇదమ్ = ఈ, పౌరోభాగ్యమ్ = తప్పులు వెదకడమనేది (దోషైకదృక్పురోభాగః), కిమ్ + అనుష్ఠితమ్ = ఎందుకు చేశావు. బొమ్మను మనిషిగా భావిస్తున్న నా తప్పును ఎత్తిచూపడం ఎందుకు? అని.

**రాజా : వయస్య, కిమిదమనుష్ఠితం పౌరోభాగ్యమ్?**

**దర్శనసుఖమనుభవతః సాక్షాదివ తన్మయేన హృదయేన**
**స్మృతికారిణా త్వయా మే పునరపి చిత్రీకృతా కాంతా. 21**

**(ఇతి బాష్పం వికిరతి)**

**సానుమతీ: పువ్వావరవిరోహీ అపువ్వో ఏసో విరహమగ్గో. (పూర్వాపరవిరోధ్యపూర్వ ఏష విరహ మార్గః)**

**రాజా : వయస్య! కథమేవ మవిశ్రాంతదుఃఖ మనుభవామి!**

**ప్రజాగరాత్ ఖిలీభూతస్తస్యాః స్వప్నే సమాగమః**
**బాష్పస్తు న దదాత్యేనాం ద్రష్టుం చిత్రగతామపి. 22**

---

**దర్శన:** తన్మయేన = ఆమెతో నిండిపోయిన, హృదయేన = మనస్సుతో, సాక్షాత్ + ఇవ = ప్రత్యక్షంగానే అన్నట్టు, దర్శనసుఖమ్ = దర్శనానందం, అనుభవతః = ఆస్వాదిస్తున్న, మే = నాకు, స్మృతి కారిణా = ఇది బొమ్మ అని గుర్తుచేసినవాడవైన, త్వయా = నీచేత, కాంతా = నా ప్రేయసి శకుంతల, పునః + అపి = మరోసారి కూడా, చిత్రీకృతా = బొమ్మ చేయబడింది.

**తాత్పర్యం:** చిత్రపటంలోని శకుంతలను వాస్తవవ్యక్తిగా భావించి దర్శనానందంతో మైమరిచిపోతున్నాను. అలాంటి నాకు ఇది బొమ్మ అని గుర్తుచేశావు. శకుంతలను మరోసారి బొమ్మను చేశావు.

(ఇతి = అని, బాష్పమ్ + వికిరతి = కన్నీరు తుడుచుకుంటాడు)

**పువ్వావర:** పూర్వాపర విరోధీ = ముందుగా బొమ్మను బొమ్మగా గుర్తించడం, తరవాత మైమరిచి బొమ్మను వ్యక్తిగా భావించడం, మళ్ళీ బొమ్మగా గుర్తించడం – అనే పూర్వాపరవిరోధంతో కూడినదై, ఏషః = ఈ, విరహమార్గః = వియోగసరళి, అపూర్వః = మునుపు కనీవినీ ఎరుగనిది.

**ప్రజాగరాత్:** వయస్య = మాధవ్య! కథమ్ = ఏమిది? ఏవమ్ = ఇలా, అవిశ్రాంతదుఃఖమ్ = (శకుంతలను చూడటానికి నోచుకోక) ఎడతెరపి లేని దుఃఖం, అనుభవామి = అనుభవిస్తున్నాను?! స్వప్నే = కలలో, తస్యాః + సమాగమః = శకుంతలా సమాగమం అనేది, ప్రజాగరాత్ = నాకు నిద్దురే లేకపోవడంవల్ల, ఖిలీభూతః = (జరగనిపని అయ్యింది) ఖిలం అయిపోయింది. ఏనామ్ + చిత్రగతామ్ + అపి = ఈ బొమ్మలో

**సానుమతీ: సవ్వహా పమజ్జిదం తుఏ పచ్చాదేసదుక్ఖం సఉందలాఏ. (సర్వథా ప్రమార్జితం త్వయా ప్రత్యాదేశ దుఃఖం శకుంతలాయాః).**

(ప్రవిశ్య)

**చతురికా : జేదు జేదు భట్టా. వట్టిఆకరండఅం గేణ్హిఅ ఇదోముహం పత్థిదహ్మి. (జయతు జయతు భర్తా. వర్తికాకరండకం గృహీత్వేతోముఖం ప్రస్థితాస్మి)**

**రాజా : కిం చ**

**చతురికా : సో మే హత్థాదో అంతరా తరలిఆదుదీఅఏ దేవీఏ వసుమదీ అహం ఏవ్వ అజ్జఉత్తస్స ఉవణఇస్సంత్తి సబలకారం గహీదో. (స మే హస్తాదంతరా తరళికాద్వితీయయా దేవ్యా వసుమత్యాహమే వార్యపుత్ర స్యోపనేష్యామీతి సబలాత్కారం గృహీతః)**

---

ఉన్న శకుంతలనైనా, ద్రష్టుమ్ = చూడటానికి, బాష్పః + తు = కన్నీరేమో, న –దదాతి = అవకాశం ఇవ్వడం లేదు.

**తాత్పర్యం:** కలలోనైనా శకుంతలను చూద్దామంటే, నా కంటికి కునుకే లేక కలలేరాక – అదీ సాధ్యం కావడంలేదు. మెలకువలో – పోనీ ఈ బొమ్మలోనైనా ఆమెను చూద్దామంటే – మాయదారి కన్నీరు, అదీ పడనివ్వడంలేదు.

**సవ్వహా:** శకుంతలాయాః = శకుంతలయొక్క, ప్రత్యాదేశ దుఃఖమ్ = తిరస్కార దుఃఖం – నీ తిరస్కారం వల్ల ఆమెకు కలిగిన దుఃఖమని, సర్వథా = అన్ని విధాలా, త్వయా = నీచేత, ప్రమార్జితమ్ = తుడిచివేయబడింది. నీ దుఃఖంతో ఆమె దుఃఖం ప్రక్షాళితమయ్యింది – అనడం.

(ప్రవిశ్య = చతురిక ప్రవేశించి)

**జేదు జేదు:** భర్తా = ప్రభువు, జయతు – జయతు = జయించుగాక! జయించుగాక!! వర్తికా – కరండకమ్ = కుంచెలూ రంగుల పెట్టెను, గృహీత్వా = తీసుకొని, ఇతః + ముఖమ్ + ప్రస్థితా+అస్మి = ఇటువైపు బయలుదేరాను.

**కిం చ:** కిం చ = ఊఁ! ఏమయ్యింది?

**సో మే:** సః = ఆ పెట్టె, మే + హస్తాత్ + అంతరా = నా చేతుల్లో నుంచి, తరళికా ద్వితీయయా = తరళికతో కూడి వస్తున్నదైన, దేవ్యా = మహారాణి (జ్ఞి), వసుమత్యా

**విదూషక : దిట్ఠిఆ తుమం ముక్కో. (దిష్ట్యా త్వం ముక్తా!)**

**చతురికా : జావదేవీఏ విడవలగ్గం ఉత్తరీఅం తరలిఆ మోచేది తావ మఏ ణివ్వాహిదో అత్తా. (యావద్దేవ్యా విటపలగ్న ముత్తరీయం తరళికా మోచయతి తావన్మయా నిర్వాహిత ఆత్మా)**

**రాజా : వయస్య! ఉపస్థితా దేవీ బహుమానగర్వితా చ. భవానిమాం ప్రతికృతిం రక్షతు.**

**విదూషక : అత్తాణంత్తి భణాహి (చిత్రఫలకమాదాయోత్థాయ చ) జఇ భవం అంతే ఉరకాలకూటాదో ముంచీఅది తదో మం మేహప్పడిచ్ఛందే పాసాదే సద్దావేహి. (ఆత్మానమితి భణ. యది భవాన్ అంతఃపురకాలకూటాత్ మోక్ష్యతే తదా మాం మేఘప్రతిచ్ఛందే ప్రాసాదే శబ్దాపయ).**

---

= వసుమతి చేత, అహమ్ + ఏవ = నేనే, ఆర్యపుత్రస్య = నా నాథుడికి, ఉపనేష్యామి = తీసుకువెడతాను, ఇతి = అని చెప్పి, సబలాత్కారమ్ = బలాత్కారంగా, గృహీతః = తీసుకోబడింది. తరళికను వెంటబెట్టుకొని వస్తున్న మహారాణి వసుమతీదేవి నాచేతుల్లోని ఆ పెట్టెను బలవంతంగా తీసేసుకుంది. నువ్వు ఫో! నేనే తీసుకువెళ్ళి దీన్ని నాథుడికి ఇస్తాను – అంది.

**దిట్ఠిఆ:** దిష్ట్యా = అదృష్టవశాత్తూ, త్వమ్ = నువ్వు, ముక్తా = విడిచిపెట్టబడ్డావు. నీ అదృష్టం బాగుండి నిన్ను విడిచిపెట్టింది – అనడం.

**జావదేవీఏ:** విటపలగ్నమ్ = చెట్లకు తగుల్కొన్న, దేవ్యాః + ఉత్తరీయమ్ = మహారాణి పైటను, తరళికా = తరళిక, యావత్ + మోచయతి + తావత్ = విడిపించేలోగా, మయా = నాచేత, ఆత్మా + నిర్వాహితః = ప్రాణం రక్షించుకోబడినది. పారిపోయి వచ్చేశాను – అని.

**ఉపస్థితా:** వయస్య = మాధవ్యా! దేవీ = మహారాజ్ఞి, బహుమాన గర్వితా + చ = అసలే రాచరికపు మన్ననతో గర్వితురాలు, ఉపస్థితా = వచ్చింది (రానుంది). భవాన్ = నువ్వు, ఇమామ్ + ప్రతికృతిమ్ = ఈ చిత్రపటాన్ని, రక్షతు = కాపాడు.

**అత్తాణం:** ఆత్మానామ్ + ఇతి = నన్ను కాపాడు అని, భణ = చెప్పు. చిత్రపటాన్ని కాపాడమనడం కాదు, "నన్ను కాపాడు" అని అడగవయ్యా – అనడం. భవాన్ = నీవు,

**(ఇతి ద్రుతపదం నిష్క్రాంతః)**

**సానుమతీ : అణ్ణసంకంతహిఅఓవిపఢమసంభావణంఅవేక్ఖదిసిఢిలసోహదోదాణిం ఏసో. (అన్యసంక్రాంత హృదయోఽపి ప్రథమసంభావనామపేక్షతే శిథిల సౌహార్ద ఇదానీమేషః)**

**(ప్రవిశ్య పత్రహస్తా)**

**ప్రతీహారీ : జేదు జేదు దేవో! (జయతు జయతు దేవః).**

**రాజా : వేత్రవతి! న ఖల్వంతరా దృష్టా త్వయా దేవీ ?**

**ప్రతీహారీ : అహ ఇం. పత్తహత్థం మం దేక్ఖిఅ పడిణిఉత్తా. (అథకిమ్. పత్రహస్తాం మాం ప్రేక్ష్య ప్రతినివృత్తా)**

---

అంతఃపుర –కాలకూటాత్ = నీ ఈ అంతఃపురకాలకూటం నుంచి, మోక్ష్యతే + యది = తప్పించుకోగలిగితివా, తదా = అప్పుడు, మామ్ = నన్ను, మేఘప్రతిచ్ఛందే – ప్రాసాదే = మేఘప్రతిచ్ఛందం అనే మన రాజభవనంలో, శబ్దాపయ = పిలిపించు. అందాకా నేను అక్కడ దాక్కుంటాను అని.

(ఇతి = అని, ద్రుతపదమ్ = గబగబా అడుగులు వేస్తూ, నిష్క్రాంతః = నిష్క్రమిస్తాడు)

**అణ్ణ సంకంత:** శిథిల సౌహార్దః = రాణిపట్ల తరిగిపోయిన వలపుగల, ఏషః = ఈ రాజు, అన్యసంక్రాంత హృదయః + అపి = మరొక వనితకు అర్పితమైన మనస్సు కలవాడైనప్పటికీ, ఇదానీమ్ = ఇప్పుడు, ప్రథమ – సంభావనామ్ = తొలుతటి ఆదరణనూ మన్ననన్నూ, అపేక్షతే = (వసుమతీ దేవి నుంచి) కోరుకొంటున్నాడు.

(పత్రహస్తా = చేతిలో లేఖతో, ప్రవిశ్య = ప్రతీహారి వేత్రవతి ప్రవేశించి)

**జేదు జేదు:** దేవః = ప్రభువు, జయతు – జయతు = జయించుగాక!

**న ఖలు:** వేత్రవతి = వేత్రవతీ! అంతరా = మార్గమధ్యంలో, త్వయా = నీచేత (నీకు), దేవీ = వసుమతీ దేవి, న – దృష్టా + ఖలు = కనబడలేదా?

**అహ ఇం:** అథకిమ్ = అవును, కనపడింది. పత్రహస్తామ్ = లేఖ చేతిలో ఉన్న, మామ్ = నన్ను, ప్రేక్ష్య = చూసి, ప్రతినివృత్తా = వెనుదిరిగి వెళ్ళిపోయింది.

**రాజా : కార్యజ్ఞా కార్యోపరోధం మే పరిహరతి.**

**ప్రతీహారీ : దేవ! అమచ్చో విణ్ణవేది. అత్థజాదస్స గణణాబహులదాఏ ఏక్కం ఏవ్వ పోరకజ్జం అవేక్ఖిదం తం దేవో పత్తారూఢం పచ్చక్ఖీకరోదుత్తి. (దేవ! అమాత్యో విజ్ఞాపయతి. అర్థజాతస్య గణనాబహుళతయా ఏకమేవ పౌరకార్యమవేక్షితం, తద్దేవః పత్రారూఢం ప్రత్యక్షీకరోత్వితి).**

**రాజా : ఇతః పత్రికాం దర్శయ. (ప్రతీహార్యుపనయతి).**

**రాజా : (అనువాచ్య) కథమ్! సముద్రవ్యవహారీ సార్థవాహో ధనమిత్రో నామ నౌవ్యసనే విపన్నః. అనపత్యశ్చ కిల తపస్వీ రాజగామీ తస్యార్థ సంచయ ఇత్యేతదమాత్యేన లిఖితమ్. కష్టం ఖల్వనపత్యతా. బహుధనత్వాద్బహుపత్నీకేన తత్రభవతా భవితవ్యమ్. విచార్యతాం యది కాచిదాపన్నసత్త్వా తస్య భార్యాసు స్యాత్.**

---

**కార్యజ్ఞా:** కార్యజ్ఞా = రాజకార్యాలు ఎరిగిన వ్యక్తి కనుక, మే = నాకు, కార్య + ఉపరోధమ్ = పనికి అడ్డంకిని, పరిహరతి = పరిహరించింది.

**అమచ్చో:** దేవ = ప్రభూ! అమాత్యః = మంత్రి పిశునుడు, విజ్ఞాపయతి = విన్నవిస్తున్నాడు. అర్థజాతస్య = ఆదాయ ద్రవ్యసమూహాన్ని, గణనా బహుళతయా = లెక్కించడం ఎక్కువ కావడంతో, ఏకమ్ +ఏవ = కేవలం ఒకే ఒక్క, పౌర కార్యమ్ = ప్రజాకార్యం, అవేక్షితమ్ = పరిశీలింపబడింది. పత్రారూఢమ్ + తత్ = లేఖలో లిఖితమైన అద్దానిని, దేవః = ప్రభువు, ప్రత్యక్షీకరోతు + ఇతి = స్వయంగా తిలకించుగాక – అని.

**ఇతః:** పత్రికామ్ = లేఖను, ఇతః + దర్శయ = ఇలా చూపించు.

(ప్రతీహారీ = వేత్రవతి, ఉపనయతి = అందిస్తుంది)

**కథమ్:** (అనువాచ్య = చదివి) కథమ్ = ఎట్టా!! సముద్ర వ్యవహారీ = నౌకలూ సముద్రయానాలతో వ్యవహరించే, సార్థవాహః = వ్యాపారి, ధనమిత్ర + నామ = ధనమిత్రుడనేవాడు, నౌ – వ్యసనే = నౌక నడిసముద్రంలో మునిగిపోవడంతో (వ్యసనం విపది భ్రంశే – అమరం), విపన్నః = మరణించాడు. తపస్వీ = ఆ సజ్జనుడు, అనపత్యః + చ + కిల = సంతానం లేనివాడు కూడానట! తస్య = అతడి, అర్థసంచయః = ఆస్తి మొత్తం, రాజగామీ = రాజుగారికే చెందాలి – ఇతి + ఏతత్ = అని – ఇది, అమాత్యేన

**ప్రతిహారీ : దేవ, దాణిం ఏవ్వ సాకేదఅస్స సేట్ఠిణో దుహిఆ ణివ్వుత్త పుంసవణా జాఆ సే సుణీఅది. (దేవ! ఇదానీమేవ సాకేతస్య శ్రేష్ఠినో దుహితా నిర్వృత్త పుంసవనా జాయాస్య శ్రూయతే)**

**రాజా : నను గర్భః పిత్ర్యం రిక్థమర్హతి. గచ్ఛ ఏవమమాత్యం బ్రూహి.**

**ప్రతీహారీ : జం దేవో ఆణవేది. (యద్దేవ ఆజ్ఞాపయతి) (ఇతి ప్రస్థితా)**

**రాజా : ఏహి తావత్.**

**ప్రతీహారీ : ఇయమస్మి.**

---

= మంత్రి పిశునుడిచేత, లిఖితమ్ = లిఖింపబడింది. అనపత్యతా = వారసుడు లేని స్థితి (పిల్లలు లేకపోవడం), కష్టమ్ + ఖలు = చాలా దుఃఖదాయకం సుమా! బహుధనత్వాత్ = బాగా సంపన్నుడు కనుక, తత్రభవతా = మాన్యధనమిత్రుడు, బహుపత్నీకేన + భవితవ్యమ్ = బహుపత్నీకుడైయుంటాడు! తస్య–భార్యాసు = అతడి భార్యలలో, కాచిత్ = ఏ ఒక్కరితె అయినా, ఆపన్నసత్త్వా = గర్భవతి, యది – స్యాత్ = ఉన్నదేమో, విచార్యతామ్ = వాకబు చెయ్యండి – సమాచారం సేకరింపబడుగాక!

**దాణిం ఏవ్వ:** దేవ = మహారాజా! సాకేతస్య = మన అయోధ్యకు చెందిన, (స్యాత్సాకేతోఽయోధ్యాయామ్ – ఇతి హైమః), శ్రేష్ఠినః = ఒక సెట్టిగారి, దుహితా = కూతురూ, అస్య = ఈ ధనమిత్రుడికి, జాయా = ఇల్లాలూ ఒకామె, ఇదానీమ్ + ఏవ + నిర్వృత్త పుంసవనా = ఇటీవలనే పుంసవనం జరుపుకొన్నదిగా (పుంసవనం = గర్భిణికి చేసే సంస్కారం), ఇదానీమేవ = ఇప్పుడే, శ్రూయతే = తెలిసింది (తెలుస్తోంది).

**నను గర్భః:** గర్భః = గర్భస్థ శిశువు, పిత్ర్యమ్ = పిత్రార్జితమైన, రిక్థమ్ = ఆస్తికి (రిక్థం ధనం వసు – అమరం), అర్హతి + నను = అర్హమే కదా! గచ్ఛ = వెళ్ళు. ఏవమ్ = ఇలాగని, అమాత్యమ్ + బ్రూహి = మంత్రికి చెప్పు!

**జం దేవ:** యత్ + దేవః + ఆజ్ఞాపయతి = మహారాజు ఆజ్ఞాపించినట్టే!! (ఇతి = అని, ప్రస్థితా = వేత్రవతి బయలుదేరుతుంది).

**ఏహి:** ఏహి + తావత్ = ఇటురా ఒకసారి!

**ఇయమస్మి:** ఇయమ్ + అస్మి = ఇదిగో ఇక్కడనే ఉన్నదానను ప్రభూ!

**రాజా : కిమనేన సంతతిరస్తి నాస్తీతి?**

**యేన యేన వియుజ్యంతే ప్రజాః స్నిగ్ధేన బంధునా**
**స స పాపాదృతే తాసాం దుష్యంత ఇతి ఘుష్యతామ్! 23**

**ప్రతీహారీ : ఏవ్వం నామ ఘోసఇదవ్వం. (నిష్క్రమ్య పునః ప్రవిశ్య) కాలే పవుట్ఠం విఅ అహిణందిదం దేవస్స సాసణమ్. (ఏవం నామ ఘోషయితవ్యమ్. కాలే ప్రవృష్టమివాభినందితం దేవస్య శాసనమ్ అమాత్యేన)**

**రాజా : (దీర్ఘ ముష్ణం చ నిఃశ్వస్య) ఏవం భోః సంతతిచ్ఛేద నిరవలంబానాం కులానాం మూలపురుషావసానే సంపదః పరముపతిష్ఠంతి. మమాప్యంతే పురువంశ శ్రీ రకాల ఇవోప్తబీజా భూరేవం వృత్తా.**

---

**కిమనేన:** సంతతిః + అస్తి = సంతానం ఉంది, నాస్తి = లేదు, ఇతి = అనే, అనేన = దీనితో, కిమ్ = ఏమిపని!!

**యేన యేన:** ప్రజాః = ప్రజలు, యేన – యేన = ఏయే, స్నిగ్ధేన – బంధునా = ఆత్మబంధువుతో, వియుజ్యంతే = శాశ్వతవియోగం పొందుతున్నారో, తాసామ్ = అలా పొందినవారికి, పాపాత్ + ఋతే = పాపస్పర్శ లేకుండా – పాపహేతువయ్యే బంధుత్వాన్ని మినహాయించి, సః + సః = ఆయా బంధువు, దుష్యంతః ఇతి = ఈ దుష్యంతుడే అని, ఘుష్యతామ్ = చాటింపబడుగాక!

**తాత్పర్యం:** మన రాజ్యంలో ఎవరు ఏ ఆత్మబంధువును కోల్పోయినా వారికి ఆయా ఆత్మబంధువు దుష్యంతుడే అవుతాడని చాటించండి. వితంతువులకు పతి కావడంలాంటి పాపహేతువులైన బంధుత్వాలకు మాత్రం మినహాయింపు.

**ఏవ్వం నామ:** ఏవమ్ – నామ = ఇలాకదా, ఘోషయితవ్యమ్ = ప్రకటింపబడాలి! చాటింపు అంటే ఇలా ఉండాలి – అనడం (నిష్క్రమ్య = నిష్క్రమించి, పునః + ప్రవిశ్య = మళ్ళీ వచ్చి). దేవస్య + శాసనమ్ = దేవరవారి ఆనతి, కాలే + ప్రవృష్టమ్ + ఇవ = సకాలంలో కురిసిన కుంభవృష్టిలాగా, అమాత్యేన + అభినందితమ్ = మంత్రి చేత ప్రశంసింపబడింది. ఈ ప్రకటనకు మంత్రి సంతోషించాడనడం (కొన్నింట అమాత్యేన అనే పదం లేదు).

**ఏవం భోః:** (దీర్ఘమ్ + ఉష్ణమ్ + చ – నిఃశ్వస్య = వేడిగా నిట్టూర్చి) భోః = ఓ వేత్రవతీ! సంతతి + ఛేద = సంతానం లేకపోవడంతో (ప్రజాతంతు విచ్ఛేదంతో),

**ప్రతీహారీ : పడిహదం అమంగలమ్. (ప్రతిహతమమంగళమ్)**

**రాజా : ధిఙ్మాముపస్థితశ్రేయోఽవమానినమ్!**

**సానుమతీ : అసంసఅం సహిం ఏవ్వ హిఅఏ కరిఅ ణిందిదో ణేణ అప్పా (అసంశయం సఖీమేవ హృదయే కృత్వా నిందితోఽనేన ఆత్మా)**

**రాజా : సంరోపితేఽప్యాత్మని ధర్మపత్నీ<br>త్యక్తా మయా నామ కులప్రతిష్ఠా<br>కల్పిష్యమాణా మహతే ఫలాయ<br>వసుంధరా కాల ఇవోప్తబీజా. 24**

---

నిరవలంబానామ్ = దిక్కులేనివైన, కులానామ్ = వంశాల, సంపదః = ఆస్తులు, మూలపురుష + అవసానే = మూలపురుషుడి మరణంతో, పరమ్ = పరాయివాడిని, ఉపతిష్ఠంతి = పొందుతున్నాయి. మమ + అంతే = నా తదుపరి, పురువంశశ్రీః + అపి = పురువంశసంపదసైతం, ఏవమ్ = ఇలాగే, అకాలే = అదనుగాని కాలంలో, ఉప్తబీజా = విత్తనాలు నాటిన, భూః+ఇవ = పొలం లాగా, వృత్తా = అయిపోతుంది.

**పడిహదం:** అమంగళమ్ = అశుభం, ప్రతిహతమ్ = అంతరించుగాక!

**ధిఙ్మామ్:** ఉపస్థిత = చేతికి అందిన, శ్రేయః = శ్రేయస్సును, అవమానినమ్ = చిన్నబుచ్చిన వాడనైన (తిరస్కరించినవాడనైన), మామ్ = నన్ను, ధిక్ = ఛీఛీ! నన్ను నేనే నిందించుకొంటున్నాను అని.

**అసంసఅం:** అసంశయమ్ = సందేహం లేదు. సఖీమ్ + ఏవ = శకుంతలనే, హృదయే + కృత్వా = మనసులో పెట్టుకొని, అనేన = ఇతడిచేత, ఆత్మా = తన్నుతాను, నిందితః = నిందించుకొన్నాడు. ఆత్మనింద చేసుకొన్నాడని!

**సంరోపితే:** కాలే = అదనులో, ఉప్తబీజా = బీజావాపనం చేయబడినదై, మహతే + ఫలాయ = గొప్పదైన పంటకోసం, కల్పిష్యమాణా = కల్పింపబడనున్న, వసుంధరా + ఇవ = పొలంలాగా; ఆత్మని = నన్ను నేను, సంరోపితే (సతి) = గర్భమందు ఆధానం చేసుకోగా, కులప్రతిష్ఠా = నా వంశాన్ని నిలబెట్టేదైన, ధర్మపత్నీ = ఇల్లాలు, మయా = ఈ నాచేత, త్యక్తా – నామ = విడిచిపెట్టబడిందిగదా!

**సానుమతీ: అపరిచ్ఛిణ్ణా దాణిం దే సందదీ భవిస్సది. (అపరిచ్ఛిన్నేదానీం తే సంతతిర్భవిష్యతి)**

**చతురికా : (జనాంతికమ్) అఏ, ఇమిణా సత్థవాహవుత్తంతేణ ద్విఉణువ్వేఓ భట్టా. ణం అస్సాసిదుం మేహపడిచ్ఛందాదో అజ్జం మాధవ్వం గేణ్హిఅ ఆఅచ్ఛ. (అయే, అనేన సార్థవాహవృత్తాంతేన ద్విగుణోద్వేగో భర్తా. ఏనమాశ్వాసయితుం మేఘప్రతిచ్ఛందాదార్యం మాధవ్యం గృహీత్వాగచ్ఛ).**

**ప్రతీహారీ : సుట్ఠు భణాసి. (సుష్ఠు భణసి). (ఇతి నిష్క్రాంతా)**

**రాజా : అహో దుష్యంతస్య సంశయమారూఢాః పిండభాజః. కుతః–**

**అస్మాత్పరం బత యథాశ్రుతి సంభృతాని**<br>**కో నః కులే నివపనాని నియచ్ఛ తీతి**

---

**తాత్పర్యం:** నేనే పుత్రుడుగా శకుంతలా గర్భంలో ప్రవేశించాను. (ఆత్మా వై పుత్రనామాసి). అందుకని నా వంశాన్ని నిలబెట్టబోతున్న ధర్మపత్ని శకుంతల. ఆమెను పరిత్యజించాను. అదనులో విత్తనాలు జల్లి, సాకి, ఫలసాయం చేతికి అందబోతుండగా పొలాన్ని వదులుకొన్న వెర్రిబాగులవాణ్ని నేను.

**అపరిచ్ఛిణ్ణా:** ఇదానీమ్ = ఇంక ఇప్పుడు, తే – సంతతిః = నీ సంతానం, అపరిచ్ఛిన్నా + భవిష్యతి = ఎడతెగదులే!

**అఏ ఇమిణా:** (జనాంతికమ్ = జనాంతికంగా) అయే = ఓసీ వేత్రవతీ! అనేన = ఈ, సార్థవాహవృత్తాంతేన = వ్యాపారి ధనమిత్రుడి ప్రస్తావనతో, భర్తా = ప్రభువు, ద్విగుణ + ఉద్వేగః = ఇబ్బడిగా దుఃఖితుడయ్యాడు. ఏనమ్ = ఇతడిని, ఆశ్వాసయితుమ్ = ఊరడించడానికి, మేఘ ప్రతిచ్ఛందాత్ = మేఘప్రతిచ్ఛందమనే భవనం నుంచి, ఆర్యమ్ + మాధవ్యమ్ = ఆర్యమాధవుణ్ని, గృహీత్వా + ఆగచ్ఛ = తీసుకురా!

**సుట్ఠు:** సుష్ఠు – భణసి = బాగా చెప్పావు.

(ఇతి = అని, నిష్క్రాంతా = వేత్రవతి నిష్క్రమిస్తుంది)

**అస్మాత్:** అహో = అయ్యో! దుష్యంతస్య = ఈ దుష్యంతుడి, పిండభాజః = పితృదేవతలు, సంశయమ్ + ఆరూఢాః = సందేహంలో పడ్డారు. కుతః = ఎందువల్లనంటే – బత = అయ్యో! కులే = మన వంశంలో, అస్మాత్ + పరమ్ = ఇతడి తదనంతరం,

నూనం ప్రసూతి వికలేన మయా ప్రసిక్తం
ధౌతాశ్రుశేషముదకం పితరః పిబంతి. **25**

(ఇతి మోహ ముపగతః)

**చతురికా :** (ససంభ్రమమవలోక్య) సమస్ససదు భట్టా. (సమాశ్వసితు భర్తా)

**సానుమతీ:** హద్ధీ హద్ధీ! సది, క్ఖు దీవే బబధాన దోసేణ ఏసో అంధఆరదోసం అణుహోది. అహం దాణిం ఏవ్వ ణివ్వుదం కరేమి. అహవా సుదం మఏ సఉందలం సమస్ససఅంతీఏ మహేందజణణీఏ ముహాదో జణ్ణభాఓస్సు ఆ దేవా ఏవ్వ తహ అణుచిట్ఠిస్సంతి జహ అఇరేణ ధమ్మపదిణిం భట్టా అహిణందిస్సదిత్తి. తాణ జుత్తం కాలం పడిపాలిదుం. జావ ఇమిణా వుత్తంతేణ పిఅసహిం సమస్సాసేమి. (ఇత్యుద్భ్రాంతకేన నిష్క్రాంతా). (హాధిక్! హాధిక్! సతి ఖలు దీపే వ్యవధానదోషేణైషోఽంధకారదోషమ్ అనుభవతి. అహమిదానీమేవ నిర్వృతం కరోమి. అథవా, శ్రుతం మయా శకుంతలాం సమాశ్వాసయంత్యాః మహేంద్రజనన్యాః ముఖాద్యజ్ఞ

---

యథాశ్రుతి = వేదోక్తంగా, సంభృతాని = పరిపూర్ణాలైన (సమృద్ధాలైన), నివపనాని = శ్రాద్ధాలను – పిండోదకాలను, నః = మనకు, కః = ఎవడు, నియచ్ఛతి = పెడతాడు? ఇతి = అని, ప్రసూతివికలేన = పిల్లలు లేనివాడనైన, మయా = నాచేత, ప్రసిక్తమ్ = కార్చబడిన, ధౌత + అశ్రుశేషమ్ = స్వచ్ఛమైన అశ్రువులలో మిగిలినదైన, ఉదకమ్ = నీటిని – శేషోదకాన్ని, పితరః = పితృదేవతలు, పిబంతి = త్రాగుతారు. నూనమ్ = ఇది నిశ్చయం! (పితృదానం నివాపః స్యాత్).

**తాత్పర్యం:** అయ్యో! వీడి తరవాత మన వంశంలో ఇక మనకు పిండప్రదానం చేసేవాడెవడు? అని బాధపడుతూ నా పితృదేవతలు సంతానహీనుడినైన నేను కార్చే కన్నీటిలో మిగులునే తర్పణోదకాలుగా గ్రోలుతారు. ఇది నిశ్చయం.

(ఇతి = అని, మోహమ్ + ఉపగతః = మూర్ఛిల్లుతాడు)

**సమస్ససదు:** (ససంభ్రమమ్ = కళవళపాటుతో, అవలోక్య = చూసి) భర్తా = మహారాజు, సమాశ్వసితు = ఊరడిల్లుగాక!

**హద్ధీ హద్ధీ:** హాధిక్ = అయ్యయ్యో! హాధిక్ = అయ్యయ్యో! దీపే – సతి = దీపం ఉండగానే, వ్యవధానదోషేణ = (అడ్డుతెర) దూరం అనే దోషంచేత, ఏషః = ఈతడు,

**భాగోత్సుకా దేవా ఏవ తథానుష్ఠాస్యంతి యథాచిరేణ ధర్మపత్నీం భర్తా అభినందిష్యతీతి. తస్మాత్ యుక్తం కాలం ప్రతిపాలయితుమ్. యావదనేన వృత్తాంతేన (నేపథ్యే) (ప్రియసఖీం సమాశ్వాసయామి)**

**అబ్బమ్మణ్ణం! అబ్బమ్మణ్ణం! (అబ్రహ్మణ్యమ్! అబ్రహ్మణ్యమ్!)**

**రాజా : (ప్రత్యాగతః. కర్ణం దత్త్వా) అయే, మాధవ్యస్యేవార్తస్వరః?! కః కోఽత్రభోః?**

**(ప్రవిశ్య)**

---

అంధకారదోషమ్ = కనిపించకపోవడం అనే అంధకారపు దొసగును, అనుభవతి = అనుభవిస్తున్నాడు. శకుంతల ఉంది. కానీ దూరంగా మరో లోకంలో ఉంది. అందుకని ఇతడిలా మూర్ఛ అనే దోషాన్ని అనుభవిస్తున్నాడు – అనేది ప్రస్తుతస్ఫూర్తి. అహమ్ = నేను, ఇదానీమ్ + ఏవ = ఈ క్షణంలోనే, నిర్వృతమ్ = సుఖ సంతోష సంపన్నునిగా, కరోమి = చేయగలను. ఇతడి దుఃఖం తొలగించగలను – అని. అథవా = కానీ, శకుంతలామ్ = శకుంతలను, సమాశ్వాసయంత్యాః = ఓదారుస్తున్న, మహేంద్రజనన్యాః = ఇంద్రుడి తల్లియైన దితి యొక్క, ముఖాత్ = నోటినుంచి, మయా = నా చేత, శ్రుతమ్ = ఆలకింపబడింది. దితి చెబుతుండగా నేను స్వయంగా విన్నాను. ఏమని అంటే – యజ్ఞభాగ + ఉత్సుకాః = యజ్ఞాలలో పురోడాశాల కోసం ఎగబడే, దేవాః + ఏవ = అమరులే, భర్తా = ఈ మహారాజు, ధర్మపత్నీమ్ = తన ఇల్లాలిని, అచిరేణ = త్వరలోనే, యథా + అభినందిష్యతి = ఎలా పురస్కరిస్తాడో, తథా = అలా, అనుష్ఠాస్యంతి = వ్యూహరచన చేస్తారు, ఇతి = అని. అభినందించే వ్యూహం దేవతలే చేస్తారని. దేవతలకు యజ్ఞాలు కావాలి. యజ్ఞాలు చెయ్యాలంటే దుష్యంతుడికి ధర్మపత్ని కావాలి. కాబట్టి వాళ్ళే వీళ్లను కలుపుతారు – అనడం. తస్మాత్ = అందుచేత, కాలమ్ + ప్రతిపాలయితుమ్ = కాలాన్ని నిరీక్షించడం, యుక్తమ్ = తగినపని. యావత్ = వెంటనే (ఇంతలో), అనేన – వృత్తాంతేన = ఈ దుష్యంతుడి విరహవేదనావృత్తాంతంతో, (ప్రియసఖీమ్ = నా ప్రియసఖి శకుంతలను, సమాశ్వాసయామి = ఓదారుస్తాను – సంభాళిస్తాను.)

(ఇతి = అని, ఉద్భ్రాంతకేన = ఉద్భ్రాంతకం అనే ఆకాశయాన చారీభేదంతో, నిష్క్రాంతా = నిష్క్రమిస్తుంది)

**ప్రతీహారీ : (ససంభ్రమమ్) పరిత్తాఅదు దేవో సంసఅగదం వఅస్సమ్.**

**(పరిత్రాయతాం దేవస్సంశయగతం వయస్యమ్)**

**రాజా : కేనాత్తగంధో మాణవకః?**

**ప్రతీ : అదిట్టరూవేణ కేణ వి సత్తేణ అదిక్కమిఅ మేహపడిచ్ఛందస్స పాసాదస్స అగ్గభూమిం ఆరోవిదో. (అదృష్టరూపేణ కేనాపి సత్త్వేనాతిక్రమ్య మేఘ ప్రతిచ్ఛందస్య ప్రాసాదస్యాగ్ర భూమి మారోపితః)**

**రాజా : (ఉత్థాయ) మా తావత్. మమాపి సత్త్వైరభిభూయంతే గృహాః? అథవా-**

---

(నేపథ్యే = తెరలో)

అబ్రహ్మణ్యమ్ - అబ్రహ్మణ్యమ్ = కాపాడండి! కాపాడండి!

**మాధవ్యస్య:** (ప్రత్యాగతః = తెలివిలోకి వచ్చినవాడై, కర్ణమ్ - దత్త్వా = చెవి ఒగ్గి విని) అయే = అరే! ఆర్తస్వరః = ఆర్తస్వరం, మాధవ్యస్య + ఇవ = మాధవ్యుడిది లాగా ఉందే?! కః + కః + అత్ర + భోః = ఎవరక్కడ?

(ప్రవిశ్య = వేత్రవతి ప్రవేశించి)

**పరిత్తాఅదు:** (ససంభ్రమమ్ = కళవళపడుతూ) సంశయగతమ్ = జీవన్మరణ సంశయం పొందిన, వయస్యమ్ = మిత్రుణ్ని, దేవః = మహారాజు, పరిత్రాయతామ్ = రక్షించుగాక!

**కేన:** కేన = ఎవడిచేత, మాణవకః = మన బ్రహ్మచారి మాధవ్యుడు, ఆత్తగంధః = బాధితుడు? (ఆత్తకంఠః - పాఠాంతరం) మన అమాయకుణ్ని ఎవడు పట్టిపీడిస్తున్నాడు - అనడం. (ఆత్తగంధోఽభిభూతః స్యాత్ - అమరం).

**అదిట్ట:** అదృష్టరూపేణ = రూపం కానరాని, కేనాపి - సత్త్వేన = ఏదో ఒక భూతం చేత, అతిక్రమ్య = కొనిపోబడినవాడై, మేఘప్రతిచ్ఛందస్య - ప్రాసాదస్య = మేఘప్రతిచ్ఛంద భవనానికి, అగ్రభూమిమ్ = శిఖరం మీద, ఆరోపితః = ఉంచబడ్డాడు.

**మా-తావత్:** (ఉత్థాయ = చటుక్కున లేచి) మా - తావత్ = అలా జరగడానికి వీలులేదు. మమ + గృహాః + అపి = ఇంతటి ధార్మికుడనైన మా రాజసౌధాలు కూడా, సత్త్వైః = భూతాలతో, అభిభూయంతే = పీడింపబడుతున్నాయా? అథవా = అవునేమో-

**అహన్యహన్యాత్మన ఏవ తావత్**
**జ్ఞాతుం ప్రమాదస్ఖలితం న శక్యమ్**
**ప్రజాసు కః కేన పథా ప్రయాతీ**
**త్యశేషతో వేదితుమస్తి శక్తిః? 26**

**(నేపథ్యే)**

**భో వఅస్స, అవిహా అవిహా. (భో వయస్య! అవిహా అవిహా!!)**

**రాజా : (గతిభేదేన పరిక్రామన్) సఖే! న భేతవ్యం, న భేతవ్యమ్.**

**(నేపథ్యే)**

---

**అహని:** అహని + అహని = దినదినమూ, ఆత్మనః = నాదియైన, ప్రమాద + స్ఖలితమ్ + ఏవ = పొరపాటునూ జారుపాటునూ, జ్ఞాతుమ్ = గుర్తించడానికే, న– శక్యమ్ = వీలు కాకుండా ఉంది. ప్రజాసు = ప్రజాబాహుళ్యంలో, కః = ఎవడు, కేన + పథా = ఏ మార్గాన, ప్రయాతి + ఇతి = వెడుతున్నాడో అనేది, అశేషతః = సమగ్రంగా, వేదితుమ్ = తెలుసుకోడానికి, శక్తిః + అస్తి = (శక్యమవుతుందా?) శక్తి చాలుతుందా?

**తాత్పర్యం:** దినదినమూ నేను చేసే పొరపాట్లు ఏమిటో తెలుసుకోడానికే వీలుకావడం లేదు, అలాంటిది ఇంతటి ప్రజాబాహుళ్యం ఎవడు ఏ తప్పు చేస్తున్నాడో తెలుసుకోవడం (రాజుగా) నాకు సాధ్యమా? (భూతప్రేతాల పీడ – రాజదోషంవల్ల గానీ ప్రజల పాపం వల్ల గానీ ఏర్పడుతుందంటారు. కాబట్టి దుష్యంతుడి ఈ పరామర్శ).

(నేపథ్యే = తెరలో)

భో + వయస్య = ఓయీ చెలికాడా! అవిహా + అవిహా! = కుయ్యో! మొర్రో!! (అవిహావిహా నిర్వేదే – ఇత్యుక్తేః. అవిధ అని పాఠాంతరం)

**సఖే:** (గతిభేదేన = క్రోధోద్ధత గమనంతో, పరిక్రామన్ = ముందుకు వెడుతూ) సఖే = చెలికాడా! న + భేతవ్యమ్ – న + భేతవ్యమ్ = భయపడకు! భయపడకు!!

(నేపథ్యే = తెరలో)

(పునః = మళ్ళీ, తత్ + ఏవ = అవిధ అవిధ అన్నదే, పఠిత్వా = పలికి) కథమ్ + న + భేష్యామి = భయపడకుండా ఎలా ఉండను?! ఏషః + కః + అపి = వీడెవడోగానీ, మామ్

(పునస్తదేవ పఠిత్వా) కహం ణ భాఇస్సం. ఏస మం కోవి పచ్చవణ దసిరోహరం భిచ్చుంవిఅ తిణ్ణ భంగం కరేది. (కథం న భేష్యామి? ఏష మాం కోఽపి ప్రత్యవనతశిరోధర మిక్షుమివ త్రిభంగం కరోతి).

రాజా : (సదృష్టిక్షేపమ్) ధనుస్తావత్!

(ప్రవిశ్య శార్ఙ్గహస్తా)

యవనీ : భట్టా, ఏదం హత్థావావసహిదం సరాసణం. (భర్తః! ఏతత్ హస్తావాప సహితం శరాసనమ్)

(నేపథ్యే)

ఏష త్వామభినవకంఠశోణితార్థీ
శార్దూలః పశుమివ హన్మి చేష్టమానమ్
ఆర్తానాం భయమపనేతుమాత్తధన్వా
దుష్యంతస్తవ శరణం భవత్విదానీమ్. **27**

---

= నన్ను, ప్రత్యవనత + శిరోధరమ్ = మెడలు వంచి, ఇక్షుమ్ + ఇవ = చెరకుగడనులాగా, త్రిభంగమ్ + కరోతి = మూడు ముక్కలు (మడతలు) చేస్తున్నాడు.

**ధనుః:** (సదృష్టిక్షేపమ్ = చూపులలో కోపం చూపుతూ) ధనుః + తావత్ = విల్లు! విల్లు!!

(శార్ఙ్గహస్తా = ధనుస్సు చేతబట్టి, ప్రవిశ్య = యవనకాంత ప్రవేశించి)

**భట్టా ఏదం:** భర్తః = మహారాజా! ఏతత్ = ఇదిగో, హస్తావాప – సహితమ్ = చేతి తొడుగుతో సహా, శరాసనమ్ = ధనుస్సు!

(నేపథ్యే = తెరలో)

**ఏష త్వామ్:** అభినవ – కంఠశోణిత + అర్థీ = కొంగ్రొత్త మెడనెత్తురు త్రాగగోరినదైన, శార్దూలః = పులి, చేష్టమానమ్ = గిలగిలలాడుతున్న, పశుమ్ + ఇవ = పసరాన్నిలాగా, ఏషః + అహమ్ = ఈ నేను, త్వామ్ = నిన్ను, హన్మి = చంపుతున్నాను. ఆర్తానామ్ = దీనులకు, భయమ్ + అపనేతుమ్ = భయం తొలగించడానికి, ఆత్తధన్వా = ధనుస్సు ధరించినవాడైన, దుష్యంతః = దుష్యంతుడు, ఇదానీమ్ = ఇప్పుడు, తవ = నీకు, శరణమ్ = దిక్కు (రక్షణ), భవతు = అగుగాక!

**రాజా : (సరోషమ్) కథం మామేవోద్దిశతి! తిష్ఠ! కుణపాశన! త్వమిదానీం న భవిష్యసి. (శార్ జ్గమారోప్య) వేత్రవతి! సోపాన మార్గమాదేశయ.**

**ప్రతీహారీ : ఇదో ఇదో దేవో! (ఇత ఇతో దేవః)**

**(సర్వే సత్వరముపసర్పంతి)**

**రాజా : (సమంతాద్విలోక్య) శూన్యం ఖల్విదమ్!!**

**(నేపథ్యే)**

**అవిహా అవిహా! అహం అత్తభవంతం పేక్ఖామి. తుమం మం ణ పేక్షసి. బిడాలగ్గహీదో మూసఓ విఅ ణిరాసోమ్హి జీవిదే సంవిత్తో. (అవిహా! అవిహా! అహమత్రభవంతం పశ్యామి. త్వం మాం న పశ్యసి. బిడాల గృహీతో మూషిక ఇవ నిరాశోఽస్మి జీవితే సంవృత్తః)**

---

**తాత్పర్యం:** మెడలు విరిచి వేడినెత్తురు తాగడానికి పులి ఒక పశువును చంపినట్టు ఈ నేను నిన్ను చంపుతాను. ఆర్తజనులకు రక్షకుణ్ని అంటూ ధనుస్సు పట్టిన దుష్యంతుడే నీ కిప్పుడు దిక్కు!!

**కథం మామేవ:** (సరోషమ్ = కోపంగా) కథమ్ = ఎట్టూ! మామ్ + ఏవ + ఉద్దిశతి = నన్నే ఉద్దేశిస్తున్నాడు!! కుణప + అశన = శవ మాంసభోజి రాక్షసుడా (కోణప + అపశద – అని పాఠాంతరం రాక్షసాధమా!) తిష్ఠ = నిలు – నిలు! త్వమ్ = నువ్వు, ఇదానీమ్ = ఇప్పుడు, న + భవిష్యసి = ఇక ఉండవు. ఖర్చయిపోతావని. (శార్ఙ్గమ్ + ఆరోప్య = ధనుస్సు ఎక్కుపెట్టి) వేత్రవతి = ఓసీ వేత్రవతీ! (ప్రతీహారీ!) సోపానమార్గమ్ = మెట్లదారిని, ఆదేశయ = చూపించు.

**ఇదో ఇదో:** దేవః = మహారాజు, ఇతః + ఇతః = ఇటు – ఇటు!! (సర్వే = అందరూ, సత్వరమ్ + ఉపసర్పంతి = త్వరగా నడుస్తారు).

**శూన్యమ్:** (సమంతాత్ + విలోక్య = అంతటా చూసి) ఇదమ్ = ఈ ప్రదేశం, శూన్యమ్ + ఖలు = శూన్యం కదా! ఎవరూ కనిపించడం లేదే – అని.

(నేపథ్యే = తెరలో)

అవిహా అవిహా = కుయ్యో! మొర్రో!! అహమ్ = నేను, అత్రభవంతమ్ = మాన్యుడవైన నిన్ను, పశ్యామి = చూస్తున్నాను. త్వమ్ = నువ్వు, మామ్ = నన్ను, న + పశ్యసి =

**రాజా : భోస్తిరస్కరిణీగర్విత! మదీయం శస్త్రం త్వాం ద్రక్ష్యతి. ఏష తమిషుం సందధే.**

**యో హనిష్యతి వధ్యం త్వాం రక్ష్యం రక్షతి చ ద్విజమ్**
**హంసో హి క్షీరమాదత్తే తన్మిశ్రా వర్జయత్యపః 28**

**(ఇత్యస్త్రం సంధత్తే)**

**(తతః ప్రవిశతి విదూషక ముత్సృజ్య మాతలిః)**

**మాతలిః : కృతాః శరవ్యం హరిణా తవాసురాః**
**శరాసనం తేషు వికృష్యతామిదమ్**

---

చూడటం లేదు. బిడాల + గృహీతః = గండు పిల్లికి చిక్కిన, మూషికః + ఇవ = ఎలుక లాగా, జీవితే = ప్రాణం మీద, నిరాశః + సంవృత్తః + అస్మి = ఆశలేనివాడనయ్యాను!

**భోస్తిరస్కరిణీ:** భోః = ఓరీ! తిరస్కరిణీగర్విత = తిరస్కరిణీవిద్యతో అహంకరించినవాడా! మదీయమ్ = నా, శస్త్రమ్ = ఈ బాణం, త్వామ్ = నిన్ను, ద్రక్ష్యతి = చూస్తుందిలే. ఏషః = ఇదిగో, తమ్ + ఇషుమ్ = ఆ బాణాన్ని, సందధే = సంధిస్తున్నాను.

**యో హనిష్యతి:** యః = ఏ బాణం, వధ్యమ్ = చంపదగినవాడవైన, త్వామ్ = నిన్ను, హనిష్యతి = చంపుతుందో, రక్ష్యమ్ = రక్షింపదగినవాడైన, ద్విజమ్ = బ్రాహ్మణ మాధవ్యుణ్ని, రక్షతి + చ = కాపాడుతుందో, ఆ బాణాన్ని సంధిస్తున్నాను. హంసః = రాయంచ, క్షీరమ్ + ఆదత్తే = పాలు స్వీకరిస్తుంది. తత్ + మిశ్రాః = వాటితో కలగలిసిన, అపః = నీళ్లను, వర్జయతి + హి = విడిచి పెట్టేస్తుంది గదా!

**తాత్పర్యం:** హంస – పాలను స్వీకరించి నీళ్లను పరిత్యజించినట్టుగా నా ఈ బాణం చంపదగ్గ నిన్ను చంపుతుంది. కాపాడదగ్గ మాధవ్యుణ్ని కాపాడుతుంది!

(ఇతి = అని, అస్త్రమ్ = మంత్రించిన బాణాన్ని, సంధత్తే = సంధిస్తాడు)

(తతః = అంతట, విదూషకమ్ + ఉత్సృజ్య = మాధవ్యుణ్ని విడిచిపెట్టి, మాతలిః = ఇంద్రరథసారథి మాతలి, ప్రవిశతి = ప్రవేశిస్తాడు)

**కృతాః:** హరిణా = ఇంద్రుడిచేత, అసురాః = రాక్షసులు, తవ = నీకు, శరవ్యమ్ = లక్ష్యం (గురి), కృతాః = చేయబడ్డారు. (లక్షం లక్ష్యం శరవ్యం చ – అమరం). ఇదమ్ = ఈ, శరాసనమ్ = విల్లు, తేషు = ఆ రాక్షసుల మీద, వికృష్యతామ్ = ఎక్కుపెట్టబడుగాక! నీ

ప్రసాదసౌమ్యాని సతాం సుహృజ్జనే
పతంతి చక్షూంషి న దారుణాః శరాః. **29**

**రాజా : (అస్త్రముపసంహరన్) అయే! మాతలిః. స్వాగతం మహేంద్రసారథే!**

**(ప్రవిశ్య)**

**విదూషక : అహం జేణ ఇట్టి పసుమారం మారిదో సో ఇమిణా సాఅదేణ అహిణందీఅది. (అహం యేనేష్టిపశుమారం మారితః సోఽనేన స్వాగతేన అభినంద్యతే!!)**

**మాతలిః : (సస్మితమ్) ఆయుష్మన్! శ్రూయతాం యదస్మి హరిణా భవత్సకాశం ప్రేషితః.**

---

ధనుస్సును నామీద కాదు వారిమీద సంధించు. సుహృజ్జనే = మిత్రులమీద, సతామ్ = సజ్జనుల, ప్రసాదసౌమ్యాని = అనుగ్రహంతో ప్రసన్నాలైన, చక్షూంషి = చూపులు, పతంతి = ప్రసరిస్తాయి. దారుణాః = తీవ్రమైన, శరాః = బాణాలు, న = కాదు.

**తాత్పర్యం:** ఇంద్రుడు నీ ధనుస్సుకు రాక్షసుల్ని లక్ష్యంగా నిర్దేశించాడు. కాబట్టి నువ్వు దాన్ని వారిమీద ఎక్కుపెట్టు. మిత్రుల మీద సజ్జనులు అనుగ్రహవీక్షణాలు ప్రసరింపజేస్తారు గానీ గాయపరిచే బాణాలు కాదు!

**అయే:** (అస్త్రమ్ + ఉపసంహరన్ = బాణాన్ని ఉపసంహరిస్తూ) అయే = ఓహో! మాతలిః = మాతలి!! మహేంద్రసారథే = దేవేంద్రుడి రథచోదకుడా! స్వాగతమ్ = స్వాగతం!!

(ప్రవిశ్య = విదూషకుడు ప్రవేశించి)

**అహం జేణ:** అహమ్ = నేను, యేన = ఎవడిచేత, ఇష్టి – పశుమారమ్ = యజ్ఞ బలిపశువులా, మారితః = హింసింపబడ్డానో, సః = అతడు, అనేన = ఈ రాజుచేత, స్వాగతేన = స్వాగతవాక్యాలతో, అభినంద్యతే = అభినందింపబడుతున్నాడు!? (ఇష్టిపశుమారం మారితః = ఇత్యత్ర "ఉపమానే కర్మణి చ" ఇతి ణముల్. కషాదిత్వాద్యథావిధ్యనుప్రయోగః).

**ఆయుష్మన్:** (సస్మితమ్ = చిరునవ్వుతో) ఆయుష్మన్ = ఆయుష్మంతుడా! హరిణా = ఇంద్రుడిచేత, అస్మి = నేను, భవత్ + సకాశమ్ = నీచెంతకు, యత్ = ఎందుకోసం, ప్రేషితః అస్మి = పంపబడ్డానో, తత్ = అది, శ్రూయతామ్ = ఆలకించు.

**రాజా : అవహితోఽస్మి**

**మాతలి : : అస్తి కాలనేమిప్రసూతిః దుర్జయో నామ దానవగణః.**

**రాజా : అస్తి. శ్రుతపూర్వం మయా నారదాత్.**

**మాతలిః : సఖ్యుస్తే స కిల శతక్రతో రజయ్యః**
**తస్య త్వం రణశిరసి స్మృతో నిహంతా**
**ఉచ్ఛేత్తుం ప్రభవతి యన్న సప్త సప్తిః**
**తన్నైశం తిమిరమపాకరోతి చంద్రః. 30**

---

**అవహితః:** అవహితః + అస్మి = నేను సావధానుడను. (అస్మీత్యహమర్థే నిపాతః)

**అస్తి:** కాలనేమి – ప్రసూతిః = కాలనేమి సంతతి, దుర్జయః + నామ = దుర్జయం అనే, దానవగణః = రాక్షససమూహం, అస్తి = ఒకటి ఉంది.

**శ్రుతపూర్వమ్:** అస్తి = అవును ఉంది. మయా = నాచేత, నారదాత్ = నారదుడి వల్ల, శ్రుతపూర్వమ్ = మునుపు విన్నదే! నారదుడు చెప్పగా మునుపు విన్నాను – అని.

**సఖ్యుస్తే:** సః = ఆ గుంపు, తే – సఖ్యుః = నీ మిత్రుడు, శతక్రతోః = ఇంద్రుడికి, అజయ్యః = జయింపశక్యం గానిది. రణశిరసి = యుద్ధరంగంలో, తస్య = ఆ గుంపునకు, నిహంతా = సంహారకుడిగా, త్వమ్ = నీవు, స్మృతః = తలపోయబడ్డావు. సప్తసప్తిః = ఏడుగుర్రాల సూర్యుడు, యత్ = దేనిని, ఉచ్ఛేత్తుమ్ = తొలగించడానికి, న + ప్రభవతి = సమర్థుడు కాడో, తత్ = ఆ, నైశమ్ + తిమిరమ్ = రాత్రి చీకటిని, చంద్రః = చంద్రుడు, అపాకరోతి = తొలగిస్తాడు గదా! (నిశాయాః ఇదమ్ = నైశమ్).

**తాత్పర్యం:** ఆ దుర్జయ రాక్షసగణాన్ని తొలగించడం నీ మిత్రుడు ఇంద్రుడి వల్ల కాలేదు. "దుర్జయం" అతడికి అజయ్యం అయ్యింది. వెంటనే నువ్వు జ్ఞాపకం వచ్చావు. రణరంగంలో ఆ గుంపును అంతమొందించగలవాడివని. సూర్యుడు పోగొట్టలేని రాత్రి చీకటిని చంద్రుడు పోగొడతాడు గదా!

**స భవాన్:** సః + భవాన్ = అంతటి నీవు, ఇదానీమ్ = ఇప్పుడు, ఆత్తశస్త్రః + ఏవ = ధనుస్సు ధరించే ఉన్నావు. తమ్ + ఇంద్ర రథమ్ = అదిగో ఇంద్రుడి రథాన్ని, ఆరుహ్య = అధిరోహించి, విజయాయ = విజయం కోసం, ప్రతిష్ఠతామ్ = బయలుదేరెదవు గాక!

**అనుగృహీతః:** మఘవతః = దేవేంద్రుడి, అనయా = ఈ, సంభావనయా = మన్ననతో, అనుగృహీతః + అహమ్ = నేను అనుగృహీతుణ్ని అయ్యాను. అథ = ఇంతకీ,

స భవానాత్తశస్త్ర ఏవ ఇదానీం తమైంద్రరథమారుహ్య విజయాయ ప్రతిష్ఠతామ్.

**రాజా :** అనుగృహీతోఽహమనయా మఘవతస్సంభావనయా. అథ మాధవ్యం ప్రతి భవతా కిమేవం ప్రయుక్తమ్?

**మాతలిః :** తదపి కథ్యతే. కించిన్నిమిత్తాదపి మనస్సంతాపాదాయుష్మాన్ మయా విక్లబో దృష్టః. పశ్చాత్కోపయితుమాయుష్మంతం తథా కృతవానస్మి. కుతః –

**జ్వలతి చలితేంధనోఽగ్ని ర్విప్రకృతః పన్నగః ఫణాం కురుతే**
**ప్రాయః స్వం మహిమానం క్షోభాత్ ప్రతిపద్యతే హి జనః 31**

---

మాధవ్యమ్ ప్రతి = మా మాధవ్యుడి పట్ల, భవతా = నీచేత, ఏవమ్ = ఇలా, ప్రయుక్తమ్ = ప్రవర్తింపబడింది, కిమ్ = ఏమి? మాధవ్యుణ్ని ఏడిపించావెందుకు? అనడం.

**తదపి:** తత్ + అపి – కథ్యతే = అదీ చెబుతాను – విను. కించిత్ + నిమిత్తాత్ + అపి = ఏ కారణంగానోగానీ (కిన్నిమిత్తాదపి – అని కొన్ని ప్రతులు), ఆయుష్మాన్ = ఆయుష్మంతుడు (నువ్వు), మనస్సంతాపాత్ = మనోవేదనవల్ల, విక్లబః = కలతచెందినవాడుగా, మయా + దృష్టః = నాకు కనిపించావు. నాకంటికి విక్లబుడిగా కనిపించావనడం. పశ్చాత్ = పదపడి, ఆయుష్మంతమ్ = ఆయుష్మంతుణ్ని (నిన్ను), కోపయితుమ్ = కోపగింపజెయ్యడానికి, తథా = అలా, కృతవాన్ + అస్మి = చేశాను. కుతః = ఎందుకంటే–

**జ్వలతి:** చలిత + ఇంధనః = కట్టెలను ఎగదోసినప్పుడే, అగ్నిః = నిప్పు, జ్వలతి = మండుతుంది. విప్రకృతః = అపకారం చేసినప్పుడే, పన్నగః = సర్పం, ఫణామ్ + కురుతే = పడగ విప్పుతుంది (ఫటాయాం తు ఫణా ద్వయోః – అమరం). ప్రాయః = తరచుగా (సాధారణంగా), జనః = వ్యక్తి, క్షోభాత్ = (చిత్తక్రౌర్యం వల్లనే) క్షోభవల్లనే, స్వమ్ + మహిమానమ్ = తన శక్తినీ మహిమనూ, ప్రతిపద్యతే + హి = పొందుతాడు సుమా!

**తాత్పర్యం:** కట్టెలు కదిపితేనే అగ్ని భగ్గుమంటుంది. తోకతొక్కితేనే పాము పడగవిప్పుతుంది. క్షోభ కలిగితేనే మనిషి తన మహిమను ప్రదర్శిస్తాడు.

**అనతిక్రమణీయా:** వయస్య = మిత్రుడా! మాధవ్యా!! దివస్పతేః + ఆజ్ఞా = దేవేంద్రుడి ఆజ్ఞ, అనతిక్రమణీయా = అతిక్రమింపరానిది. తత్ = కాబట్టి, అత్ర = ఈ విషయంలో,

**రాజా : (జనాంతికమ్) వయస్య! అనతిక్రమణీయా దివస్పతే రాజ్ఞా. తదత్ర పరిగతార్థం కృత్వా మద్వచనా దమాత్యపిశునం బ్రూహి –**

**త్వన్మతిః కేవలా తావత్పరిపాలయతు ప్రజాః**
**అధిజ్యమిదమన్యస్మిన్ కర్మణి వ్యాపృతం ధనుః. 32**

**విదూషక : జం భవం ఆణవేది. (ఇతి నిష్క్రాంతః) (యద్భవానాజ్ఞాపయతి)**

**మాతలిః : ఆయుష్మాన్ రథమారోహతు**

**(రాజా రథాధిరోహణం నాటయతి)**
**(ఇతి నిష్క్రాంతాస్సర్వే)**
**–: ఇతి షష్ఠోஉంకః :–**

---

అమాత్యపిశునమ్ = మంత్రి పిశునుడిని, పరిగతార్థమ్ + కృత్వా = ఈ విషయమంతా తెలిసినవాణ్ని చేసి – అంటే – ఇదంతా తెలియజేసి, మద్వచనాత్ + బ్రూహి = నా మాటగా చెప్పు.

**త్వన్మతిః:** కేవలా = కేవలమూ, త్వత్ + మతిః = నీ తెలివియే, ప్రజాః = ప్రజలను, పరిపాలయతు + తావత్ = పాలించుగాక! అధిజ్యమ్ = ఎక్కుపెట్టబడిన (నారి తగిలించిన), ఇదమ్ + ధనుః = ఈ నా ధనుస్సు, అన్యస్మిన్ + కర్మణి = మరొక పనిలో, వ్యాపృతమ్ = లగ్నమయ్యింది.

**తాత్పర్యం:** నా ధనుస్సు రాక్షసవధలో నిమగ్నమయ్యింది. నేను తిరిగివచ్చేదాకా నీ బుద్ధిబలమే ప్రజారక్షణ – ప్రజాపాలన చేయుగాక!

**జం భవం:** భవాన్ = నువ్వు, యత్ + ఆజ్ఞాపయతి = ఆనతిచ్చినట్టే!

(ఇతి = అని, నిష్క్రాంతః = నిష్క్రమిస్తాడు)

**ఆయుష్మాన్:** ఆయుష్మాన్ = ఆయుష్మంతుడు, రథమ్ + ఆరోహతు = రథమధిరోహించుగాక!

(రాజా = దుష్యంతుడు, రథ + అధిరోహణమ్ = రథాన్ని అధిరోహించడం, నాటయతి = అభినయంతో ప్రదర్శిస్తాడు)

(ఇతి = ఇలా, సర్వే – నిష్క్రాంతాః = అందరూ నిష్క్రమిస్తారు)

–: ఇది ఆరవ అంకం :–

# సప్తమోఽంకః

**(తతః ప్రవిశత్యాకాశయానేన రథాధిరూఢో రాజా మాతలిశ్చ)**

**రాజా : మాతలే! అనుష్ఠితనిదేశోఽపి మఘవతః సత్క్రియావిశేషాత్ అనుప యుక్తమివ ఆత్మానం సమర్థయే.**

**మాతలిః : (సస్మితమ్) ఆయుష్మన్! ఉభయమప్యపరితోషం సమర్థయే.**

**ప్రథమోపకృతం మరుత్వతః**
**ప్రతిపత్త్యా లఘు మన్యతే భవాన్**
**గణయత్యవదాన విస్మితో**
**భవతః సోఽపి న సత్క్రియాగుణాన్. 01**

---

(తతః = అంతట, రథ+అధిరూఢః = రథం అధిరోహించి, రాజా = రాజూ, మాతలిః + చ = మాతలీ, ఆకాశయానేన = ఆకాశమార్గంలో, ప్రవిశతి = ప్రవేశిస్తారు)

**అనుష్ఠిత:** మాతలే = ఓయీ! మాతలీ! అనుష్ఠిత నిదేశః + అపి = ఇంద్రుడి ఆజ్ఞను అనుష్ఠించినవాడనైనప్పటికీ, మఘవతః = ఇంద్రుడి, సత్క్రియా విశేషాత్ = విశిష్టమైన సమ్మానం వల్ల, ఆత్మానమ్ = నన్ను నేను, అనుపయుక్తమ్ + ఇవ = ఉపకారం చేసినవాడను కానట్లే, సమర్థయే = భావిస్తున్నాను. ఆ సన్మానంతో పోలిస్తే – నేను చేసింది ఒక ఉపకారమే కాదనీ అత్యల్పమనీను.

**ఉభయమ్ :** (సస్మితమ్ = చిరునవ్వుతో) ఆయుష్మన్ = ఆయుష్మంతుడా! ఉభయమ్ + అపి+ అపరితోషమ్ = ఇద్దరి అసంతృప్తినీ, సమర్థయే = నేను సమర్థిస్తున్నాను.

**ప్రథమ:** మరుత్వతః = ఇంద్రుడియొక్క – అతడు చేసిన, ప్రతిపత్త్యా = గౌరవంచేత, భవాన్ = నీవు, ప్రథమ + ఉపకృతమ్ = దానికంటే ముందు అతడికి చేసిన ఉపకారాన్ని, లఘు = స్వల్పమైనదిగా, మన్యతే = భావిస్తున్నావు. సః+అపి = అతడేమో, భవతః = నీ, అవదాన – విస్మితః = మంచిపనికి విస్మితుడై (అవదానం శుద్ధకర్మ), సత్క్రియా – గుణాన్ = తాను చేసిన సత్కారంలోని గొప్పదనాలను, న+గణయతి = అసలు పరిగణించడమే లేదు.

**తాత్పర్యం:** ఇంద్రుడు చేసిన సత్కారంతో మురిసిపోతున్న నువ్వు – అతడికి చేసిన ఉపకారాన్ని (రాక్షస సంహారాన్ని) స్వల్పమనుకొంటున్నావు. అతడేమో నీ

**రాజా : మాతలే! మా మైవమ్. స ఖలు మనోరథానామప్యభూమిః విసర్జనావసర సత్కారః. మమ హి దివౌకసాం సమక్షమర్ధాసనోపవేశితస్య**

**అంతర్గతప్రార్థన మంతికస్థం**
**జయంతముద్వీక్ష్య కృతస్మితేన**
**ఆమృష్టవక్షోహరిచందనాంకా**
**మందారమాలా హరిణా పినద్ధా. 02**

**మాతలిః : కిమివ నామాయుష్మానమరేశ్వరాన్నార్హతి. పశ్య–**

---

చేసిన సత్కర్మకు నివ్వెరపోతూ తాను చేసిన సత్కారాన్ని అదొక పెద్ద సత్కారంగా పరిగణించడమే లేదు.

**మా మైవమ్:** మాతలే = మాతలీ! మా+మా+ఏవమ్ = అలా కాదు, అలా కాదు. సః = ఆ, విసర్జనావసర–సత్కారః = వీడ్కోలు సమయంలోని సత్కారం, మనోరథానామ్+అపి = ఊహలకైనా, అభూమిఃఖలు = అందనిది కదా! దివౌకసామ్+సమక్షమ్ = సకల దేవతల సమక్షంలో, అర్ధాసన+ఉపవేశితస్య = అర్ధాసనంలో కూర్చోబెట్టుకోబడినవాడనైన, మమ+హి = నాకు–

**అంతర్గత:** అంతర్గత – ప్రార్థనమ్ = మనస్సులో (మందారమాలపై) కోరిక కలవాడూ, అంతికస్థమ్ = చేరువలోనే ఉన్నవాడూ అయిన, జయంతమ్ = (తన పుత్రుడు) జయంతుణ్ని, కృతస్మితేన = చిఱునవ్వుతో, ఉద్వీక్ష్య = తలఎత్తి చూసి; ఆమృష్ట = పులుమబడిన, వక్షః = గుండెలమీది, హరిచందన + అంకా = మంచి గందపు చిన్నెలు కలదైన, మందారమాలా = కల్పవృక్షాల ఎఱ్ఱటి పుష్పమాల, హరిణా = స్వయంగా దేవేంద్రుడి చేత, పినద్ధా = వేయబడింది!

**తాత్పర్యం:** ఇంద్రుడు తన మెడలోని మందారమాలను తీసి స్వయంగా నాకు వేశాడు. దానికి అతడి గుండెలమీది మంచి గందపు పూత హత్తుకొని ఉంది. దానివైపు కోరికతో జయంతుడు చూస్తున్నాడు. అతడివైపు ఒక చిరునవ్వు విసిరి ఇంద్రుడు ఆ మందారమాలను నా మెడలో వేశాడు.

**సుఖపరస్య:** అమరేశ్వరాత్ = ఇంద్రుడినుండి, ఆయుష్మాన్ = ఆయుష్మంతుడు (నువ్వు) కిమివ–నామ–న+ అర్హతి = ఏ సత్కృతికి అనర్హుడు? దేనికైనా అర్హుడవే–

సుఖపరస్య హరేరుభయైః కృతం
త్రిదివముద్ధృతదానవకంటకమ్
తవ శరై రధునా నతపర్వభిః
పురుషకేసరిణశ్చ పురా నఖైః. **03**

రాజా : అత్ర ఖలు శతక్రతోరేవ మహిమా స్తుత్యః.

సిద్ధ్యంతి కర్మసు మహత్స్వపి యన్నియోజ్యాః
సంభావనా గుణమవేహి తమీశ్వరాణామ్
కిం వాభవిష్యదరుణస్తమసాం విభేత్తా
తం చేత్సహస్ర కిరణో ధురి నాకరిష్యత్. **04**

---

అని. పశ్య= చూడు – సుఖపరస్య = సుఖలోలుడైన, హరేః = ఇంద్రుడికి, త్రిదివమ్ = స్వర్గలోకం, ఉభయైః = రెండింటిచేత, ఉద్ధృత = నిర్మూలింపబడిన, దానవ–కంటకమ్ = రాక్షసులు అనే ముండ్లు కలదిగా – రాక్షసకంటకాలు తొలగింపబడినదిగా, కృతమ్ = చేయబడింది. అధునా = ఇప్పుడు, నత–పర్వభిః = అణచిన అతుకులు కలవైన, తవ = నీ, శరైః = బాణాలచేత; పురా = మునుపు, పురుషకేసరిణః = నృసింహుడి, (నత–పర్వభిః = కణుపుల దాకా దిగిన), నఖైః = గోళ్లచేత.

**తాత్పర్యం:** సుఖలాలసుడైన దేవేంద్రుడి రాజ్యాన్ని రాక్షస సంహారంతో నిష్కంటకం చేసిన వ్యక్తులూ శక్తులూ – రెండే రెండు. ఇదిగో ఇప్పుడు – అతుకులు తీర్చబడిన నీ విశిఖాలు. మునుపేమో హిరణ్యకశిపుడి గుండెల్లోకి కణుపుల దాకా దిగిన నృసింహుడి క్రొవ్వాడి నఖాలు.

**సిద్ధ్యంతి:** అత్ర = ఈ విషయంలో (నేను దుర్జయ రాక్షసగణాన్ని జయించడం విషయంలో), శతక్రతోః = ఇంద్రుడి, మహిమా+ఏవ = ప్రభావమే, స్తుత్యః+ఖలు = ప్రశంసింపదగ్గదికదా! అతడి మహిమయే తప్ప నా గొప్ప కాదు – అనడం. మహత్సు = గొప్పగొప్ప, కర్మసు = పనులయందు, నియోజ్యాః = (నియోగింపబడ్డ) సేవకులు, సిద్ధ్యంతి+యత్ = కార్యసిద్ధిని పొందడం అనేది, తమ్ = దానిని, ఈశ్వరాణామ్ = వారి అధిపతుల, సంభావనా+గుణమ్ = గౌరవ మహిమగా (గొప్పదనంగా), అవేహి = గుర్తించు. (సంభావనా వాసనాయాం గౌరవే ధ్యానకర్మణి – ఇత్యజయః). అరుణః = అనూరుడు, తమసామ్ + విభేత్తా = చీకట్లను చీల్చివేసేవాడు, కిమ్+వా+ అభవిష్యత్ =

**మాతలిః : సదృశమేవైతత్. (స్తోకమంతరమతీత్య) ఆయుష్మన్! ఇతః పశ్య నాకపృష్ఠ ప్రతిష్ఠితస్య సౌభాగ్యమాత్మయశసః.**

**విచ్ఛిత్తిశేషైః సురసుందరీణాం**
**వర్ణైరమీ కల్పలతాంశుకేషు**
**విచింత్య గీతక్షమమర్థజాతం**
**దివౌకసస్త్వచ్చరితం లిఖంతి. 05**

---

అయ్యేవాడేనా, తమ్= అతడిని, సహస్ర కిరణః + చేత్ = సూర్యుడు గనుక, ధురి= తన అగ్రభాగంలో, న+అకరిష్యత్ = ఉంచుకోకపోతే?! (లిఙ్నిమిత్తే లృఙ్ క్రియాతిపత్తౌ)

**తాత్పర్యం:** సేవకులు ఘనకార్యాలు సాధించగలుగుతున్నారంటే, అది ఆ పనులను వారికి అప్పగించిన యజమానుల మహిమయే తప్ప సేవకుల గొప్పకాదు. అరుణుడు (అనూరుడు) చీకట్లను పారద్రోలగలుగుతున్నాడంటే అది సూర్యుడి మహిమ. సూర్యుడే గనుక అరుణుణ్ని తన ముందు నిలుపుకొని ఉండకపోతే అతడు చీకట్లను పారద్రోలగలిగి ఉండేవాడా?

**సదృశమ్:** ఏతత్ = ఇది, సదృశమ్+ఏవ = సమంజసమే. (స్తోకమ్+అంతరమ్ = కొంచెంసేపు, అతీత్య = గడిచాక) ఆయుష్మన్ = ఆయుష్మంతుడా! ఇతః+పశ్య = ఇటువైపు చూడు. నాకపృష్ఠ = స్వర్గలోకంలో, ప్రతిష్ఠితస్య = స్థిరీకరింపబడిన, ఆత్మయశసః = నీ కీర్తి తాలూకు, సౌభాగ్యమ్ = అదృష్టం!! (నాకపృష్ఠే = స్వర్గతలే – రాఘవభట్టు.)

**విచ్ఛిత్తి:** సురసుందరీణామ్ = అప్సరసల యొక్క, విచ్ఛిత్తిశేషైః = అలంకరించుకోగా మిగిలిన, వర్ణైః = రంగులతో, అమీ+దివౌకసః = ఈ అమరులు, త్వత్+చరితమ్ = నీ గాథను, విచింత్య = బాగా ఆలోచించి, గీతక్షమమ్ = పాటలకు యోగ్యమైన, అర్థజాతమ్ = భావసమూహాన్ని, కల్పలతా + అంశుకేషు = కల్పతరువులందించిన సన్నని తెలివలిపాలపై, లిఖంతి = విలిఖిస్తున్నారు. (సంచిత్య = కూర్చి, గీతిక్షమమర్థ బంధమ్ = గానయోగ్యమైన పదాన్ని – అని పాఠాంతరం)

**తాత్పర్యం:** దేవసుందరీమణులు అలంకరణకు ఉపయోగించే రంగులతో, ఈ అమరులు నీ చరిత్రలోని రమణీయ ఘట్టాలను పాటలుగా కట్టి, కల్పలతలందించిన

**రాజా : మాతలే! అసురసంప్రహారోత్సుకేన పూర్వేద్యుర్దివమధిరోహతా న లక్షితః స్వర్గమార్గః. కతరస్మిన్ మరుతాం పథి వర్తామహే.?**

**మాతలిః : త్రిస్రోతసం వహతి యో గగనప్రతిష్ఠామ్**
**జ్యోతీంషి వర్తయతి చ ప్రవిభక్తరశ్మిః**
**తస్య ద్వితీయ హరివిక్రమ నిస్తమస్కం**
**వాయోరిమం పరివహస్య వదంతి మార్గమ్. 06**

---

తెలిపట్టు వస్త్రాల మీద, అందంగా లిఖిస్తున్నారు. నీ యశోగీతికలను ఇలా ఇక్కడ ప్రతిష్ఠిస్తున్నారు. చూడు!!

**అసుర:** మాతలీ! అసుర – సంప్రహార+ ఉత్సుకేన = దుర్జయాసురగణాన్ని సంహరించాలి అనే ఉత్సాహంతో, పూర్వేద్యుః = మొన్నటినాడు, దివమ్+అధిరోహతా = దేవలోకం అధిరోహిస్తూన్న నాచేత, స్వర్గ మార్గః = స్వర్గలోకపు దారి, న+లక్షితః = సరిగా విలోకింపబడలేదు. వచ్చేటప్పుడు హడావిడి మూలాన దారిలో అందచందాలను సరిగా చూడలేదు– అని. కతరస్మిన్+మరుతామ్+పథి = ఎన్నవ వాయుమార్గంలో, వర్తామహే = ఉన్నాము? (ఉత్తరోత్తరం ఎత్తుగా ఉండే – ఆవహ, ప్రవహ, ఉద్వహ, సంవహ, సువహ, పరివహ, పరావహాలనే ఏడు వాయుమార్గాల్లో ఇప్పుడు మనం ఎక్కడ ఏ మార్గంలో ప్రయాణిస్తున్నామని ప్రశ్న.)

**త్రిస్రోతసమ్:** యః = ఏ వాయుమార్గం, గగనప్రతిష్ఠామ్ = ఆకాశంలో స్థిరంగా నిలిచేట్టు, త్రిస్రోతసమ్ = త్రిపథగ అయిన గంగను, వహతి = వహిస్తున్నదో; ప్రవిభక్త–రశ్మిః = దేనికదిగా విభక్తాలైన వాయురూప రజ్జువులతో, జ్యోతీంషి = సూర్యచంద్రతారాదులను, వర్తయతి = నడిపిస్తోందో; ద్వితీయ = రెండవదైన, హరి–విక్రమ = వామనుడి పాదనిక్షేపం వల్ల, నిస్తమస్కమ్ = చీకటిగానీ పాపంగానీ దుఃఖంగానీ లేనిదయ్యిందో (తమోఽంధకారే స్వర్భానౌ పాపే శోకే గుణాంతరే – ఇతిహైమః), తస్య = ఆ, పరివహస్య–వాయోః = పరివహమనే (ఆరవ) వాయువు యొక్క, మార్గమ్ = మార్గము అని, ఇమమ్ = దీనిని, వదంతి = పెద్దలు చెబుతున్నారు.

**తాత్పర్యం:** ఆయుష్మన్! దీనిని పరివహవాయుమార్గం అంటారు. ఆకాశ గంగ ఇక్కడే స్థిరంగా ప్రవహిస్తోంది. దాన్ని అలా నిలిపేది ఈ వాయువే! సూర్యచంద్రతారాదులన్నీ ఒక్కొక్కటీ ఒక్కొక్క పరివహ వాయురజ్జువు ఆధారంగా ఇక్కడ – గమనం

**రాజా : మాతలే! అతఃఖలు సబాహ్యకరణో మమాంతరాత్మా ప్రసీదతి.**
**(రథాంగమవలోక్య) మేఘపదవీమవతీర్ణౌ స్వః.**

**మాతలిః : కథమవగమ్యతే?**

**రాజా : అయమరవివరేభ్యశ్చాతకైర్నిష్పతద్భిః**
**హరిభిరచిరభాసాం తేజసా చానులిప్తైః**
**గతముపరి ఘనానాం వారిగర్భోదరాణాం**
**పిశునయతి రథస్తే శీకరక్లిన్ననేమిః. 07**

---

సాగిస్తుంటాయి. వామనుడుగా హరి ఉద్భవించి త్రివిక్రముడైనప్పుడు, అతడు తన రెండవ పాదాన్ని (రెండవ అడుగు) నిలిపింది ఇక్కడే. అందువల్ల ఇది నిస్తమస్కం = పరమపవిత్రం. దుఃఖరహితం. అంధకార విదూరం!!

**అతఃఖలు:** మాతలీ! అతః+ఖలు = అందుకే కాబోలు, సబాహ్యకరణః = బాహ్యేంద్రియాలతో సహా, మమ+అంతరాత్మా = నా అంతఃకరణ, ప్రసీదతి = ఎంతగానో ప్రసన్నత పొందింది (రథాంగమ్ = రథచక్రాన్ని, అవలోక్య = చూసి) మేఘపదవీమ్ = మేఘాల వీథికి, అవతీర్ణౌ–స్వః = ఇరువురమూ దిగాము!

**కథమ్:** కథమ్+అవగమ్యతే = ఎలా తెలుసుకొన్నావు?

**అయమ్:** శీకర = నీటిబిందువులతో, క్లిన్న–నేమిః = తడిసిన చక్రాల అంచులు కలదైన, తే–అయమ్–రథః = నీ ఈ రథం; అర–వివరేభ్యః = పూటీల సందులనుంచి, (అరం శీఘ్రే చ చక్రాంగే – విశ్వః), నిష్పతద్భిః = అటూ ఇటూ ఎగురుతున్న, చాతకైః = చాతకపక్షులతోనూ; అచిరభాసామ్ = క్షణప్రభలైన మెరుపుల యొక్క, తేజసా = కాంతితో, అనులిప్తైః = పులుమబడిన, హరిభిః = గుర్రాలతోనూ; వారిగర్భ+ఉదరాణామ్ = జలంతో నిండిన నడిమిభాగాలు కలవైన, ఘనానామ్ = మేఘాల, ఉపరి = మీదుగా, గతమ్ = తన గమనాన్ని, పిశునయతి = సూచిస్తోంది. (పిశునౌ ఖల సూచకౌ – అమరం).

**తాత్పర్యం:** మాతలీ! రథచక్రాల అంచులు తేమగొన్నాయి. పూటీల సందుల నుంచి చాతకపక్షులు (తీతువులు) ఎగురుతున్నాయి. మెరుపుల కాంతులు నీ రథాశ్వాల వీపులమీద ప్రతిఫలిస్తున్నాయి. నీటితో పూటెక్కిన నడిమిభాగాలు గల మేఘాల మీదుగా నీ రథం వెడుతోంది – అనడానికి ఇవన్నీ సూచనలే గదా!

**మాతలిః : క్షణాదాయుష్మాన్ స్వాధికారభూమౌ వర్తిష్యతే.**

**రాజా : (అధోఽవలోక్య) వేగావతరణాదాశ్చర్యదర్శనః సంలక్ష్యతే మనుష్యలోకః. తథాహి –**

**శైలానామవరోహతీవ శిఖరాదున్మజ్జతాం మేదినీ**
**పర్ణస్వాంతరలీనతాం విజహాతి స్కంధోదయాత్పాదపాః**
**సంతానైస్తనుభావనష్టసలిలా వ్యక్తిం భజంత్యాపగాః**
**కేనాప్యుత్క్షిపతేవ పశ్య భువనం మత్పార్శ్వమానీయతే. 08**

---

**క్షణాత్:** ఆయుష్మాన్ = ఆయుష్మంతుడు, క్షణాత్ = క్షణకాలంలో, స్వ+అధికారభూమౌ = తన అధికారం సాగే నేలలో, వర్తిష్యతే = ఉండబోతున్నాడు. కాసేపట్లో నీ రాజ్యం చేరతామని.

**వేగావతరణ:** (అధః+అవలోక్య = క్రిందికి చూసి) వేగ+అవతరణాత్ = చాలా వేగంగా క్రిందికి దిగుతుండడం వల్ల, మనుష్యలోకః = మానవలోకం (భూగోళం), ఆశ్చర్యదర్శనః = ఆశ్చర్యపరిచే దర్శనం కలదిగా, సంలక్ష్యతే = కనబడుతోంది. ఎత్తునుంచి కిందికి దిగుతుంటే భూగోళం ఆశ్చర్యకరంగా కనిపిస్తోందని. తథాహి = అవును గదా –

**శైలానామ్:** ఉత్+మజ్జతామ్ = పైకి లేస్తున్న, శైలానామ్ = పర్వతాల, శిఖరాత్ = శిఖరాల నుంచి (జాత్యేకవచనం), మేదినీ = భూగోళం, అవరోహతి+ఇవ = దిగుతున్నట్టుంది. పాదపాః = చెట్లు, స్కంధ+ ఉదయాత్ = మ్రానుల దర్శనంతో, పర్ణ–స్వ + ఆంతర – లీనతామ్ = ఆకు గుబురులలో కప్పువడ్డవైనాన్ని, విజహాతి = విడిచిపెడుతున్నాయి. (పర్ణాభ్యంతర లీనతామ్ – పాఠాంతరం. స్పష్టం. అస్త్రీ ప్రకాండః స్కంధః స్యాత్) తనుభావ = సన్నదనం వల్ల (రేఖల్లా కనబడడం వల్ల), నష్టసలిలాః = కనపడని నీళ్లు కలవైన (నీళ్లే కనపడని), ఆపగాః = నదీప్రవాహాలు, సంతానైః = విస్తృతులతో – జలసమృద్ధులతో (సంతానో విస్తృతౌ దేవవృక్షే చాపత్యగోత్రయోః – ఇతి ధరణిః), వ్యక్తిమ్ + భజంతి = ప్రకటస్థితిని పొందుతున్నాయి – స్పష్టంగా కనపడుతున్నాయి. (వ్రజంతి – పాఠాంతరం). పశ్య = చూడు, చూడు. కేన+అపి+ఉత్+క్షిపతా = ఎవడో పైకెత్తుతున్నవాడిచేత, భువనమ్ = భూలోకం, మత్+పార్శ్వమ్ = నా చెంతకు, ఆనీయతే+ఇవ = కొనిరాబడుతోందన్నట్టుంది! (పార్శ్వం కక్షాధరే చక్రోపాంతే పర్శుగణేఽపి చ–ఇతి విశ్వః)

**మాతలిః : సాధు దృష్టమ్. (సబహుమానమవలోక్య) అహో, ఉదారరమణీయా పృథివీ!!**

**రాజా : మాతలే! కతమోఽయం పూర్వాపరసముద్రావగాఢః కనకరసనిష్యందీ సాంధ్య ఇవ మేఘపరిఘః సానుమానాలోక్యతే?**

**మాతలిః : ఆయుష్మన్! ఏష ఖలు హేమకూటో నామ కింపురుషపర్వతః. తపస్సంసిద్ధిక్షేత్రమ్. పశ్య–**

**స్వాయంభువాన్మరీచేర్యః ప్రబభూవ ప్రజాపతిః**
**సురాసురగురుః సోఽత్ర సపత్నీకస్తపస్యతి. 09**

---

**తాత్పర్యం:** పర్వత శిఖరాలు పైకి లేస్తూంటే భూమి – కిందికి దిగుతున్నట్టుంది. మొదళ్లు కానరావడంతో చెట్లు – ఆకుల గుంపుల మాటునుంచి బయటపడుతున్నాయి. సన్నటి గీతలుగా కనిపించిన నదులు విశాలమై జలసమృద్ధితో స్పష్టపడుతున్నాయి. ఎవడో ఈ భువనాన్ని పైకెత్తి నాకు ఎదురు తెస్తున్నట్టుగా ఉంది!!

**సాధు:** సాధు–దృష్టమ్ = అద్భుతంగా దర్శించావు. (సబహుమానమ్ + అవలోక్య = ప్రశంసాపూర్వకంగా తిలకించి) అహో= ఓహోహో!! పృథివీ = ఈ భూమి, ఉదార – రమణీయా = అత్యంత సుందరం కదా! (ఉదారా = మహతీ చ, సా – సుందరా = రమణీయా చ – అని రాఘవభట్టు)

**కతమో:** మాతలీ! పూర్వ + అపర – సముద్ర +అవగాఢః = తూర్పు–పడమర సముద్రాలను తాకుతున్నదీ, కనక–రస–నిష్యందీ = బంగారుకాంతులు వెదజల్లుతున్నదీ, సాంధ్యః = సంధ్యాకాలపు, మేఘ–పరిఘః + ఇవ = మబ్బుల కడ్డీలాగా (కమాను), ఆలోక్యతే = కనపడుతోంది, అయమ్=ఈ, సానుమాన్ = పర్వతం, కతమః = ఏది? (మేఘః పరిఘ ఇవ అని ఉపమానోత్తరపదంగా సమన్వయించాడు రాఘవభట్టు. తక్కిన ప్రతులలో సాంధ్య ఇవ మేఘః అని మాత్రమే ఉంది). సంధ్యాకాలపు మేఘపంక్తి లాగా ఉంది ఈ పర్వతశ్రేణి ఏది – ఏమిటి అనడం.

**ఏష ఖలు:** ఆయుష్మంతుడా! ఏషః = ఇది, హేమకూటః + నామ= హేమకూటం అనే పేరుగల, కింపురుష పర్వతః + ఖలు = కింపురుషుల పర్వతం సుమా! తపః + సంసిద్ధిక్షేత్రమ్ = తపస్సులు సిద్ధించే పుణ్యస్థలం. పశ్య = చూడు!

**రాజా : తేన హ్యనతిక్రమణీయాని శ్రేయాంసి. ప్రదక్షిణీకృత్య భగవంతం గంతు మిచ్ఛామి.**

**మాతలిః : ప్రథమః కల్పః!!**

**(నాట్యేనావతీర్ణౌ)**

**రాజా : (సవిస్మయమ్)**

**ఉపోఢశబ్దా న రథాంగనేమయః**
**ప్రవర్తమానం న చ దృశ్యతే రజః**

---

**స్వాయంభువ:** స్వాయంభువాత్ = బ్రహ్మసంబంధియైన, మరీచేః = మరీచికి, యః +ప్రజాపతిః = ఏ ప్రజాపతి, ప్రబభూవ = జన్మించాడో, సః = ఆ, సుర +అసుర – గురుః = దేవదానవుల తండ్రి కశ్యపుడు, సపత్నీకః = భార్యాసమేతుడై, అత్ర = ఈ హేమకూట పర్వతం మీద, తపస్యతి = తపస్సు చేసుకుంటూంటాడు.

**తాత్పర్యం:** బ్రహ్మ మానస పుత్రుడైన మరీచికి జన్మించిన కశ్యప ప్రజాపతి తన ఇల్లాండ్రతో కలిసి ఇక్కడే తపస్సు చేసుకొంటున్నాడు. తెలుసుగా ఆయన దైత్యులకు ఆదిత్యులకూ తండ్రి!

**విశేషాలు:** హిమాలయాలకంటే పైన ఉంటుందట హేమకూటం. అలాగే భారత వర్షానికి పైన ఉంటుందట కింపురుషదేశం. హిమవాన్ హేమకూటశ్చ నిషధస్య దక్షిణే...; భారతం ప్రథమం వర్షం తతః కింపురుషం స్మృతమ్.... విష్ణుపురాణం ఉదాహరించారు వ్యాఖ్యాతలు.

**తేన హి:** తేన–హి = అలాగయితే, శ్రేయాంసి = శ్రేయోదాయకాలైన పనులు (విశేషణం – విశేష్యలక్షకం), అనతిక్రమణీయాని = ఉల్లంఘింపరానివి. భగవంతమ్ = కశ్యప ప్రజాపతిని, ప్రదక్షిణీకృత్య = ప్రదక్షిణతో నమస్కరించి, గంతుమ్ + ఇచ్ఛామి = మరీ వెళ్ళాలనుకొంటున్నాను.

**ప్రథమః:** ప్రథమః + కల్పః = ఇది ఉత్తమపక్షం. చాలా మంచి నిర్ణయం – అని. (నాట్యేన + అవతీర్ణౌ = దిగడాన్ని అభినయంతో ప్రదర్శించి దిగుతారు)

**ఉపోఢ:** (సవిస్మయమ్ = ఆశ్చర్యపడుతూ) రథ +అంగ – నేమయః = రథచక్రాల అంచులు (పట్టాలు), ఉపోఢశబ్దాః +న= ధ్వనిచెయ్యడం లేదు (పొందిన ధ్వని కలవి

**అభూతలస్పర్శతయా నిరుద్ధత**
**స్తవావతీర్ణోఽపి రథో న లక్ష్యతే.** **10**

**మాతలిః : ఏతావానేవ శతక్రతోరాయుష్మతశ్చ విశేషః.**

**రాజా : మాతలే! కతమస్మిన్ ప్రదేశే మారీచాశ్రమః?**

**మాతలిః : (హస్తేన దర్శయన్)**

**వల్మీకాగ్రనిమగ్నమూర్తి రురసా సందష్టసర్పత్వచా**
**కంఠే జీర్ణలతాప్రతానవలయేనాత్యర్థ సంపీడితః**
**అంసవ్యాపి శకుంతనీడనిచితం బిభ్రజ్జటామండలం**
**యత్ర స్థాణురివాచలో మునిరసావభ్యర్కబింబం స్థితః.** **11**

---

కావడం లేదు). రజః +చ= దుమ్ముసైతం, ప్రవర్తమానమ్ = ఎగిరినదిగా, న–దృశ్యతే = కనిపించడం లేదు. అభూతలస్పర్శతయా = భూతలాన్ని తాకమిచేత, తవ = నీయొక్క, నిరుద్ధతః + రథః = వేగం తగ్గిన అరదం, అవతీర్ణః + అపి = నేలకు దిగినదైనా, న +అవతీర్ణః + ఇవ – లక్ష్యతే = దిగినట్టు కనిపించడం లేదు.

**తాత్పర్యం:** వేగం తగ్గి నీ రథం నేలకు దిగింది. కానీ దిగినట్టు అనిపించడం లేదు. కారణం – నేలను తాకకపోవడం. అందుకే – రథచక్రాల నేములు (పట్టాలు) ధ్వని చెయ్యడం లేదు, ధూళి పైకి లేవడమూ లేదు. వెరసి – రథం దిగినట్టు అనిపించడమే లేదు.

**ఏతావానేవ:** శతక్రతోః = ఇంద్రుడికీ, ఆయుష్మతః + చ = నీకూ, విశేషః = తేడా, ఏతావాన్ +ఏవ = ఇంతటిదే! నేలను తాకడం, తాకకపోవడం మినహా మీ ఇద్దరికీ తేడా లేదని పొగడ్త.

**కతమస్మిన్:** మాతలీ! మారీచాశ్రమః = కశ్యప ప్రజాపతి ఆశ్రమం, కతమస్మిన్ + ప్రదేశే = ఏ ప్రదేశంలో ఉంది?

**వల్మీకాగ్ర :** (హస్తేన దర్శయన్ = చేతితో చూపుతూ) వల్మీక +అగ్ర+నిమగ్న = పుట్ట కొనదాకా మునిగిన (వల్మీకస్య అగ్రే = ప్రాంతే నిమగ్నా మూర్తిర్యస్య. అగ్రమాలంబనే వ్రాతే – ఇతి విశ్వః. వల్మీకార్ధనిమగ్న – పాఠాంతరం. మూర్తిః కాఠిన్య కాయయోః – అమరం), మూర్తిః = శరీరం కలవాడూ, సందష్ట = హత్తుకోబడిన (కరుచుకొన్న),

**రాజా : నమస్యే కష్టతపసే!**

**మాతలిః : (సంయతప్రగ్రహం రథం కృత్వా) మహారాజ! ఏతావదితి పరివర్ధిత మందారవృక్షం ప్రజాపతేరాశ్రమం ప్రవిష్టౌ స్వః.**

---

సర్పత్వచా = పాముకుబుసాలతో కూడిన, ఉరసా = వక్షస్సీమతో, స్థితః = ఉన్నవాడూ; కంఠే = కంఠభాగంలో, జీర్ణ – లతా ప్రతాన = ఎండిన పూదీగల, వలయేన = వలయాలతో – పూదీగల చుట్టలతో, అత్యర్థ సంపీడితః = బాగా బిగింపబడినవాడూ (వలయః కంఠరోమ్ణి స్యాద్వలయం కంకణేఽపి చ – ఇతివిశ్వః. లతాప్రతానం వల్లీ సమూహః స వలయ ఇవ కంఠరోమాణీవేత్యుపమిత సమాసః – రాఘవభట్టు), అంసవ్యాపి = బుజాలదాకా పొడవుసాగినదీ, శకుంత–నీడ – నిచితమ్ = పిట్టల గూడులతో నిండినదీ అయిన, జటా మండలమ్ = జడలగుంపు, బిభ్రత్ = ధరిస్తున్నవాడూ (ధారయన్ – కాటయ), అసౌ +మునిః = అడిగో కనిపిస్తున్న మహర్షి, యత్ర = ఏ ప్రదేశంలో, స్థాణుః + ఇవ = స్థాణువులాగా (శాఖాహీన తరుస్కంధ ఇవ– కాటయ), అచలః = నిశ్చలుడై, అభి + అర్కబింబమ్ = సూర్యబింబానికి అభిముఖంగా, స్థితః = కూర్చున్నాడో – అదే మారీచాశ్రమ ప్రదేశమని సమన్వయం.

**తాత్పర్యం:** అదిగో చూడు ఒక ముని తపస్సు చేసుకొంటున్నాడు. అతడి పొట్ట దాకా పుట్ట ఏర్పడింది. రొమ్ము నిండా కుబుసాలు (నిర్మోకాలు) హత్తుకొన్నాయి. మెడచుట్టూ ఎండిన పూలతీగల చుట్టలు ఇబ్బంది పెడుతున్నాయి. బుజాల దాకా ఎదిగిన జడలలో పక్షులు గూడులు కట్టుకున్నాయి. సూర్యుడికి అభిముఖంగా స్థాణువులా నిశ్చలంగా కూర్చున్నాడు. అతడే మారీచ మహర్షి. అదే మారీచాశ్రమం!!

**నమస్యే:** కష్టతపసే = కఠోరతపస్సు చేస్తున్నవాడైన ఈ ముని కొఱకు, నమస్యే = నమస్కరిస్తున్నాను. (నమోఽస్త్వస్మై కష్టతపసే– అని పాఠాంతరం.)

**ఏతౌ:** (రథమ్ = రథాన్ని, సంయతప్రగ్రహమ్ = పగ్గాలు కట్టివేయబడినదిగా, కృత్వా = చేసి) మహారాజా! అదితి పరివర్ధిత = అదితిచేత స్వయంగా పెంచబడిన, మందారవృక్షమ్ = కల్పవృక్షాలు కలదైన, ప్రజాపతేః + ఆశ్రమమ్ = కశ్యపప్రజాపతి ఆశ్రమం, ఏతౌ = ఇదిగో మనమిద్దరమూ, ప్రవిష్టౌ +స్వః = ప్రవేశించిన వారమైతిమి. ఇద్దరమూ ప్రవేశించామనడం.

**రాజా : స్వర్గాదధికతరం నిర్వృతిస్థానమ్. అమృతహ్రదమివావగాఢోఽస్మి.**

**మాతలిః : (రథం స్థాపయిత్వా) అవతరత్వాయుష్మాన్.**

**రాజా : (అవతీర్య) మాతలే! భవాన్ కథమిదానీమ్?**

**మాతలిః : సంయంత్రితో మయా రథః. వయమప్యవతరామః. (తథా కృత్వా) ఇత ఆయుష్మన్! (పరిక్రమ్య) దృశ్యంతామత్రభవతామృషీణాం తపోవన భూమయః.**

**రాజా : నను విస్మయాదవలోకయామి.**

**ప్రాణానామనిలేన వృత్తిరుచితా సత్కల్పవృక్షే వనే**
**తోయే కాంచనపద్మరేణుకపిశే ధర్మాభిషేకక్రియా**

---

**స్వర్గాత్:** స్వర్గాత్ = దేవలోకంకన్నా, అధికతరం = అధికంగా, నిర్వృతిస్థానమ్ = మనశ్శాంతికి నిలయమిది. అమృతహ్రదమ్ + ఇవ= అమృతపు తటాకంలాగా, అవగాఢః + అస్మి= స్నాతుడనయ్యాను. (జ్ఞానామృత హ్రదావగాహన ఇవ ఇత్యుత్ప్రేక్షా – రాఘవభట్టు).

**అవతరతు:** (రథమ్ + స్థాపయిత్వా = రథం నిలిపి) ఆయుష్మాన్ = ఆయుష్మంతుడు, అవతరతు = దిగుగాక!

**భవాన్:** (అవతీర్య = దిగి) మాతలే = మాతలీ! ఇదానీమ్ = ఇప్పుడు, భవాన్ = నీవు, కథమ్ + ఇవ = ఏమిచేస్తావు? (కథమితి ప్రశ్నే. కిం కరిష్యసి ఇత్యర్థః – రాఘవభట్టు).

**సంయంత్రితః:** రథః = రథం, మయా = నాచేత, సంయంత్రితః = నిలుపబడింది. వయమ్ + అపి = మేముకూడా, అవతరామః = దిగుతున్నాం. (తథా = అలా, కృత్వా = చేసి – రథం దిగి) ఆయుష్మన్ = ఆయుష్మంతుడా! ఇతః = ఇటు. (పరిక్రమ్య = నాలుగడుగులు వేసి) అత్రభవతామ్ = పూజ్యులైన, ఋషీణామ్= ఋషుల, తపోవన భూమయః = ఆశ్రమ ప్రదేశాలు, దృశ్యంతామ్ = వీక్షింపబడుగాక! (వీక్షింపబడినవి అగుగాక!).

**ప్రాణానామ్:** నను = అవును, విస్మయాత్ + అవలోకయామి = చాలా ఆశ్చర్యపోతూ వీరిని చూస్తున్నాను. సత్ + కల్పవృక్షే = గొప్ప గొప్ప కల్పవృక్షాలతో నిండిన, వనే = తపోవనంలో, అనిలేన = కేవలం గాలితో, ప్రాణానామ్ + ఉచితా వృత్తిః =

**ధ్యానం రత్నశిలాతలేషు విబుధస్త్రీసన్నిధౌ సంయమో**
**యత్కాంక్షంతి తపోభిరన్యమునయస్తస్మింస్తపస్యంత్యమీ. 12**

**మాతలిః : ఉత్సర్పిణీ ఖలు మహతాం ప్రార్థనా. (పరిక్రమ్య – ఆకాశే) అయే! వృద్ధ శాకల్య! కిమనుతిష్ఠతి భగవాన్మారీచః? కిం బ్రవీషి? దాక్షాయణ్యా పతివ్రతాధర్మ మధికృత్య పృష్టస్తస్యై మహర్షిపత్నీ సుహితాయ కథయతీతి!!**

---

(ప్రాణాలు నిలుపుకోవడం) జీవించడం. కోరిన తినుబండారాన్నల్లా ఇవ్వగలిగిన కల్పవృక్షాల చెంత ఉండీ కూడా కేవలం గాలి తిని బతికే సంయమనం. కాంచనపద్మ = బంగారు పద్మాల, రేణు = పుప్పొడితో, కపిశే = కెంపెక్కిన, తోయే = జలంలో, ధర్మ +అభిషేకక్రియా = ధర్మాచరణకోసం పవిత్రస్నానాలు చెయ్యడం (జలవిహారాలకు దిగని సంయమనం). రత్న – శిలాతలేషు = రత్నాలతో నిండిన శిలా ప్రదేశాలలో, ధ్యానమ్ = ధ్యానం సాగించడం (రత్నాలకోసం వెంపరలాడని సంయమనం). విబుధస్త్రీ + సన్నిధౌ = అప్సరసలు (సేవలందిస్తూ) చెంత ఉన్న సందర్భంలోనూ, సంయమః = తపస్సు సాగించే సంయమనం!! అన్యమునయః = భూలోకంలో ఇతర మహర్షులు, తపోభిః = తమ తమ తీవ్ర తపస్సులతో, యత్ + కాంక్షంతి = ఏ దివ్యదేశం కోరుకొంటున్నారో, తస్మిన్ = ఆ ప్రదేశంలో, అమీ = ఈ మహర్షులు, తపస్యంతి = తపస్సులు సాగిస్తున్నారు.

**తాత్పర్యం:** కల్పవృక్షాల సన్నిధిలో ఉండీ కూడా కేవలం గాలి భోజనం చేస్తూ జీవించడం! బంగారు పద్మాల పుప్పొడి నిండి ఎరుపెక్కిన నదీ జలాలలో కేవలం పుణ్యస్నానాలు చేసి ఊరుకోవడం! రత్నాలు దొర్లే శిలాతలాల మీద కూర్చొని ధ్యానం సాగించడం! అప్సరసలు సన్నిధి చేసినా నిగ్రహంతో ఉండటం! ఎంత ఆశ్చర్యం. ఇతర లోకాల మహర్షులు తపఃఫలంగా ఏ ప్రదేశంలో జన్మను కోరుకొంటారో ఆ ప్రదేశంలో ఉండి వీరు తపస్సులు సాయిస్తున్నారు!!

**ఉత్సర్పిణీ:** మహతామ్ = మహాత్ముల, ప్రార్థనా = స్పృహ (ఆకాంక్ష), ఉత్సర్పిణీ +ఖలు = ఊర్ధ్వగామిని గదా! వారి చూపు ఎప్పుడూ పైలోకాల మీదనే – అని దుష్యంతుడి అభిప్రాయాన్ని సమర్థించడం. (పరిక్రమ్య = నాలుగడుగులు వేసి, ఆకాశే = ఆకాశభాషితం చేస్తూ) అయే = ఓయీ! వృద్ధశాకల్య = "వృద్ధశాకల్యుడా!" భగవాన్ + మారీచః = మహానుభావుడు మారీచుడు, కిమ్ +అనుతిష్ఠతి = ఏమి చేస్తున్నాడు?

**రాజా : (కర్ణం దత్త్వా) అయే, ప్రతిపాల్యావసరః ఖలు ప్రస్తావః.**

**మాతలిః : (రాజానమవలోక్య) అస్మిన్నశోకవృక్షమూలే తావదాస్తామాయుష్మాన్, యావత్త్వామింద్రగురవే నివేదయితుమంతరాన్వేషీ భవామి.**

**రాజా : యథా భవాన్ మన్యతే. (ఇతి స్థితః)**

**మాతలిః : ఆయుష్మన్! సాధయామ్యహమ్. (ఇతి నిష్క్రాంతః)**

**రాజా : (నిమిత్తం సూచయిత్వా)**

**మనోరథాయ నాశంసే కిం బాహో! స్పందసే వృథా**
**పూర్వావధీరితం శ్రేయో దుఃఖం హి పరివర్తతే. 13**

---

కిమ్ +బ్రవీషి = ఏమంటున్నావ్? దాక్షాయణ్యా = దాక్షాయణిచేత, పతివ్రతాధర్మమ్ + అధికృత్య = పతివ్రతల ధర్మాల గురించి, పృష్టః = అడుగబడినవాడై, మహర్షి పత్నీ – సుహితాయ = ఋషిపత్నులందరి మేలుకోసం (మహర్షిపత్నీ సహితాయై – పాఠాంతరం), తస్యై = ఆమెకు, కథయతి + ఇతి = చెబుతున్నాడు – అనియా నీవంటున్నది?!

**ప్రతిపాల్య:** (కర్ణమ్ + దత్త్వా = ఆలకించి) అయే = ఓయీ మాతలీ! ప్రస్తావః = ఈ ప్రస్తావన, ప్రతిపాల్య + అవసరః ఖలు = నిరీక్షించవలసిన సమయం కలదిగదా! ఇది ముగిసే వరకూ మనం వేచి ఉండటం సబబు – అని.

**అస్మిన్:** (రాజానమ్ + అవలోక్య = రాజువైపు చూసి) అస్మిన్ = ఈ, అశోకవృక్షమూలే = అశోకవృక్షం మొదట, ఆయుష్మాన్ = ఆయుష్మంతుడు, తావత్ + ఆస్తామ్ = వేచి ఉండుగాక! యావత్ = అంతలో, త్వామ్ = నిన్ను, ఇంద్రగురవే = ఇంద్రుడి జనకుడైన కశ్యప ప్రజాపతికి, నివేదయితుమ్ = విన్నవించడానికి, అంతరా + అన్వేషీ + భవామి = సమయం కోసం చూచేవాడిని అవుతాను. సమయం కోసం ప్రయత్నిస్తాను – అని.

**యథా:** భవాన్ = నీవు, యథా + మన్యతే = ఎలా భావిస్తే అలాగే! (ఇతి = అని, స్థితః = అక్కడ నిలుస్తాడు).

**సాధయామి:** ఆయుష్మన్ = ఆయుష్మంతుడా! అహమ్ + సాధయామి = నేను వెళ్ళివస్తాను. (ఇతి = అని, నిష్క్రాంతః = నిష్క్రమిస్తాడు).

**(నేపథ్యే)**

**మాక్ఖు చాబలం కరేహి. కహం గదో జేవ అత్తణో పకిదిం?! (మాఖలు చాపలం కురు. కథం గత ఏవాత్మనః ప్రకృతిమ్?!)**

**రాజా : (కర్ణం దత్త్వా) అభూమిరియ మవినయస్య. కోను ఖల్వేష నిషిధ్యతే? (శబ్దానుసారేణావలోక్య సవిస్మయమ్) అయే! కోను ఖల్వయం అనుబధ్యమానస్తపస్వినీభ్యా మబాలసత్త్వో బాలః?!**

---

**మనోరథాయ:** (నిమిత్తమ్ = శుభశకునం, సూచయిత్వా = అభినయంతో చూపించి). బాహో = ఓ కుడిబుజమా! వృథా = వృథాగా, కిమ్ + స్పందసే = ఎందుకు అదురుతున్నావు? మనోరథాయ = ఏ కోరికకోసమూ, న +ఆశంసే = నేను ఆకాంక్షించడం లేదు – ఆశించను. పూర్వ + అవధీరితమ్ = మునుపు తిరస్కృతమైన, శ్రేయః = శ్రేయస్సు, దుఃఖమ్ = ఎప్పటికీ బాధాకరమే, పరివర్తతే+హి = అవుతుంది గదా! (దుఃఖం యథా స్యాత్తథా).

**తాత్పర్యం:** అలనాడు శకుంతలను తిరస్కరించిన నా దుఃఖం, ఇప్పటికీ నన్ను బాధిస్తూనే ఉంది. ఓ కుడిబుజమా! ఇక నాకిప్పుడు ఏ కోరిక ఉంది కనుక నువ్విలా శుభసూచకంగా అదురుతున్నావు?! (ఓ కుడిబుజమా! వృథాగా ఎందుకు అదురుతావు? నేను ఏదీ కోరను. ఒకప్పుడు శ్రేయస్సుకు మోకాలొడ్డినవాడికి ఎప్పటికీ దుఃఖమే కదా మిగిలేది),

**(నేపథ్యే = తెరలో)**

చాపలమ్ = అల్లరి, మా +ఖలు +కురు = చెయ్యకురా! కథమ్ = ఎట్టా!? ఆత్మనః + ప్రకృతిమ్ = నీ సహజప్రవృత్తిని, గతః +ఏవ = అప్పుడే మొదలుపెట్టావా?!

**అభూమిః:** (కర్ణమ్ + దత్త్వా = ఆలకించి) ఇయమ్ = ఇది, అవినయస్య = అల్లరితనానికి, అభూమిః = నెలవుకాదే! నిషిధ్యతే = వారింపబడుతున్నాడు, ఏషః = ఇతడు, కః +ను +ఖలు = ఎవరో కదా?! (శబ్దానుసారేణ = ధ్వని వచ్చినవైపు, అవలోక్య = దృష్టిసారించి, సవిస్మయమ్ = విస్తుపోతూ) అయే = అరే! కః + ను + ఖలు + అయమ్ + బాలః = ఎవడో కదా ఈ బాలుడు!? తపస్వినీభ్యామ్ = ఇద్దరు తాపసస్త్రీల చేత, అనుబధ్యమానః = ఆపబడుతున్నవాడైన, అబాల – సత్త్వః = బాలుడికి

**అర్ధపీతస్తనం మాతురామర్దక్లిష్టకేసరమ్**
**ప్రక్రీడితుం సింహశిశుం బలాత్కారేణ కర్షతి. 14**

**(తతః ప్రవిశతి యథా నిర్దిష్టకర్మా తపస్వినీభ్యాం బాలః)**

**బాలః : జింభ సింఘ! దత్తాఇం దే గణఇస్సం. (జృంభస్వ సింహ! దంతాంస్తే తే గణయిష్యే).**

**ప్రథమా : అవిణీద, కింణో అపచ్చణివ్విసేసాణి సత్తాణి విప్పఅరేసి? హంత, వడ్ఢఇ దే సంరంభో. ఠాణే క్ఖు ఇసిజణేణ సవ్వదమణోత్తి కిదణామహేహో సి. (అవినీత! కిం నోऽపత్యనిర్విశేషాణి సత్త్వాని విప్రకరోషి? హంత! వర్ధతే తవ సంరంభః స్థానే ఖలు ఋషి జనేన సర్వదమన ఇతి కృతనామధేయోऽసి!!)**

---

సహజంకాని – లేదా – ప్రౌఢుడిలాంటి బలసంపన్నుడు – ఎవడో కదా ఈ బాలుడు?! (అబాలస్యేవ సత్త్వం బలం యస్య = అబాలసత్త్వః).

**అర్ధపీత:** మాతుః = తల్లి యొక్క (తల్లినుంచి) అర్ధపీతస్తనమ్ = సగమే త్రాగిన పాలు కలదీ, ఆమర్ద = లాగడం వల్ల, క్లిష్ట = చిక్కులువడ్డ, కేసరమ్ = జూలు కలదీ అయిన, సింహశిశుమ్ = సింహకిశోరాన్ని, ప్రక్రీడితుమ్= కేవలం ఆడుకోడానికై, బలాత్కారేణ = బలవంతంగా, కర్షతి = లాగుతున్నాడు!

**తాత్పర్యం:** తల్లిదగ్గర పాలు తాగుతూ ఉన్న సింహప్పిల్లను, జూలు పట్టి బలవంతంగా, కేవలం ఆడుకోడానికి లాగుతున్నాడు. అబాలసత్త్వుడు ఈ బాలుడెవడో గదా!?

(తతః = అంతట, యథానిర్దిష్టకర్మా = వర్ణింపబడినట్టే ఆ పనిచేస్తున్న, బాలః = బాలుడు, తపస్వినీభ్యామ్ = ఇద్దరు తపస్వినులతో, ప్రవిశతి = ప్రవేశిస్తాడు)

**జింభ:** సింహ = సింహమా! జృంభస్వ = ఆవులించు – నోరు తెరు! తే + దంతాన్ = నీ దంతాలను, గణయిష్యే = లెక్కపెడతాను!!

**అవిణీద:** అవినీత = అల్లరిపిల్లాడా! నః = మాకు, అపత్యనిర్విశేషాని = బిడ్డలతో సమానమైన, సత్త్వాని = జంతువులను, కిమ్ + విప్రకరోషి = హింసిస్తున్నావేమి? హంత = హన్నా! తవ–సంరంభః = నీ ఆటోపం, వర్ధతే = నానాటికీ పెరుగుతోంది! స్థానే +ఖలు = సముచితమే సుమా! ఋషిజనేన = ఇక్కడి మునిజనంతో, సర్వదమనః

**రాజా : కిం ను ఖలు బాలేஉస్మిన్నౌరస ఇవ పుత్రే స్నిహ్యతి మే మనః. నూనమనపత్యతా మాం వత్సలయతి.**

**ద్వితీయా : ఏసాక్ఖు కేసరిణీ తుమం లఙ్ఘేది జఇ సే పుత్తఅం ణ ముంచేసి. (ఏషా ఖలు కేసరిణీ త్వాం లంఘయిష్యతి యది తస్యాః పుత్రకం న ముంచసి.)**

**బాలః : (సస్మితమ్) అహ్మహే! బలిఅం క్ఖు భీదోహ్మి. (ఇత్యధరం దర్శయతి). (అంహో! బలవత్ ఖలు భీతోஉస్మి).**

**రాజా : మహతస్తేజసో బీజం బాలోஉయం ప్రతిభాతి మే**
**స్ఫులింగావస్థయా వహ్నిరేధాపేక్ష ఇవ స్థితః. 15**

---

+ఇతి = సర్వదమనుడు అని, కృతనామధేయః + అసి = పేరుపడ్డ వాడవయ్యావు. నీకు ఈ ముద్దు పేరు యుక్తమే – అనడం.

**కిం ను ఖలు:** కిమ్ + ను + ఖలు = ఏమిది చెప్మా! అస్మిన్ + బాలే = ఈ బాలుడి విషయంలో, ఔరసే +పుత్రే +ఇవ = సొంతకొడుకన్నట్టు, మే +మనః= నా హృదయం, స్నిహ్యతి = ద్రవిస్తోంది – స్నేహపరవశమవుతోంది?! (ఉరసా ధర్మపత్న్యాం జాతః = ఔరసః = ఆత్మజుడు). అనపత్యతా = నాకు పిల్లలు లేకపోవడమే – నా అనపత్యతయే, నూనమ్ = కచ్చితంగా, మామ్ = నన్ను, వత్సలయతి = ఇలా వాత్సల్యంతో నింపుతోంది – వాత్సల్యం కలిగిస్తోంది.

**ఏసాక్ఖు:** ఏషా + కేసరిణీ = ఇదిగో ఈ సింహం పిల్ల తల్లి (సివంగి), తస్యాః + పుత్రకమ్ = దాని పుత్రుణ్ని, న ముంచసి యది = విడిచిపెట్టవో, త్వామ్ = నిన్ను, లంఘయిష్యతి + ఖలు = దూకి పీకగలదు సుమా!

**అహ్మహే:** (సస్మితమ్ = చిరునవ్వు చిందిస్తూ) అంహో = అమ్మో! బలవత్ + ఖలు + భీతః + అస్మి = చాలా భయపడిపోతున్నాను!! (ఇతి = అని, అధరమ్ + దర్శయతి = వెక్కిరిస్తాడు)

**మహతః:** అయమ్ + బాలః = ఈ బాలుడు, మహతః + తేజసః = మహాతేజస్సుకు బీజమ్ = విత్తనంలాగా, మే–ప్రతిభాతి = నాకు అనిపిస్తున్నాడు. స్ఫులింగ + అవస్థయా = రవ్వగా ఉండి, ఏధాపేక్షః = వృద్ధిని కాంక్షిస్తున్న, వహ్నిః +ఇవ + అగ్నిలాగా, స్థితః = ఉన్నాడు.

ప్రథమా : వచ్ఛ, ఏదం బాలమిఇందఅం ముంచ. అవరం దే కీలణఅం దాఇస్సం.
(వత్స! ఏనం బాలమృగేంద్రం ముంచ. అపరం తే క్రీడనకం దాస్యామి).

బాలః : కహిం, దేహి ణం. (ఇతి హస్తం ప్రసారయతి). (కుత్ర? దేహి ఏతత్!)

రాజా : కథమ్! చక్రవర్తి లక్షణమప్యనేన ధార్యతే. తథాహ్యస్య –

ప్రలోభ్యవస్తు ప్రణయ ప్రసారితో
విభాతి జాలగ్రథితాంగులిః కరః
అలక్ష్యపత్రాంతర మిద్ధ రాగయా
నవోషసా భిన్నమివైకపంకజమ్. **16**

---

**తాత్పర్యం :** ఈ బాలుడు ఒక మహాతేజస్సుకి విత్తనంలాగా ఉన్నాడు. ప్రజ్వరిల్ల గోరుతున్న నిప్పురవ్వలాగా ఉన్నాడు.

**ఏదం:** వత్స = నాయనా! ఏనమ్ = ఈ, బాలమృగేంద్రమ్ = సింహపు పిల్లను, ముంచ = విడిచిపెట్టు. తే = నీకు, అపరమ్ + క్రీడనకమ్ = మరో ఆట వస్తువు, దాస్యామి = ఇస్తాను.

**కహిం:** కుత్ర = ఏది ఎక్కడ? దేహి +ఏతత్ = అదేదో ఇయ్యి! (ఇతి = అని, హస్తమ్ + ప్రసారయతి = చెయ్యిచాపుతాడు).

**ప్రలోభ్య:** కథమ్ = ఎట్టా! అనేన = ఇతడిచేత, చక్రవర్తి లక్షణమ్ + అపి = చక్రవర్తి చిహ్నం కూడా, ధార్యతే = వహింపబడుతోంది! చక్రవర్తి కాబోయే సాముద్రిక లక్షణం కనబడుతోందని. తథాహి = అవును. అస్య = ఇతడి – ప్రలోభ్య = ఆశపెట్టే, వస్తు = వస్తువుపట్ల, ప్రణయ = ప్రీతితో, ప్రసారితః = చాచబడినదీ, జాల = జాగాలలో (ఖాళీలలో), గ్రథిత = దగ్గరకు చేర్చబడిన, అంగులిః = వ్రేళ్లు కలదీ – వేళ్ల మధ్య జాగాలు లేనిది – అని; కరః = (చెయ్యి) హస్తం, అలక్ష్యపత్ర + అంతరమ్ = రేకల మధ్య ఖాళీలు లేనిదీ – దళాలు ఒత్తుగా ఉన్నదని, ఇద్ధరాగయా = స్వచ్ఛమైన ఎఱ్ఱదనం కలిగిన, నవ + ఉషసా = తొలి సంజ వెలుగుచేత, భిన్నమ్ = అప్పుడే విచ్చుకొన్నదీ అయిన, ఏక – పంకజమ్ = అద్వితీయమైన పద్మంలాగా, విభాతి = విరాజిల్లుతోంది.

**తాత్పర్యం:** ప్రలోభపెడుతున్న వస్తువుకోసం చాచిన ఇతడి హస్తం – ఆహా! దగ్గరగా పొందికగా జతపడిన వేళ్లతో, ఎఱ్ఱటి తొలి సంజ వెలుగులకు కొద్దిగా విచ్చుకొని ఒత్తుగా రేకలతో అద్వితీయంగా భాసిస్తున్న పద్మంలాగా విరాజిల్లుతోంది.

ద్వితీయా : సువ్వదే, ణ సక్కో ఏసో వా ఆమేత్తేణ విరమయిదుమ్. గచ్ఛ తుమం. మమకేరఏ ఉడఏ మక్కండేఅస్స ఇసికుమారఅస్స వణ్ణచిత్తిదో మిత్తిఆ మోరఓ చిట్ఠది తం సే ఉవహర. (సుప్రతే! న శక్య ఏష వాచామాత్రేణ విరమయితుమ్. గచ్ఛ త్వమ్. మదీయ ఉటజే మార్కండేయస్య ఋషికుమారస్య వర్ణచిత్రితో మృత్తికామయూరస్తిష్ఠతి తమస్యోపహర.)

ప్రథమా : తహ, (ఇతి నిష్క్రాంతా) తథా.

బాలః : ఇమిణా ఏవ్వ దావ కీలిస్సం. (ఇతి తాపసీం విలోక్య హసతి) (అనేనైవ తావత్ క్రీడిష్యామి).

రాజా : స్పృహయామి ఖలు దుర్లలితాయాస్మై.

ఆలక్ష్యదంతముకుళా ననిమిత్తహాసై
రవ్యక్తవర్ణ రమణీయవచః ప్రవృత్తీన్

---

**విశేషాలు:** అతిరక్తః కరో యస్య గ్రథితాంగులికో మృదుః చాపాంకుశాంకితః సోఽపి చక్రవర్తీ భవేత్ ధ్రువమ్ – అని సాముద్రిక శాస్త్రం.

**సువ్వదే:** సుప్రతే = ఓ సుప్రతా! (మొదటి తాపసి పేరు. మంచి తపోదీక్ష కలదానా!) ఏషః = వీడు, వాచా–మాత్రేణ = ఇలా మాటలతో, విరమయితుమ్ = విరమింపజెయ్యడానికి – అల్లరినుంచి తప్పించడానకి, న–శక్యః = లొంగనివాడు. త్వమ్ – గచ్ఛ = నువ్వు వెళ్ళు. మదీయే + ఉటజే = నా పర్ణశాలలో, ఋషికుమారస్య = మునికుమారుడైన, మార్కండేయస్య = మార్కండేయుడి (అతడు చేసినదని), వర్ణచిత్రితః = రంగురంగుల, మృత్తికా – మయూరః = నెమలి–మట్టిబొమ్మ, తిష్ఠతి = ఉన్నది. తమ్= దానిని, అస్య = ఇతడికి, ఉపహర = తీసుకురా!

**తహ:** తథా = అలాగే (ఇతి = అని, నిష్క్రాంతా = ప్రథమ నిష్క్రమిస్తుంది)

**ఇమిణా:** అనేన + ఏవ = ఈ సింహకిశోరంతోనే, క్రీడిష్యామి – తావత్ = ఆడుకొంటానులే! (ఇతి = అని, తాపసీం = తాపసిని, విలోక్య = చూసి, హసతి = నవ్వుతాడు)

**ఆలక్ష్య:** దుర్లలితాయ + అస్మై = అల్లరివాడైన ఈ బాలుడికోసం, స్పృహయామి+ఖలు = తహతహలాడుతున్నాను గదా! అనిమిత్తహాసైః = ఉత్తిపుణ్యానికి వచ్చే నవ్వులతో, ఆలక్ష్య = కనిపించీ కనిపించని, దంతముకుళాన్ = మొగ్గలలాంటి దంతాలు

**అంకాశ్రయప్రణయినస్తనయాన్ వహంతో**
**ధన్యాస్త దంగరజసా మలినీభవంతి.** **17**

**తాపసీ : హోదు. ణ మం అఅం గణేది. (పార్శ్వమవలోకయతి) కో ఏత్థ ఇసికుమారాణం. (రాజానమవలోక్య) భద్దముహ, ఏహిదావ. మోఏహి ఇమిణా దుమ్మోఅహత్థగ్గహేణ డింభలీలాఏ బాహీ అమాణం బాలమిహి దఅం. (భవతు. న మామయం గణయతి. కోஉత్ర ఋషికుమారాణామ్? భద్రముఖ! ఏహి తావత్. మోచయానేన దుర్మోకహస్తగ్రహేణ డింభలీలయా బాధ్యమానం బాలమృగేంద్రమ్)**

**రాజా : (ఉపగమ్య సస్మితమ్) అయి భో మహర్షిపుత్ర!**

---

కలవాళ్ళూ, అవ్యక్త – వర్ణ = అక్షరాలు స్పష్టపడని, రమణీయ = అందమైన, వచః + ప్రవృత్తీన్ = మాటలు – తొక్కుబలుకులు పలికేవాళ్ళూ, అంకాశ్రయ + ప్రణయినః = ఒడిని ఇష్టపడేవాళ్ళూ అయిన, తనయాన్ = పుత్రులను, వహంతః = కలిగినవారు, ధన్యాః = ధన్యులు, తత్ +అంగరజసా = ఆ పుత్రుల ఒంటి దుమ్ముతో, మలినీభవంతి = ధూసరితులవుతున్నారు.

**తాత్పర్యం:** ఉత్తిపుణ్యానికి నవ్వులు ఒలకబోస్తూ మొగ్గల్లాంటి దంతాలను ప్రదర్శిస్తూ, అక్షరాలు స్పష్టంగా పలకడం కుదరక తొక్కుబలుకులతో మురిపిస్తూ, ఒడిలో కూర్చోడానికి ఇష్టపడే తనయుల ఒంటిదుమ్ముతో తమ దుస్తులు మాపుకొనే తల్లిదండ్రులు ఎంతటి ధన్యులోకదా!

**హోదు :** భవతు = సరే. అయమ్ = వీడు, మామ్ + న – గణయతి = నన్ను లెక్కపెట్టడం లేదు. (పార్శ్వమ్ + అవలోకయతి = ప్రక్కకు చూచి) ఋషికుమారాణామ్ = మునికుమారులలో, అత్ర = ఇక్కడున్నది, కః = ఎవడు? (రాజానమ్ + అవలోక్య = అక్కడున్న రాజును చూసి) భద్రముఖ = మునికుమారా! (నాట్యశాస్త్ర మర్యాద), ఏహి – తావత్ = కొంచెమిటు రా నాయనా! అనేన = ఈ బాలుడి, దుర్మోక – హస్తగ్రహేణ = విడిపింపగాని చేతిపట్టుతో, డింభలీలయా = బాలక్రీడచేత, బాధ్యమానమ్ = హింసింపబడుతున్న, బాలమృగేంద్రమ్ = సింహకిశోరాన్ని, మోచయ = విడిపించు.

**ఏవమాశ్రమ :** (ఉపగమ్య = సమీపించి, సస్మితమ్ = చిరునవ్వుతో) అయి–భోః – మహర్షిపుత్ర = ఓయీ మునికుమారా! ఆశ్రమ – విరుద్ధ – వృత్తినా = ఆశ్రమానికి

ఏవమాశ్రమ విరుద్ధవృత్తినా
సంయమః కిమితి జన్మతస్త్వయా
సత్త్వసంశ్రయసుఖోఽపి దూష్యతే
కృష్ణసర్పశిశునేవ చందనః. **18**

**తాపసీ : భద్ద ముహ, ణ ఖు అఅం ఇసికుమారఓ. (భద్రముఖ! న ఖల్వయం ఋషికుమారకః)**

**రాజా : ఆకారసదృశం చేష్టితమేవాస్య కథయతి. స్థానప్రత్యయాత్తు వయమేవం తర్కిణః. (యథాభ్యర్థితమనుతిష్ఠన్ బాలస్పర్శముపలభ్య – ఆత్మగతమ్)**

---

విరుద్ధమైన ప్రవర్తన కలవాడవైన, త్వయా = నీచేత, ఏవమ్ = ఇలా, జన్మతః = చిన్నప్పటినుండియే (పుట్టినప్పటినుంచే), సత్త్వ = సకల జీవులకూ, సంశ్రయ = ఆశ్రయమనే, సుఖః = సుఖాన్ని ఇచ్చేదయిన (సత్త్వసంశ్రయశ్చాసౌ సుఖశ్చ. సంశ్రయగుణోఽపి – పాఠాంతరం), సంయమః +అపి = నిగ్రహమూ – శమమూ సైతం, కృష్ణసర్ప – శిశునా = నల్లత్రాచుపిల్ల చేత, చందనః +ఇవ = మంచి గంధపు చెట్టులాగా, దూష్యతే –కిమ్ + ఇతి = దూషింపబడుతోంది ఎందుకని?

**తాత్పర్యం:** నల్లత్రాచు పిల్ల చందనతరువును చేరరానిదిగా చేసినట్టు నువ్వు ఈ ఆశ్రమ వాతావరణాన్ని పాడుచేస్తున్నావు. ఇది ఆశ్రమం. ఇక్కడ అన్ని ప్రాణులూ సుఖంగా జీవిస్తాయి. దానికి కారణం ఇక్కడివారి సంయమం. దానికి విరుద్ధంగా – ఇంత చిన్నవాడివి – ఎందుకు ఇలా ప్రవర్తిస్తున్నావ్?

**ణ ఖు :** భద్రముఖా! అయమ్ = వీడు, ఋషికుమారకః = మునిపుత్రుడు, న +ఖలు= కాదు సుమా!

**ఆకార:** ఆకారసదృశమ్ = ఇతని ఆకారానికి తగిన, చేష్టితమ్ + ఏవ = ఈ దుడుకు సేతయే, అస్య కథయతి = ఇతడు మునికుమారుడు కాదన్న సంగతి తెలుపుతోంది. తు = కానీ, స్థాన – ప్రత్యయాత్ = ఈ ప్రదేశంపై నమ్మకంతో – ఇది ఆశ్రమం కనుక, వయమ్ = మేము, ఏవమ్ = ఇలా, తర్కిణః = ఆలోచించిన వారమయ్యాం. ఇది ఆశ్రమం కాబట్టి, ఆ నమ్మకంతో ఇతడు మునికుమారుడని భావించామనడం.

(యథాభ్యర్థితమ్ = తాపసి అభ్యర్థించినట్టు, అనుతిష్ఠన్ = ఆచరిస్తూ, బాలస్పర్శమ్ = ఆ బాలుడి శరీరస్పర్శను, ఉపలభ్య = పొంది, ఆత్మగతమ్ = తనలో –)

**అనేన కస్యాపి కులాంకురేణ**
**స్పృష్టస్య గాత్రేషు సుఖం మమైవమ్**
**కాం నిర్వృతిం చేతసి తస్య కుర్యా**
**ద్యస్యాయమంకాత్కృతినః ప్రరూఢః.** **19**

**తాపసీ : (ఉభౌ నిర్వర్ణ్య) అచ్చరిఅం అచ్చరిఅం (ఆశ్చర్యమాశ్చర్యమ్!)**

**రాజా : ఆర్యే, కిమివ?**

**తాపసీ : ఇమస్స బాలఅస్సదే వి సంవాదిణీ ఆకిదీత్తి విహ్మావిదహ్మి. అపరిఇదస్స విదేఅప్పడిలోమోసంవుత్తోత్తి. (అస్యబాలస్యతేఽపిసంవాదిన్యాకృతిరితి విస్మాపితాస్మి. అపరిచితస్యాపి తేఽప్రతిలోమః సంవృత్త ఇతి.)**

---

**అనేన :** కస్య + అపి = ఎవరో తెలియని వ్యక్తి యొక్క, కులాంకురేణ = వంశాంకురమైన, అనేన = ఈ బాలుడిచేత, స్పృష్టస్య = తాకబడిన, మమ + గాత్రేషు = నా శరీరావయవాలయందు, సుఖమ్ = ఆనందం, ఏవమ్ = ఇంతగా ఉన్నదే, యస్య + కృతినః = ఏ అదృష్టవంతుడి, అంకాత్ = ఒడినుంచి, అయమ్ = ఈతడు, ప్రరూఢః = ఆవిర్భవించాడో (మొలకెత్తాడో), తస్య +చేతసి = అతడి మనస్సులో, కామ్ +నిర్వృతిమ్ = మరింకెంతటి సుఖాన్ని, కుర్యాత్ = కల్గిస్తాడో!

**తాత్పర్యం :** ఎవరి బిడ్డడో తెలియకపోయినా ఇతడి ఈ పాటి స్పర్శ నాకే ఇంతటి సుఖం కలిగిస్తోందంటే, నిజంగా ఇతడి కన్నతండ్రి ఎంత అదృష్టవంతుడో! ఇంకెంతటి సుఖానుభూతి పొందుతాడో కదా!!

**అచ్చరిఅం:** (ఉభౌ = ఇద్దరినీ, నిర్వర్ణ్య = చూసి) ఆశ్చర్యం! ఆశ్చర్యం!!

**కిమివ :** ఆర్యే = మాన్యులారా! కిమ్ +ఇవ = ఏమయ్యిందని?!

**ఇమస్స:** అస్య – బాలస్య = ఈ బాలుడికీ, తే +అపి = నీకూ, సంవాదినీ = సరిపోలినది, ఆకృతిః + ఇతి = ఆకారమని, విస్మాపితా +అస్మి= విస్తుపోతిని! (విస్తుపోయినదానను అయ్యాను). అపరిచితస్య + అపి = ఏ పరిచయమూ లేనివాడవే అయినా, తే = నీకు, అప్రతిలోమః = అనుకూలుడు (ఎదురుతిరగనివాడు), సంవృత్తః = అయ్యాడు వీడు. ఇతి = అనీ – విస్మాపితాస్మి.

**రాజా : (బాలకముపలాలయన్) న చేన్మునికుమారోఽయమ్ అథ కోఽస్య వ్యపదేశః?**

**తాపసీ : పురువంసో (పురువంశః).**

**రాజా : (ఆత్మగతమ్) కథమేకాన్వయో మమ. అతః ఖలు మదనుకారిణమేనమ్ అత్రభవతీ మన్యతే. అస్త్యేతత్పౌరవాణామంత్యం కులవ్రతమ్.**

**భవనేషు రసాధికేషు పూర్వం**
**క్షితిరక్షార్థముశంతి యే నివాసమ్**
**నియతైకపతివ్రతాని పశ్చాత్**
**తరుమూలాని గృహీభవంతి తేషామ్. 20**

---

**న చేత్ :** (బాలకమ్ = బాలుణ్ని, ఉపలాలయన్ = లాలిస్తూ – బుజ్జగిస్తూ) అయమ్ = ఇతడు, మునికుమారః + న + చేత్ = మునిపుత్రుడు కాకపోతే, అథ = మరి, అస్య+వ్యపదేశః = ఇతడి వంశం, కః +ఏది?

**పురువంసో :** పురువంశః = పురువంశం.

**కథమ్ :** (ఆత్మగతమ్ = తనలో) కథమ్ = ఎట్టా!, మమ = నాకు, ఏక +అన్వయః = ఒకే వంశంవాడా?! నా వంశం వాడా – అని విస్తుపోవడం. అతః+ఖలు = అందుకే కాబోలు, ఏనమ్ = ఇతడిని, మత్+ అనుకారిణమ్ = నాలాగా – నా పోలికతో ఉన్నవాడని, అత్రభవతీ = ఈ మాన్యురాలు, మన్యతే = భావించింది. (సమీపభూతంలో వర్తమానం). పౌరవాణామ్ = మా పురువంశీయులకు, ఏతత్ = ఈ, అంత్యమ్ = చివరిదైన వానప్రస్థాశ్రమ స్వీకారం, కులవ్రతమ్ = కులాచారంగా, అస్తి =ఉన్నదే.

**భవనేషు :** యే = ఏ పురువంశమహారాజులు, పూర్వమ్ = యౌవనంలో, రసాధికేషు = శృంగారాది రసాలూ స్వాదిష్ఠ పదార్థాదులూ పుష్కలంగా ఉన్న, (సుధా–సితేషు = అమృతంలా తెల్లటివైన – పాఠాంతరం) భవనేషు = సౌధాలలో, క్షితి–రక్షార్థమ్ = రాజ్యపాలనకోసం, నివాసమ్ = నివాసాన్ని, ఉశంతి = కోరుకొన్నారో (వశకాంతౌ. కాంతిరిచ్ఛా. ఉశంతి = వాంఛంతి), తేషామ్ = ఆ మహారాజులకు, పశ్చాత్ = వార్ధకదశలో, నిరయ+ఏక – పతివ్రతాని = తపోనియమమే ఏకైక సహధర్మచారిణిగా కలవైన (నియతైక – యతివ్రతాని = నియతంగా ఉన్న ఒకే ఒక్క యతినియమం

**(ప్రకాశమ్) న పునరాత్మగత్యా మానుషాణామేవ విషయః.**

**తాపసీ : జహ భద్దముహో భణాది అచ్చరాసంబంధేణ ఇమస్స జణణీ ఏత్థ దేవగురుణో తవోవణే పసూదా. (యథా భద్రముఖో భణత్యప్సరః సంబంధేనాస్య జనన్యేత్య దేవగురోస్తపోవనే ప్రసూతా.)**

**రాజా : (అపవార్య) హంత! ద్వితీయ మిద మాశాజననమ్. (ప్రకాశమ్) అథ సా తత్రభవతీ కిమాఖ్యస్య రాజర్షేః పత్నీ?**

**తాపసీ : కో తస్స ధమ్మదార పరిచ్చా ఇణో ణామ సంకీతిదుం చింతిస్సది? (కస్తస్య ధర్మదార పరిత్యాగినో నామ సంకీర్తయితుం చింతయిష్యతి?)**

---

కలవైన – పాఠాంతరం), తరుమూలాని = వనాలలోని చెట్ల మొదళ్ళే, గృహీభవంతి = గృహాలు అవుతున్నాయి.

**తాత్పర్యం :** పురువంశపు రాజులు యౌవనంలో ఉన్నప్పుడు రాజ్యపాలన కోసమని అన్ని సుఖాలూ సమృద్ధంగా ఉండే మహాసౌధాలలో నివసిస్తారు. వాళ్ళే వార్ధక్యంలో వానప్రస్థులై తపోనియమమే సహధర్మచారిణిగా చెట్ల మొదళ్ళూ తొర్రలే గృహాలుగా వాటిలో నివసిస్తారు.

**న పునః :** (ప్రకాశమ్ = ప్రకాశంగా) ఆత్మగత్యా + పునః = స్వభావరీత్యా అయితే, మానుషాణామ్ = మానవులకు, న+విషయః+ఏవ = ఇది నివాస ప్రదేశమే కాదుగదా! పురువంశజుడు ఇక్కడ ఎలా ఉన్నాడు? – అని.

**జహ భద్దముహో :** భద్రముఖః = భద్రముఖుడు, యథా+భణతి = అన్నట్టే! నువ్వన్నట్టే మానవులకు ఇది నివాసప్రదేశం కాదు. కానీ – అప్సరస్సంబంధేన = (మేనక అనే) అప్సరసతో బంధుత్వం వల్ల, అస్య+జననీ = ఈతడి తల్లి, ఏత్య = ఇక్కడికి వచ్చి, దేవగురోః = దేవతల జనకుడైన కశ్యపుడి, తపోవనే = ఆశ్రమంలో, ప్రసూతా = ప్రసవించింది.

**హంత :** (అపవార్య = జనాంతికంగా) హంత = ఆహా! ఇదమ్ = ఇది, ద్వితీయమ్ = రెండవదైన, ఆశాజననమ్ = ఆశ కలిగించే అంశం. ఒకటి – వంశం, రెండు – ఇక్కడ ఈ ప్రసవం. రెండూ ఆశాజనకాలైన అంశాలే – అని. (ప్రకాశమ్ = ప్రకాశంగా) అథ = అలాగా! సా+తత్ర భవతీ = ఆ పూజ్యురాలు, కిమ్+ ఆఖ్యస్య = ఏ పేరుగల, రాజర్షేః = రాజర్షికి, పత్నీ = ఇల్లాలు?

**రాజా : (స్వగతమ్) ఇయం ఖలు కథా మామేవ లక్ష్యీకరోతి. యది తావదస్య శిశోర్మాతరం నామతః పృచ్ఛామి. అథవానార్యః పరదారవ్యవహారః.**

**(ప్రవిశ్య మృణ్మయూరహస్తా)**

**తాపసీ : సవ్వదమణ, సఉందలావణ్ణం పేక్ఖ. (సర్వదమన! శకుంతలావణ్యం ప్రేక్షస్వ)**

**బాలః : (సదృష్టిక్షేపమ్) కహిం వా మే అజ్జు? (కుత్ర వా మమ మాతా?)**

**ఉభే : ణామ సారిస్సేణ వంచిదో మాఉవచ్ఛలో. (నామసాదృశ్యేన వంచితో మాతృవత్సలః.)**

---

**కో తస్స:** ధర్మదార – పరిత్యాగినః = ధర్మపత్నిని పరిత్యజించినవాడైన, తస్య = ఆతడి, నామ = పేరు, సంకీర్తయితుమ్ = ప్రస్తావించడానికి, కః + చింతయిష్యతి =ఎవడు స్మరిస్తాడు? ఎవడు గుర్తు పెట్టుకుంటాడు?

**ఇయం ఖలు:** (స్వగతమ్ = తనలో) ఇయమ్+కథా = ఈ కథ, మామ్+ఏవ = నన్నే, లక్ష్యీకరోతి+ఖలు = గురిపెడుతోంది సుమా! నాదే అనిపిస్తోంది సుమా – అని. అస్య = ఈ, శిశోః = బాలకుడి, మాతరమ్ = తల్లిని, నామతః = పేరుతో, యది– తావత్ – పృచ్ఛామి = అడగనా? ఈతడి తల్లిపేరు ఏమిటని అడుగుదునా?! అథవా = వద్దులే, పరదార – వ్యవహారః = పరాయి ఇల్లాలి వ్యవహారం – ఊరూ పేరూ అడగడం, అనార్యః = అసమంజసం. అధర్మం – అని. ఆర్యుడికి తగనిది.

(మృత్+మయూరహస్తా = నెమలి మట్టిబొమ్మ చేబట్టి, ప్రవిశ్య = తాపసి ప్రవేశించి)

**సవ్వదమణ:** సర్వదమన = సర్వదమనుడా! శకుంత – లావణ్యమ్ = ఈ పక్షిబొమ్మ సొగసు, ప్రేక్షస్వ = చూడు!! (శకుంతలా వణ్యమ్)

**కహిం వా:** (సదృష్టిక్షేపమ్ = కళ్లు తిప్పుతూ) కుత్ర – వా = ఏది? ఎక్కడ? మమ – మాతా = నా జనని?? (అజ్జ అజ్జు చ మాతరి – ఇతి దేశీకోశః)

**ణామ సారిస్సేణ:** నామ – సాదృశ్యేన = పేరులోని పోలికతో, మాతృవత్సలః = ఈ అమ్మకూచిగాడు, వంచితః = మోసపోయాడు. "శకుంతలా" అని వినపడేసరికి అమ్మ వచ్చింది అనుకొన్నాడనడం.

**ద్వితీయా :** **వచ్ఛ, ఇమస్స మిత్తిఆమోరఅస్స రమ్మతణం దేక్ఖత్తి భణిదోసి. (వత్స! అస్య మృత్తికామయూరస్య రమ్యత్వం పశ్యేతి భణితోఽసి.)**

**రాజా :** **(ఆత్మగతమ్) కిం వా శకుంతలేత్యస్య మాతురాఖ్యా? సంతి పునర్నామధేయ సాదృశ్యాని. అపి నామ మృగతృష్ణికేవ నామమాత్ర ప్రస్తావో మే విషాదాయ కల్పతే?**

**బాలః :** **అజ్జుఏ, రోఅది మే ఏసో భద్దమోరఓ. (ఇతి క్రీడనకమాదత్తే) (మాతః! రోచతే మే ఏషః భద్రమయూరః)**

**ప్రథమా :** **(విలోక్య సోద్వేగమ్) అహ్మహే, రక్ఖాకరండఅం సే మణిబంధే ణ దీసది (అహో! రక్షాకరండకమస్య మణిబంధే న దృశ్యతే!!)**

**రాజా :** **అలమలమావేగేన. నన్విదమస్య సింహశాబవిమర్దాత్పరిభ్రష్టమ్.**

**(ఇత్యాదాతు మిచ్ఛతి)**

---

**ఇమస్స:** వత్స = నాయనా! అస్య = ఈ, మృత్తికా మయూరస్య = మట్టినెమలియొక్క (శకుంతస్య), రమ్యత్వమ్ = లావణ్యం, పశ్య = చూడు, ఇతి =అని, భణితః+ అసి = చెప్పబడ్డావు.

**కిం వా:** (ఆత్మగతమ్ = తనలో) కిమ్+వా = ఏమీ! అస్య = ఇతడి, మాతుః+ఆఖ్యా = తల్లిపేరు, శకుంతలా+ఇతి = శకుంతల అనియా? పునః = కానీ, నామధేయ సాదృశ్యాని = పేరులలో పోలికలు, సంతి = లోకంలో ఉన్నవే. ఒకే పేరున్న వ్యక్తులు – సమాన నామధేయులు – చాలామంది ఉండవచ్చునని. నామమాత్ర – ప్రస్తావః = శకుంతల అనే నామమాత్రపు ప్రస్తావన, మృగతృష్ణికా+ఇవ = ఎండమావిలాగా, మే = నాకు, విషాదాయ = అధిక దుఃఖానికి, అపినామ– కల్పతే = సమర్థమవుతోందా? నా దుఃఖాన్ని పెంచుతోందా? – అని.

**రోఅది:** మాతః = తల్లీ! ఏషః = ఈ, భద్రమయూరః = మగనెమలి, మే = నాకు, రోచతే = నచ్చింది!!

**అహ్మహే:** (విలోక్య = పరిశీలనగా చూసి, సోద్వేగమ్ = అలజడితో) అహో = అయ్యో! రక్షాకరండకమ్ = రక్షకోసం కట్టిన తాయెత్తు, అస్య = వీడి, మణిబంధే = మణికట్టు మీద, న–దృశ్యతే = కనబడటం లేదు!! ఎక్కడ పడిపోయిందో అని ఆందోళన. (కరండో మధుకోశే స్యాత్ వీటికా ఖడ్గకోశయోః – అమరం. రక్షాఘుటికా – అని కాటయ.).

**ఉభే : మాక్ఖు ఏదం అవలంబఅ. కహం గహీదం ణేన. (ఇతి విస్మయాత్ ఉరోనిహితహస్తే పరస్పరమవలోకయతః) (మాఖల్విదమవలంబస్వ. కథం గృహీతమనేన?)**

**రాజా : కిమర్థం ప్రతిషిద్ధాః స్మః?**

**ప్రథమా : సుణాదు, మహాభాఓ. ఏసా అవరాజిదా ణామ ఓసహీ ఇమస్స జాతకమ్మసమఏ భఅవదా మారీఏణ దిణ్ణా. ఏదం కిల మాతాపిదరో అప్పాణం చ వజ్జిఅ అవరో భూమిపడిఅం ణ గేణ్హాది. (శృణోతు మహాభాగః. ఏషా అపరాజితా నామౌషధిరస్య జాతకర్మసమయే భగవతా మారీచేన దత్తా. ఏతాం కిల మాతాపితరావాత్మానం చ వర్జయిత్వా పరో భూమిపతితాం న గృహ్ణాతి.)**

---

**అలమలమ్:** అలమ్+అలమ్+ఆవేగేన = ఆందోళన చాలు చాలు. ఆందోళన పడవద్దు – అని. అస్య+ఈతడి, ఇదమ్ = ఈ రక్షాకరండకం, సింహశాబ – విమర్దాత్ = సింహపు పిల్లతోడి గుంజులాటవల్ల, పరిభ్రష్టమ్ + నను = నేలకు జారిపడింది సుమా! (ఇతి = అనిచెప్పి, ఆదాతుమ్+ఇచ్ఛతి = అందుకోవడానికి ప్రయత్నిస్తాడు.)

**మాక్ఖు:** ఇదమ్ = దీనిని, మా+అవలంబస్వ–ఖలు = ముట్టుకోవద్దు సుమా! కథమ్ = ఎట్టా!? అనేన = ఇతడిచేత, గృహీతమ్ = అందుకోబడినదే? (ఇతి = అని, విస్మయాత్ = ఆశ్చర్యంతో, ఉరః+ నిహిత – హస్తే = గుండెలమీద చేతులు వేసుకొని, పరస్పరమ్ = ఒకరినొకరు, అవలోకయతః = చూసుకొంటారు.) వద్దువద్దు అంటూండగానే దుష్యంతుడు నేలమీద పడ్డ ఆ తాయెత్తును తీశాడు. అతడికి ఏమీ కాలేదు. ఇది ఎలా సాధ్యపడింది అని ఆ తాపసుల ఆశ్చర్యమూ ఆందోళనానూ.

**కిమర్థమ్:** కిమర్థమ్ = ఎందుకని, ప్రతిషిద్ధాః + స్మః = నివారింపబడ్డాము? పట్టుకోవద్దనీ ముట్టుకోవద్దనీ ఎందుకన్నారు? – అనడం.

**సుణాదు:** మహాభాగః= మహానుభావుడు, శృణోతు = వినుగాక! ఏషా = ఈ తాయెత్తు, అపరాజితా – నామ = అపరాజిత అనే పేరుగల, ఓషధిః = ఒక ఓషధి. అస్య = ఈ బాలుడికి, జాతకర్మ సమయే = బారసాలప్పుడు (బాలసారె), భగవతా+మారీచేన = మహానుభావుడైన కశ్యప ప్రజాపతిచేత, దత్తా = ఈయబడినది. మాతాపితరౌ = పిల్లవాడి తల్లిదండ్రులనూ, ఆత్మానమ్ + చ = తననూ, వర్జయిత్వా = మినహాయించి, అపరః = మరెవ్వడూ, భూమి పతితామ్ = నేలమీద పడిన, ఏతామ్ = దీనిని, న–గృహ్ణాతి + కిల = తీయరాదు సుమా!

**రాజా : అథ గృహ్ణాతి?**

**ప్రథమా : తదోతం సప్పో భవిఅ దంసఇ. (తతస్తం సర్పో భూత్వా దశతి)**

**రాజా : భవతీభ్యాం కదాచిదస్యాః ప్రత్యక్షీకృతా విక్రియా?**

**ఉభే : అణేఅసో (అనేకశః)**

**రాజా : (సహర్షమ్ - ఆత్మగతమ్) కథమివ సంపూర్ణమపి మే మనోరథః నాభినందామి? (ఇతి బాలం పరిష్వజతే)**

**ద్వితీయా : సువ్వదే, ఏహి, ఇమం వుత్తంతం ణిఅమవ్వావుదాఏ సఉందలాఏ ణివేదేహ్మ. (సువ్రతే! ఏహి. ఇమం వృత్తాంతం నియమవ్యాపృతాయై శకుంతలాయై నివేదయావః.)**

**(ఇతి నిష్క్రాంతే)**

---

**అథగృహ్ణాతి:** అథ – గృహ్ణాతి = ఒకవేళ తీస్తాడు – తీస్తే?

**తదోతం:** తతః = వెంటనే, సర్పః+భూత్వా = సర్పమై, తమ్ = ఆ తీసినవాడిని, దశతి = కరుస్తుంది.

**భవతీభ్యామ్:** అస్యాః = ఈ అపరాజితయొక్క, విక్రియా = ఈ పరిణామం – పామై కరవడమనేది, భవతీభ్యామ్ = మీ ఇద్దరిచేతనూ, కదాచిత్ = ఎప్పుడైనా, ప్రత్యక్షీకృతా = ప్రత్యక్షంగా చూడబడిందా?

**అణేఅసో:** అనేకశః = చాలాసార్లు చూశాం.

**కథమివ:** (సహర్షమ్ = ఆనందంగా, ఆత్మగతమ్ = తనలో) మే–మనోరథః = నాకోరిక – నా ఆశ, సంపూర్ణమ్+అపి = పూర్తిగా తీరినా, న+అభినందామి = నన్ను నేను అభినందించుకోలేకపోతున్నాను – సంబరపడలేకపోతున్నాను, కథమివ = ఏమిది?! (ఇతి = అని, బాలమ్ = పుత్రుణ్ని, పరిష్వజతే = కౌగిలించుకొంటాడు).

**సువ్వదే:** సువ్రతే = ఓసీ సువ్రతా! ఏహి = రమ్ము! ఇమమ్+వృత్తాంతమ్ = ఈ కథ అంతా, నియమవ్యాపృతాయై = తపస్వినీ నియమాలతో తీరికలేనిదైన, శకుంతలాయై = మన శకుంతలకై, నివేదయావః = విన్నవిద్దాము!

(ఇతి = అని, నిష్క్రాంతే = ఇద్దరూ నిష్క్రమిస్తారు)

**బాలః : ముంచ మం. జావ అజ్జుఏ సఆసం గమిస్సం. (ముంచ మామ్. యావన్మాతుః సకాశం గమిష్యామి).**

**రాజా : పుత్రక! మయా సహ మాతరమభినందిష్యసి?**

**బాలః : మమ క్ఖు తాదో దుస్సందో. ణ తుమమ్. (మమ ఖలు తాతో దుష్యంతః. న త్వమ్.)**

**రాజా : (సస్మితమ్) ఏవం వివాద ఏవ ప్రత్యాయయతి. (తతః ప్రవిశత్యేకవేణీధరా శకుంతలా)**

**శకుంతలా : విఆరకాలే వి పకిదిత్థం సవ్వదమణస్స ఓసహిం సుణిఅ ణ మే ఆసా ఆసి అత్తణో భాఅహేఏసు. అహవా జహ సాణుమదీఏ ఆచక్ఖిదం తహ సంభావీఅది ఏదం. (వికారకాలేఽపి ప్రకృతిస్థాం సర్వదమనస్యౌషధిం శ్రుత్వా న మే ఆశాసీదాత్మనో భాగధేయేషు. అథవా యథా సానుమత్యా ఆఖ్యాతం తథా సంభావ్యతే ఏతత్.)**

---

**ముంచ మం:** మామ్ = నన్ను, ముంచ = విడిచిపెట్టు. మాతుః+సకాశమ్ = మా అమ్మదగ్గరికి, యావత్+గమిష్యామి = వెంటనే వెడతాను.

**పుత్రక:** పుత్రక = తనయుడా! మయా+సహ = నాతో కలిసివెళ్ళి, మాతరమ్ = తల్లిని అభినందిష్యసి = ఆనందింపజేస్తావా? నన్నూ నీతో తీసుకువెడతావా? నువ్వు ఒక్కడివే వెళ్ళి ఆనందపెడతావా? – అని. (మయా సహైవ మాతరమ్ – పాఠాంతరం).

**మమ క్ఖు:** మమ–తాతః = నా తండ్రి, దుష్యంతః+ఖలు = దుష్యంతుడు సుమా! న–త్వమ్ = నువ్వు కాదు.

**ఏవమ్:** (సస్మితమ్ = చిరునవ్వుతో) ఏవమ్ = ఇలా, వివాదః+ఏవ = వివాదమే – నా తండ్రి నువ్వు కాదు, దుష్యంతుడు అనే వివాదమే, ప్రత్యాయయతి = నమ్మిక కలిగిస్తోంది.

(తతః+అంతట, ఏకవేణీధరా = ఒంటిజడతో, శకుంతలా = శకుంతల, ప్రవిశతి = ప్రవేశిస్తుంది)

**విఆరకాలే:** వికారకాలే+ అపి = పాముగా వికృతిని పొందవలసిన సమయంలోసైతం (పరాయివాడు చేతితో తియ్యడం), ప్రకృతిస్థామ్ = యథాతథంగానే ఉండిపోయిన, సర్వదమనస్య+ఓషధిమ్ = సర్వదమనుడి ఓషధి అపరాజిత గురించి, శ్రుత్వా =

**రాజా : (శకుంతలాం విలోక్య) అయే, సేయమత్రభవతీ శకుంతలా?! యైషా–**

**వసనే పరిధూసరే వసానా**
**నియమక్షామముఖీ ధృతైకవేణిః**
**అతినిష్కరుణస్య శుద్ధ శీలా**
**మమ దీర్ఘం విరహవ్రతం బిభర్తి. 21**

**శకుంతలా: (పశ్చాత్తాపవివర్ణం రాజానం దృష్ట్వా) ణ క్ఖు అజ్జఉత్తో విఅ. తదోకో ఏసో దాణిం కిదరక్ఖామంగలం దారఅం మే గాత్త సంసగ్గేణ దూసేది. (న ఖలు ఆర్యపుత్ర ఇవ. తతః క ఏష ఇదానీం కృతరక్షామంగళం దారకం మే గాత్రసంసర్గేణ దూషయతి?!)**

---

వినినప్పటికీ, ఆత్మనః + భాగధేయేషు = నా అదృష్టాల విషయంలో, మే = నాకు, ఆశా = ఆశ, న+ఆసీత్ = కలుగకుంది. అథవా = అయినా, సానుమత్యా = నా ప్రియసఖి సానుమతిచేత, యథా+ఆఖ్యాతమ్ = ఏది చెప్పబడినదో, తథా = అలాగే, ఏతత్ = ఇది, సంభావ్యతే = నాచేత ఆదరింపబడుచున్నది. నేను దీన్ని అలా భావిస్తున్నాను – అనడం. దుష్యంతుడు శకుంతలను అభినందించేట్టు దేవతలే వ్యూహరచన చేస్తున్నారనీ, అందాకా ప్రతీక్షించాలనీ సానుమతి చెప్పినది – ఇదే కావచ్చు అని ఆశించడం – అన్నమాట.

**వసనే:** (శకుంతలామ్ = శకుంతలను, విలోక్య = చూసి) అయే = అయ్యో! అత్రభవతీ = మాన్యురాలు, సా+శకుంతలా = ఆ శకుంతల, ఇయమ్ = ఈమెయేనా? యా+ఏషా = ఈమె – పరిధూసరే = మాసిపోయిన, వసనే = దుస్తులలో, వసానా = వసిస్తున్నదీ; నియమ = వ్రతవిధులతో, క్షామ–ముఖీ = నీరసించిన ముఖం కలదీ; ధృత+ఏకవేణిః = ఒంటి జడవేసుకొన్నదీ అయిన, శుద్ధశీలా = నిష్కలంక చరిత్ర, అతి నిష్కరుణస్య = అత్యంత కఠినచిత్తుడనైన, మమ = నా, దీర్ఘమ్ – విరహవ్రతమ్ = సుదీర్ఘమైన విరహవ్రతం, బిభర్తి = భరిస్తోంది.

**తాత్పర్యం:** మాసిపోయిన దుస్తులతో, వాడిపోయిన ముఖంతో, ఒంటిజడతో ఈ పతివ్రత ఇలా అతికఠినాత్ముడినైన నా విరహాన్ని సుదీర్ఘకాలంగా భరిస్తోంది! అయ్యయ్యో!!

**ణ క్ఖు:** (పశ్చాత్తాప = పశ్చాత్తాపంతో, వివర్ణమ్ = నల్లబడ్డ, రాజానమ్ = రాజును, దృష్ట్వా = చూసి) ఆర్యపుత్రః+ఇవ = నా ఆర్యపుత్రుడిలాగా, న+ఖలు = లేదు సుమా!

**బాలః : (మాతర ముపేత్య) అజ్జుఏ, ఏసో కోవి పురిసో మం పుత్తత్తి ఆలింగది. (మాతః! ఏష కోఽపి పురుషో మాం పుత్ర ఇత్యాలింగతి)**

**రాజా : ప్రియే! క్రౌర్యమపి మే త్వయి ప్రయుక్త మనుకూల పరిణామం సంవృత్తమ్, యదహమిదానీం త్వయా ప్రత్యభిజ్ఞాతమాత్మానం పశ్యామి.**

**శకుం : (ఆత్మగతమ్) హి అఅ, అస్సస అస్సస, పరిచ్చత్త మచ్చరేణ అణుఅప్పిఅ హ్మి దేవేణ. అజ్జఉత్తోక్ఖు ఏసో. (హృదయ! ఆశ్వసిహి ఆశ్వసిహి. పరిత్యక్త మత్సరేణానుకంపితాస్మి దైవేన. ఆర్యపుత్రః ఖల్వేషః!)**

---

తతః = మరి, ఏషః+కః = ఇతడెవరు? ఇదానీమ్ = ఇప్పుడు, కృతరక్షామంగళమ్ = ధరించిన తాయెత్తుగల, మే–దారకమ్ = నా పుత్రుణ్ని, గాత్రసంసర్గేణ = తన గాత్ర సంపర్కంతో – కౌగిలింతతో, దూషయతి = మలిన పరుస్తున్నాడు?!

**అజ్జుఏ:** (మాతరమ్+ఉపేత్య = తల్లిచెంతకు చేరి) మాతః = అమ్మా! ఏషః = ఈతడు, కః+అపి+పురుషః = ఎవరో పరాయివాడు, మామ్ = నన్ను, పుత్రః+ఇతి = పుత్రుడని, ఆలింగతి = కౌగిలించుకొంటున్నాడు.

**ప్రియే:** ప్రియే! = ప్రియురాలా! త్వయి+ప్రయుక్తమ్ = నీపట్ల చూపిన, మే+క్రౌర్యమ్+అపి = నా క్రూరత్వం కూడా, అనుకూల పరిణామమ్+ సంవృత్తమ్ = అనుకూలంగానే పరిణమించింది. యత్ = ఏమిటంటే – ఇదానీమ్ = ఇప్పుడు, అహమ్ = నేను, త్వయా = నీచేత, ప్రత్యభిజ్ఞాతమ్ + ఆత్మానమ్ = గుర్తింపబడినవాడినిగా, పశ్యామి = భావిస్తున్నాను. అప్పుడు నిన్ను గుర్తించలేదు. పశ్చాత్తాపంతో ఎవరికీ ఆనవాలు దొరకనంతగా మారిపోయిన నన్ను ఇప్పుడు నువ్వు గుర్తించావు. నా అపరాధం కడిగివేయబడిందన్నమాట – అనేది అనుకూల పరిణామమని వ్యాఖ్యాతలు. (ఇప్పుడు నన్ను నీ వానవాలు పట్టగలిగితి వనుకొనుచున్నాను – కందుకూరి)

**హి అఅ:** (ఆత్మగతమ్ = తనలో) హృదయ – హృదయమా! ఆశ్వసిహి – ఆశ్వసిహి = ఊరడిల్లుమూరడిల్లుము. పరిత్యక్తమత్సరేణ = ఇప్పటికి మాత్సర్యం విడిచిపెట్టినవాడైన, దైవేన = దేవుడిచేత, అనుకంపితా+ అస్మి = కరుణింపబడినదాన నైతిని. ఏషః = ఇతడు, ఆర్యపుత్రః+ఖలు = నా ఆర్యపుత్రుడే సుమా!

**రాజా : ప్రియే!**

**స్మృతిభిన్నమోహతమసో దిష్ట్యా ప్రముఖే స్థితాసి మే సుముఖి!**
**ఉపరాగాంతే శశినః సముపగతా రోహిణీ యోగమ్. 22**

**శకుం : జేదు జేదు అజ్జఉత్తో (ఇత్యర్ధోక్తౌ బాష్పకంఠీ విరమతి) (జయతు జయతు ఆర్యపుత్రః).**

**రాజా : సుందరి!**

**బాష్పేణ ప్రతిషిద్ధేఽపి జయ శబ్దే జితం మయా**
**యత్తే దృష్టమసంస్కారపాటలోష్ఠపుటం ముఖమ్. 23**

---

**స్మృతి:** ప్రియే = ప్రియురాలా! సుముఖి = సుందరవదనా! (అనుకూలా!!) దిష్ట్యా = అదృష్టవశాత్తూ, స్మృతి = ఎరుకతో (గుర్తురావడంతో), భిన్న = తొలగిపోయిన, మోహ = అజ్ఞానం అనే, తమసః = రాహువు కలవాడనైన, మే = నా, ప్రముఖే = సమ్ముఖంలో, స్థితా+అసి = నిలిచావు. ఉపరాగ + అంతే = గ్రహణం వీడటంతో, శశినః = చంద్రుడితో, రోహిణీ = అతని ఇల్లాలైన రోహిణి, యోగమ్ = పునస్సమాగమం, సమ్+ఉపగతా = పొందింది.

**తాత్పర్యం:** ప్రేయసీ! అదృష్టవశాత్తూ, నేను స్మృతిని పొందడంతో నాకు పట్టిన మరపు అనే రాహువు వదిలిపోయింది. నువ్వు నా సమ్ముఖంలో నిలిచావు. ఇలా గ్రహణం వీడటంతో – రోహిణీదేవి చంద్రుడితో సమాగమం పొందింది!! (తమస్తు రాహుః స్వర్భానుః. ఉపరాగో గ్రహో రాహుగ్రస్తే త్విందౌ చ పూష్ణి చ – అమరం)

**జేదు జేదు:** జయతు – జయతు = జయించుగాక – జయించుగాక! ఆర్యపుత్రః = ఆర్యపుత్రుడు (ఇతి = అని, అర్ధోక్తౌ = సగం మాటలో, బాష్పకంఠీ = దుఃఖంతో గొంతు పూడుకుపోయి, విరమతి = విరమిస్తుంది). మాట సగంలో ఆగిపోతుంది – అలనాడు కొలువులో లాగా)

**బాష్పేణ:** సుందరి = సొగసరీ! జయశబ్దే = "జయతు" అనేమాట, బాష్పేణ = కన్నీటితో, ప్రతిషిద్ధే+అపి = నిరోధింపబడినదైనా, మయా = నాచేత, జితమ్ = జయం పొందబడినదే. యత్ = ఎందుకంటే, అసంస్కార = ఎర్రదనం పులుముకోవడమూ మొదలైన సంస్కారాలకు నోచుకోకపోయినా, పాటల = ఎర్రగానే ఉన్న, ఓష్ఠపుటమ్ = పెదవుల జంట కలదైన, తే+ముఖమ్ = నీ వదనం, దృష్టమ్ = చూడబడింది. చూడగలిగాను –అనడం.

**బాలః : అజ్జుఏ, కో ఏసో? (మాతః! క ఏషః?)**

**శకుం : వచ్ఛ, దే భాఅహేఆఇం పుచ్ఛేహి. (వత్స! తే భాగధేయాని పృచ్ఛ.)**

**రాజా : (శకుంతలాయాః పాదయోః ప్రణిపత్య)**

**సుతను హృదయాత్ప్రత్యాదేశవ్యలీకమపైతు తే**
**కిమపి మనసః సమ్మోహో మే తదా బలవానభూత్**
**ప్రబల తమసామేవం ప్రాయాః శుభేషు ప్రవృత్తయః**
**స్రజమపి శిరస్యంధః క్షిప్తాం ధునోత్యహిశంకయా. 24**

---

**తాత్పర్యం:** ఏ సుందరీకరణమూ – (సంస్కారం) లేక చిట్లి ఎరుపుగొన్న పెదవులతో ఉన్న నీ ముఖం దర్శించగలిగాను. అందుకని – కన్నీటితో పూడుకుపోయిన నీ గొంతులో జయశబ్దం సగంలో ఆగిపోయినా నేను జయం పొందినట్టే!!

**అజ్జుఏ:** మాతః = అమ్మా! ఏషః+కః = ఈయన ఎవరు?

**వచ్ఛ:** వత్స = నాయనా! తే = నీ, భాగధేయాని = అదృష్టదేవతలను, పృచ్ఛ = అడుగు. (పృచ్ఛ అనే క్రియాపదం కొన్ని ప్రతులలో లేదు. తే =నీ, భాగధేయాని = అదృష్టదేవతలు వీరు అని రూపకాతిశయోక్తి. ఈయన నీ భాగధేయాల సమాహారం. కనుక వీరినే అడుగు – అనడం. నీ తండ్రి – అని చెప్పలేదంటే ఆమె కోపం ఏమీ తగ్గలేదన్నమాట).

**సుతను:** (శకుంతలాయాః = శకుంతలయొక్క, పాదయోః = కాళ్లమీద, ప్రణిపత్య = పడి) సుతను = సుందరాంగీ! తే = నీ, హృదయాత్ = మనస్సునుంచి, ప్రత్యాదేశ – వ్యలీకమ్ = నా తిరస్కృతి అనే అప్రియం, అపైతు = తొలగిపోవుగాక! (వ్యలీకం త్వప్రియేఽనృతే – అమరం). తదా = అలనాడు అప్పుడు, మే–మనసః = నా మనస్సుకు, కిమపి = ఏదో తెలియని, సమ్మోహః = ఒక మైకం, బలవాన్ + అభూత్ = గాఢంగా కమ్మేసింది – ఏర్పడింది. ప్రబలతమసామ్ = అధిక దుఃఖంలో కూరుకుపోయినవారి, ప్రవృత్తయః = నడవడులు, శుభేషు = శుభకార్యాల విషయంలో, ఏవమ్+ప్రాయాః = ఒక్కొక్కసారి ఇలాంటివే – శుభానికి మోకాలొడ్డే లాంటివే – అవుతుంటాయి. (తమశ్శోకే గుణాంతరే – ఇతి విశ్వః). శిరసి+క్షిప్తామ్ = శిరస్సున ఉంచబడిన, స్రజమ్+అపి = దండనుసైతం, అంధః = గ్రుడ్డివాడు, అహి–శంకయా = పాము అనే భ్రాంతితో, ధునోతి = విదిలించేస్తాడు – తిరస్కరిస్తాడు.

**శకుం : ఉట్ఠేదు అజ్జఉత్తో. ణూణం మే సుఅరిఅప్పడిబంధఅం పురాకిదం తేసు దిఅహేసు పరిణామముహం ఆసి జేణ సాణుక్కోసో వి అజ్జఉత్తో మఇ విరసో సంవుత్తో. (ఉత్తిష్ఠత్వార్యపుత్రః. నూనం మే సుచరిత ప్రతిబంధకం పురాకృతం తేషు దివసేషు పరిణామముఖమాసీద్యేన సానుక్రోశోఽపి ఆర్యపుత్రో మయి విరసః సంవృత్తః.)**

**(రాజోత్తిష్ఠతి)**

**శకుం : అహ కహం అజ్జఉత్తేణ సుమరిదో దుక్ఖభాఈ అఅం జణో. (అథ కథ మార్యపుత్రేణ స్మృతో దుఃఖభాగ్యయం జనః?)**

**రాజా : ఉద్ధృతవిషాదశల్యః కథయిష్యామి.**

**మోహాన్మయా సుతను పూర్వముపేక్షితస్తే**
**యో బాష్పబిందురధరం పరిబాధమానః**

---

**ఉట్ఠేదు:** ఆర్యపుత్రః = ఆర్యపుత్రుడు, ఉత్తిష్ఠతు = లేచుగాక! నూనమ్ = అవును నిజమే! పురాకృతమ్ = నేను పూర్వజన్మల్లో చేసుకున్న, మే = నా, సుచరిత–ప్రతిబంధకమ్ = అదృష్టాన్ని అడ్డుకొనే దుష్కర్మ, తేషు – దివసేషు = అప్పటి ఆనాళ్లలో, పరిణామముఖమ్+ఆసీత్ = పరిపక్వదశను పొందిందన్నమాట. యేన = అందుకనే, సానుక్రోశః + అపి = ఎంతో దయగలవాడే అయినా, ఆర్యపుత్రః = ఆర్యపుత్రుడు (తమరు), మయి = నాపట్ల, విరసః = కఠినుడూ విరాగుడూ, సంవృత్తః = అయ్యాడు. అంతేలెండి! ఏ జన్మలో చేసుకొన్న పాపమో?! మీరు తిరస్కరించారు – అనడం.

(రాజా = దుష్యంతుడు, ఉత్తిష్ఠతి = కాళ్ళమీదనుంచి లేస్తాడు)

**అహ కహం:** అథ = ఇంతకీ, దుఃఖభాగీ = దుఃఖాలకే నోచుకొన్న, అయమ్+జనః ఈ వ్యక్తి (నేను), ఆర్యపుత్రేణ = ఆర్యపుత్రుడిచేత (తమతో), కథమ్+స్మృతః = ఎలా తలవబడింది?! అప్పట్లో ఏదో మైకం కమ్మింది, మరిచానంటున్నారు గదా! తమరికి నేను ఇప్పుడు మళ్ళీ ఎలా జ్ఞాపకం వచ్చాను? – అనడం.

**మోహాత్:** ఉద్ధృత – విషాదశల్యః = పెకలించివేయబడిన విషాదమనే బాణపు ములికి కలవాడనై, కథయిష్యామి = చెబుతాను. సుతను = సుందరాంగీ! పూర్వమ్ = అలనాడు, తే = నీ, అధరమ్ = పెదవిని, పరిబాధమానః = నొప్పిస్తున్నదైన, యః = ఏ, బాష్పబిందుః = కన్నీటిచుక్క, మయా = (ధర్మభీరువునైన) నాచేత, మోహాత్ = మతిమరపువల్ల,

తం తావ దాకుటిల పక్ష్మవిలగ్న మద్య
బాష్పం ప్రమృజ్య విగతానుశయో భవేయమ్. **25**

(ఇతి యథోక్త మనుతిష్ఠతి)

**శకుం : (నామముద్రాం దృష్ట్వా) అజ్జఉత్త, ఏదం తే అంగులీఅఅం! (ఆర్యపుత్ర! ఇదం తేఽంగులీయకమ్!?)**

**రాజా : అస్మాదంగులీయకోపలంభాత్ ఖలు స్మృతిరుపలబ్ధా!**

**శకుం : విసమం కిదం ణేణ జం తదా అజ్జఉత్తస్స పచ్చఅకాలే దుల్లహం ఆసీ. (విషమం కృతమనేన యత్తదార్యపుత్రస్య ప్రత్యయకాలే దుర్లభమాసీత్.)**

---

ఉపేక్షితః = నిర్లక్ష్యం చెయ్యబడిందో, అద్య = ఇప్పుడు, ఆకుటిల = వాలుగా ఉన్న, పక్ష్మ = కనురెప్పలలో, విలగ్నమ్ = నిలిచినదైన, తమ్+బాష్పమ్ = అదే కన్నీటిచుక్కను, ప్రమృజ్య = తుడిచి, విగత+అనుశయః = తొలగిన పశ్చాత్తాపం కలవాడను, భవేయమ్+తావత్ = అగుదునుగాక! (అపరాధ పరిజ్ఞానాదనుతాపస్తు యో భవేత్ స విషాదః – సుధాకరే)

**తాత్పర్యం:** అలనాడు నీ పెదవికి జారిన కన్నీటి బిందువును నిర్లక్ష్యం చేశాను. ఇప్పుడు నీ కనురెప్పలలో నిలిచిన అదే కన్నీటిని తుడిచి నా పశ్చాత్తాపం తొలగించుకుంటాను. సుందరీ! అంగీకరించు!!

(ఇతి= అని, యథోక్తమ్ = అన్నట్టుగానే, అనుతిష్ఠతి = ఆచరిస్తాడు)

**అజ్జఉత్త:** (కన్నీరు తుడుస్తుండగా, నామముద్రామ్ = దుష్యంతుడి చేతికున్న రాజముద్రికను, దృష్ట్వా = చూచి) ఆర్యపుత్రా! ఇదమ్ = ఇదిగో, తే = నీ, అంగులీయకమ్ = ఉంగరం?! ఎలా చేరింది నీకు – అని, ప్రశ్నగర్భమైన ఆశ్చర్యం.

**అస్మాత్:** అస్మాత్ = ఈ, అంగులీయక+ఉపలంభాత్+ఖలు = ఉంగరం లభించడం వల్లనే గదా, స్మృతిః+ఉపలబ్ధా = నాకు మునుపటి స్మృతి కలిగింది!!

**విసమం:** అనేన = ఈ ఉంగరం చేత, విషమమ్+కృతమ్ = ఈ విషమస్థితి కల్పింపబడింది, యత్ = ఎందువల్లనంటే, ఆర్యపుత్రస్య = ఆర్యపుత్రుడికి, ప్రత్యయకాలే = ఆనవాలుగా చూపించి నమ్మకం కలిగించవలసిన తరుణంలో, దుర్లభమ్ + ఆసీత్ = కనుమరుగయ్యింది.

**రాజా : తేన హి ఋతుసమవాయచిహ్నం ప్రతిపద్యతాం లతా కుసుమమ్.**

**శకుం : ణసే విస్ససామి. అజ్జఉత్తో ఏవ్వ ణం ధారేదు (నాస్య విశ్వసిమి. ఆర్యపుత్ర ఏవై తద్ధారయతు).**

**(తతః ప్రవిశతి మాతలిః)**

**మాతలిః : దిష్ట్యా ధర్మపత్నీ సమాగమేన పుత్రముఖదర్శనేన చాయుష్మాన్ వర్ధతే.**

**రాజా : అభూత్సంపాదితస్వాదుఫలో మే మనోరథః మాతలే! న ఖలు విదితోఽయమ్ ఆఖండలేన వృత్తాంతః స్యాత్?**

**మాతలిః : (సస్మితమ్) కిమీశ్వరాణాం పరోక్షమ్ నామ? ఏత్వాయుష్మాన్. భగవాన్ మారీచస్తే దర్శనం వితరతి.**

---

**తేనహి:** తేన+హి = అవును అందువల్లనే, ఋతు–సమవాయ – చిహ్నమ్ = తగిన ఋతువు (తరుణం) రాకకు చిహ్నంగా, లతా = ఈ పూలతీగ (నువ్వు), కుసుమమ్ = పువ్వును (ఈ ఉంగరాన్ని), ప్రతిపద్యతామ్ = పొందుగాక!

**ణసే:** అస్య – న – విశ్వసిమి = దీనిని నేను నమ్మను. ఆర్యపుత్రః+ఏవ = ఆర్యపుత్రుడే (తమరే), ఏతత్ = దీనిని (ఈ ఉంగరాన్ని), ధారయతు = ధరించుగాక!!

(తతః = అంతట, మాతలిః = మాతలి, ప్రవిశతి = ప్రవేశిస్తాడు)

**దిష్ట్యా:** దిష్ట్యా = అదృష్టవశాత్తూ, ధర్మపత్నీ సమాగమేన = ఇల్లాలి కలయికతో, పుత్ర–ముఖదర్శనేన+చ = కన్నకొడుకును దర్శించడంతోనూ, ఆయుష్మాన్ = ఆయుష్మంతుడు, వర్ధతే = వర్ధిల్లుతున్నాడు!!

**అభూత్:** మే+మనోరథః = నాకోరిక, సంపాదిత – స్వాదుఫలః = పొందిన మధుర ఫలం కలది, అభూత్ = అయ్యింది. మధురంగా నా కోరిక "సఫల"మయ్యిందని. మాతలీ! అయమ్+వృత్తాంతః = ఈ జరిగినదంతా, ఆఖండలేన = ఇంద్రుడిచేత, న+ఖలు – విదితః+స్యాత్ = తెలియబడదూ? ఇది ఇంద్రుడికి తెలిసి ఉండదంటావా?! అని.

**కిమీశ్వరాణామ్:** (సస్మితమ్ = చిరునవ్వుతో) ఈశ్వరాణామ్ = దేవతలకు (ప్రభువులకు) కిమ్+పరోక్షమ్+నామ = తెలియని దంటూ ఏముంటుంది? (ఇది అంతా ఇంద్రాది దేవతల వ్యూహరచనయే – అనడం చిరునవ్వుకి అర్థమట!)

**రాజా! : శకుంతలే! అవలంబ్యతాం పుత్రః. త్వాం పురస్కృత్య భగవంతం ద్రష్టుమిచ్ఛామి.**

**శకుం : హిరిఆమి అజ్జఉత్తేణ సహ గురుసమీపం గంతుం. (జిహ్రేమ్యార్యపుత్రేణ గురు సమీపం గంతుమ్.)**

**రాజా : అలం హ్రియా. ఏవ మాచరితవ్య మభ్యుదయకాలేషు. ఏహ్యేహి.**

**(సర్వే పరిక్రామంతి)**

**(తతః ప్రవిశత్యదిత్యా సార్ధమాసనస్థో మారీచః)**

**మారీచః : (రాజానమవలోక్య) దాక్షాయణి!**

**పుత్రస్య తే రణశిరస్యయమగ్రయాయీ**
**దుష్యంత ఇత్యభిహితో భువనస్య భర్తా**

---

ఆయుష్మాన్ = ఆయుష్మంతుడు, ఏతు = వచ్చుగాక! (రమ్ము). భగవాన్+మారీచః = మహానుభావుడు కశ్యపుడు, తే = నీకు, దర్శనమ్+ వితరతి = దర్శనమిస్తాడు.

**అవలంబ్యతామ్:** శకుంతలా! పుత్రః+అవలంబ్యతామ్ = పుత్రుణ్ని తీసుకో. త్వామ్ = నిన్ను, పురస్కృత్య = ముందుంచుకొనే – నీతోకలిసే, భగవంతమ్ = మహానుభావుడు కశ్యపుణ్ని, ద్రష్టుమ్+ఇచ్ఛామి = దర్శించాలనుకొంటున్నాను.

**హిరిఆమి:** ఆర్యపుత్రేణ = ఆర్యపుత్రుడితో కలిసి, గురుసమీపమ్ + గంతుమ్ = పెద్దాయన దగ్గరకు వెళ్లడానికి, జిహ్రేమి = సిగ్గుగా ఉంది (సిగ్గు పడుతున్నాను).

**అలమ్:** అలమ్+హ్రియా = సిగ్గుపడటం చాలులే. అభ్యుదయకాలేషు = మంచి జరిగిన వేళల్లో (మంగళోత్సవాది సమయేషు), ఏవమ్+ఆచరితవ్యమ్ = ఇలా చెయ్యాలి – గురుదర్శనం చెయ్యాలనడం. ఏహి+ఏహి = రా! రా!!

(సర్వే = అందరూ, పరిక్రామంతి = ముందుకు నడుస్తారు)

(తతః = అంతట, అదిత్యా–సార్ధమ్ = అదితితో సహా, మారీచః = కశ్యపుడు, ఆసనస్థః = ఆసనస్థుడై, ప్రవిశతి = ప్రవేశిస్తాడు)

**పుత్రస్య:** (రాజానమ్+అవలోక్య = చేరవస్తున్న రాజును చూసి) దాక్షాయణి = దక్ష ప్రజాపతి కూతురా! అదితీ!! తే = నీ, పుత్రస్య = పుత్రుడైన ఇంద్రుడికి, రణశిరసి

**చాపేన యస్య వినివర్తితకర్మ జాతం**
**తత్కోటిమత్కులిశమాభరణం మఘోనః.** **26**

**అదితిః : సంభావణీఆణుభావాసే ఆకిదీ. (సంభావనీయానుభావాస్య ఆకృతిః)**

**మాతలిః : ఆయుష్మన్! ఏతౌ పుత్రప్రీతిపిశునేన చక్షుషా దివౌకసాం పితరౌ ఆయుష్మంతమవలోకయతః. తావుపసర్ప.**

**రాజా : మాతలే! ఏతౌ–**

**ప్రాహుర్ద్వాదశధా స్థితస్య మునయో యత్తేజసః కారణం**
**భర్తారం భువనత్రయస్య సుషువే యద్యజ్ఞ భాగేశ్వరమ్**

---

= యుద్ధరంగంలో, అయమ్ = ఇతడు, అగ్రయాయీ = ముందు నడిచేవాడు. దుష్యంతః+ఇతి+అభిహితః = దుష్యంతుడు అని చెప్పబడే, భువనస్య+భర్తా = భూలోకప్రభువు. యస్య = (ఏ) ఇతనియొక్క, చాపేన = ధనుస్సుతో, మఘోనః = మన ఇంద్రుడి, తత్ = ఆ, కోటిమత్ = నూరు అంచులుగల, కులిశమ్ = వజ్రాయుధం, వినివర్తిత – కర్మ = పనిలేనిదిగా చేయబడి, ఆభరణమ్ + జాతమ్ = కేవలం అలంకారమయ్యింది.

**తాత్పర్యం:** దాక్షాయణీ! ఇతడు భూలోకభర్త దుష్యంతుడు. రణరంగంలో ఇంద్రుడికి ముందుంటాడు. నూరంచుల వజ్రాయుధం చేసే పనిని ఇతడి ధనుస్సే నిర్వహించడంతో అది ఇంక ఇంద్రుడికి చేతిలో ఒక ఆభరణమయ్యింది.

**సంభావణీఆ:** అస్య+ఆకృతిః = ఇతడి రూపం, సంభావనీయ+అనుభావా = గుర్తించ దగ్గ మహిమ కలదే. (సంభావనీయః అనుభావః మహిమా యస్యాస్సా ఆకృతిః).

**ఆయుష్మన్:** ఆయుష్మంతుడా! ఏతౌ = ఈ, దివౌకసామ్+పితరౌ = దేవతల తల్లిదండ్రులిద్దరూ, పుత్రప్రీతి – పిశునేన = పుత్రవాత్సల్యాన్ని సూచిస్తున్న, చక్షుషా = చూపుతో – ఇంద్రుడిపట్ల వాత్సల్యాన్ని నీపట్ల చూపుతున్న దృష్టితో, ఆయుష్మంతమ్ = ఆయుష్మంతుణ్ని (నిన్ను), అవలోకయతః = చూస్తున్నారు. తౌ+ఉపసర్ప = వారిని సమీపించు.

**ప్రాహుః:** మాతలీ! ఏతౌ = వీరిద్దరూ – దక్షమరీచి సంభవమ్ = దారిణీ దక్ష సంభవయైన అదితీ, కళామరీచి సంభవుడైన కశ్యపుడూ కలదైన, ఇదమ్ = ఈ, ద్వంద్వమ్ = జంట, తత్+స్రష్టుః = ఆ బ్రహ్మదేవుడికి, ఏక+అంతరమ్ ఒక్కతరమే తరువాతది. బ్రహ్మకూ

**యస్మిన్నాత్మభవః పరోఽపి పురుషశ్చక్రే భవాయాస్పదం**
**ద్వంద్వం దక్షమరీచి సంభవమిదం తత్ స్రష్టురేకాంతరమ్. 27**

**మాతలిః : అథకిమ్.**

**రాజా : (ఉపగమ్య) ఉభాభ్యామపి వాసవానుయోజ్యో దుష్యంతః ప్రణమతి.**

---

ఈ అదితి కశ్యపులకూ మధ్య కేవలం ఒక్క తరమే (దక్ష–మరీచుల తరం) అంతరమని. అలాంటి ఈ జంటను – మునయః = వ్యాసాది మహర్షులు, ద్వాదశధా+స్థితస్య = పన్నెండు రూపాలుగా ఉన్న, తేజసః = మహాతేజస్సుకు, కారణమ్ = కారణమని (ఉత్పత్తిహేతువని), ప్రాహుః = చెబుతున్నారు. ద్వాదశాదిత్యులకూ–లేదా – ద్వాదశ కిరణాలతో విరాజిల్లే సూర్యుడికీ వీరు జన్మప్రదాతలు అని. యత్ = ఈ జంట, భువనత్రయస్య = ముల్లోకాలకూ, భర్తారమ్ = అధిపతీ, యజ్ఞ భాగ+ఈశ్వరమ్ = యజ్ఞాలలో హవిర్భాగానికి ప్రభువూ అయిన ఇంద్రుణ్ని, సుషువే = ప్రసవించింది. ఇంద్రుడికీ వీరే జన్మప్రదాతలు అని. యస్మిన్ = ఈ జంటయందు, ఆత్మభవః = స్వయంభువూ, పరః+పురుషః+అపి = పురుషోత్తముడూ అయిన వామనుడు సైతం, భవాయ = తన పుట్టుకకు, ఆస్పదమ్+చక్రే = (స్థానం చేసుకున్నాడు) నెలవు ఒనర్చుకున్నాడు. వామనుడికీ వీరే జన్మప్రదాతలు అని. అంతటివారు ఈ దంపతులు.

**తాత్పర్యం:** ఈ అదితికశ్యపులు – సూర్యుడికీ ఇంద్రుడికీ ఉపేంద్రుడికీ (వామనుడు) జన్మప్రదాతలైన దంపతులు.

**విశేషాలు:** తత్ర విష్ణుశ్చ శక్రశ్చ జజ్ఞాతే పునరేవ హి అర్యమా చైవ ధాతా చ త్వష్టా పూషా తథైవ చ వివస్వాన్ సవితా చైవ మిత్రో వరుణ ఏవ చ అంశుః భగశ్చాదితిజా ఆదిత్యా ద్వాదశ స్మృతాః. తపినీ తాపినీ ధూమ్రా మరీచిః జ్వాలినీ రుచిః సుషుమ్నా భోగదా విశ్వా బోధినీ ధారిణీ క్షమా కభాద్యా వసుధా సౌర్యా ఠండాంతా ద్వాదశేరితాః. మన్వంతరే చ సంప్రాప్తే తథా వైవస్వతే ద్విజ! వామనః కశ్యపాద్విష్ణుః అదిత్యాం సంబభూవ హ. (విష్ణుపురాణమ్).

**అథకిమ్:** అథకిమ్ = అవును.

**ఉభాభ్యామ్:** (ఉపగమ్య = సమీపించి) ఉభాభ్యామ్+అపి = మీ ఇరువురికీ, వాసవ+అనుయోజ్యః = ఇంద్రుడి భృత్యుడు, దుష్యంతః = ఈ దుష్యంతుడు, ప్రణమతి = ఇదే నమస్కరించుచున్నాడు.

**మారీచః : వత్స! చిరంజీవ! పృథివీం పాలయ!!**

**అదితిః : వచ్ఛ! అప్పడిరహో హోది. (వత్స! అప్రతిరథో భవ)**

**శకుం : దారఅ సహిదా వో పాదవందణం కరేమి. (దారకసహితా వో పాదవందనం కరోమి).**

**మారీచః : వత్సే!**

**ఆఖండలసమో భర్తా జయంతప్రతిమస్సుతః**
**ఆశీరన్యా న తే యోగ్యా పౌలోమీ సదృశీ భవ. 28**

**అదితిః : జాదే, భత్తుణో అబిమదా హోహి. అవస్సం దీహాఊ వచ్ఛఓ ఉహఅకులణందణో హోదు. ఉవవిసహ. (జాతే! భర్తురభిమతా భవ. అవశ్యం దీర్ఘాయుర్వత్స ఉభయకుల నందనో భవతు. ఉపవిశత.**

---

**వత్స:** వత్స = నాయనా! చిరమ్+జీవ = చిరకాలం జీవించు. పృథివీమ్ = భూమిని, పాలయ = పాలించు.

**అప్పడిరహో:** వత్స = నాయనా! అప్రతిరథః + భవ = ఎదురులేని మహావీరుడవు కమ్ము. (న విద్యతే ప్రతిరథః = ప్రతివీరః యస్య).

**దారఅ:** దారక-సహితా = పుత్రుడితో కలిసి, వః = మీ, పాదవందనమ్+కరోమి = పాదాలకు మ్రొక్కుతున్నాను.

**ఆఖండల:** వత్సే = బిడ్డా! భర్తా = నీ పెనిమిటి, ఆఖండల సమః = ఇంద్రుడంతటివాడు. సుతః = నీ సుతుడు, జయంతప్రతిమః = జయంతుడంతటివాడు, అన్యా = మరొకటీ మరొకటీ, ఆశీః = ఆశీస్సు, తే = నీకు, న-యోగ్యా = నప్పదు. పౌలోమీ సదృశీ + భవ = ఇంద్రపత్ని శచీదేవికి సాటిదానవు కమ్ము.

**తాత్పర్యం:** అమ్మాయీ! నీ భర్త - ఇంద్రుడంతటివాడు. నీ తనయుడు జయంతుడంతటివాడు. ఇక నీకు మరేమి ఆశీస్సు అందించను. సాక్షాత్తు శచీదేవికి సాటిదానవు కమ్ము!!

**భత్తుణో:** జాతే = తనయా! భర్తుః = మగనికి, అభిమతా+భవ = ఆదరపాత్రవుకమ్ము. వత్సః = నీ కుమారుడు, అవశ్యమ్ = తప్పకుండా, దీర్ఘాయుః = దీర్ఘాయుష్మంతుడై,

(సర్వే ప్రజాపతి మభిత ఉపవిశంతి)

**మారీచః : (ఏకైకం నిర్దిశన్)**

**దిష్ట్యా శకుంతలా సాధ్వీ సదపత్యమిదం భవాన్**
**శ్రద్ధా విత్తం విధిశ్చేతి త్రితయం తత్సమాగతమ్. 29**

**రాజా : భగవన్! ప్రాగభిప్రేతసిద్ధిః పశ్చాద్దర్శనమ్. అతోఽపూర్వః ఖలు వోఽనుగ్రహః. కుతః–**

**ఉదేతి పూర్వం కుసుమం తతః ఫలమ్**
**ఘనోదయః ప్రాక్తదనంతరం పయః**

---

ఉభయకుల – నందనః = రెండు వంశాలనూ ఆనందింపజేసేవాడు, భవతు = అగుగాక! ఉపవిశత = కూర్చోండి!!

(సర్వే = అందరూ, ప్రజాపతిమ్+ అభితః = కశ్యప ప్రజాపతిని పరివేష్టించి, ఉపవిశంతి = కూర్చుంటారు)

**దిష్ట్యా:** (ఏకైకమ్ = ఒక్కొక్కరినీ, నిర్దిశన్ = చూపిస్తూ) సాధ్వీ – శకుంతలా = పతివ్రతయైన శకుంతల, ఇదమ్ – సత్+అపత్యమ్ = ఈ మంచి పుత్రుడు, భవాన్ = నువ్వు, దిష్ట్యా = అదృష్టవశాత్తు, శ్రద్ధా = శ్రద్ధ, విత్తమ్ = సొమ్ము, విధిః+చ = అనుష్ఠానమూ, ఇతి = అని, తత్+త్రితయమ్ = ఆ త్రికం – మూడూ, సమాగతమ్ = సమకూడింది.

**తాత్పర్యం:** శ్రద్ధలాగా ఈ సాధ్వి, సొమ్ములాగా నీ సుతుడు, ఆచరణలాగా నువ్వూ – ఇలా మీ త్రితయం అదృష్టవశాత్తూ సమకూడింది. (వస్సమాగతమ్ – పాఠాంతరం).

**భగవన్:** భగవన్ = మహాత్మా! (దేవానామపి యే దేవా మహాత్మానో మహర్షయః భగవన్నితి తే వాచ్యా యాస్తేషాం యోషితస్తథా – నాట్యశాస్త్రం). ప్రాక్ = ముందుగా, అభిప్రేతసిద్ధిః = అభీష్ట సిద్ధి కలిగింది, పశ్చాత్ = ఆపైని, దర్శనమ్ = మీ దర్శనం లభించింది. అతః = అందుచేత, వః = తమరి, అనుగ్రహః = అనుగ్రహం, అపూర్వః+ఖలు = అపూర్వం సుమా! కుతః = ఎలాగంటే–

**ఉదేతి:** పూర్వమ్ = ముందుగా, కుసుమమ్+ఉదేతి = పువ్వు ఉదయిస్తుంది, తతః+ఫలమ్ = అటుపైని ఫలం అవుతుంది. ప్రాక్ = ముందుగా, ఘన+ఉదయః =

**నిమిత్తనైమిత్తికయోరయం క్రమః**
**తవ ప్రసాదస్య పురస్తు సంపదః. 30**

**మాతలిః : ఏవం విధాతారః ప్రసీదంతి.**

**రాజా : భగవన్! ఇమామాజ్ఞాకరీం వో గాంధర్వేణ వివాహ విధినోపయమ్య కస్య చిత్కాలస్య బంధుభిరానీతాం స్మృతిశైథిల్యాత్ప్రత్యాదిశన్ అపరాద్ధోఽస్మి తత్రభవతో యుష్మత్సగోత్రస్య కణ్వస్య. పశ్చాత్ అంగులీయక దర్శనాత్ ఊఢపూర్వాం తద్దుహితరమవగతోఽస్మి. తచ్చిత్రమివ మే ప్రతిభాతి.**

---

మబ్బులు పుడతాయి, తదనంతరం = అటుపైని, పయః = వాన. నిమిత్త – నైమిత్తికయోః = కారణానికీ కార్యానికీ, అయమ్+క్రమః = ఇదీ వరస. తు = కానీ, తవ– ప్రసాదస్య = నీ అనుగ్రహానికి మాత్రం, పురః = ముందుగానే, సంపదః = సర్వసంపదలూను.

**తాత్పర్యం:** మహాత్మా! ముందు కారణం, తరవాత కార్యం అనేది ప్రకృతి సిద్ధం. ముందుగా పువ్వు పుడుతుంది. పండుగా మారుతుంది. ముందుగా మబ్బులు వస్తాయి. తరవాత వాన కురుస్తుంది. కానీ నీ అనుగ్రహానికన్నా ముందే సంపదలు వెల్లివిరుస్తాయి!!

**ఏవమ్:** విధాతారః = ప్రజాపతులు, ఏవమ్ = ఇలాగే, ప్రసీదంతి = కరుణిస్తారు!!

**ఇమామ్:** భగవన్ = మహాత్మా! ఇమామ్ = ఈ, వః = మీ, ఆజ్ఞాకరీమ్ = సేవకురాలైన శకుంతలను, గాంధర్వేణ – వివాహవిధినా = గాంధర్వ వివాహపద్ధతితో, ఉపయమ్య = పెళ్ళాడి, కస్యచిత్+కాలస్య = కొంతకాలానికి, బంధుభిః = గౌతమీ ప్రభృతులైన ఆత్మీయులతో, ఆనీతామ్ = నాచెంతకు కొనిరాబడిన ఈమెను, స్మృతిశైథిల్యాత్ = మతిమరుపువల్ల, ప్రత్యాదిశన్ = తిరస్కరించినవాడనై, యుష్మత్+సగోత్రస్య = నీ గోత్ర సంభవుడైన (గోత్రాపత్యం), తత్రభవతః = మాన్యుడు, కణ్వస్య = కణ్వుడికి (కశ్యపస్య అపత్యం – కాశ్యపః = కణ్వః), అపరాద్ధః + అస్మి = అపరాధం చేసినవాడనయ్యాను. పశ్చాత్ = అటు తరువాత, అంగులీయక దర్శనాత్ = నా రాజముద్రికను చూడటంతో, ఊఢపూర్వామ్ = నాచేత మునుపు పరిణీతయైన, తత్+దుహితరమ్ = వారి కుమారితను, అవగతః+అస్మి = తెలుసుకోగలిగాను. తత్ = అది అంతా, చిత్రమ్+ఇవ = చాలా చిత్రంగా, మే–ప్రతిభాతి = నాకు అనిపిస్తోంది.

**యథా గజో నేతి సమక్షరూపే**
**తస్మిన్నపక్రామతి సంశయః స్యాత్**
**పదాని దృష్ట్వా తు భవే త్ప్రతీతిః**
**తథావిధో మే మనసో వికారః.** **31**

**మారీచః : వత్స! అలమాత్మాపరాధశంకయా. సమ్మోహోఽపి త్వయ్యనుపపన్నః. శ్రూయతామ్.**

**రాజా : అవహితోఽస్మి.**

**మారీచః : యదైవాప్సరస్తీర్థావతరణాత్ ప్రత్యక్షవైక్లబ్యాం శకుంతలామాదాయ మేనకా దాక్షాయణీముపగతా తదైవ ధ్యానాదవగతోఽస్మి దుర్వాససః శాపాదియం తపస్వినీ సహధర్మచారిణీ త్వయా ప్రత్యాదిష్టా నాన్యథేతి. స చాయమ్ అంగుళీయక దర్శనావసానః.**

---

**యథా గజః:** సమక్షరూపే (సతి) = ప్రత్యక్షరూపంగా ఉన్నప్పుడు, గజః+న+ఇతి = ఇది ఏనుగు కాదు అనిపించి; తస్మిన్ = అది, అపక్రామతి (సతి) = వెళ్ళిపోగా, యథా – సంశయః +స్యాత్ = ఏనుగేనేమో అని సంశయం కలిగి, పదాని = అడుగుజాడలు, దృష్ట్వా = గమనించి, ప్రతీతిః = ఏనుగే అని నమ్మకం, యథా– భవేత్ = ఎలా కలుగుతుందో, తథా విధః = అలాంటిది, మే = నా, మనసః+వికారః = అప్పటి నా మనోవికారం.

**తాత్పర్యం:** కళ్ల ఎదుట ప్రత్యక్షంగా ఏనుగు ఉంటే (శకుంతల బంధువులతో వచ్చి ఎదుట నిలిస్తే) అది ఏనుగే కాదనీ, అది కాస్తా వెళ్లిపోయాక ఏనుగేనేమో (నేను పరిణయమాడానేమో) అని సందేహం కలిగి, అటుపైని అడుగుజాడలు చూసి (ఉంగరం దొరికి) ఏనుగే అని నమ్మిక కలిగినట్టు ఉంది నా మానసిక స్థితి!!

**అలమాత్మ:** వత్స = కుమారా! ఆత్మాపరాధ – శంకయా = అపరాధ భావనతో, అలమ్ = చాలు. (ఆత్మాపచార శంకయా – పాఠాంతరం). నిన్ను నీవు అపరాధిగా భావించకు – అని. సమ్మోహః+అపి = అప్పటి నీ మతిమరుపు సైతం, త్వయి+అనుపపన్నః = నీ అంతట నీకు కలిగినది కాదు. శ్రూయతామ్ = విను.

**అవహితః:** అవహితః + అస్మి = సావధానుడనై ఉన్నాను.

**యదైవ:** అప్సరస్తీర్థావతరణాత్ = అప్సరస్తీర్థఘట్టం నుంచి, ప్రత్యక్ష వైక్లబ్యామ్ = ప్రస్ఫుటంగా మనోవేదనకు గురియైన, శకుంతలామ్ = శకుంతలను, ఆదాయ

**రాజా : (సోచ్ఛ్వాసమ్) ఏష వచనీయాన్ముక్తోఽస్మి.**

**శకుం : (స్వగతమ్) దిట్ఠిఆ అకారణపచ్చాదేశీ ణ అజ్జఉత్తో. ణహు సత్తం అత్తాణం సుమరేమి. అహవా పత్తో మఏ స హి సాబో విరహ సుణ్ణహి అఆఏ ణ విదిదో. అదో సహీహిం సందిట్ఠహ్మి భత్తుణో అంగులీఅఅం దంసఇదవ్వం త్తి. (దిష్ట్యాకారణప్రత్యాదేశీ నార్యపుత్రః. న ఖలు శప్తమాత్మానం స్మరామి. అథవా ప్రాప్తో మయా స హి శాపో విరహశూన్యహృదయయా న విదితః. అతస్సఖీభ్యాం సందిష్టాస్మి భర్తురంగులీయకం దర్శయితవ్యమితి.)**

---

= వెంటబెట్టుకొని, మేనకా = ఆమె కన్నతల్లి మేనక, యదా+ఏవ = ఎప్పుడైతే, దాక్షాయణీమ్ = ఈ అదితిని, ఉపగతా = సమీపించిందో, తదా+ఏవ = అప్పుడే, ధ్యానాత్ = తపశ్శక్తివల్ల, అవగతః+అస్మి = తెలుసుకొన్నాను – దుర్వాససః +శాపాత్ = దుర్వాసో మునిపుంగవుడి శాపం వల్ల, ఇయమ్+తపస్వినీ = ఈ అమాయకురాలు, సహధర్మచారిణీ = నీ ధర్మపత్ని, త్వయా = నీచేత, ప్రత్యాదిష్టా = తిరస్కృత అయ్యింది, న+అన్యథా+ఇతి = మరెందువల్లా కాదు అని అవగతోఽస్మి. సః+చ+అయమ్ = ఆ శాపం కూడా, అంగులీయక దర్శన+అవసానః = అంగులీయక దర్శనమే అవధిగా ముగింపుగా కలది.

**ఏషః:** (సోచ్ఛ్వాసమ్ = నిట్టూర్చి) ఏషః = ఇదే, వచనీయాత్ = అపవాదునుంచి, ముక్తః +అస్మి = విడుదల పొందాను.

**దిట్ఠిఆ:** (స్వగతమ్ = తనలో) దిష్ట్యా = అదృష్టవశాత్తు, ఆర్యపుత్రః = నా ఆర్యపుత్రుడు, అకారణ – ప్రత్యాదేశీ+న = నిష్కారణంగా తిరస్కరించినవాడు కాలేదు. శప్తమ్ = శపింపబడినదానిగా, ఆత్మానమ్ = నన్ను నేను, న+స్మరామి+ఖలు = స్మరించలేక పోతున్నాను సుమా! దూర్వాసుడు శపించినట్టు నాకు గుర్తే లేదు – అనడం. అథవా = ఒకవేళ, ప్రాప్తః = పొందబడిన, సః+శాపః = ఆ శాపం, విరహశూన్య హృదయయా = విరహం వల్ల శూన్యహృదయనైన, మయా = నాచేత, న+విదితః+హి = తెలుసుకోబడలేదో! నేను తెలుసుకోలేకపోయాను – అనడం. అతః = అందుకే, సఖీభ్యామ్ = నా చెలిమికత్తెలైన అనసూయా ప్రియంవదలచేత, సందిష్టా+అస్మి = (ఆశ్రమం నుంచి వస్తున్నప్పుడు) ఉపదేశింపబడినదాననైతిని, భర్తుః = నీ మగనికి, అంగులీయకమ్ = ఉంగరం, దర్శయితవ్యమ్ + ఇతి = చూపించవలసినది – అని.

**మారీచః : వత్సే! చరితార్థాసి. సహధర్మచారిణం ప్రతి న త్వయా మన్యుః కార్యః. పశ్య–**

**శాపాదసి ప్రతిహతా స్మృతిరోధరూక్షే**
**భర్తర్యపేతతమసి ప్రభుతా తవైవ**
**ఛాయా న మూర్ఛతి మలోపహతప్రసాదే**
**శుద్ధే తు దర్పణతలే సులభావకాశా. 32**

**రాజా : యథాహ భగవాన్.**

---

**చరితార్థా:** వత్సే = పుత్రీ! చరితార్థా+అసి = ధన్యురాలివయ్యావు. సహధర్మచారిణమ్ + ప్రతి = నీ ఆర్యపుత్రుడిపట్ల, త్వయా = నీచేత, మన్యుః = కోపం, న+కార్యః = చేయదగ్గది కాదు. మగనిపై అలగకు – అని. పశ్య = చూడు–

**శాపాత్:** శాపాత్ = దుర్వాససుడి శాపం వల్ల, ప్రతిహతా+అసి = దెబ్బ తిన్న దానవయ్యావు. స్మృతి–రోధ = మరపువల్ల, రూక్షే = కఠినాత్ముడైనవాడూ, అపేత –తమసి = ఆ చీకటీ దుఃఖమూ తొలగినవాడూ అయిన, భర్తరి = ఈ నీ ఆర్యపుత్రుడి విషయంలో, ప్రభుతా = ఆధిపత్యం, తవ+ఏవ = ఇక నీదే. మల+ఉపహతే = మకిలితో అడ్డగింపబడిన, ప్రసాదే = ప్రసన్నత గల, దర్పణతలే = అద్దంలో, ఛాయా = ప్రతిబింబం, న+మూర్ఛతి = ప్రసరించదు. శుద్ధే+తు = మకిలి వదిలి శుభ్రపడ్డ, దర్పణతలే+ఏవ = అద్దంలోనే, ఛాయా = ప్రతిబింబం, సులభ+అవకాశా = స్పష్టమయ్యే (ప్రతిబింబించే) అవకాశం కలది అవుతుంది. (ఛాయా సూర్యప్రియా కాంతిః ప్రతిబింబమనాతపః – అమరం).

**తాత్పర్యం:** తల్లీ! శాపంవల్ల దెబ్బతిన్నావు. అందుకే నీ భర్తకు మరపు ఏర్పడింది. దానితో కఠినాత్ముడయ్యాడు. చీకటి తొలగి మరుపు వదలి దుఃఖమూ తీరి – పులు గడిగిన అద్దమయ్యాడు. దుమ్ము కొట్టుకుపోయిన అద్దంలో ప్రతిబింబం కనపడదు గానీ శుభ్రపడ్డాక స్పష్టంగా కనపడుతుంది గదా! ఇక ఇప్పటి నుంచి నీ భర్త మీద ఆధిపత్యం నీదే!!

**యథాహ:** భగవాన్ = మహానుభావుడు, యథా+ఆహ = అన్నట్టే – అంగీకరిస్తున్నాననీ, అలాగే జరుగుతుందనీను.

**మారీచః : వత్స! కచ్చిదభినందితస్త్వయా విధివదస్మాభిరనుష్ఠితజాతకర్మా పుత్ర ఏష శాకుంతలేయః.**

**రాజా : భగవన్! అత్ర ఖలు మే వంశప్రతిష్ఠా.**

**మారీచః : తథా భావినమేనం చక్రవర్తిన మవగచ్ఛతు భవాన్. పశ్య–**

**రథేనానుద్ఘాతస్తిమిత గతినా తీర్ణజలధిః**
**పురా సప్తద్వీపాం జయతి వసుధామప్రతిరథః**
**ఇహాయం సత్త్వానాం ప్రసభదమనాత్ సర్వదమనః**
**పునర్యాస్యత్యాఖ్యాం భరత ఇతి లోకస్య భరణాత్. 33**

---

**కచ్చిత్:** వత్స = నాయనా! విధివత్ = శాస్త్రప్రకారంగా, అస్మాభిః = మాచేత, అనుష్ఠిత = చేయబడిన, జాతకర్మా = జన్మ సంస్కారాలు కలవాడైన, పుత్రః = బిడ్డడు, ఏషః = ఈ, శాకుంతలేయః = శకుంతలా సుతుడు, త్వయా = నీచేత, అభినందితః + కచ్చిత్ = అభినందింపబడ్డాడా? గుర్తించి ఆశీర్వదించావా? దగ్గరకు తీసుకున్నావా? – అనడం. (కొన్ని ప్రతులలో ఈ వాక్యం లేదు).

**అత్ర ఖలు:** భగవన్ = మహాత్మా! అత్ర+ఖలు = వీడియందే గదా, మే = నా, వంశప్రతిష్ఠా = వంశపు ఉనికీ శాశ్వతత్త్వమూనూ!!

**తథా భావినమ్:** తథా = అవును. ఏనమ్ = ఇతడిని, భావినమ్+చక్రవర్తినమ్ = కాబోయే చక్రవర్తిగా, భవాన్ = నీవు, అవగచ్ఛతు = తెలుసుకొందువుగాక! పశ్య = చూడు – అనుద్ఘాత = కుదుపులు లేనిదై, స్తిమిత–గతినా = నిబ్బరంగా ప్రయాణించేదైన, రథేన = రథంతో, తీర్ణ – జలధిః = సముద్రాలు దాటినవాడై, అప్రతిరథః = ఎదిరించే వీరుడే లేనివాడై, పురా = ముందుగా, సప్తద్వీపామ్ = కుశమూక్రౌంచమూ ఇత్యాదిగా ఏడు ద్వీపాలతో ఉన్న, వసుధామ్ = మొత్తం భూగోళాన్ని, జయతి = జయిస్తాడు. (జేష్యతి అనడానికి బదులు జయతి. యావత్పురా నిపాతయోర్లట్). ఇహ = ప్రస్తుతం, సత్త్వానామ్ = సింహశార్దూలాది ప్రాణులను, ప్రసభ – దమనాత్ = బలాత్కారంగా హింసించడం వల్ల, సర్వదమనః = సర్వదమనుడు, ఇతి = అని, ఆఖ్యామ్ = ముద్దుపేరును, అయమ్ = ఇతడు, యాతః = పొందాడు. పునః = కానీ, లోకస్య = భూలోకం యొక్క (లోకస్తు భువనే జనే – అమరం), భరణాత్ = రక్షణ పోషణాదుల వల్ల, భరతః+ఇతి+ఆఖ్యామ్ = “భరతుడు” అనే పేరును, యాస్యతి = పొందుతాడు.

**రాజా : భగవతా కృతసంస్కారే సర్వమస్మిన్ వయమాశాస్మహే.**

**అదితిః : భఅవం, ఇమాఏ దుహిదుమణోరహ సంపత్తీఏ కణ్ణో వి దావ సుద విత్థారో కరీఅదు. దుహిదువచ్ఛలా మేణఆ ఇహ ఏవ్వ ఉవచరంతీ చిట్ఠది. (భగవన్! అనయా దుహితృమనోరథసంపత్త్యా కణ్వోఽపి తావత్ శ్రుతవిస్తారః క్రియతామ్. దుహితృవత్సలా మేనకా ఇహైవోపచరంతీ తిష్ఠతి. )**

**శకుం : (ఆత్మగతమ్) మణోరహో క్ఖు మే భణిదో భఅవదీఏ. (మనోరథః ఖలు మే భణితో భగవత్యా)**

---

**తాత్పర్యం:** ఇప్పుడు సింహశార్దూలాలను హింసిస్తూ సర్వదమనుడు అనిపించు కొంటున్న ఈ నీ చిరంజీవి, రేపు అప్రతిరథుడై తిరుగులేని రథం మీద సప్తద్వీపాలనూ జయించి, మొత్తం ప్రజానీకాన్నీ భూలోకాన్నీ రక్షిస్తాడు, పోషిస్తాడు. అప్పుడూ – భరణాత్ భరతః అని సార్థకనామధేయుడు అవుతాడు.

**భగవతా:** భగవతా = మహాత్ముడవైన నీచేత, కృతసంస్కారే = జాతకర్మాది సంస్కారాలు చేయబడినవాడైన, అస్మిన్ = ఇతడి విషయంలో, సర్వమ్ = సమస్తమూ – దిగ్విజయం చక్రవర్తిత్వం ఇత్యాదులన్నీ, వయమ్ = మేము, ఆశాస్మహే = ఆకాంక్షిస్తున్నాము.

**ఇమాఏ:** భగవన్ = మహాత్మా! అనయా = ఈ, దుహితృ – మనోరథ – సంపత్త్యా = కూతురి కోరిక తీరిన శుభసంపదతో, కణ్వః+అపి = పెంచిన తండ్రి కణ్వర్షి సైతం, శ్రుతివిస్తారః = వీనులవిందు కలవాడుగా, క్రియతామ్+తావత్ = చేయబడుగాక! కణ్వర్షికీ ఈ శుభవార్తను పంపించి వీనులవిందు చేయండి – అనడం. దుహితృ–వత్సలా = కూతురిపట్ల వాత్సల్యం నిండిన, మేనకా = శకుంతల కన్నతల్లి, ఇహ+ఏవ = ఇక్కడనే, ఉపచరంతీ = సేవలు చేస్తూ, తిష్ఠతి = ఉండనే ఉంది. ఆవిడ ఈ దినుసు శ్రుతి విస్తారం పొందుతూనే ఉంది అనడం.

**మణోరహో:** (ఆత్మగతమ్ = తనలో) భగవత్యా = ఈ మహాత్మురాలిచేత, మే = నాదైన, మనోరథః = కోరిక, భణితః+ఖలు = ప్రస్తావింపబడిందిగదా! నేను మనసులో కోరుకొంటున్నదే ఈవిడ పలికింది – అనడం.

**మారీచః : తపః ప్రభావాత్ ప్రత్యక్షం సర్వమేవ తత్రభవతః.**

**రాజా : అతః ఖలు మమ నాతిక్రుద్ధో మునిః.**

**మారీచః : తథాప్యేతత్ ప్రియమస్మాభిః సందేష్టవ్యమ్. కః కోఽత్రభోః?**

**(ప్రవిశ్య)**

**శిష్యః : భగవన్! అయమస్మి.**

**మారీచః : గాలవ! ఇదానీమేవ విహాయసా గత్వా మమ వచనాత్తత్రభవతే కణ్వాయ ప్రియమావేదయ యథాపుత్రవతీ శకుంతలా తచ్ఛాపనివృత్తౌ స్మృతిమతా దుష్యంతేన ప్రతిగృహీతేతి.**

---

**తపః ప్రభావాత్:** తపః+ప్రభావాత్ = తపశ్శక్తివల్ల, తత్రభవతః = ఆ మహానుభావుడికి, సర్వమ్ = అంతా, ప్రత్యక్షమ్+ఏవ = ప్రత్యక్షమే. కరతలామలకమే – అనడం.

**అతః ఖలు:** అతః+ఖలు = అందుకేనేమో, మునిః = కణ్వర్షి, మమ = నాపై, న+అతిక్రుద్ధః = అంతగా కోపించలేదు. లేకపోతే ఎప్పుడో నన్ను శపించి ఉండేవాడు – అని భావం.

**తథాపి:** తథాపి = అయినా, ఏతత్+ప్రియమ్ = ఈ ప్రియసంఘటనం, అస్మాభిః = మాచేత, సందేష్టవ్యమ్ = సందేశంగా పంపబడవలసినదే (అసౌ = కణ్వుడు, అస్మాభిః, ప్రియమ్ = కుశలం, ప్రష్టవ్యః = అడుగబడవలసినవాడే. శుభవార్త అందించి కుశలం కనుక్కోవాలి అనడం ఒక పాఠాంతరం. అసౌ ప్రియ సమాయోగస్సందేష్టవ్యః – మరో పాఠాంతరం) కః+కః+అత్ర+భోః = ఎవరక్కడ?!

(ప్రవిశ్య = గాలవుడు ప్రవేశించి)

**భగవన్:** భగవన్ = మహాత్మా! అయమస్మి = ఇదిగో వచ్చాను!

**ఇదానీమేవ:** గాలవ = గాలవుడా! ఇదానీమ్+ఏవ = ఇప్పుడే, విహాయసా+గత్వా = ఆకాశమార్గాన వెళ్ళి, మమ–వచనాత్ = నా మాటగా, తత్రభవతే+కణ్వాయ = మాన్యుడైన కణ్వుడికి, ప్రియమ్+ఆవేదయ = ఈ ప్రియవార్తను విన్నవించు – యథా = ఎలాగంటే – పుత్రవతీ+శకుంతలా = మగబిడ్డకు కన్నతల్లియైన శకుంతల, తత్+శాపనివృత్తౌ = దూర్వాసుడిచ్చిన ఆ శాపం తీరిపోవడంతో, స్మృతిమతా = మరపువదలి ఎరుకగలవాడైన, దుష్యంతేన = దుష్యంతుడిచేత, ప్రతిగృహీతా = స్వీకరింపబడింది, ఇతి = అని.

**శిష్యః : యదాజ్ఞాపయతి భగవాన్. (ఇతి నిష్క్రాంతః)**

**మారీచః : వత్స! త్వమపి స్వాపత్యదార సహితః సఖ్యురాఖండలస్య రథమారుహ్య తే రాజధానీం ప్రతిష్ఠస్వ.**

**రాజా : యదాజ్ఞాపయతి భగవాన్.**

**మారీచః : వత్స! కిం తే భూయః ప్రియముపకరోమి?**

**రాజా : అతః పరమపి ప్రియమస్తి? యదీహ భగవాన్ ప్రియం కర్తుమిచ్ఛతి తర్హీదమస్తు భరతవాక్యమ్.**

**ప్రవర్తతాం ప్రకృతిహితాయ పార్థివః**
**సరస్వతీ శ్రుతమహతాం మహీయసామ్**

---

**యదాజ్ఞా:** భగవాన్ = భగవంతుడు (నీవు), యత్+ఆజ్ఞాపయతి = ఆజ్ఞాపించినట్టే – చేస్తాను అని. (ఇతి = అని, నిష్క్రాంతః = నిష్క్రమిస్తాడు).

**త్వమపి:** వత్స = నాయనా! త్వమపి = నువ్వుకూడా, స్వ+అపత్య–దార–సహితః = కొడుకు ఇల్లాలుతో కలిసి, సఖ్యుః + ఆఖండలస్య = నీ మిత్రుడైన ఇంద్రుడి, రథమ్+ఆరుహ్య = రథం అధిరోహించి, తే–రాజధానీమ్ = నీ రాజధానికి, ప్రతిష్ఠస్వ = బయలుదేరు.

**యదాజ్ఞాపయతి:** భగవాన్ = మహాత్ముడు, యత్+ఆజ్ఞాపయతి = ఆనతిచ్చినట్టే.

**కిం తే:** వత్స = నాయనా! తే = నీకు, భూయః = ఇంకా, కిమ్+ప్రియమ్ + ఉపకరోమి = ఏ ప్రియం సమకూర్చను?

**అతఃపరమ్:** అతః+పరమ్+అపి+ప్రియమ్+అస్తి = ఇంతకన్నా మించిన ప్రియం ఉంటుందా? యది = అయినా, భగవాన్ = మహాత్ముడు, ఇహ = ఇప్పుడు ఇంకా, ప్రియమ్+కర్తుమ్+ఇచ్ఛతి = ప్రియం కలిగించాలనుకుంటే, తర్హి = అప్పుడు, ఇదమ్+ఇది, భరతవాక్యమ్+అస్తు = భరతవాక్యమగుగాక! (ఈ సందర్భంలో త్వయి భవతు బిడౌజాః అనే శ్లోకమొకటి అధికపాఠంగా కొన్ని ప్రతులలో కనిపిస్తోంది.)

**ప్రవర్తతామ్:** పార్థివః = రాజు, ప్రకృతిహితాయ = ప్రజాహితం కోసం, ప్రవర్తతామ్ = ప్రవర్తించుగాక! (ప్రకృతిర్గుణ సామ్యే స్యాత్ అమాత్యాది స్వభావయోః యోనౌ లింగే

**మమాపి చ క్షపయతు నీలలోహితః**
**పునర్భవం పరిగతశక్తి రాత్మభూః.** **34**

**(ఇతి నిష్క్రాంతా స్సర్వే)**

**–: ఇతి సప్తమోఽంకః :–**

**సమాప్తమిద మభిజ్ఞాన శాకుంతలం నామ నాటకమ్**

---

పౌరవర్గే – మేదినీ) శ్రుతమహతామ్ = వేదవేత్తలైన – శాస్త్రగరిష్ఠులైన, మహీయసామ్ = మహాత్ముల, సరస్వతీ = వాక్కు, ప్రకృతి హితాయ = ప్రజాహితం కోసం, ప్రవర్తతామ్ = విరాజిల్లుగాక – చెల్లుగాక! పరిగతశక్తిః = సర్వశక్తి సంపన్నుడూ, ఆత్మభూః = స్వయంభువూ అయిన, నీలలోహితః = మహాదేవుడు శివుడు, పునర్భవమ్ = పునర్జన్మను, మమ+అపి = నాకు కూడా, క్షపయతు = తొలగించుగాక! పునర్జన్మ లేని ముక్తిని ప్రసాదించుగాక!! (కృశానురేతాస్సర్వజ్ఞో ధూర్జటిర్నీలలోహితః – అమరం)

(ఇతి = అని, సర్వే = అందరూ, నిష్క్రాంతాః = నిష్క్రమిస్తారు)

–: ఇది ఏడవ అంకం:–

అభిజ్ఞాన శాకుంతలమ్ అనే నాటకం ముగిసింది.

# శ్లోక సంఖ్యానుక్రమణికా

| శ్లోకాది | సంఖ్య | ఛందస్సు | అలంకృతి | రాగం |
|---|---|---|---|---|
| అంతర్గత ప్రార్థన | 7–2 | ఉపజాతి | ఉదాత్త | భైరవి |
| అంతర్హితే | 4–3 | వసంతతిలక | అర్థాంతరన్యాసం | బిలహరి |
| అక్లిష్టబాల | 6–20 | వసంతతిలక | ఉపమ | శంకరాభరణం |
| అతః పరీక్ష్య | 5–24 | అనుష్టుప్ | అర్థాంతరన్యాసం | మోహన |
| అధరః కిసలయ | 1–18 | ఆర్య | ఉపమ | నాథనామక్రియ |
| అధ్యాక్రాంత | 2–14 | మందాక్రాంత | వ్యతిరేక | దేవగాంధారి |
| అనవరతధను | 2–4 | మాలిని | పరికరం | యదుకుల కాంభోజి |
| అనాఘ్రాతం | 2–10 | శిఖరిణి | రూపకం | భైరవి |
| అనుకారిణి | 2–16 | అనుష్టుప్ | కావ్యలింగం | కల్యాణి |
| అనుమతగమనా | 4–10 | అపరవక్రం | పరిణామః | ఆరభి |
| అనుయాస్యన్ | 1–25 | ఆర్య | కావ్యలింగం | నాథనామక్రియ |
| అనేన కస్యాపి | 7–19 | ఉపజాతి | అర్థాపత్తి | సావేరి |
| అపరిక్షత | 3–21 | మాలభారిణి | ఉపమ | ఖరహరప్రియ |
| అభిజనవతో | 4–19 | హరిణి | కావ్యలింగం | ఆనందభైరవి |
| అభినవమధు | 5–1 | అపరవక్రం | హేత్వలంకారం | యదుకుల కాంభోజి |
| అభిముఖే | 2–11 | ద్రుత విలంబితం | విరోధాభాస | పున్నాగవరాళి |
| అభ్యక్తమివ | 5–11 | ఆర్య | మాలోపమ | కేదారగౌళ |
| అభ్యున్నతా | 3–5 | ఆర్య | పర్యాయోక్తం | కాపీ |
| అమీ వేదిం పరితః | 4–8 | ఋక్ఛందః | పరికరం | గీర్వాణి / సావేరి |
| అయం స తే | 3–11 | వంశస్థం | అతిశయోక్తి | పంతువరాళి |
| అయమరవివరే | 7–7 | మాలినీ | హేతు–కావ్యలింగ | భైరవి |
| అర్థోహి కన్యా | 4–22 | ఇంద్రవజ్ర | ఉత్ప్రేక్ష | మధ్యమావతి |
| అర్ధపీతస్తనమ్ | 7–14 | అనుష్టుప్ | స్వభావోక్తి | కల్యాణి |

| శ్లోకాది | సంఖ్య | ఛందస్సు | అలంకృతి | రాగం |
|---|---|---|---|---|
| అసంశయం క్షత్ర | 1–19 | వంశస్థం | అర్థాంతరన్యాసం – | ఆరభి |
| అస్మాత్పరం | 6–25 | వసంతతిలక | కావ్యలింగం | ముఖారి |
| అస్మాన్ సాధు | 4–17 | శార్దూలం | కావ్యలింగం | భైరవి |
| అహన్యహని | 6–26 | ఉపజాతి | అర్థాపత్తి | శంకరాభరణం |
| ఆఖండలసమో | 7–28 | అనుష్టుప్ | ఉపమ | సురటి |
| ఆచార ఇత్యవహితేన | 5–3 | వసంతతిలక | స్వభావోక్తి | నాథనామక్రియ |
| ఆజన్మనః శాఠ్యమ్ | 5–25 | ఉపజాతి | అప్రస్తుత ప్రశంస | నాట |
| ఆతామ్రహరిత | 6–2 | ఆర్య | రూపక | బ్యాహాగ్ |
| ఆపరితోషాత్ | 1–2 | ఆర్య | పర్యాయోక్తి | కాపీ |
| ఆలక్ష్యదంత | 7–17 | వసంతతిలక | అప్రస్తుత ప్రశంస | నీలాంబరి |
| ఇతః ప్రత్యాదే | 6–9 | శిఖరిణి | ఉపమ | ఉశేని / మధ్యమావతి |
| ఇదంకిలావ్యాజ | 1–16 | వంశస్థం | నిదర్శన | వసంత |
| ఇదమనన్య | 3–16 | ద్రుత విలంబితం | ఉపమ | ఆనందభైరవి |
| ఇదమశిశిరైః | 3–10 | హరిణి | స్వభావోక్తి | ఆనందభైరవి |
| ఇదముపనత | 5–19 | మాలిని | ఉపమ | నీలాంబరి |
| ఈషదీషచ్చుంబిత | 1–4 | ఆర్య | కావ్యలింగం | నాథనామక్రియ |
| ఉత్పక్ష్మణోః | 4–15 | వసంతతిలక | కావ్యలింగం | తోడి / సావేరి |
| ఉత్సృజ్య కుసుమ | 3–19 | ఆర్య | కావ్యలింగం | జంఝూటి |
| ఉదేతి పూర్వం | 7–30 | వంశస్థ | అప్రస్తుత ప్రశంస | ఆరభి |
| ఉద్గలితదర్భ | 4–12 | ఆర్య | ఉత్ప్రేక్ష | ఆనందభైరవి |
| ఉన్నమితైక | 3–12 | ఆర్య | అనుమానం | కల్యాణి |
| ఉపోఢశబ్దా | 7–10 | వంశస్థ | వ్యతిరేక | కేదారగౌళ |
| ఏకైకమత్ర | 6–12 | వసంతతిలక | కావ్యలింగం | భైరవి |

| శ్లోకాది | సంఖ్య | ఛందస్సు | అలంకృతి | రాగం |
|---|---|---|---|---|
| ఏవమాశ్రమ | 7–18 | స్వాగత | ఉపమ | కేదారగౌళ |
| ఏష త్వామభి | 6–27 | ప్రహర్షిణి | ఉపమ | మోహన |
| ఏషా కుసుమ | 6–19 | ఆర్య | సమాసోక్తి | బ్యాహాగ్ |
| ఏషాపి ప్రియేణ | 4–16 | ఆర్య | అర్థాంతరన్యాసం | నాథనామక్రియ |
| ఔత్సుక్యమాత్రమ్ | 5–6 | వసంతతిలక | ఉపమ | వరాళి |
| కః పౌరవే | 1–21 | ఆర్య | అప్రస్తుత ప్రశంస | నాట |
| కథం ను తమ్ | 6–13 | వంశస్థం | సమాసోక్త్యాక్షేపౌ | ఆనందభైరవి |
| కా కథా బాణ | 3–1 | అనుష్టుప్ | అతిశయోక్తి | మోహన |
| కామం ప్రత్యాదిష్టా | 5–31 | ఆర్య | విభావన / అనుమాన | ఘంటా |
| కామం ప్రియా | 2–1 | ఆర్య | కావ్యలింగం | ఘంటా |
| కార్యా సైకత | 6–17 | శార్దూలం | స్వభావోక్తి | భైరవి |
| కాస్విదవకుంఠన | 5–13 | ఆర్య | ఉపమ | కాపి |
| కిం కృతకార్య | 5–18 | ఆర్య | అర్థాంతరన్యాసం | నాట |
| కిం శీతలైః క్లమ | 3–18 | వసంతతిలక | పరికరం | కాపి |
| కింతావద్ వ్రతినామ్ | 5–9 | శార్దూలం | కావ్యలింగం | భైరవి |
| కుతో ధర్మక్రియా | 5–14 | అనుష్టుప్ | దృష్టాంతం | కేదారగౌళ |
| కుముదాన్యేవ | 5–28 | ఆర్య | అప్రస్తుతప్రశంస | బేగడ |
| కృతం న కర్ణా | 6–18 | వంశస్థం | సముచ్చయ | తోడి |
| కృతాః శరవ్యం | 6–29 | వంశస్థం | అప్రస్తుత ప్రశంస | భైరవి |
| కృతాభిమర్శామ్ | 5–20 | ఉపజాతి | ఉపమ | మోహన |
| కృత్యయోర్భిన్న | 2–17 | అనుష్టుప్ | ఉపమ | ఆనందభైరవి |
| కృష్ణసారే | 1–6 | అనుష్టుప్ | ఉపమ | మోహన |
| క్వ వయం క్వ | 2–18 | వైతాళీయం | కావ్యలింగం | ఖమాస్ |
| క్షామక్షామకపోల | 3–7 | శార్దూలం | ఉపమ | భైరవి |
| క్షౌమం కేనచిత్ | 4–5 | శార్దూలం | అర్థాపత్తి | కేదారగౌళ |

| శ్లోకాది | సంఖ్య | ఛందస్సు | అలంకృతి | రాగం |
|---|---|---|---|---|
| గచ్ఛతి పురః | 1-30 | ఆర్య | ఉపమ | పున్నాగవరాళి |
| గాంధర్వేణ | 3-20 | అనుష్టుప్ | కావ్యలింగం | ఆరభి |
| గాహంతాం | 2-6 | శార్దూలం | స్వభావోక్తి | పున్నాగవరాళి |
| గ్రీవాభంగ | 1-7 | స్రగ్ధర | స్వభావోక్తి | ఖమాస్ |
| చలాపాంగాం | 1-20 | శిఖరిణి | కావ్యలింగం | ఆనందభైరవి |
| చిత్రే నివేశ్య | 2-9 | వసంతతిలక | కావ్యలింగం | తోడి |
| చూతానామ్ | 6-4 | శార్దూలం | కావ్యలింగం | ఆరభి |
| జన్మ యస్య | 1-11 | అనుష్టుప్ | కావ్యలింగం | సురటి |
| జానే తపసో | 3-2 | ఆర్య | విరోధాభాస | వరాళి |
| జ్వలతి చలిత | 6-31 | ఆర్య | మాలాదృష్టాంత | ఆరభి |
| తత్సాధు | 1-10 | అనుష్టుప్ | కావ్యలింగం | ఆరభి |
| తదేషా భవతః | 5-26 | అనుష్టుప్ | అర్థాంతరన్యాసం | నాట |
| తపతి తనుగాత్రి | 3-14 | ఆర్య | దృష్టాంతం | నాథనామక్రియ |
| తవ కుసుమ | 3-3 | మాలిని | పరిణామం | శహాన |
| తవ న జానే | 3-13 | గాథ | ప్రత్యనీకం | మోహన |
| తవ సుచరిత | 6-11 | పుష్పితాగ్ర | కావ్యలింగం | తోడి |
| తవాస్మి | 1-5 | అనుష్టుప్ | కావ్యలింగం | కేదార |
| తస్యాః పుష్పమయీ | 3-23 | శార్దూలం | విభావన | ముఖారి |
| తీవ్రాఘాతాత్ | 1-29 | మందాక్రాంత | ఉత్ప్రేక్ష | వసంత |
| తురగఖురహత | 1-28 | పుష్పితాగ్ర | ఉపమ | ధన్యాసి |
| త్రిస్రోతసమ్ | 7-6 | వసంత తిలక | ఉదాత్త | శంకరాభరణం |
| త్వన్మతిః కేవలా | 6-32 | అనుష్టుప్ | కావ్యలింగం | కల్యాణి |
| త్వమర్హతాం | 5-15 | వంశస్థం | సమ / హేతు | కల్యాణి |
| త్వమసిమయా | 6-3 | ఆర్య | అతిశయోక్తి | ఉశేని / మధ్యమావతి |
| దర్భాంకురేణ | 2-12 | వసంతతిలక | విరోధాభాస | భైరవి |
| దర్శనసుఖమ్ | 6-21 | ఆర్య | స్మరణ | ఆనందభైరవి |

| శ్లోకాది | సంఖ్య | ఛందస్సు | అలంకృతి | రాగం |
|---|---|---|---|---|
| దిష్ట్యా శకుంతలా | 7–29 | అనుష్టుప్ | నిదర్శన | కల్యాణి |
| దుష్యంతేనాహితమ్ | 4–4 | అనుష్టుప్ | ఉపమ | కల్యాణి |
| న నమయితుమ్ | 2–3 | పుష్పితాగ్ర | కావ్యలింగం | ఆనందభైరవి |
| నాపేక్షితో | 5–16 | గాథ | కావ్యలింగం | మధ్యమావతి |
| నియమయసి | 5–8 | మాలిని | వ్యతిరేక | నాటకురంజి |
| నీవారాశ్శుక | 1–13 | శార్దూలం | స్వభావోక్తి | కేదారగౌళ |
| నైతచ్చిత్రం యత్ | 2–15 | మందాక్రాంత | కావ్యలింగం | కేదారగౌళ |
| పరిగ్రహబహుత్వే | 3–17 | అనుష్టుప్ | తుల్యయోగిత | మోహన |
| పాతుం న ప్రథమం | 4–9 | శార్దూలం | సమాసోక్తి | ఆనందభైరవి |
| పుత్రస్య తే | 7–26 | వసంతతిలక | ఉదాత్త/పర్యాయోక్త | భైరవి |
| పృష్టా జనేన | 3–8 | వసంతతిలక | కావ్యలింగం | యదుకుల కాంభోజి |
| ప్రజాః ప్రజాః స్వాః | 5–5 | ఉపజాతి | ఉపమ | ఆరభి |
| ప్రజాగరాత్ | 6–22 | అనుష్టుప్ | హేతు | మోహన |
| ప్రత్యాదిష్టవిశేష | 6–6 | శార్దూలం | ఉపమ | తోడి |
| ప్రథమం సారంగ | 6–7 | ఆర్య | విభావన | పున్నాగవరాళి |
| ప్రథమోపకృతం | 7–1 | వైతాళీయమ్ | ఉదాత్త | శంకరాభరణం |
| ప్రలోభ్యవస్తు | 7–16 | వంశస్థం | ఉపమ | నీలాంబరి |
| ప్రవర్తతామ్ | 7–34 | రుచిర | పరికరం | మధ్యమావతి |
| ప్రాణానామనిలేన | 7–12 | శార్దూలం | హేతు | కేదారగౌళ |
| ప్రాహుర్ద్వాదశధా | 7–27 | శార్దూలం | అర్థావృత్తి | ఆరభి |
| బాష్పేణ ప్రతిషిద్ధే | 7–23 | అనుష్టుప్ | కావ్యలింగం | తోడి |
| భవ హృదయ | 1–24 | ఆర్య | కావ్యలింగం | భైరవి |
| భవంతి నమ్రాః | 5–12 | వంశస్థం | హేతు/అర్థాంతర | ఆరభి |
| భవనేషురసాధి | 7–20 | మాలభారిణి | రూపక | ఆరభి |
| భానుః సకృత్ | 5–4 | ఇంద్రవజ్ర | అప్రస్తుత ప్రశంస | కేదారగౌళ |

| శ్లోకాది | సంఖ్య | ఛందస్సు | అలంకృతి | రాగం |
|---|---|---|---|---|
| భూత్వా చిరాయ | 4–20 | వసంతతిలక | మాలాదీపకం | కేదారగౌళ |
| మనోరథాయ | 7–13 | అనుష్టుప్ | అర్థాంతరన్యాసం | ఘంటా |
| మయ్యేవ విస్మరణ | 5–23 | వసంతతిలక | కావ్యలింగం | తోడి |
| మహతస్తేజసో | 7–15 | అనుష్టుప్ | ఉపమ | కల్యాణి |
| మహాభాగః కామం | 5–10 | శిఖరిణి | ఉత్ప్రేక్ష | కల్యాణి |
| మానుషీషు | 1–22 | అనుష్టుప్ | నిదర్శన | వసంత / కాంభోజి |
| ముక్తేషు | 1–8 | వసంతతిలక | స్వభావోక్తి | మోహన |
| మునిసుతా | 6–8 | ద్రుత విలంబితం | స్మరణ | జంఝూటి |
| ముహురంగుళి | 3–22 | మాలభారిణి | స్వభావోక్తి | మోహన |
| మూఢః స్యామ్ | 5–29 | అనుష్టుప్ | సందేహ | ఉశేని |
| మేదశ్ఛేదకృశో | 2–5 | శార్దూలం | కావ్యలింగం | యదుకుల కాంభోజి |
| మోహాన్మయా | 7–25 | వసంతతిలక | కావ్యలింగం | కల్యాణి |
| యథా గజో నేతి | 7–31 | ఉపజాతి | నిదర్శన | కేదారగౌళ / తోడి |
| యదాలోకే | 1–9 | శిఖరిణి | హేతూక్తి | మోహన |
| యది యథా వదతి | 5–27 | ద్రుత విలంబితం | హేతు | మోహన |
| యదుత్తిష్ఠతి | 2–13 | అనుష్టుప్ | వ్యతిరేక | కానడ |
| యద్యత్సాధు | 6–14 | అనుష్టుప్ | విరోధాభాస | నాథనామక్రియ |
| యయాతేరివ | 4–7 | అనుష్టుప్ | ఉపమ | సురటి |
| యస్య త్వయా | 4–14 | వసంతతిలక | స్వభావోక్తి | తోడి |
| యా సృష్టిః | 1–1 | స్రగ్ధర | పరికరం / పర్యాయం | బ్యాహాగ్ |
| యాత్యేకతో | 4–2 | వసంతతిలక | యథాసంఖ్య | భూపాల |

| శ్లోకాది | సంఖ్య | ఛందస్సు | అలంకృతి | రాగం |
|---|---|---|---|---|
| యాస్యత్యద్య | 4–6 | శార్దూలం | వ్యతిరేక | యదుకుల కాంభోజి |
| యేన యేన | 6–23 | అనుష్టుప్ | ఛేకానుప్రాస | బ్యాహాగ్ |
| యో హనిష్యతి | 6–28 | అనుష్టుప్ | దృష్టాంతం | నాట |
| రథేనానుద్ఘాత | 7–33 | శిఖరిణి | కావ్యలింగం | కల్యాణి |
| రమ్యంద్వేష్టి | 6–5 | శార్దూలం | పర్యాయోక్తి | ఆనందభైరవి |
| రమ్యాంతరః | 4–11 | వసంతతిలక | పరికరం | సౌరాష్ట్రకం |
| రమ్యాణి వీక్ష్య | 5–2 | వసంతతిలక | అర్థాంతరన్యాసం | సావేరి |
| రమ్యాస్తపోధనా | 1–12 | ఆర్య | పరికరం | కేదారగౌళ |
| వల్మీకాగ్రనిమగ్న | 7–11 | శార్దూలం | పరికరం | ఆరభి |
| వసనే పరిధూసరే | 7–21 | మాలభారిణి | స్వభావోక్తి | మోహన |
| వాచం న మిశ్ర | 1–27 | వసంతతిలక | స్వభావోక్తి | వసంత |
| విచింతయంతీ | 4–1 | వంశస్థం | కావ్యలింగం | నాట / మోహన |
| విచ్ఛిత్తిశేషైః | 7–5 | ఉపజాతి | పరిణామ / ఉదాత్త | శంకరాభరణం |
| వైఖానసం | 1–23 | వసంతతిలక | ఉత్తరం | పూరికల్యాణి |
| వ్యపదేశమావిల | 5–21 | ఆర్య | ఉపమ | ధనాసరి |
| శక్యమరవింద | 3–4 | ఆర్య | సమాహిత | భైరవి |
| శమప్రధానేషు | 2–7 | ఉపజాతి | కావ్యలింగం | భైరవి |
| శమమేష్యతి | 4–21 | ఆర్య | కావ్యలింగం | ముఖారి |
| శాంతమిదమ్ | 1–14 | ఆర్య | అర్థాంతరన్యాసం | ధనాసరి |
| శాపాదసి | 7–32 | వసంతతిలక | దృష్టాంతం | తోడి |
| శుద్ధాంతదుర్లభ | 1–15 | ఆర్య | నిదర్శనం | బ్యాహాగ్ |
| శుశ్రూషస్వ | 4–18 | శార్దూలం | రూపకం | తోడి |
| శైలానామవ | 7–8 | శార్దూలం | ఉత్ప్రేక్ష | భైరవి |
| సంకల్పిత ప్రథమ | 4–13 | వసంతతిలక | తుల్యయోగిత | కేదారగౌళ |
| సందష్టకుసుమ | 3–15 | ఆర్య | కావ్యలింగం | శంకరాభరణం |

| శ్లోకాది | సంఖ్య | ఛందస్సు | అలంకృతి | రాగం |
|---|---|---|---|---|
| సంరోపితేఽపి | 6–24 | ఉపజాతి | ఉపమ | తోడి |
| సఖ్యుస్తే స కిల | 6–30 | ప్రహర్షిణి | దృష్టాంతం | కేదారగౌళ |
| సతీమపి జ్ఞాతి | 5–17 | వంశస్థం | అప్రస్తుత ప్రశంస | మోహన |
| సరసిజమను | 1–17 | మాలిని | అర్థాంతరన్యాసం | ఫరజు |
| సహజంకిల | 6–1 | వైతాళీయ | దృష్టాంతం | భైరవి/కల్యాణి |
| సాక్షాత్ప్రియామ్ | 6–16 | వసంతతిలక | నిదర్శన | యదుకుల కాంభోజి |
| సానిందంతీ | 5–30 | శాలిని | సముచ్చయ | గీర్వాణి/సావేరి |
| సాయంతనే సవన | 3–24 | వసంతతిలక | ఉపమ | పంతువరాళి |
| సిధ్యంతి | 7–4 | వసంతతిలక | దృష్టాంతం | భైరవి |
| సుఖపరస్య | 7–3 | ద్రుత విలంబితం | అతిశయోక్తి | శంకరాభరణం |
| సుతను హృదయాత్ | 7–24 | హరిణి | దృష్టాంత అర్థాంతరన్యాసం | ఆనందభైరవి |
| సుభగసలిలావ | 1–3 | ఆర్య | పరికరం | సురటి |
| సురయువతి | 2–8 | ఆర్య | దృష్టాంతం | తోడి |
| స్తనన్యస్తోశీరం | 3–6 | శిఖరిణి | వ్యతిరేకం | తోడి |
| స్త్రీణామశిక్షిత | 5–22 | వసంతతిలక | అర్థాంతరన్యాసం | మోహన |
| స్నిగ్ధం వీక్షితమ్ | 2–2 | శార్దూలం | అర్థాంతరన్యాసం | నాథనామక్రియ |
| స్మర ఏవ తాప | 3–9 | ఆర్య | వ్యాఘాతం | మోహన |
| స్మృతిభిన్నమోహ | 7–22 | ఆర్య | దృష్టాంతం | తోడి |
| స్రస్తాంసావతి | 1–26 | శార్దూలం | స్వభావోక్తి | ముఖారి |
| స్వప్నో ను మాయా | 6–10 | ఉపజాతి | సందేహ+ఉపమ | ఉశేని |
| స్వసుఖనిరభిలాషః | 5–7 | మాలిని | దృష్టాంతం | కల్యాణి |
| స్వాయంభువాత్ | 7–9 | అనుష్టుప్ | ఉదాత్త | కేదారగౌళ |
| స్విన్నాంగులి | 6–15 | ఆర్య | అనుమాన | కాపి |

(రాగాలు సమకూర్చినవారు: గోమఠం శ్రీనివాసాచార్య & సి.వి.కృష్ణస్వామి అయ్యర్. అలంకారాలు: రాఘవభట్టు)

# రాష్ట్రపతి పురస్కారం - 2018

## (క్లాసికల్ తెలుగు)





# Abhijñāna śākuntalam

Telugu commentary by :

**Bethavolu Ramabrahmam**



## ముద్రిత గ్రంథాలు

1. తెలుగు వ్యాకరణాలపై సంస్కృత, ప్రాకృత వ్యాకరణాల ప్రభావం 1982.
2. శృంగార శ్రీకంఠము (పద్యకవిత్వం), 1982.
3. స్వర్ణ కమల (చారిత్రక నాటకం), 1983.
4. షోడశీ (సంస్కృతంలో పరిశోధనా వ్యాసాలు), 1987.
5. వేణీ సంహారం (తెలుగులో సమగ్ర వ్యాఖ్యానం), పి.ఎస్. తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణ, 1988.
6. ఆధునిక వేమన శతకము, 1990.
7. క్రొత్త గోదావరి (పద్యకవిత్వం), 1991.
8. అనర్ఘ రాఘవం (తెలుగులో సమగ్ర వ్యాఖ్యానం), పి.ఎస్. తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణ, 1992.
9. శ్రీమద్రామాయణం (తెలుగు వచనం), 1993.
10. గురుదత్త లహరి (కవిత్వం), 1995.
11. పలుకు చిలుక (అనువాద కవిత్వం), 1996 .
12. శ్రీ ద్వారకా తిరుమల క్షేత్ర మాహాత్మ్యం- సమర్పించినది, 1997.
13. ఆధునిక గీతావళి (కవిత్వం), 1997.
14. యశోధర (కవిత్వం), 1997.
15. పద్య కవితా పరిచయం, 1997, 2000
16. శ్రీ దేవీభాగవతం (కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, 2003), 1999.
17. శ్రీ దత్తాత్రేయ గురుచరిత్ర, 2000.
18. నాగానందం (తెలుగులో సమగ్ర వ్యాఖ్యానం), పి.ఎస్. తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణ, 2000.
19. శ్రీమద్రామాయణం - సుందర కాండ (తెలుగు వచనం), 2004.
20. శివమహాపురాణం - టిటిడి కేటాయించిన రుద్రఖండ నుండి 5000 శ్లోకాలకు అనువాదం.
21. వ్యాస గౌతమి (సాహిత్య విమర్శ), జూన్ 2004.
22. పద్యారామం, 2004.
23. శాకుంతలం & సౌందరనందం - (నృత్యరూపకం), 2004.
24. ఆంధ్ర మహాభారతం (శాంతి పర్వం - 6, వ్యాఖ్యానం), టిటిడి, 2005.
25. మృచ్ఛకటికం (తెలుగులో సమగ్ర వ్యాఖ్యానం), 2005.
26. వ్యాస పీఠిక (తెలుగు సాహిత్య వ్యాసాలు), 2007.
27. ఉత్తరరామచరితం (తెలుగులో సమగ్ర వ్యాఖ్యానం), 2010.
28. మంచెళ్ళ కృష్ణ కవి - వేంకట నగాధిప శతకము (వ్యాఖ్యానం), 2012.
29. వర్ణనరత్నాకరము (సంపాదకులు-వ్యాఖ్యానం) 23 సంపుటాలు, హైదరాబాద్ విశ్వవిద్యాలయం, 2012-2016.
30. అయ్యలరాజు త్రిపురాంతక కవి, ఒంటిమిట్ట రఘువీర శతకము (వ్యాఖ్యానం), 2017.
31. శమంతకమణి ( ప్రబంధం), ఏపికెఎఫ్ ప్రచురణ, 2018.
32. మాదయగారి మల్లన, రాజశేఖర చరిత్రము (వ్యాఖ్యానం), 2018.
33. కంకంటి పాపరాజు ఉత్తర రామాయణము (వ్యాఖ్యానం) (డాక్టర్ అద్దంకి శ్రీనివాస్‌తో), 2018.
34. ఎఱ్ఱన హరివంశము పూర్వభాగము, 2020.




**S.R. PUBLICATIONS**

Address : DRR Street, Inner ring Road, (Ambapuram), Vijayawada Rural - 520012.
Tel : (0866) 243 6959, 243 8959, (+91) 94928 75959, 94938 75959 & 94948 75959.

Purchase online @ www.srpublications.in
info@srpublications.in

B.O. : # 1-8-104, Ambedkar College Road, Chikkadapally, HYDERABAD - 500 020.
Mobile : 90324 28516

For e-books : Kinige
https://kinige.com/

Price ₹ 288


ISBN 978-93-86040-95-4

SRI RAGHAVENDRA PUBLISHERS : # 11-25-119, Main Bazaar, Vijayawada - 1.
Ph : 0866-2421052, Cell : 9849181712